# పరిచయవాక్యములు

---

ఆత్మానందము సకలపదార్థములకును పరమార్థము. ఆనందమునకు జ్ఞాన మాధారము. జ్ఞానమునకు సత్యము శక్తి. సత్యమున కాత్మ కీలకము. సచ్చిదానందాత్మకమైన పరమార్థానందానుభవమునకు విశ్వహృదయ సౌందర్య విలాసములు నిత్యసాధనములు. పిపీలికాది బ్రహ్మపర్యంతమును గలజీవజాలము విశ్వవ్యాప్తములైన కళాసాహిత్యముల యాధారమునను నాత్మరసానందము ననుభవించుచున్నవి. సాహిత్యకళోపాసకు లాత్మసంకల్ప సంస్కారానుభవరూపముగ ననంతములైన కావ్యకళలను సంకల్పించి, ధ్యానించి, సందర్శించి, నిర్మించి, ఆత్మరసానందానుభవమున కధికారు లగుచున్నారు.

ప్రకృతి పురుషలీలావిలాస సంభవమైన విశ్వరసానందానుభవమునకు కావ్యము లుత్తమసాధనములు. కావ్యములు కవుల సంకల్పసంస్కారానురూపములు. మహాకవులు రసోపాసకులు; రససిద్ధులు; రసానుభవజ్ఞులు. కావ్యార్ణవసంభవము లైన యనంతకావ్యములు కవుల సంకల్ప జ్ఞాన క్రియాశక్తుల కనురూపముగను ఆత్మరసానందానుభవమునకు సాధనము లగుచున్నవి. అనంత

మైన కావ్య పరిణామపరిజ్ఞానమునకు కావ్య తత్త్వ మీమాంసయును, కావ్యాత్మనిర్ణయమును సాధనములు. చిర కాలరసానుభవ సంవర్ధితములైన కావ్య సంప్రదాయ సంకేతములును, భావాలంకార విశేషములును, రస విభేదములును కావ్యాత్మపరిజ్ఞానమును దుర్ఘటము చేయు చున్నవి. అవ్యక్తమైన బ్రహ్మాన దమును కావ్యములు భావ భావాలంకార రసానందానుభవపరమైన ఆత్మానం దానుభవ ప్రమాణమునను సువ్యక్తము చేయుచున్నవి. కావ్యాత్మస్వరూప స్వభావములను నిర్ణయించుటకును, గ్రహించుటకును శ్రీ కోట్లూరి వేంకటరాఘవయ్యంగారు రచియించిన ' కావ్యాత్మ ' మిమి యోగపడుచున్నది.

అతి ప్రాచీనమైన సంస్కృత సాహిత్యమునందు కావ్యాలంకార శాస్త్రములు వికాసమును పొందిన విధము నపారమైన శాస్త్ర గ్రంథములు విశదము చేయుచున్నవి. ప్రాచీనమైన దేశమునకువలెను సాహిత్య కళా శాస్త్రములకును భరతనామము సార్థకముగ నున్నది. భరతముని ప్రారంభించిన కావ్య మీమాంస క్రమపరిణామమును పొంది కావ్యాత్మ జిజ్ఞాస కవకాశమును గలుగజేయుచున్నవి. అనంత మైన కావ్యాలంకారశాస్త్ర పఠనాభ్యాసము సామా న్యులకు దుర్ఘటము. భావభావాలంకారరసయోగానం దాత్మకమైన కావ్యాత్మ విశ్వసాహిత్యమునందు సర్వత్ర మహాకవులకు, కళాభిజ్ఞులకు, పండితులకు ప్రత్యక్షముగ

చున్నది. పరమాణువుమహామేరువులందును, పిపీలిక పరబ్రహ్మాలందును కవులు రసానందానుభవమును కల్పించి, సందర్శించి, ప్రత్యక్షము చేయుటకు సమర్థులు. కావ్యాచార్యులు కావ్యములను పరిశీలించి వ్రాసిన శాస్త్రగ్రంథముల సారాంశమును కావ్యాత్మ సుబోధకముగను విశదము చేయుచున్నది.

భరతుడు, భామహుడు, మమ్మటుడు, విశ్వనాథుడు, దండి, హేమచంద్రుడు, దీక్షితుడు, వామనుడు, జగన్నాథుడు మొదలగు కావ్యాలంకార శాస్త్రజ్ఞులు వ్రాసిన కావ్యమీమాంస గ్రంథమునందు వివిధాధ్యాయములందు సుబోధములుగ వివరింపబడినవి. కావ్యము లనంతములైన శబ్దార్థాలంకార శోభితములు, గుణరీతిబద్ధములు, ధ్వని సాధనములు, రసాత్మకములు. కావ్యపరిణామమునందు కావ్యాత్మ రస పరిణామమును పొందినవిధమును గ్రంథము పరిస్ఫుటము చేయుచున్నది. గ్రంథమునందలి యీ క్రిందివాక్యములు కావ్యాత్మ సంకల్పమునకు మనోహరనిదర్శనములు.

కావ్యసౌందర్యము కేవలబాహ్యము, అస్థిరములైన పదాలపైగాక ఆంతరంగికము, ఆనందదాయకము లైన ఆత్మతత్త్వముపై నాధారపడియుండును. అందువలన 'శోభనమున కనువైన రసభావములకు భావమే కావ్య' మని భరతుడును, 'సువర్ణమయాలంకార విశేషభూషితమైన వాక్యమే కావ్య' మని భామహుడును, 'శబ్దార్థములజంటయే కావ్య' మని రుద్రటుడును, 'ఇచ్చవచ్చినతలపులు మూలక రత్తి

శ్రేయజాలు నీటు నులుకు మాటలసౌరునే కావ్య' మని దండియు, 'మంచి గొనముల నెలవను మేలిపదముల పొందికయే కావ్య' మని వామనుడును, 'ఇంపుసొంపుల ముంపును క్రొత్త చింతకోరికల నవ తెత్తగా పలుపు పలుకును శికారము గల వలపుతలపే కావ్య' మని ఆనందవర్ధనుడును, 'నెరజాణతనపు మురిపెముల సరియు ముద్దు ముద్దుల మూటయే కావ్య' మని కుంతలుడును, 'సరసమైన వాక్యమే కావ్య' మని విశ్వనాథుడును, 'అందము చిందు భావము పొందు పరచునట్టి నెరయ మెరయు పదమే కావ్య' మని జగన్నాథుడును వచించిరి.

సాహిత్యపరిణామమునకు శాంతసుందర శివాత్మకము లైన భావార్థాలంకారములు, పదార్థాలంకారములు, ధ్వని గుణాలంకారములు నియత సాధనము లైనను రసాత్మయె కావ్యాత్మ యని కావ్య మీమాంస సువ్యక్తము చేయుచున్న విషయమును పండితపామరులు గ్రహించుట కావ్యోపాసనకు పరమార్థము.

ఆంధ్ర గ్రంథమాలయందు కావ్యాత్మను ౧౽ వ ప్రచురణముగను సమకూర్చి గౌరవించినందులకు శ్రీయుత శేట్లూరి వేంకటరాఘవయ్యంగారికి నిర్వాహకులు కృతజ్ఞులు. 'కావ్యాత్మ' ఆంధ్రలోకాదరణ పోషణమునను, ముఖ్యముగను విద్యార్థి పండితాదరణమునను గలిగి వర్ధిల్లుటకు భగవంతు డనుగ్రహించును గాక!

యువ సం. ఆషాఢ
౫ శనివారము

కా. నాగేశ్వరరావు

# కృతజ్ఞత

కావ్యాత్మ విచారమును గురించి సంస్కృతాలంకారికులు తమతమ మతముల తమతమ గ్రంథముల వివరించిరి. ఆనానామతముల నన్నిటి నేకసూత్రమున పాశ్చాత్యపద్ధతులపై విద్వాంసులు కేన్ (Kane), సుశీలకుమారడే (Dr. Susila Kumara de), శంకరను (Dr. Sankaran) గార్లు రచించిరి. అందు డేగారి విమర్శనాప్రణాళిక సమగ్రము సంపూర్ణముగ నుండుట చేతను, అదియే విశిష్టచారిత్రక విమర్శన మగుటచేతను నే నాపద్ధతుల ననుసరించియే నా 'కావ్యాత్మ'ను రచించితిని. నా గ్రంథరచనమునకు పై మువ్వురి గ్రంథములలో చాలవరకు 'డే'గారి సంస్కృతాలంకార చరిత్రము (History of Sanskrit Poetics, Vol. II) తోడ్పడెను. మత నిర్వచన విషయమున భేద మంతగా లేకపోయినను మతవిభాగమున ప్రాచీనాచార్యుల ననుసరించియే వ్రాసితిని. అందువలన గొన్నిచోట్ల డే గారితో సమ్మతింపలేకపోతిని. అయినను, నా 'కావ్యా

త్మ' రచనమునకు జేయూత నిచ్చుటచేతను, ఆంగ్లమున
దొలుత వారే యిట్టి సమగ్రచరిత్రమును వ్రాసినవా
రగుటచేతను వారిపద్ధతుల నచ్చటచ్చట నే ననుసరించి
తిని. కావున ప్రత్యేకముగ నిట్లు వారికి నా కృతజ్ఞతను
తెలుపుకొనుచున్నాను.

ఇట్లు
గ్రంథకర్త

---

# ఉపోద్ఘాతము

'జిహ్వా కొకరుచి, పుఱ్ఱె కొకబుద్ధి' యని విశ్వపరిచితిగలవారి సత్యవాక్కు. ఉల్లేఖాలంకార మిట్లేర్పడినదే. తత్త్వము సంస్కృతాలంకార సారస్వతమును కలికపు గన్నులతో జూచువారికి తెల్లమయినది. గ్రహీతృ, గ్రహణభేదములను బురస్కరించుకొని సంస్కృతాలంకార సారస్వతమున కావ్యాత్మ పలుపోకలు పోయి విరివియైన చరిత్రను సంపాదించుకొన్నది. రస, అలంకార, గుణ, రీతి, ధ్వని, వక్రోక్తి, అనుమాన, ఔచితులు వారివారి రుచిభేదమును బట్టి కావ్యాత్మలైనవి. సహృదయుల కివి యన్నియు నుపపన్నములేయయి గోచరించును. కాదనుట రుచిభేదమును దిద్దజూచుట. కావున నెవరిమతమును వారికే వదలి సమగ్రమతచరిత్రమును ఎరుకపరచుకొని, విమర్శించుకొని, తన మనస్సునకు సమ్మతమయినపంథను తాను ననుగమించుట సహృదయునకు పాడి. ఒక్కమతముననే గుదికట్టి, దానినే అంటగట్టుకొని యుండు డనుట సారస్వతాభివృద్ధిని గాంక్షించువారికి తగవుకాదు.

అలంకారసారస్వతము తెలుగున నెన్నియో విధముల వికాసమును గోరుచున్నది. రోజులును ఎన్నియో భంగుల మార్పుదలలను చూపుచున్నవి. నేడు మనకు లభించిన అలంకార సారస్వత మంతయు కేవల మను వాదరూప మయినది. ఎవరి మనస్సునకు పట్టినరచన వారి యనువాదమునకు పాత్రమయినది. ఆ యనువాదములును వ్రేళ్ల లెక్క యిడదగినవి. అందును ప్రాచీనములని చెప్పదగినవి కావ్యాలంకారచూడామణి, నరసభూపాలీయమునను రెండే. వీనికిముందు తెనుగున అలంకారసారస్వతము లేదనియే చెప్పవచ్చును. తరువాత నిటీవల కొందరు మరికొన్నిటిని అనువదించినారు. ఇప్పుడిప్పుడే మనవారికి అలంకారశాస్త్రసమగ్రత గుర్తుకు వచ్చినది.

వైయక్తికత్వము, పరిపూర్ణత కొరవడిన యీ సారస్వతమున వైయక్తికత్వము, పరిపూర్ణసాహితి యల వరిచికొనుట కష్టమయిన పని. మనకు సర్వవిధముల మూలమయి యొప్పిన సంస్కృతాలంకార సారస్వతమును సమగ్రముగ, పాశ్చాత్త్య విమర్శనదృష్టితో పరిశీలించి, భావించుకొనుట నేటిసారస్వత ప్రియులు కోరునది. అప్పటికిగాని యందలి గుణాగుణముల నెరుంగుటకుగాని, దానిని మరింత వికాసపరుచుటకుగాని యవ

కాశములు తక్కువ. పాశ్చాత్యరచనా ప్రణాళికలు, వారి విమర్శనపద్ధతి యీ అవకాశములను హెచ్చించును.

అలంకార శాస్త్రమునకు ప్రథమాచార్యుడు భరతమునిచంద్రుడు. తత్పూర్వము దీని వాసనలు చూచాయగ గోచరించినను సరియైన యొక్క యాకృతి, యొక్క గ్రంథ యుండినట్లు లేదు. భరతుని మొదలు మొన్నటి జగన్నాథపండితునిదనుక నీశాస్త్రము శాఖోపశాఖల విస్తరిల్లి బ్రహ్మాండమయినది. పలువురు పలువిధముల కావ్యలక్షణములను నిరూపించిరి. వెవ్వేరు లక్షణముల ప్రసంగమున నెటులున్నను శరీరముగ నిర్వచించుకొన్న కావ్యమునకు ఆత్మవంటి దేది యనుటలో నొక్కొక్క రొక్కొక్క త్రోవబట్టిరి. అందరు నన్నికారణములను జూపుచు నన్నియాత్మలను చూపిరి. దేనికది యుపపన్నమే యవును. ఇది యంతయు కేవల మొక్క మార్గప్రదర్శనమే కాని యనుశాసనము మాత్రము గాదని సహృదయులు భావింపగలరు. వికాసాభ్యుదయములు కోరిన మెవరు ఎవరిని అనుశాసింపగలరు?

అలంకారశాస్త్రము రసమతముతో నారంభమై పోయిపోయి ధ్వనిమతముతో చట్టున నిలిచిపోయినది. అదియే నిజమునకు కావ్యాత్మ యని పలువురకు తట్టి

నది. పలువురు దాని ననుగమించినారు. సర్వమతలక్షణ సమంచిత మదియే యని నమ్మినారు. ధ్వనికావ్యమే ఉత్తమకావ్య మని యంగీకరించినారు. ఆధునికులకును ఇదియే విశిష్టసమ్మతమైనది. నిజమున కదియే కావ్యాత్మ కాఁగలిగినది.

కాని యీ సాహిత్యశాస్త్రమునకు అలంకార శాస్త్రమని పే రెట్లు వచ్చినది? ప్రాధాన్యవ్యపదేశమున ననుపక్షమున, దీనికిని ధ్వనిమతమునకును సమన్వయము కుదర్చవలసియున్నది.

అలంకారశాస్త్రమును సమగ్రముగ పరిశీలించి, అందు వెలసిన యన్నిమతముల తత్త్వము నెఱుంగుట తచ్ఛాస్త్రాభ్యుదయ వికాసములకు మొదటి మెట్టు. పాశ్చాత్యసంస్కృతి కారణముగ మనదృష్టి యిప్పు డిప్పుడే చరిత్ర, విమర్శలవైపు మరలుచున్నది. ఇది కారణముగా సారస్వతమున క్రొత్తవికాసము ప్రొడ చూపుచున్నది. అభ్యుదయమున కిది ప్రథమలక్షణము. 'గుణాః పూజాస్థానం.' ఆంగ్లమున నెన్నియో విమర్శ గ్రంథములు వెలువడినవి. పాశ్చాత్యసంస్కార మంతగా లేని మన యాలంకారికుల కవి వ్యక్తపడక ప్రాతదారినే యుండిపోయినారు; ఇటీవలివారి కయినను ఏతాదృశ

సాహిత్యావశ్యకత గోచరించలేదు. సంస్కృతాలంకారిక సిద్ధాంతపరిజ్ఞానము, ఆంగ్లవిమర్శన సూత్రావలంబనము, వాని సాయమున ప్రాచీనాధునిక కావ్యముల పరిశీలన, సమన్వయము-ను ననువీనివలన సారస్వతమునకు గలుగగల లాభములు వారిమది కెక్కలేదు. ఈ కొరత కంతటికిని కారణము తెలుగున నట్టి గ్రంథములు లేమియే. 'కొరతపడిన భాగమును పూర్తిచేయుటయే భాషాసేవకునకు పరమకర్తవ్యము.'

శ్రీరాఘవయ్యంగారీ కర్తవ్యము నూహించినారు; కర్తవ్య నిర్వహణమున కుత్సహించినారు. ఫలముగ ప్రకృతమయిన యీ 'కావ్యాత్మ' పైలోపమును దీర్చి దిద్ద వెలువడినది. 'భరతమునిచంద్రుని నాట్యశాస్త్ర రచనాకాలము మొదలు జగన్నాథ పండితుని రసగంగాధర రచనాసమయమువరకును కావ్యాత్మ విచార మేరీతిని పెంపొందినదియు' చరిత్ర రూపముగ, విమర్శరూపముగ నీగ్రంథమున లెస్స నిరూపింపబడినది. ఇట్టి రచనలకు పరమావశ్యకమయిన 'సంస్కృతాంధ్రాంగ్ల సారస్వతత్రయసాహిత్య' ముప్పతిల్ల రచయిత యీగ్రంథమును రచించి సారస్వతప్రపంచమునకు క్రొంగ్రొత్తవికాసమును గూర్చినాడు. ఇది యలంకారశాస్త్ర విమర్శగ్రంథముగను, చరిత్రగ్రంథముగను సహృదయా

ంకారికుల సమాదరమునకు పాత్ర మగు ననుటలో సందేహము లేదు. ప్రాచీనాలంకారిక మతము లన్నియు నిందు సమగ్రముగ గోచరించును.

గ్రంథమంతయు మొత్తము రెండు భాగములు: ప్రాచీనమతములు, నవీనమతములు నని. రసాలంకార గుణరీతి మతములు ప్రాచీనములుగను, ధ్వనివక్రోక్త్యను మానౌచితీమతములు నవీనములుగను విభాగింపబడినవి. తొలిదాన రసమతము, అలంకారమతము, గుణమతము, రీతిమతము, రసమతసమాలోచనము నని పంచప్రకరణములు. మలిదాన ధ్వనిమతములు, ధ్వనినాశకమతములు, వక్రోక్తిమతము, అనుమానమతము, రసాలంకారమత సమ్మేళనము, నవ్యమతము నని యారు ప్రకరణములు. ఒక్కొక్క ప్రకరణమునను నుపప్రకరణములు గలవు. ఈవిధముగ నిది సమగ్ర కావ్యాత్మ చరిత్ర మన నొప్పియున్నది.

దారి క్రొత్త దగుటచేతను, తొలు దొలుత నే వెలువడి దారిమాపిన దగుటచేతను ఈ 'కావ్యాత్మ' పలువు రాంగ్లవిద్యా విశారదులు వ్రాసిన రచనలను ఆధారముగ గొని నిబంధింపబడినది. అందును ఎక్కువగా సుశీల కుమారదేగారి రచనాప్రణాళికయే దీనికి

మేలుబంతి యయినది. డేగారి సంస్కృతాలంకార చరిత్రము (History of Sanskrit Poetics) ద్వితీయసంపుటము వీరికి మిక్కిలి యుపకరించి, విషయమును సమకూర్చినది. విషయ మూ గ్రంథముల పరిచితిగలవారికి నూతనముగాకపోయినను తక్కువారలకు ఇది క్రొత్తదే యవును. అచుంబితార్థసంపత్తి గలిగిన యీగ్రంథమును గూర్చిన రచయిత నభినందించి తెలుగువారు దీనికి హృదయపూర్వక స్వాగత మిత్తురని నమ్మిక.

ప్రహతమార్గములందే, నడవ నేర్చిన వారికే ఒక్కొక్కప్పుడు ఒడుదుడుకులు గలిగి కాళ్లు తడబడు నన్నప్పుడు అప్రహతమార్గములందు నడవబూనినవారికి తడబడుననుట వింతకాదు. విషయగౌరవము నుపలక్షించి దోషములను దూరీకరించి, గుణములను గ్రహింప సహృదయపాఠకులను గోరెదను.

'గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేడా వివేశ్వరః,
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి.'

తిరుమల వేంకటరంగాచార్యులు

---

ఆంధ్రగ్రంథమాల — ౨౯

# కావ్యాత్మ

రచయిత :

శే. వెం. రాఘవ అయ్యంగారు

ప్రకాశకులు :

ఆంధ్రగ్రంథమాల,

మదరాసు.

రూ-3౮

# అంకితము

సప్తపది

'దేశభాషలలోపల తెలుగు లెస్స'
యనెడు రాయలసూక్తి విఖ్యాతి నెంచి
మాసదినపత్రికా గ్రంథమాలలైన
మూడుశక్తుల తెనుగు పూబోడిభాష
మాదలధరించు నాగేశు డర్థికల్ప
కుజము మాతృదేశోద్ధారకుండటంచు
వినుతి గాంచిన సుకృతి కర్పింతు గృతిని.

# పీ ఠి క

—

ఆంధ్రభాషయం దలంకారశాస్త్ర గ్రంథములు చాల తక్కువగ నుండుటయు, పాశ్చాత్యవిమర్శనవివేకము తెనుగున కొరంతవడుటయు నను రెండు కారణములచే ప్రాచీనకవుల ఆంధ్రగ్రంథములకు జరుగవలసినంత యాదరణము నేడు జరుగుటలే దని నా యాశయము. మన పూర్వకవుల పుస్తకముల మనము చక్కగ నెరింగి, వారి గ్రంథముల సారమును గ్రహింపగోరుదుమేని, సంస్కృతాలంకారికసిద్ధాంతములను, ఆంగ్ల విమర్శనసూత్రములను గమనించి, వానిసాయమున ప్రాచీనాంధ్రకవుల కావ్యముల మనము సమన్వయ మొనరించుకొనవలయును. ఇటుల ప్రాచ్యపాశ్చాత్యసాహిత్యద్వితయసమ్మేళనము సంభవింపనిచో ప్రాచీనకవుల కావ్యమాధుర్యమును మనము మనసార గ్రోలలేము.

కావ్యవిబుధోద్యానవీథికావిసరముల విహారకేళీలాలసనై విలసిల్లు సాహిత్యసాగరకన్యాకటాక్షవీక్షణప్రసారప్రసాదమున ప్రసన్నతం జెంది పరిపాకవంతులు

గాగోరి తపంబొనర్చు విద్యార్థిబృందారకబృందమునకు విమర్శనవిజ్ఞానసువర్ణకోశసంచయంబులే పరమోప నిష త్సముదాయంబులై ప్రసిద్ధినొందుట సహృదయసమ్మ తము. అందుచే సంస్కృతాంధ్ర సారస్వతమును సమగ్ర ముగ నెరింగి కావ్యముల రచించిన ఆంధ్రకవితాపితా మహ సార్వభౌమాద్యుల గ్రంథములను, ఆంగ్లభాష నించుక చదివి, సంస్కృతము నించుక చవిచూచియో, చూడకయో విమర్శనములకు గడంగినచో మనము పరి హాసపాత్రులము కాకపోము. కావున సంస్కృతాం ధ్రాంగ్లసారస్వతత్రయసాహిత్యము సహృదయు లైన విమర్శకశిరోమణుల కత్యంతావశ్యకము. అట్టివారలకు చేయూతగ నుండునన్న తలంపుతో దీనిని రచించితిని.

భరతమునిచంద్రుని నాట్యశాస్త్ర రచనాకాలము మొదలు జగన్నాథపండితుని రసగంగాధర రచనా సమయమువరకును కావ్యాత్మవిచార మేరీతి పెంపొంది నదియు నీ గ్రంథమునందలి విషయము. సంస్కృ తాలంకారికుల సమయము సంశయగ్రస్తముగ నుండు టచే దానివిచారణమును విరమించితిని. తగిన గ్రంథ సంపద లభించినచో ముందుముద్రణమున వారి కాల నిర్ణయమును, దానితోపాటు భరతునిపూర్వమందలియు, పండితరాయలతరువాత బయలువెడలినట్టియు కావ్యా

త్మవిచారణనుగూడ జేర్చగలనని సహృదయవతంసు లకు విన్నపము.

ఈ 'కావ్యాత్మ' ను పఠించుటవలన నవీనులు, ప్రాచీనకవుల కావ్యములలోని రసాలంకారగుణరీతి ధ్వని మతముల తత్త్వము నెరింగినచో నా శ్రమము ఫలించెనని సంతసింతును. నవలలు, నాటకములు జనముల మన ముల నాకర్షించు నీకాలమున శాస్త్రగ్రంథములు తరు ణుల సరసహృదయముల కరగింపలేకపోవచ్చును. కొరంతపడినభాగమును పూర్తిచేయుటయే భాషాసేవకు నకు పరమకర్తవ్యము. ఈమార్గమునకు నవీనుల దృష్టి లేకారణముననో ప్రసరింపలేదు. విద్యార్థిగా గడపిన నేటిదనుక నాయొనర్చిన సేవను ఆంధ్రభాషామతల్లి కొన రించి 'కావ్యాత్మ' రూపమున ఆంధ్ర సోదరసోదరీమణుల కర్పించుకొంటిని.

ఇంక నొకవిషయమును జెప్పి పీఠిక ముగింతును. సంస్కృతసాహిత్యమును బి. ఏ. తరగతియందు పఠించు టకు నా కవకాశమును గల్పించి, బ్రహ్మశ్రీ వేమూరి రామగోవిందశాస్త్రులవారియొద్ద అలంకారము నభిమాన శాస్త్రముగ నభ్యసించమని నాకుపదేశించిన మ. రా రా. శ్రీ. విస్సా అప్పారావుపంతులుగారికిని, శ్రీమాన్

సముద్రాల అప్పలాచార్యులుగారికిని నే నెంతయు కృతజ్ఞుడను.

ఈ 'కావ్యాత్మ' రచింపబడి రమారమి నాలుగై దేడులైనను దీని నింతవరకు ముద్రించి ఆంధ్రుల కర్పించు భాగ్యము నాకు సమకూడదాయెను. కార్యాంతరమున నేను చెన్నపట్టణమున కేగినపుడు భారతీకార్యాల యమువారిని సందర్శించి, 'భారతి' యందు వరుసగ దీనిని బ్రకటించుటకు ముదలగోరగా, వారు దీనిని త్రుటి రూపమున ముద్రించిన-చో గ్రంథగౌరవము తగ్గుననియు, శ్రీ దేశోద్ధారకులు కృష్ణజన్మస్థానమునుండి వచ్చిన వెనుక వారికి నివేదించి, "ఆంధ్రగ్రంథమాల" యందొక సుమముగ ప్రకటింతుమనియు వ్రాకుచ్చిరి. వారి సంపూర్ణసాహాయ్యమున కత్యంతము కృతజ్ఞుడను.

నా 'కావ్యాత్మ'కు ఉపోద్ఘాతమును రచింప గోరినంత నాయం దత్యంతమైత్రి బూని పుస్తకము నామూలముగ పరిశీలించి, అచిరకాలమున నుపోద్ఘాత మును వ్రాసిన సంస్కృతాంధ్రాంగ్లేయా ద్యనేకభాషా పారీణులు, సహృదయవతంసులు నగు శ్రీమాన్, తిరుమల వేంకటరంగాచార్యవర్యులకు వందనశతంబుల నర్పించువాడ.

ఈ 'కావ్యాత్మ' ను ప్రకటించుట కనుజ్ఞ నొసంగి, దీని నాంధ్రలోకమున కుపాయనముగ సమ ర్పించుటకు నాకవకాశము గలిగించి, భాషాపోషకులను ప్రఖ్యాతిగాంచిన శ్రీ దేశోద్ధారకుల యౌదార్యమును ప్రస్తుతించుచు, వారికి చిరాయురారోగ్యభాగ్యముల ప్రసాదింప పరమేశ్వరుని ప్రార్థించుచు, సర్వదా కృత జ్ఞుడనై యుందును.

శబ్దోచ్చారణసౌకుమార్యమును, అర్థవ్యక్తి మా ధుర్యమును గణుతించి కొన్నిచోట్ల సంధి నియమముల పాటించి, మరికొన్నిచోట్ల పాటింపక, 'కావ్యాత్మ' యందలి వచనరచనాప్రకారము ప్రకాశించుచున్నది. ఇందలి మతములకు లక్ష్యముల గాంచగోరువారు నాచే ముద్రింపబడిన 'అలంకారమంజరి'ని జూడ ప్రార్థితులు.

గీ. వ్రాసె భరతుడు కావ్యాత్మ 'రస'మటంచు
'అల నలంకారసహిత శబ్దార్థసమితి'
జీవమని భామహాదులు చెప్పినారు
'గుణము' ప్రాణమటంచు వాకొనియె దండి
పలికె కావ్యాత్మ 'రీతి' గా వామనుండు
'ధ్వని' యటంచు నానందవర్ధనుడు నుడివె
కుంతలుండు జీవంబు 'వక్రోక్తి' యనియె
మహిమభట్టారకుం 'డనుమాన' మనియె

'ఔచితి' యటంచు క్షేమేంద్రు డాడె; కాని
మతములన్నిట 'ధ్వని' మహోన్నతి వహించె
నెల్లమతముల లక్షణ మిందుగలదు.

విజయవాడ, శ్రీముఖ సం.
మాఘశుద్ధ ద్వితీయ,
సౌమ్యవాసరము.

ఇట్లు,
వినీతవశంవదుడు,
గ్రంథకర్త.

# విషయసూచిక

## ప్రథమభాగము

## I. ప్రాచీనమతములు

### ౧. రసమతము


| | పుట |
|---|---|
| గుణదోషవిచారము (భరతుడు) | ౧ |
| రసము-విభావాదులు | ౧౯ |
| అలంకారమతోదయచిహ్నములు (భరతుడు-భామహుడు) | ౨౮ |


### ౨. అలంకారమతము


| | |
|---|---|
| కావ్యశరీరము-ప్రయోజనములు (భరతుడు) | ౩౭ |
| కావ్యాంగములు-భేదములు | ౪౦ |
| కావ్యాలంకారములు-వక్రోక్త్యాదులు | ౪౮ |
| అలంకారములు - అనుప్రాసవృత్తిభేదములు (ఉద్భటుడు) | ౫౬ |
| అలంకారాభ్యుదయము; భాషావిభాగము వర్ణవృత్తివిభేదము (రుద్రటుడు) | ౬౭ |
| అలంకారసంఖ్యావృద్ధి కారణములు; విభాగసూత్రవిభేదములు | ౮౭ |

## ౩. గుణమతము

భాషారచనావిభాగము; గుణప్రాచుర్యము (దండి) ౮౩
దశవిధగుణ స్వరూపనిరూపణము-మార్గద్వయ విభేద
నిర్వచనము ౮౯
గుణాలంకారదోష తారతమ్యము-స్వభావోక్తి
ప్రాశస్త్యము ౧౦౧

## ౪ రీతిమతము

శబ్దార్థగుణలక్షణ వివేచనము; రీతిత్రయవిభాగ
వివేకము (వామనుడు) ౧౦౯
గుణాలంకారనిత్యానిత్య సంబంధము-సర్వాలంకార
మూలసూత్ర నిర్ణయము ౧౧౯
ప్రాచీన ప్రస్తుతమత తారతమ్యము-రసరీతి
వృత్తిసంబంధ విభేదము ౧౨౫

## ౫. రసమత సమాలోచనము

నాట్యరసచరిత్రము (భామహుడు - రుద్రటుడు) ౧౩౫
రససూత్రార్థవివిధవాదములు ౧౪౬
ఉత్పత్తివాదము (భట్టలోల్లటుడు) ౧౪౭
అనుమితివాదము (శ్రీశంకుకుడు) ౧౪౯
ఉత్పత్త్యాది వాదపూర్వపక్షము ౧౫౧
భుక్తివాదసిద్ధాంతము (భట్టనాయకుడు) ౧౫౨
రసధ్వనిమతాన్యోన్యసాంగత్యము; వ్యక్తివాదము
(అభినవగుప్తపాదుడు) ౧౫౭
భుక్తివాదపూర్వపక్షము ౧౬౧
వ్యక్తివాదసిద్ధాంతము ౧౬౩

రసపర్వణసౌఖ్యస్వరూప
పరబ్రహ్మాస్వాదానందవిభేదవివేకము ౧౬౬.
రసమతసమాలోచనసారము ౧౮౦

## ద్వితీయభాగము

## II. నవీనమతములు

### ౧. ధ్వనిమతము

వృత్తిత్రయావిభేదము; విపక్షమతఖండనము
(ఆనందవర్ధనాచార్యుడు) ౧౮౩
కావ్యత్రయవిభాగము, ప్రాచీనమతసమన్వయము ౧౯౬
రసధ్వనిమతాన్యోన్యదాంపత్యము; ధ్వనిమతాభ్యుదయము ౨౦౦

### ౨. ధ్వనినాశకమతములు

ప్రౌఢోక్తిమతము (భట్టనాయకుడు) ౨౦౮

### ౩, వక్రోక్తిమతము

వక్రోక్త్యలంకారలక్షణనిరూపణము
(రాజానకకుంతలుడు) ౨౧౩
వక్రోక్తిజీవితస్వరూపవర్ణనము ౨౨౨
అలంకారతత్త్వవిమర్శనము ౨౩౨

### ౪. అనుమానమతము

ధ్వన్యాపిమతఖండనము; అనుమానమతమండనము
(మహిమభట్టు) ౨౩౯
అనౌచిత్యవిచారము; ధ్వనిలక్ష్యవిమర్శనము ౨౪౪

### ౫. రసాలంకారమతసమ్మేళనము

అగ్నిపురాణము; సరస్వతీకంఠాభరణము (భోజదేవుడు) ౨౫౨

## III. నవ్యమతము


| | |
|---|---|
| ధ్వనిమతస్థాపనము | ౨౬౫ |
| ధ్వనిమతసంస్థాపనము (మమ్మటాచార్యుడు) | ౨౭౧ |
| ధ్వనిమతప్రాచుర్యము (రుయ్యకుడు) | ౨౮౨ |
| రసమతసముద్ధరణము (విశ్వనాథుడు) | ౨౮౮ |
| అలంకారమతానుకరణము (విద్యాధరవిద్యానాథాదులు) | ౨౯౩ |
| ,, (హేమచంద్రాదులు) | ౩౦౪ |
| రసధ్వనిమతసింహావలోకనము (జగన్నాథపండితుడు) | ౩౧౯ |
| కావ్యాత్మోపసంహారము | ౩౨౬ |

# గ్రంథరచన కుపయోగించిన పుస్తకములు

---

అగ్ని పురాణము;

అభిధావృత్తిమాతృక - ముకుళభట్టు

అలంకారకౌస్తుభము - విశ్వేశ్వరుడు

అలంకార శేఖరము - కేశవమిశ్రుడు

అలంకారసర్వస్వము - రాజానకరుయ్యకుడు

  వ్యాఖ్యాసహితము - జయరథుడు; సముద్రబంధుడు

ఏకావళి - విద్యాధరుడు

కావ్యప్రదీపము - గోవిందుడు

  వ్యాఖ్య - ప్రభ - వైద్యనాథతత్సత్

కావ్యప్రకాశము - మమ్మటాచార్యుడు

  వ్యాఖ్యలు - సంకేతము - మాణిక్యచంద్రుడు; సుధాసాగరము - భీమసేనదీక్షితుడు; బాలబోధిని - భట్టవామనాచార్యఝాల్కీకరు.

కావ్యమీమాంస - రాజ శేఖరుడు

కావ్యాదర్శము - దండి

  వ్యాఖ్యలు - హృదయంగమ; ప్రభ

కావ్యానుశాసనము - వాగ్భటుడు

కావ్యానుశాసనము - హేమచంద్రుడు

  వ్యాఖ్య - అలంకారచూడామణి

కావ్యాలంకారము - భామహాచార్యుడు

కావ్యాలంకారము - రుద్రటాచార్యుడు

కావ్యాలంకారము - వాగ్భటుడు

కావ్యాలంకారసంగ్రహము - ఉద్భటాచార్యుడు

వ్యాఖ్య - ప్రతీహారేందురాజు

కావ్యాలంకారసూత్రములు - వామనుడు

వ్యాఖ్య - కామధేనువు - గోపేంద్రతిప్పభూపాలుడు

కువలయానందము - అప్పయ్యదీక్షితుడు

చంద్రాలోకము - జయదేవుడు

వ్యాఖ్యలు - రమ ; శరదాగమము

చిత్రమీమాంస - అప్పయ్యదీక్షితుడు

,, ఖండనము - జగన్నాథపండితుడు

దశరూపకము - ధనంజయుడు

అవలోకము - ధనికుడు

ప్రభ - సుదర్శనుడు

ధ్వన్యాలోకము - ఆనందవర్ధనుడు

లోచనము - అభినవగుప్తపాదుడు

నాట్యశాస్త్రము - భరతుడు

అభినవభారతీవ్యాఖ్య - అభినవగుప్తపాదుడు

ప్రతాపరుద్రీయము - విద్యానాథుడు

వ్యాఖ్య - రత్నాపణము, కుమారస్వామి

రసగంగాధరము - జగన్నాథపండితుడు

వక్రోక్తిజీవితము - రాజానకకుంతలుడు

వ్యక్తివివేకము - మహిమభట్టు

సరస్వతీకంఠాభరణము - భోజదేవుడు

సాహిత్యదర్పణము - విశ్వనాథుడు.

---

# కావ్యాత్మ

## ప్రాచీనమతములు

---

అరయఁగా నియతికృతనియమరహిత మ
నన్యపరతంత్ర మెంచ హ్లాదైకమయము,
నవరసరుచిరనిర్మితిని వెలుఁగొంది
స్రష్టను హసించు కవివాణి జయము నొందు.

### ౧. రసమతము

(గుణదోషవిచారము–భరతుడు)

సంస్కృత వాఙ్మయమున మహోత్కృష్టగ్రంథముల కన్నింటి కిని నిర్మాతలు మహర్షులు. తరచుగా మహాత్ముల ప్రవృత్తులు లోకహితాపాదకములై చెలువారుచుండును. కాన మన పవిత్ర గ్రంథము లన్నియు నార్షములుగానే చెలంగుచున్నవి. వేదపురాణేతి హాసములే కాక కావ్యనాటకాలంకారములుగూడ మునిప్రోక్తములు గానే కన్పట్టుచున్నవి. ఈ గీర్వాణవాణీమహావృక్షమునకు ఫల కుసుమపల్లవసంచయంబులే మన కన్నులకు పండువుగా గన్పట్టు చుండును. కాని దీనితల్లివేరును వెదుక మనకు శక్యముగాదు. ఆర్ష

# కావ్యాత్మ - ప్రాచీనమతములు

భాషాయోషామణీ వదనారవిందమునకు అపూర్వసౌందర్యసంపాదకములై, నేత్రప్రాయములై, సహృదయహృదయాహ్లాదసంధాయకములై కావ్యనాటకములు ప్రకాశించుచున్నవి. ఈ కావ్యనాటకములకు తొలుదొల్త లక్షణము విధించిన సృష్టికర్తల చరిత్ర మనకు అనాదియు, అతిప్రాచీనము నగుటచే గాఢాంధకారనిమగ్న మైయున్నది. నవీనుల గ్రంథముల నచ్చటచ్చట నుదాహృతములై ప్రాచీన లక్షణవిధాయుల శ్లోకములు, శ్లోకార్థములును తారకలవలె కొంత కొంత మెరయుచున్నవి. ఈనక్షత్రగణమధ్యమున మునిచంద్రుడు భరతుడు షోడశకళాపరిపూర్ణుడై ప్రకాశించుచు, భారతీయనాట్యశాస్త్రజ్యోత్స్నాప్రపూరము బ్రవహింపజేసి అజ్ఞానతమమును బారదోలెను.

కాన భరతమునిరచిత మైన నాట్యశాస్త్రమే ప్రథమమున కావ్యనాటకములకు లక్షణమును విధించెను. ఇదియే మనకు ప్రస్తుతమున లభ్యము లైన లక్షణగ్రంథములలో నతిప్రాచీనపుస్తకము. భరతునితరువాత మహాకవు లందరును, నాట్యశాస్త్రచోదితము లైన లక్షణముల ననుసరించియే కావ్యనాటకముల రచించిరి. భరతుడు, నాట్యశాస్త్రమున పదునారవ యధ్యాయమున అలంకారలక్షణమును వచించెను. ఇందు నాలుగు అలంకారముల, పదిగుణముల, పదిదోషముల, ముప్పదియారులక్షణముల పేర్కొనియున్నాడు. ఇదియే కావ్యసామగ్రిగా భరతుడు నుడివెను. కావ్యనాట్యసృష్టియం దిదియే కృతయుగ మని మనము భావింపనగును. మన మిట ముఖ్యముగా నొకసంగతిని గుర్తింపవలయును. భరతుడు తనగ్రంథమున నాట్యశాస్త్రమును అంగిగాను, తదితరముల అంగములుగను పాటించె నని గ్రంథనామమే వెల్లడించుచున్నది. కొంతకాలమునకు కావ్యనాటక

ములకు దాయభాగ మేర్పడియె. అప్పుడు రెండును వేర్వేరు త్రోవల సంచరింపజొచ్చె. మరియు నాట్యాలంకారముల రెంటిలో నాట్యము ప్రాచీనతర మైనట్లు కొన్నిచోట్ల గన్పట్టుచున్నది. నటసూత్రములని కొన్ని సూత్రములు పాణిన్యాచార్యుల కాలములో నున్నట్లు మనము వినుచున్నాము. అటులనే అలంకారసూత్రము లున్నట్లు మన కెచ్చటను దెలియవచ్చుటలేదు. దీనిచే నాట్యశాస్త్రము జ్యేష్ఠ మనియు, అలంకారశాస్త్రము కనిష్ఠ మనియు మన మూహింపవలసి యున్నది. ఈకారణముననేకాబోలు, భరతముని తనగ్రంథమునకు నాట్యశాస్త్ర మని పేరిడియెను. కాన దీన నాట్యమునకే ప్రాధాన్య మని మన మెరుంగవలయు. మరియు ప్రాచీనాలంకారికులైన భామహాదులు తమతమగ్రంథముల నాట్యకళకు తావొసంగకున్నను, కావ్యమున నొక విభాగమే నాటక మని వచించిరి. భామహుని భావమును దండ్యాచార్యుడు బలపరచెను. తరువాత వామనాచార్యుడు, నాటకమునెడ విశేషాభిమానమును జూపినను, దానికి ప్రత్యేకముగ లక్షణము విధింప ప్రయత్నింపడయ్యె. పోనుపోను చిరంతనులమార్గమునే ఆధునికు లనుసరించిరి. కాని హేమచంద్ర, విద్యానాథ, విశ్వనాథులుమాత్రమే మరల నాటకలక్షణమును తమ తమ అలంకారగ్రంథములలో జోడింపజొచ్చిరి. వీరికాలమునకు స్వతంత్రమతనిర్మాణము శిథిల మగుటంజేసి, ప్రాచీనజీర్ణకుడ్యములకు సుధానులేపన మొనరించి, అలంకారశాస్త్రప్రాసాదమునకు నూతన వికాసము నొసంగుటయే వీరికి విధాయకకృత్య మయ్యెను.

ఈముగ్గురిలో హేమచంద్రునకు భరతమునియందును, అతనివ్యాఖ్యాత అభినవగుప్తపాదాచార్యులయందును విశేషాదరగౌరవము లున్నవి. కాన నీతడు భరత, కోహల, అభినవగుప్తుల

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

గ్రంథములలోని రసవంతములైన భాగముల నెల్ల స్వీకరించెను. ఇంక విద్యానాథవిశ్వనాథు లన్నవారు ధనంజయ, ధనికకృత మైన దశరూపకము నామూలముగ సంగ్రహించిరి. దీనివలన కావ్యనాటకా లంకారములకు విభేదము గల దని తెలియుచున్నది. కావుననే భరత ముని తనగ్రంథమున నాటకాశ్రయము లైన అలంకారములను వేరుగ నొక అధ్యాయమున రచించె. మరియు దోషవిచారమున భరతుడు కావ్యగుణములు, కావ్యదోషము లనియు, అలంకారములవిషయమున కావ్యమున కివియే అలంకారము లనియు వచించెను. ఇచ్చటను మరికొన్నిచోట్లను భరతుడు కావ్యపదమును వాడెను. దీనివలన కావ్య మన నాటక మనియే భరతునితలంపుగా మనము గురుతింపవల యును. కావి పదునారవ యధ్యాయమున రెంటికి నిసుమంత భేద మును భరతుడు గమనించినట్లు కన్పడును. ఈభేదము విశేషభేదము గాదు. మరియు కావ్యనాటకము లొక్కతొడిమను పూచిన జంట పువ్వులుగా జెలంగును. అందుననే నాటకశబ్దమునకు మారుగా కావ్య పదమును భరతమునీంద్రుడు ప్రయోగించెను.

పదునారవ యధ్యాయమున భరతమహర్షి కావ్యలక్షణముల వివరించి వాని నన్నింటిని విపులముగ జర్చించెను. ఈ లక్షణవిమర్శన మును దిలకింతుమేని భరతుడు వీనికి అలంకారశాస్త్రమున నెచ్చట స్థలనిర్దేశము చేసెనో మనకు స్ఫుటముగ బోధపడదు. కాని నవీనులు వీనిని గుణాలంకారములుగా భావించిరి. దండ్యాచార్యుడు వీనిని స్థూలదృష్టిగ నలంకారము లని వచించి, నాటకాంగము లైన సంధ్యంగ వృత్త్యంగముల బేరొక్కొని, వీనిలక్ష్యములకు ఆగమాంతరమున గను డనియెను. దండ్యాచార్యుని ధనంజయుడు డనుసరించెను. కాని విశ్వనాథుడు డీలక్షణముల నాటకపరిచ్ఛేదమున నిరూపించి,

కొన్నిటి నాట్యాలంకారములుగా వచించెను. ఈలక్షణములలో కొన్నిటిని గుణాలంకారభావములలో పాటించినను, నాటకరచన కివి శోభావహము లనియు, చాల నేర్పుతో వీనిని గమనింపవలయు ననియు నాతనిమతము గానోపును. ఈలక్షణములు శాస్త్రమర్యాద ననుసరించి దశరూపకముల సంచరించుచున్నను, ఆధునికాలంకార గ్రంథముల వీని కాదరము సున్న యయ్యె. లక్షణములవు నాటకముతే యోగ్యస్థలము లని మన కీమార్పు తెలియజేయుచున్నది. మరియు, అలంకారశాస్త్రపరిజ్ఞానము బాల్యప్రాయమున నున్నతరిని గుణాలంకారములకన్న వేరుగను, పేరొందినవిగను భావింపబడిన లక్షణములు, విమర్శనావివేక మభివృద్ధిగాంచి, ప్రౌఢదశ నందినంతనే గుణాలంకారముల లీనములై; ఉచితగౌరవమును బడసె నని మన కీనూతనమార్గము బోధించుచున్నది. భరతుడు ఆశీస్సు నొకలక్షణముగా వచించె. భామహుడు 'కొందరిమతము ననుసరించి ఆశీస్సు గూడ నొక అలంకారమే' అని సందేహాస్పదముగ బలికెను. దండ్యాచార్యులకాలమునకు ఆశీస్సు రూఢిగ నొక అలంకారమయ్యె. దీనివలన అలంకారశాస్త్రము ప్రాథమికదశలో నున్న దని మనకు తెలియగలదు.

కావ్యలక్షణనిరూపణానంతరమున మునిచంద్రుడు, కావ్యోపస్కారకము లైన ఉపమా, రూపక, దీపక, యమకము లను చతురలంకారముల జర్చించెను. ఇందు, ఉపమానాలంకారమును నాలుగు విధములుగా విభజించెను. ఈ విభాగము ఉపమేయోపమానముల యేకత్వానేకత్వములపై నాధారపడియుండును. ఉపమానముపై దృష్టి నిల్పి వీక్షింతుమేని భరతుని ఉపమానాలంకారము, ప్రశంసా, నిందా, కల్పిత, సదృశ, కించిత్సదృశము లని పంచవిధముల బరగు

చున్నది. భామహోద్భటదండివామనాచార్యులవలె అణీయములు అతిరమణీయములు నైన ఉపమానాలంకారభేదప్రభేదముల భరతు డెరుంగడు. ఈ ఉపమానాలంకార మతిప్రాచీనాలంకారములలో నొకటియై, నిరుక్తకారుడైన యాస్కునికాలములోగూడ, ప్రచార ములో నున్న దని చెప్పకతప్పదు. వామనాచార్యుల ఉపమానా లంకారలక్షణమును ప్రాచీనుల లక్షణముతో సరిపోల్చి చూతుమేని, అచిరకాలమున నలంకారశాస్త్ర మెంత వృద్ధి నందెనో, దీనిపై చిరంతనాచార్యవర్యుల కెంత అభిమానాదరము లున్నవో మనకు దెలియవచ్చును. భరతుని నిందాప్రశంసోపమలు భామహునిచే నిరాకరింపబడినను దండ్యాచార్యులప్రశంసకు పాత్రము లయ్యెను. భావమున లేశము భేద మున్నను, కల్పితోపమానామమును వామ నుడు వాడెను. రూపకదీపకాలంకారముల విభేదము లేమియు మనకు గానరావు. కాన నివి నూతనాలంకారము లైయుండనోపు. ఇంక యమకాలంకారము పదివిధము లని వచించి, భరతుడు వీనికి లక్ష్య లక్షణముల నుదాహరించెను. లక్షణముమార్పు లభించినను, యమకా లంకారభేదములు దండ్యాదులకాలమునకుగూడ శేషించియుండెను. కావున శబ్దాలంకారములుగా నవీనులు గణించినవానికి కొందరు ప్రాచీనులు విశేషాభిమానమును జూపి రని దీన మనకు గానవచ్చును. దీనికి యమకాలంకారచరిత్రమే తార్కాణము. దండివామనరుద్ర టాదులు యమక మనిన నత్యాదరము గలిగియుండిరి. భామహా చార్యుడు యమకము ఐదువిధములుగా బలికె. చిరంతనులలో నొక్క ఉద్భటాచార్యుడే దీని నేలనో మరచిపోయె. భరతుడు జూపిన విశేషాదరమును గమనించినచో యమకాలంకారముగూడ నతి ప్రాచీనాలంకారములలో నొకటి యైయుండవచ్చును. మమ్మటాది

నవీనులు ప్రాయశముగ, ఆనందవర్ధనాచార్యుల ఆజ్ఞానుసారముగ పృథగ్యత్నమునగాని దుష్కరయమకాదిశబ్దనిబంధనము జేయరాదనియు, శబ్దశ్లేషాన్వేషణరూపయమకాదినిబంధనము రసాభివ్యక్తికి దోడుపడ దనియు గాఢముగా నమ్మియుంటచేగాబోలు, తమతమ గ్రంథములలో నలంకారప్రకరణమున పేరునకుమాత్రము యమకమును చేర్కొని, రెండుమూడు వాక్యములలోనే ముగింప జొచ్చిరి. మరియు విబుధేంద్రప్రతిభావిశేషనందనోద్యానపీఠికాంతరముల విమర్శనావిజ్ఞానపారిజాతప్రసూనము వికసించిననాట నుండియు, కావ్యాత్మతత్త్వవిచారకల్పతరుఫలము పరిపక్వ మందిన కాలందియు, శబ్దాలంకారముల సంఖ్య సన్నగిల్లుచు, రసభావరీతి గుణధ్వనులు వన్నె మీరెను. ఇందుచే ఆధునికుల శబ్దార్థాలంకారముల తారతమ్యము భరతభామహాచార్యులకు తెలిసియుండదని మన మనుటకు వీలు లేదు. ఏలనన, యమకమును శబ్దాభ్యాసముగా భరతముని వచించెను. ఇదియే దండ్యాచార్యాదుల శబ్దార్థాలంకారముల విభేదమును బురికొల్పియుండవచ్చును. భరతముని ప్రభృతులు ఉపమానాలంకారయమకాలంకారములను క్రమముగా అర్థాలంకారము, శబ్దాలంకారముగా నిచ్చగించి రని ఆచార్యాభినవగుప్తపాదుడు రచించెను.

అలంకారపరిగణనానంతరమున మునీంద్రుడు గుణదోషవిచారమునకు దొరకొనెను. పదిగుణములు, పదిదోషములును, కావ్యమునకు గల వనియెను. రీతి, గుణమతాచార్యు లీ గుణదోషవిచారమును సూక్ష్మదృష్టితో జేయ మొదలిడిరి. కాన వీని నచ్చట విపులముగ జర్చించెదము. భరతుడు నిర్ణయించిన గుణదోషముల లక్షణమునకును, తరువాతివారల లక్షణమునకును భేదము గలదు. భరతభామహుల

లక్షణముల రెంటెని పోల్చి చూచినచో మన కీభేదము తేటపడును. ఇంక భరతు డుదాహరించిన దోషముల సంగ్రహముగా వివరింతుము:

౧. గూఢార్థము—ఇది పర్యాయశబ్దాభిహితమై తనరారును. పర్యాయశబ్ద మనినంతనే ఏకార్థశబ్ద మని మనము భ్రమింపరాదు. దీని నింకొకదోషముగ భరతుడు గణించెను. కావున నీగూఢార్థము నవీనులచే అలంకారముగ గణింపబడిన పర్యాయోక్తి యైయుండవచ్చును. ఈయూహకు ననుకూలముగనే అభినవగుప్తుని వ్యాఖ్యానమున్నది. కొన్నిచోట్ల పర్యాయోక్తిగూడ కావ్యమునకు శోభావహమగుటచే నూతనాలంకారికులు దీని నలంకారముగ లెక్కించియుందురు. ఈరీతినే అలంకారములసంఖ్య క్రమక్రమముగా వృద్ధినొందెను.

౨. అర్థాంతరము—అవర్ణ్యముయొక్క వర్ణన మీదోషము. అనగా, అవసరము లేనిదానిని వర్ణించుటయే. అభినవగుప్తుడు వ్యాఖ్యానమున నీదోషము అప్రకృతవర్ణనము గా దనియు, అవర్ణనీయమునుగూడ శబ్దమున వర్ణించుట యనియు పలికెను. కాని అప్రకృతవర్ణనమే అర్థాంతరదోష మనుట సమంజసముగా గన్పట్టును. వ్యక్తివివేకకారుడు నిరూపించిన వాచ్యావచనదోషము భరతుని అర్థాంతరమైయుండును. రసభావముల స్వశబ్దాభిధానదోష మిం దిమిడియున్నదని వ్యాఖ్యాత సూచించెను గాని గ్రంథకారుడు దీనిని దోషముగా గణించెనో, లేదో, మనకు స్ఫుటముగ బోధపడదు.

3. అర్థహీనము—ఇది అసంబద్ధము, అశేషార్థము నని రెండు తెరగులు.

౪. భిన్నార్థము—అసభ్యత లేక గ్రామ్యత గలచోటను, వివక్షిత మైన అర్థ మెచట అన్యార్థముచే భేదించుచుండు నచటను భిన్నార్థదోషము వర్తిల్లును. ఇట్లీదోషము రెండువిధముల జెలంగును.

౫. ఏకార్థత—ఏకార్థముయొక్క అభిధాన మీదోషము.

౬. అభిప్లుతార్థము—ఇది పదములచే సమసింపబడును. ప్రతి పదమునకును అర్థపరిసమాప్తి గలిగి ఏకవాక్యత్వముచే నిమజ్జనాభావమున్నచో నది అభిప్లుతార్థ మని అభినవగుప్తుడు వ్యాఖ్యాన మొనరించెను.

౭. న్యాయాపేతము లేక అపేతన్యాయము—ప్రమాణవర్జిత మైనచో నీదోషము చెలంగుచుండును.

౮. విషమము—ఇది వృత్తదోషముగా వర్తిల్లును.

౯. విసంధి—సుప్రతిష్ఠితశబ్దరచనావిన్యాసము లేకున్నచో విసంధిదోషము సంభవించును.

౧౦. శబ్దహీనము—ఇది వ్యాకరణదోషము. అశబ్దయోజన మీపేర బరగుచుండును. అశబ్ద మనగా అపశబ్దము.

ఇచటనే భామహుడు వివరించిన దోషములగూడ వచింతుము. వీనిని భరతుడు పేర్కొనిన దోషములతో పోలిచి చూచినచో రెంటికిని గలభేదము చదువరులమదికి వెంటనే పొడగట్టును:

౧. అపార్థము—దీనిని సముదాయార్థశూన్యతగా బలుకుదురు.

౨. వ్యర్థము—సందర్భవిరోధము నీపేర బిలుతురు.

3. ఏకార్థత—కొందరు దీనిని పునరుక్తిదోష మందు రని భామహుడే పలికెను. ఈ పునరుక్తినామము భరతునకు దెలియకపోవచ్చును.

౪. ససంశయము—ఇందు శ్లేషార్థమునకు పోలిక గలదు.

౫. అపక్రమము—ఇదియే క్రమభంగదోషము.

౬. శబ్దహీనత—వ్యాకరణదుష్టపదప్రయోగము.

౭. యతిభ్రష్టత—ఇది విశ్రాంతిదోషము.

౮. భిన్నవృత్తము—వృత్తమున అస్థానమున గురులఘువుల ప్రయోగించుట.

౯. విసంధి—పదములకు గావలసినచోట్ల నన్యోన్యరచన లేకుండుటయే.

౧౦. దేశ, కాల, కళా, లోకన్యాయాగమవిరోధము—ధర్మశాస్త్రముల రచించినవారల ఆచారవ్యతిక్రమణమే ఆగమవిరోధ మని భామహుడు తానే వివరించెను.

ఈపైన పేర్కొనిన పదిదోషములుగాక వేరొకదోషమును భామహుడు నుడివెను. ఇది తర్కశాస్త్రదోషము. హేతుదృష్టాంతములలో లోప మున్నచో ప్రతిజ్ఞాదోషముగా బరగును. ఈ కావ్యన్యాయదోషమును పంచమాధ్యాయమున పూర్తిగ జర్చించెను. మరియు వేరొకసందర్భమున కావ్యగుణదోషముల నిరూపించుచు, భామహాచార్యు లింకొక పదిదోషములగూడ వచించెను. అవి: ౧. నేయార్థము, ౨. క్లిష్టత, ౩. అన్యార్థము, ౪. అవాచకత, ౫. గూఢశబ్దాభిధానత, ౬. అయుక్తిమత్తు, ౭. శ్రుతిదుష్టత, ౮. అశ్లీలత, లేక అర్థదుష్టత, ౯. కల్పనాదుష్టత, ౧౦. శ్రుతికష్టత, ఈ పదిదోషములను శ్రద్ధతో గమనింపవలయు నని కవులకు భామహాచార్యుడు బోధించెను. వీనిలో శ్రుతిదుష్టతాకష్టతలకు గల భేదమును అభినవగుప్తుడు చదువరులకు కన్నులకు గట్టినట్లు చూపించెను.

ఈరెండువిధముల దోషముల గురుతెరుంగు టెటులనో మనకు భామహుడు చెప్పలేదు. కాని వానిలక్షణమును పరిశీలించినచో మొదటి పది దోషములును కావ్య శరీరమునకును, రెండవ పది దోషములును కావ్యాత్మత్త్వమునకును సంబంధించినట్లు మన బుద్ధికి దోచును. భరతభామహులచే పేర్కొనబడిన దోషజాలమును సవిమర్శదృష్టి వీక్షింతుమేని, కొన్నిట రెంటికిని శబ్దార్థముల సాదృశ్య మున్నను, భామహుని లక్షణనిరూపణము, భరతుని విచారణకన్న మిన్నగా భాసించుచున్నది. శ్రుతికష్టతకు భామహుడిచ్చినలక్షణమును దిలకించినచో, కొన్నిచోట్ల దోషము గుణముగా పరివర్తనము జెందు నని మనకు స్ఫురించును. మరియు భరతుని మతమున చాలవరకు దోషాభావములే గుణములుగా భాసించును.

దోషసంచయమును జర్చించి భరతుడు గుణగణవిమర్శనమునకు బూనెను. దోషవిపర్యయము గుణ మని ప్రథమమున భరతముని పలికెను. కావ్యశోభాధాయకధర్మమే గుణ మని వామనుడు నుడివెను. ఈ రెండులక్షణములకును కొండంతయంతర మున్నది. సత్యము విచారించినచో దోషాభావము గుణ మనుట చాల సాహసము. ఇంతియేగాక, భరతుని లక్షణానుసారముగ మాధుర్యౌదార్యాదిగుణములాతడు పేర్కొనినదోషములకు విపర్యయము లని చెప్పుటకు వలను పడదు. ఇంతమాత్రమున మునిచంద్రునియందు స్వవచన విఘాతము నారోపింపరాదు. తొలుత సాధారణలక్షణమును వచించి పిదప విశేషలక్షణమును రచించె నని మనము సమర్థింపవచ్చును. తాను పేర్కొనిన దశగుణముల నీక్రిందివిధమున భరతుడు వివరించెను:

౧. శ్లేషము—ఇందు శబ్దములు స్వభావస్పష్టములయి, విచారగహనములయి, సుప్రతిబద్ధములయి కవితలంపు ననుసరించి అనేకము

లైన సముదాయార్థముల చదువరులమనముల కొదవించును. ఇందు పదములు పైపూపులను నస్పష్టముగ గనుపించినను అర్థవిచారావసరమున నస్పష్టము లైయుండును. శ్లేషలక్షణమున గల భరతుని విచారగహన మనుదానికి అభినవగుప్తుడు విచారోపహత మని పాఠాంతరమును సూచించెను. హేమచంద్రుడు కావ్యానుశాసనమునను, మాణిక్య చంద్రుడు కావ్యప్రకాశసంకేతమునను విచారగహన మను విశేషణ మునే సమ్మతించిరి. అభినవగుప్తునిమతము ననుసరించి, భరతుని శ్లేషగుణము వామనుని అర్థగుణశ్లేషగా గన్పట్టును.

౨. ప్రసాదము — విభక్తవాచ్యవాచకయోగముచే అనుక్త మైన శబ్దార్థములకుగూడ ప్రతిపత్తి గల్గినచో ప్రసాదగుణముగా భరతుడు పల్కె నని హేమచంద్రుడు వచించెను. కాని నాట్య శాస్త్రమునందు సుఖశబ్దార్థసంయోగముచే అనుక్తశబ్దార్థముల కిచట ప్రతీతి గల్గునో దానికే ప్రసాద మని భరతుడు రచించెను. భరతుని ప్రసాదగుణము దండిసమాధిగుణమును బోలియున్నది. ప్రయత్నా పేక్ష లేకయే బోధపడునవి సుఖశబ్దార్థము లని అభినవగుప్తు డర్థము చెప్పెను. ఇచట అనుక్త మని భరతుడు నుడువుటచే, చంద్రాలోక కువలయానందములలోని ముద్రాలంకారమునకును, కొంతవరకు వామనుని వక్రోక్త్యలంకారమునకును, నవీనులలక్షణ లేక ఉప చారతకును, భరతుని ప్రసాదగుణము సాటి వచ్చుచున్న దని చెప్పనగును. ఇచట నర్థము వైమల్యాశ్రయ మైనను, వైమల్యము ఉపచారమాత్ర మని, అభినవగుప్తుడు చెప్పుటచే, భరతునిప్రసాద గుణము, వామనుడు అర్థవైమల్యమే ప్రసాద మని చెప్పిన అర్థగుణమై కొంతవరకు తెలంగవచ్చును.

3. సమత — చూర్ణపదరచనావిశేషమే సమతాగుణము. భిన్నభిన్నసమాసములచే గూర్చిన వచనరచనకు చూర్ణపద మని భరతుడు లక్షణము రచించెను. భరతలక్షణానుసారముగనే వామనుడు బలికెను. చూర్ణపదోపచారముచే, వ్యస్తపదసమాహారము లక్షిత మనియు, నందుచే వ్యస్తపదబహుళమే చూర్ణ మనియు తిప్పభూపాలుడు వామనునిసూత్రమునకు వ్యాఖ్యానము జేసెను. మరియు దీర్ఘసమాసములు, అనుద్ధతపదము లని వామనుడే తనసూత్రమునకు వృత్తి వ్రాసె. ఇంతియే గాక, శబ్దముల సమత్వముచే సమ మనియు, ఎచట నది సాతిశయము గాకుండునో, అది చూర్ణపదసమాసరచన యనియు, దీర్ఘసమాసములును, అత్యంతసమాసములునుగూడ వివమతావిపర్యయమున సమతాగుణాశ్రయములై, ఉపక్రాంతమార్గాపరిత్యాగములై భాసించు ననియు, భరతుని సమతాగుణలక్షణమునకు, అభినవగుప్తపాదుడు విపులవ్యాఖ్యానము రచించెను. దీనిచే నిది వామనుడు మార్గాభేదమే సమత యనిన శబ్దగుణము గానోపును.

4. సమాధి — అర్థముయొక్క గుణాంతరసమాధానముచే, సమాధిగుణము సంభవించు నని భరతునిలక్షణమునకు, హేమచంద్ర మాణిక్యచంద్రు లర్థముచెప్పిరి. స్వోల్లిఖితమై, ప్రతిభానాతిశయవంతమై, సమాహితమనస్సంపాద్యవిశిష్టత్వమున సమాధిగుణమునందు అర్థము చెలంగునని అభినవగుప్తుడు వచించెను. మరియు సమాధిశబ్దమున కే అర్థము పరిహారలక్షణమో దానిచే నది పరికీర్తితము; అనగా సమంతాత్క్రాంతోచ్చారణసంపన్నమై సమాధిగుణము జెలంగు నని భావము. ఇచట ఆక్రాంతోచ్చారణ మన ఆరోహావరోహక్రమ మని తానే స్పష్ట మొనరించెను. కాన నిది వామనుడు, ఆరోహావరోహక్రమమే సమాధిగా గణించిన శబ్దగుణము గావచ్చును.

౫. మాధుర్యము—మరలమరల వినిన జదివిన, వెగటు వొడమక, తనివి దీరక వాక్యమైన, పద్యమైన, మనమనముల కింపుసొంపుల ముంపుచున్నచో, మాధుర్య మని భరతుడు నుడివెను. వలపుజెలుల కినుకజెనకు పలుకుములుకులలో గల తియ్యదనమునకు నిది సరిపోవు నని వామనీయులమతము. ఈ మాధుర్యము అక్షరవిన్యాసముపైనను, అసమాసరచనపైనను ఆధారపడి యుండు నని కొందరందురు. అసమాసరచన మనుట, అనుభవవిరుద్ధ మని దండ్యాచార్యు డాడెను. దీర్ఘసమాసము లున్నను, కొన్నిచోట్ల మాధుర్య మొలుకుచుండును. కాన భరతునిమాధుర్యగుణము వామనుడు పృథక్పదత్వమే మాధుర్య మనిన శబ్దగుణము గాజాలదు. ఇంక ఉక్తివైచిత్ర్యమే మాధుర్య మనిన అర్థగుణము గానోపును. ఈసందర్భమున ఆచార్యహేమచంద్రుడు పలికినట్లు రసవంతమే మాధురీధురీణతగా మనము సమ్మతించినచో సమంజసము, దండ్యాచార్యమతానుకూలమునయి నుండును.

౬. ఓజము — ఉదారస్వరములతో, వివిధములు, విచిత్రములు నైన పదములతోడను గూడిన సమాసవంతమైన సంఘటనమే ఓజోగుణముగా గీర్తింపబడు నని భరతుడు చెప్పెను. ఈలక్షణమున 'వివిధైః' అనుచో 'బహుభిః' అనియు, 'సాతుస్స్వరైః' అనుచో 'సానురాగైః' అనియు బఠించి, వర్ణములు వర్ణాంతరము నపేక్షించునవి సానురాగస్వరము లని, అభినవగుప్తుడు వ్యాఖ్యాన మొనరించెను. అవగీతమునకు గాని, హీనమునకుగాని, ఉదాత్తత్వమును గురియుచు, శబ్దార్థసంపద మెలంగుచో, ఓజోగుణముగా భరతుడు వచించె నని కావ్యానుశాసనమునం దపూర్వలక్షణమును హేమచంద్రుడు వచించెను. మాణిక్యచంద్రుడు హేమచంద్రునితో నేకీభవించెను.

౭. సౌకుమార్యము — సుశ్లిష్టసంధిబంధమై, సుకుమారార్థసంయుక్తమై, సుఖప్రయోజ్యము లైన వృత్తములతో గూడియున్నచో సౌకుమార్య మనబడును. దండియొక్క అనిష్ఠురాక్షరప్రాయత అనువిశేషణమునకును, వామనుని అజరఠత్వము, అపారుష్యము నను ద్వివిధసౌకుమార్యముల విశేషణములకును భరతుని సుకుమారార్థసంయుక్త మనువిశేషణము సరివచ్చును. కావున తుద కిది, అమంగళరూప మైన అశ్లీలత్వదోషాభావమే గాని గుణముగా గానరాదు. అందుచేత నవీనులు దీనిని అశ్లీలత్వదోషమున ప్రభేదముగ గణించి, గుణగణమున లెక్కింపరైరి.

౮. అర్థవ్యక్తి — లోకధర్మవ్యవస్థితము లైన కార్యములను సుప్రసిద్ధము లైన క్రియలచే స్పష్టముగ వర్ణించినచో, దానిని అర్థవ్యక్తిగుణముగా భరతుడు జెప్పెను. అర్థ మెచట నన్యథాస్థిత మైనను తథాస్థిత మైనట్లె ప్రతిభాసించునో, అచట నర్థవ్యక్తిగుణ మని హేమచంద్రాచార్యుడు భరతుని లక్షణమును వివరించెను. ఇదియే దండ్యాచార్యుని మతమున ఉక్త్యంతరాభిహిత మైన ప్రసాదగుణముగను, వామనుని వస్తుస్వభావస్ఫుటత్వ మైన అర్థవ్యక్తిగుణముగను పరిణమించు నని హేమచంద్రుడు పలికెను. మరియు, దండ్యాచార్యుల జాతి లేక స్వభావోక్త్యలంకారమునకును దీనికిని సామ్యమున్నది. కావున నిదియు దోషాభావమే గాని గుణము గాదని కొందరు దలంతురు. మమ్మటాచార్యుడు దీనిని అభిధాస్యమానస్వభావోక్త్యలంకార మగుటచే వస్తుస్వభావస్ఫుటత్వరూప మైన, అర్థవ్యక్తిగా స్వీకరించెను. కాని విశ్వనాథకవిరాజు దీనిని ప్రసాదగుణమునం దంతర్భావముగా భావించెను.

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

౯. ఉదారత — అనేకభావసంయుతమై, దివ్యభావపరీతమై ఎచట శృంగారాద్భుతరసములు యోజింపబడునో, అచట ఉదారతా గుణముగా గీర్తింపబడు నని భరతుడు విధించెను. ఈ లక్షణమున దివ్యభావపరీతము, అద్భుతరసయోజనము నని సూచించుటచే నీ గుణమునం దొక ఉత్కర్షధర్మము గానవచ్చును. అర్థమిచట ఉల్లేఖసమన్వితమగుటచే దీనిని గుణముగా స్వీకరించుటకు వామనీయులు శంకింతు రనియు, ఇచట కొంచెము మసృణమై అనుప్రాసము గానవచ్చుటచే, నిది, ఓజోగుణప్రకారమే కాని వేరు గాదనియు, ఆ కారణమున నిదియు దోషాభావమే గాని ప్రత్యేకగుణము గా దనియు హేమచంద్రుడు రచించెను.

౧౦. కాంతి — ఏది మనఃశ్రోత్రవిషయమై, ఆహ్లాదము జనింప జేయునో, లేక లీలాద్యర్థోపపన్నమై, పూర్ణచంద్రునివలె ప్రకాశించునో, దానిని కాంతిగుణ మందు రని భరతుడు వచించెను. ఈలక్షణమును మాధుర్యసాధారణముగా వామనీయులు భావింతు రని హేమచంద్రు డాడెను. కాని వామనమతానుసారముగ నీలక్షణము దీప్తరసత్వముగా భాసించుటచే అర్థగుణకాంతిగా మనము దలంపవచ్చును.

భరతలక్షణానుసారముగ నిట వివరింపబడిన గుణముల బరిశీలించినచో నచ్చటచ్చట నొకదానిలో వేరొకటి లీన మగునట్లును, వానిలో వానికి పరస్పరసంబంధ మున్నట్లును గానవచ్చును. దీనివలన మునీంద్రుడు సామాన్యలక్షణమును రచించెనేకాని, గుణగణమును సూక్ష్మదృష్టిని విమర్శించి విశేషలక్షణమును వచింపలే దని తోచును. కావుననే వామనునకు శబ్దగుణములను, అర్థగుణములను వేరుగ వివరించుట కవకాశము గలిగెను. గుణనిరూపణావసరమున

సంభవించిన నీ శేష భేదముల గుణరీతిమతముల సందర్భమున విమర్శింపదలచుటచే నింతతో విరమింపము. భరతముని చంద్రుడే ప్రథమమున గుణస్వరూపమును జర్చించె ననిమాత్రము మన మెరుంగనగును. ఇదియే మున్ముందు గుణమతమునకు బీజప్రాయమయ్యెను. తరువాత కాలక్రమమున నీ గుణమతపుష్పము రీతిమతఫలమై పరిణమించును. ఇంతియేకాక భరతమునియే ప్రథమమున కావ్యమునకు రసప్రాముఖ్యమును నిశ్చయించి నిరూపించెను. దండి, వామను లేరీతిగుణముల బెంపొందజేసిరో, యాచందముననే ఆనందవర్ధన, అభినవగుప్తపాదాచార్యులు రసమునకు సొంపు సంపాదించిరి. అందుచే ఆలంకారికమతముల కెల్ల భరతుడే పితామహసముడై వెలుగొందుచున్నాడు.

---

## ( రసము : విభావాదులు )

భరతమహర్షిచే నిర్మింపబడిన గుణాలంకారలక్షణములు కావ్యకాంతాలలామకు నవయవములై భాసిల్లి ప్రాణసమమైన రసమునకుపచరించును. ఈ అంగము లన్నియు వాచికాభినయరూపమున దీపించి ముఖ్యాంగమైన అనుభావమూలమున రసోదయమున కుపస్కారక మగును. ఈకారణముననే వీనికి విశేష్యప్రాముఖ్యము నొసంగక రసము నంగిగాను, గుణాలంకారాదుల నంగములుగాను, భావించి మునిచంద్రుడు నాట్యశాస్త్రమున లక్షణమును వివరించెను. కాన భరతమునిమతమున రసము కావ్యాత్మయై విలసిల్లును. ఇదియే భరతుని ముఖ్యాశయముగా మనకు జూచినంతనే కానరాదు. ఏల నన,

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

రాజశేఖరు డీవిషయమై ప్రసంగించుచు, మునీంద్రుడు, రూపకాను
కూలముగ రసమునకు ప్రాధాన్యము నంగీకరించె ననియు, మొదట
నందికేశ్వరుడు రసమతమును ప్రతిపాదించె ననియు, నందికేశ్వరప్రోక్త
మైన రసమతమును భరతుడు రూపకానుసారముగ స్వీకరించుటం జేసి,
మునిచంద్రుడు రూపకలక్షణమున కధికారి యనియు, కావ్య
మీమాంసను వక్కాణించెను. దీని కనుగుణముగ రసవిచారముఖమున
మునియే ప్రాచీనులశ్లోకముల గొన్నింటిని జేర్కొనెను. నవీను డైన
కేశవమిశ్రుడు, అలంకారశేఖరమున శౌద్ధోదనాచార్యు డను ప్రాచీ
నాచార్యు డొకడు అలంకారవిద్యాసూత్రకారు డనియు, అతడు
రససూత్రముల రచించె ననియు బలికెను. రసమతప్రాచీనతను నిశ్చ
యించుట కింతకన్న నాధారము లేవియు నేడు లేవు.

ఇందుచే రసమతావలోకనమునకు ప్రాచీనాచార్యులు జను
షాంధులని మన మనుటలేదు. వారికాలమున రసమతలతాంతము కోర
కముగా నుండనోపును. కావున కావ్యమాలతీలతాలవాలమునందు
మునిచంద్రు డమృతసేచన మొనరించి రసకోరకమును వికసింపజేసి,
రసప్రసూనపరిమళమిళితమలయానిలముల రసికజనమనముల నల
రింపజేసెనని మనము దలంచినచో సత్యదూరము గానేరదు.
మరియు, కావ్యాత్మ రసమనుటచే దృశ్యకావ్యములైన రూపకాదులని
మనము సందియమందనక్కరలేదు. దృశ్యశ్రవ్యముల కించుమించుగ
నభేదమును సంకల్పించియే భరతముని కావ్యపదమును వాడెనని
మనము మొదటనే తెలుసుకొంటిమి. కావ్యములలో నాటకమే
రమ్యమని నమ్ముటచే, రసము నాటకమున కెంతవరకు శోభాదాయ
కమో, దానిని విశదముగ నాతడు నాట్యశాస్త్రమున విమర్శించెను.
భరతముని ననుసరించియే ఆనందవర్ధనాచార్యాదులు రసనటీ

వామలోచనాలలితలాస్యనృత్యముల దృశ్యకావ్యరంగమును దప్పించి శ్రవ్యకావ్యసీమకు గొనివచ్చిరి. కావున తమతమ గ్రంథరచనాశైలి కనుకూలముగ, పూర్వాచార్యవర్యులు నాట్యరసమనియు, కావ్యరసమనియు గణుతించిరి. ఇందువలన రసకన్యకకు రూపకరంగము పుట్టినిల్లును, కావ్యసౌధము మెట్టినిల్లునుగా నిలచిల్లుచున్నది. ఇట్లు చెలంగినను గుణాలంకారరీతిమతముల ప్రాచుర్యమున జేసి, భరతముని గనిపెంచిన రసకన్యకాసౌందర్య మెలప్రాయముననే రసికజనమనముల రంజింపలేకున్నను, కాలక్రమమున 'భోగయోగ్యముగ ప్రాయము నిండుచురాగ' నామెలావణ్యాతిశయము సహృదయశిరోమణులైన సకలమతాచార్యుల మానసముల పరవశ మొనరింపగలిగెను. ఈనాట్యరసము మున్ముందు ఆనందవర్ధన, అభినవగుప్తపాద, మమ్మటాచార్యాదుల కరస్పర్శమున సువర్ణమయకావ్యరసముగా మార్పునొందును. మరియు, నాట్యశాస్త్రోపాధ్యాయుల రససూత్రమే భట్టలొల్లట, శ్రీశంకుక, భట్టనాయకాదుల దృష్టిప్రసారమున రసోదయచర్వణాక్రమముల వివిధ మతప్రతిపాదనముల కాస్పదమగును.

అందుచే రసమతమునకు నాట్యాచార్యుడే ప్రథమాచార్యుడని మనము జెప్పవచ్చును. తరువాతివా రందరును తమతమ మతముల నెలకొలుపబూనుచు మునిమతమునే మునుముందు చేకొందురు. ఇట్టి భరతాచార్యుల నాట్యశాస్త్రము సరళమై, సంగ్రహమై, సమగ్రమై, విబుధోద్యానసదృశమై విలసిల్లుచున్నది. ఇందు కావ్యము దశరూపాత్మకమే యనియు, రసాదృతమైనచో నర్థము వీసమేనియు గావ్యమున వర్తింపదనియు స్పష్టముగ సూత్రప్రాయముగ వచించి, దానిని మునియే మరలమరల కారికా, నిరుక్త, భాష్యముఖముల

విస్తరముగ నుపదేశించెను. మరియు విభావానుభావములు రసజనకములని సూక్ష్మముగ బలికెనేకాని, భరతుడు రసోదయక్రమమును విమర్శించి ప్రదర్శించలేదు. భావమూలకమై రసము వర్తించునవియు, వాగంగసత్త్వోపేతమై కావ్యార్థమును భావింపజేయునది భావమనియు లక్షణ మేర్పరచెను. విభావానుభావములమూలమున నీభావము రసావస్థ నందును. విభావమన విజ్ఞానార్థమనియు, వాగంగసత్త్వాభినయములచే విభావితములగుట విభావములనియు రచించెను. ఇంక అనుభావములన్నచో నవి వాగంగసత్త్వకృతాభినయముల ననుభావితములుగా నొనరించుటచే నాపేర బిలువబడును. రసమునకు తృతీయాంశముగా గణింపబడిన వ్యభిచారిభావములు, విభావానుభావములకు సహాయకములు, ఉద్దీపకములు నై మెలంగుచు, వివిధాభిముఖ్యమున జరింపజేయును. అంతియే కాని తాను లక్షణము విధించిన విభావానుభావవ్యభిచారిభావము లేయే సంబంధమున రసోదయమును గలిగించి, తా మేయేవిధమున రసాస్వాదనావసరమున నుపచరించునో, దానిని సంపూర్ణముగ జర్చింపక మునీంద్రుడు విభావానుభావవ్యభిచారిసంయోగమువలన రసనిష్పత్తి సంభవించునని కేవలసూత్రముమాత్ర మాదేశించెను. ఈసూత్రోపదేశానంతరమున నాట్యాచార్యశేఖరులు దృష్టాంతశ్లోకముల నెన్నిటినో రచించినను పరిపూర్ణార్థము బయలుపడకుంటచే 'సంయోగ', 'నిష్పత్తి' శబ్దార్థముల నిర్వచననిరూపణాదుల వేర్వేరుమతములు జనించుట కవకాశము లభించెను. మునివచనముల సారమును సంగ్రహించి, సృష్టి మొనరించుట కనేకులు పాటుపడుట జదువరు లెరుంగగలరు.

వ్యాఖ్యాతల మతముల ప్రసక్తికన్న మున్ను భరతమునిచంద్రుని ముఖ్యోద్దేశ మేదియో మనము పరికింపవలయు. "విభావాను

భావ వ్యభిచారిసంయోగాత్ రసనిష్పత్తిః"అనుసూత్రమును రచించిన వెనుక భరతు డాసూత్రార్థము నీక్రిందివిధమున జర్చించెను. గుడాది ద్రవ్యములచేతను, వ్యంజనౌషధులచేతను షాడబాదిరసము లెట్లు నిర్వర్తింపబడునో, ఆరీతిగానే నానాభావోపగతమై స్థాయిభావము రసత్వమును బొందునని భరతుడు దృష్టాంతము నిరూపించెను. ఆస్వాద్యత్వమే రసపదార్థమనియు, నానావ్యంజనసంస్కృతమైన అన్నమును భుజించుచు, రసము నాస్వాదించుచు, సుమనసులైన పురుషులు హర్షాదుల నేవిధమున ననుభవింతురో, ఆప్రకారమే నానా భావాభినయవ్యంజితములు, వాగంగసత్త్వోపేతములునైన స్థాయిభావముల నాస్వాదించుచు సుమనసులైన ప్రేక్షకులు హర్షాదుల ననుభవింతురనియు, ఇదియే నాట్యరసమనియు విపులవ్యాఖ్యాన మొనరించెను. మరియు నీసందర్భమున, బీజమువలన వృక్షము, దాన పుష్పఫలములు నేరీతి నుద్భవించునో, ఆవిధమున నన్నింటికిని మూలము రసములనియు, ఆరసములు భావవ్యవస్థితములనియు, కావున స్థాయిభావములు రససంజ్ఞచే వ్యవహరింపబడుననియు రచించి మునీంద్రుడు విరమించెను. పిదప స్థాయిభావము లెనిమిదివిధములుగను, సాత్త్వికభావము లెనిమిది తెరగులుగను, వ్యభిచారి, లేక సంచారి భావములు ముప్పదిమూడుప్రకారములుగను విభజించి, ఈనలువది తొమ్మిది భావములును కావ్యరసాభివ్యక్తిహేతువులుగను, వీని సామాన్యగుణయోగమున రసోదయ మగుననియు భరతుడు నుడివెను. దీనినంతయు బరికించినచో స్థాయిభావమే రసమునకు మూలాధారమనియు, రసనా, చర్వణా, ఆస్వాదనలే రససారమనియు, విభావానుభావవ్యభిచారిభావములు స్థాయిభావానుప్రాణితములై సామాజికులకు రసాస్వాదనసుఖానుభవము గలిగించుననియు మనకు తేట

వడును. ఇచట రసమాత్రమునను, దాని భావ్యమునను భరతమునీం ద్రుడు ప్రయోగించిన "సంయోగ", "నిష్పత్తి", "వ్యంజిత", "సామాన్యగుణయోగము" లను శబ్దములు రసోదయక్రమమును స్పష్టముగ వివరింపకపోవుటంజేసి, వ్యాఖ్యాతలు వేరువేరుమతముల నెలకొల్పగలిగిరి. ఉత్పత్తివాదమును భట్టలోల్లటుడును, అనుమితివాదమును శ్రీశంకుకుడును, భట్టనాయకుడు భుక్తవాదమును, అభినవగుప్తపాదుడు వ్యక్తివాదమును ప్రతిపాదించిరి. వారివారి వాదములను, మతములను సముచితస్థలమున జర్చింపవలసియుంటచేత నతిప్రసంగభయమున నిట మానెదము.

ఈరసోదయక్రమమున వ్యాఖ్యాతలు వారి మతానుసారముగ వేరువేరుమార్గముల నవలంబించినను, రసానుభవవిషయమున నందరు నేకీభవించిరి. దృశ్యశ్రవ్యకావ్యముల దర్శనశ్రవణానుభవముల సామాజికసహృదయశిరోమణుల కుదయించు, అలౌకిక చమత్కారకారియు, పరబ్రహ్మాస్వాదసోదరము నైన చిత్తవృత్తివిశేషమే స్వసంవేదనసిద్ధమైన, రత్యాదిస్థాయిభావాత్మకరసాస్వాదానందానుభవమై పరిణమించునని ప్రాచీనులు రచించిరి. భగ్నావరణచిద్విశిష్టమైన రత్యాదిస్థాయిభావములే రసములనియు, రత్యాద్యవచ్ఛిన్నమును, భగ్నావరణమును నైన చిదంశమే రసస్వరూపమనియు నవీనులు వచించిరి. మరియు నీ ఆనందము అలౌకికము, అతీంద్రియము, స్వప్రకాశము, సకలసహృదయప్రత్యక్షము నై భాసించునందురు. ఈసుఖము ప్రాక్తనవాసనావశమున సహృదయహృదయసంవాదభాజమై, సామాజికులకు విభావాదిచర్వణామహిమచే వ్యక్తివిషయీకృతమై లభించును. రసాస్వాదానుభవమున స్థాయిభావము నకు విభావములు, అనుభావములు, సంచారిభావములు వరుసగా

ఆలంబన, ఉద్దీపన, సహకారికారణములై తోడుపడుచుండును. ఈ త్రివిధభావములలో మొదటివి రెండును ముఖ్యములు. భరతుడు వీని కొసంగిన లక్షణములను భరతమతానుసారులు పూర్ణముగ విమర్శించి వివరించిరి. శృంగారకరుణవీరరౌద్రాదులైన సుస్థిరభావములే కావ్యనాటకములలో స్థాయిభావములన బ్రసిద్ధినొందును. ఈ సుస్థిరభావమే కథాసంవిధానముల ప్రాధాన్యము వహించి, పూలమాలికలో గల నూలువోలె, దాను మిగిలినభావముల నన్నింటితో గలసిమెలసి వెలుంగుచున్నను, సాదృశ్యవిరోధభావముల సంసర్గమున నుపహతముగాక, తా నుపచరింపబడుచు నభివృద్ధిగాంచును. ఈ కారణముననే విభావానుభావవ్యభిచారిభావములు క్రమప్రకారము స్థాయిభావములకు నాలంబనోద్దీపనసహకారులై సంచరించుచు, లౌకికకారణకార్యసదృశములై భాసించును. కావున స్థాయిభావమ ననుభవించుటకు యోగ్యతను విభావము లాపాదించును. అనుభావము లాసౌఖ్యమును సత్యముగ సంభవింపజేయును. సంచారిభావము లాసౌఖ్యానుభవమునకు చేయూత నిచ్చునని చెప్పవచ్చును. ఇందులకు నిదర్శనముగ శృంగారరసమును బరిశీలింతము. ఈరసమునకు రతియే స్థాయిభావము ; స్త్రీపురుషమాల్యానులేపనాదులే విభావములు ; భ్రూక్షేపకటాక్షాలింగనాదులే వ్యభిచారిభావములు-అని పలుకుదురు. ఈ పైన పేర్కొనబడిన విభావానుభావసంచారిభావముల సంయోగముచే స్థాయిభావము రసనిష్పత్తి గలిగించి సామాజికులకు రసాస్వాదానందానుభవము గూర్చునని భరతముని వచించెను.

ఇటుల సామాజికుల మనముల జనించు నాట్యరసము లెనిమిదివిధములుగ భరతుడు నుడివెను. రసముల ననుసరించి స్థాయి

భావములుగూడ ఎనిమిదితెరంగుల జెలంగును. ఈవిభాగమే ఆలంకారికులకెల్ల సాధారణమై మెలంగును. కాని నిజమునకు రసములు నాలుగువిధములు–౧. శృంగారము, ౨. రౌద్రము, ౩. వీరము, ౪. బీభత్సము. ఈనాలుగురసములు క్రమక్రమముగా నాలుగుక్రొత్త రసముల జనింపజేసెను–౧. హాస్యము, ౨. కరుణము, ౩. అద్భుతము, ౪. భయానకము. ఇవి రెండును గలసి మొత్తమెనిమిదిరసము లయ్యెను. వీని ననుసరించి వేర్వేరుస్థాయిభావములు–౧. రతి, ౨. హాసము, ౩. క్రోధము, ౪. ఉత్సాహము, ౫. భయము, ౬. జుగుప్స, ౭. విస్మయము, ౮. శోకము నియమింపబడెను. వీని కనుకూలముగ ముప్పదిమూడు సంచారి, లేక వ్యభిచారిభావములు విధింపబడెను–౧. నిర్వేదము, ౨. గ్లాని, ౩. శంక, ౪. అసూయ, ౫. మదము, ౬. శ్రమము, ౭. ఆలస్యము, ౮. దైన్యము, ౯. చింత, ౧౦. మోహము, ౧౧. స్మృతి, ౧౨. ధృతి, ౧౩. వ్రీడ, ౧౪. చపలత, ౧౫. హర్షము, ౧౬. ఆవేగము, ౧౭. జడత, ౧౮. గర్వము, ౧౯. విషాదము, ౨౦. ఔత్సుక్యము, ౨౧. నిద్ర, ౨౨. అపస్మారము, ౨౩. సుప్తము, ౨౪. విబోధము, ౨౫. అమర్షము, ౨౬. అవహిత్థ, ౨౭. ఉగ్రత, ౨౮. మతి, ౨౯. వ్యాధి, ౩౦. ఉన్మాదము, ౩౧. మరణము, ౩౨. త్రాసము, ౩౩. వితర్కము. వీనితో పాటుగా ఎనిమిది సాత్త్వికభావములు గలవు. వీనిని మనోగతభావములకు సహజసాక్షిభూతములుగ దలంపనగును. సాంఖ్యసిద్ధాంతుల సత్త్వగుణమునకు నీసాత్త్వికభావములకును సంబంధము గలదని అభినవగుప్తపాదాది నవీనాచార్యులు వచించిరి. సత్త్వమనగా మనఃప్రభవమనియు, మనస్సమాధానముచే సత్త్వనిర్వృత్తి గల్గుననియు, రోమాంచాశ్రువైవర్ణ్యాదిలక్షణములచేత సాత్త్వికభావ ముపగత

మనియు, లోకస్వభావానుకరణమువలన నాట్యమున సత్త్వమిాప్సిత మనియు మునిచంద్రుడు రచించెను. మరియు నాట్యధర్మప్రవృత్తములై భావము లేవిధమున సుఖదుఃఖకృతములుగా నొనరింపబడునో, సత్త్వవిశుద్ధములై కార్యము లారీతిగానే స్వరూపమును బొందునని దృష్టాంతీకరించెను. ఇంక నిట్టి సాత్త్వికభావము లెవ్వియనగా ౧. స్తంభము, ౨. స్వేదము, ౩. రోమాంచము, ౪. స్వరభంగము, ౫. వేపథువు, ౬. వైవర్ణ్యము, ౭. అశ్రువు, ౮. ప్రళయము లన నెలుగొందుచుండును. ఈశారీరకమానసిక భావ విమర్శనము మొదట నాట్యశాస్త్రానుగుణముగ చిరంతనులచే విధింపబడినను తుదకు కావ్యకళాంగానుకూలముగ నాధునికులచే నిర్మింపబడెను. దీనినిగురించి నూతన మతసందర్భమున జర్చింపవలసియుంటచే నిట నింతతో ముగించెము.

---

## (అలంకారమతోదయచిహ్నములు)

### (భరతుడు - భామహుడు)

వెనుకటి అధ్యాయముల రచింపబడినదియే కావ్యవిషయమున భరతమహర్షి వరేణ్యుడు సంగ్రహముగ విధించిన లక్షణమై చెలువారుచున్నది. భామహ, దండి, వామన, ధ్వన్యాచార్యులకాలమునుండి నూతన యుగములు ప్రారంభించును. వీరికాలమునుండి అలంకారశాస్త్రము సారవంతము, ఫలప్రదము నై కన్పట్టునని మన మనుకొనవలయును. భరతభామహులకు పూర్వ మీశాస్త్రము విరళముగ నుండెను. ఇంతమాత్రమున పూర్వాచార్యులు అలంకారశాస్త్రవాసనాశూన్యు

లని మనము జెప్పుట గొప్పసాహసము. గుణదోషాలంకారలక్షణ ములతో వారు పరిచితులనియు, ఆయాకావ్యశోభాదాయకాంగ ములు కాలానుసారముగ ఆధునికాచార్యుల పరిశ్రమమున బలిష్ఠ ములై సౌష్ఠవమును సంపాదించెననియు దలపవలయు. భరతుని తరువాత రచింపబడిన సుప్రసిద్ధములైన శాస్త్రగ్రంథములు మన యభాగ్యవశమున నేడు ప్రచారమున లేవు. గ్రంథములు నశించుట చేత మనకు నేడవి లభ్యములుగావు. కాని శాస్త్రగౌరవాదరణ ములు నశించెనని మనము చెప్పజాలము. భామహాదుల గ్రంథముల జూచినచో పూర్వులు కొందరు శాస్త్రాభ్యాస మొనరించినట్లును, కారణాంతరముల నాయాపుస్తకములు గానరావనియు దెల్లమగును. గ్రంథసరణియు నీయుద్దేశమునే బలపరచును. నిజమున కాగ్రంథము లన్నియు నున్నచో అలంకారశాస్త్రసంప్రదాయ మవిచ్ఛిన్నముగ వర్తించినట్లు నిరూపించుటకును, ప్రాచీనాచార్యుల లక్షణముల కున్న భేదసాదృశ్యముల స్ఫుటతరముగ మనము గ్రహించుటకును జాలవీలుగల్గియుండును. పోయినపుస్తకములగురించి చాలతడవు వాపోవుట గతజలసేతుబంధనము గాన వానికలంతినిట్టూర్పు విడచి మనము మౌనమూనదము.

ఇంక శాస్త్రాభ్యుదయమునుగూర్చి భామహాద్యాచార్యులు తమతమ గ్రంథముల సూచించిన సూచనల నొకింత పరిశీలించినచో కొంతప్రయోజన ముండును. భాగ్యవశమున మన కట్టి సందర్భములు కొన్ని దొరకినవి. అలంకారలక్షణమును విధించుపట్టున భామహా చార్యు డొక నూతనపథము ననుసరించెను. ఇతరులవలె నలంకార ముల నొకేవరుస నుదాహరించుట మాని, భామహుడు వానిని వర్గ ములుగ విభజించెను. ప్రథమఖండమునందు అనుప్రాస, యమక,

అలంకారములు కౌమారదశ నున్నవనియు, దండికాలమునకు యౌవన ప్రాదుర్భావముం జెందెననియు, అందుచే భామహునికన్న మున్ను బాల్యప్రాయమున నడయాడుచున్నట్లును మనకు దోచును.

భామహునితరువాత భట్టోద్భటుడే స్వతంత్రరచనకు చాకి జూపి, కావ్యాలంకారగమనికలో చిరిమార్పుల దెచ్చెను. కాలవిశేష మున నీస్వల్పభేదములే దండ్యాచార్యాదుల దృక్పథమును మరలించి, నూతనపథావలోకనమునకును, నవీనమతోపపాదనమునకును బురి కొల్పెనని మనము జెప్పవచ్చును. ఈసందర్భమున మన మొక నూత నాంశమును గమనింపవలయును. దండ్యాచార్యులకాలమున ఆద్యా లంకారముగా గణింపబడిన స్వభావోక్తి భామహునికాలమునందు సందిగ్ధావస్థలో నుండెను. అలంకారములన్నియు వక్రోక్తిమూలకము లని తలంచిన భామహుడు స్వభావోక్త్యలంకారమునకు సుముఖత జూపలేదు. మరియు 'కవిప్రతిభాసువర్ణమునకు గీటురాయిగా గణింప బడిన గద్యకావ్యము'గ వాసవదత్తను రచించి, 'కవుల గర్వమును భంగ పరచె'నని బాణునిచే పొగడ్తనొందిన సుబంధుడు ఆక్షేప, ఉత్ప్రే క్షాలంకారములను, 'ఆసర్వత్రగభీరధీరకవితావింధ్యాటవీచాతురీసంచా రీకవి కుంభికుంభభిదుర పంచాననుడై' 'వశ్యవాణీకవిచక్ర వర్తి'గా వన్నెగాంచిన భట్టబాణుడు ఉపమా, దీపకాలంకారము లను సమ్మతించిరి. వీరు తమతమ వాసవదత్తా, కాదంబరీ మహాగద్య కావ్యకాంతారమును శ్లేషాలంకారసంకీర్ణము గావించిరి. ఈశ్లేష దలంపగా, భరతముని పేర్కొనిన ప్రబంధగుణశ్లేషయో, లేక నిజ ముగ నవీను లుదాహరించిన శ్లేషాలంకారమో స్పష్టముగ నిరూపిం చుట కాధారము జాలదు. కాని మునీంద్రుని లక్షణమును, కవీంద్రుని శ్లేషసంఘటనమును బరిశీలింతుమేని నవీనులచే నాదరింపబడిన

శ్లేషాలంకారమే సుబంధుని వాసవదత్తకు ప్రాణభూతమని స్ఫురించును. ఈశ్లేషాలంకారము నంగీకరించుటయే కాక, భామహుడు దీనికి మూడు తెరంగులగూడ వచించెను. ఇంక కావ్య జీవితసర్వస్వమైన ఉత్ప్రేక్షాలంకారమునుగురించి, మేధావినిచే నిది సంఖ్యానముగా వచింపబడెనని భామహుడు పలికెను. దీనిచే భామహునకుపూర్వ మీయలంకారమును మేధానిధియైన మేధావిన్యాచార్యులు సమగ్రముగ విమర్శించినట్లు కానవచ్చును. కొందరాధునికు లీశ్లోకమునకు పాఠాంతరము గల్పించి, యీసంఖ్యానము నవీనుల యథాసంఖ్యము, లేక క్రమాలంకారమనియు, ఉత్ప్రేక్ష అలంకారముగ నెన్నబడ లేదనియు జెప్పుదురు. భామహదండ్యాచార్యుల గ్రంథము లీసమాధానమునకు బాధకములుగా నుంటచే దీనిని మన మంగీకరింపజాలము. మరియు, కావ్యాదర్శమున 'ఇవ' అనుప్రత్యయము ఉత్ప్రేక్షాసూచక మగునా కాదా యని దండ్యాచార్యుడు విశేషముగ చర్చించెను. దీనివలన భామహదండ్యాచార్యుల మధ్యకాలమున నీయంశము వివాదభూయిష్ఠమైన ట్లున్నది. కాని వామనాచార్యులనాటి కీరాద్ధాంతసిద్ధాంతములు ముగిసి 'ఇవ' ప్రత్యయము నిశ్చయముగ ఉత్ప్రేక్షాసూచకముగ నెల్లరచే నంగీకృతమయ్యెను. వేరొకచో భామహు డీమేధావిని లేక మేధావిరుద్రుడు ఉపమాదోషముల నేడింటిని గణించినట్లు రచించెను. ఇంతకన్న నెక్కువగ మేధావిన్యాచార్యులగురించి మనకు తెలియదు. కావున నీతడు ఉపమా, ఉత్ప్రేక్షాలంకారముల సూక్ష్మదృష్టి విమర్శించి, భామహునిపూర్వ మలంకారశాస్త్రప్రాశస్త్యమునకు శక్తివంచనలేక పాటుబడినవాడనిమాత్రము మన మెరింగినజాలుదుము. తరువాత నింకొకఅధ్యాయమున భామహుడు ఇరువదినాలుగు అలం

కారముల లెక్కించెను. భామహాచార్యుల సాన్నిధ్యమునకు జేరుటకు మన కిదియే చతుర్థసోపానముగా జెలువారును. ఇంతనుండియు నలంకారములు అగణితములు, అనంతములు నై అపూర్వాభివృద్ధి నందెనని చెప్పవచ్చును. ఒకరికన్న నింకొకరు, వారినిమీరి వీర లొక్కరీతి, తమతమ బుద్ధికుశలత ననుసరించి, అలంకారములలో భేద, విభేద, ప్రభేదముల నెలకొల్పి, సారస్వతకోశమునందు అసంఖ్యాకములు, అమూల్యములు నైన రత్నాలంకారనిచయము నించిరి. కావున అలంకారశాస్త్ర మన్వర్థాభిధానమై, శబ్దార్థోభయాలంకారములే కావ్యజీవముగా, భామహ, భట్టోద్భట, రుద్రటప్రముఖులచే శిరసావహింపబడెను. దీని సత్యమును ప్రకటించుటకు భట్టికావ్యమే ప్రబలనిదర్శనము. ముప్పదిఎనిమిదిముఖ్యాలంకారములను భట్టికవీంద్రుడు సమ్మతించెను. కావున నిప్పటి కొక క్రొత్తమతము పుట్టబోవుచున్నట్లు సూచనలు గన్పట్టుచున్నవి. ఈ సూచనల వలని ఫలమును కనులబండువుగా జదువరులు ముందు గనుగొనగలరు.

# కావ్యాత్మ
## ప్రాచీనమతములు

### ౧. అలంకారమతము

(కావ్యశరీరము : ప్రయోజనములు - భరతుడు)

నాట్యాచార్యుడైన భరత మునీంద్రుని వరప్రసాదమున, 'ముహుర్ముహు ర్లుఠదభంగతరంగమృదంగ నిస్వనస్ఫుటనటనలతో' నవతరించిన అలంకారశాస్త్రగంగానదీన ర్తకీలలామము మొదట రసాతలరంగంబున లాస్యకౌశలముం జూపి, పిదప భగీరథప్రతిముడైన భామహాచార్యుల కృపాకటాక్షవీక్షణముల ప్రావీణ్యముం గాంచి, ఆర్యావర్తసీమ లీలాకళావిలాసవిభ్రమముల బ్రచురించి రసికజనమాన సముల రంజింపజేసెను. ఈ అలంకారశాస్త్రామృతలహరి భామహు ననంతరమున నవిచ్ఛిన్న ప్రవాహమున ప్రసవించి, సహృదయహృదయ కేదారముల సారవంతములుగ నొనరించి, సంస్కృతభాషాప్రపంచ మున దుర్భిక్షదోషమును దొలగించెను.

అందువలన నలంకారశాస్త్రజగమున భామహాచార్యుల జన నముతో నూతనయుగప్రతిష్ఠాపన మయ్యెనని మనము దలంపవలయు. ఈయుగమందలి విశేషాంశముల నెరుంగుట కాయాఆచార్యుల గ్రంథ ముల నాలోకింపవలయును. భరతభామహులనడుమ కొందరాలం కారికులు గ్రంథముల రచించినట్లును, వారి పుస్తకములన్నియు నించు

మించగ నామమాత్రావశేషము లైనట్లును, కాలపరిభ్రమణము ననుసరించి కావ్యాత్మతత్త్వవిచారమున నూతనమతము లుదయించెననియును మన మీవరలో దెలిసికొంటిమి. ఆకారణమున రసమతప్రాచుర్య మడుగంటి, భామహాచార్యులనాటి కలంకారమతప్రాశస్త్య మతిశయించె. భామహోపాధ్యాయునకు సహచరులు, ననుచరులు ననేకులు వెలసిరి. వారి బోధనల నెఱుంగుటకుపూర్వము భామహుని మతము నొకింత దిలకింతము. భామహుని గ్రంథనామమే చాలవరకాతని మతమును బ్రకటించును. భరతునివలె నప్రధానముగగాక, భామహుడు కావ్యాలంకారలక్షణముల దన గ్రంథమున విపులముగ జర్చించుటంజేసి, ఆతనికాలమున కలంకారశాస్త్రము ప్రాముఖ్యము నందె పండితమండలి సమాదరణమునకు బాత్రమయ్యెనని స్పష్టమగును. నాట్యశాస్త్రమున గుణాలంకారదోషములు రూపకరచన కుపకారకములుగను, రసోదయమున కనుకూలముగనుమాత్రమే చర్చింపబడెను. ఇంక భరతునితరువాత ననినచో రసస్ఫూర్తి రూపకకౌశలములు గణుతింపబడక, గుణాలంకారములు కావ్యకాంతాలలామకు ప్రాణతుల్యములుగ స్వీకృతములై, ప్రత్యేకములుగను, ప్రధానములుగను జర్చింపబడెను. మునివరు డాకాలమున బ్రచారములో నున్న వానిని గొన్నిటిని యాదృచ్ఛికముగ జేర్కొనెనేకాని, భామహుని వలె ప్రాచీనాచార్యుల సంప్రదాయముల నన్నిటి నేకముఖమొనర్చి స్వతంత్రశాస్త్రసరణి ననుసరించలేదు. నాట్యభాగమునకు స్వస్తి జెప్పి భామహుడు కావ్యవిభాగమునుమాత్రమే గ్రహించుటచే నీతని కాలమునుండి అలంకారశాస్త్రము స్వతంత్రశాస్త్రముగ బరిణమించె ననవచ్చును. మరియు బ్రచారముననున్న అలంకారాదులకు జేయూత నిచ్చి సాకుటవలన, అలంకారమతమునకు భామహాచార్యుడే స్రష్టి

కర్తగా మనము భావింపవచ్చును. రూపకానుకూలముగ నాట్యరసము తెలుపారుచున్నను, శాస్త్రాచార్యులు కావ్యరచనోపకరణములు, బంధచారుత్వహేతుభూతములు నగు వ్యుత్పత్త్యభ్యాసములను, గుణ దోషములను, రీతివృత్తులను, శబ్దార్థాలంకారములను సమగ్రముగ విమర్శించి, లక్షణ మేర్పరచి, కవులకు శిక్షణోపదేశముల విధించుటయందే పాటుపడజొచ్చిరి.

కావున భామహాదిచిరంతనాచార్యుల దృక్ప్రసారము కావ్య వనితాబాహ్యసౌందర్యమునందే మునిగి తేలజొచ్చెను. క్రమముగా దండి, వామన, ఆనందవర్ధనాదులు ఆంతరంగికగుణరీతిధ్వనిమణి ముక్తారత్నసికరము గొని కూడదొడగిరి. అందుచే కావ్యశరీరము, కావ్యాత్మలను ఆలంకారికసంప్రదాయ మీమాంసమున మొదటి నుండియు తుదిదాక మనకు గానవచ్చుచు, కాలానుకూలముగ నది సంప్రాప్తాభివృద్ధి నొంది వెలుంగుచున్నది. ఈసామ్యమునకు జన్మ స్థానము ఋగ్వేదమందలి "చత్వారి శృంగా" అను ఋక్కు గానోపును. వేదములకు వేదపురుషునివలెనే, కావ్యములకు కావ్యపురుషుడు సంభవించెను. పురుషుడొంటిగా నుంట ప్రకృతివిరుద్ధ మగుటచే కావ్యపురుషునకు సాహిత్యవిద్యావధూలలామ సహధర్మచారిణి యయ్యెను. రాజశేఖరకవిరాజశేఖరుని అత్యద్భుత స్వకపోలకల్పనావిశేషమహిమమున శబ్దార్థములు కావ్యపురుషుని శరీరము, సంస్కృతము ముఖము, ప్రాకృతము హస్తములు, అప భ్రంశము ఊరుకటిప్రదేశములు, పైశాచి పాదములు, మిశ్ర భాష వక్షస్థలమునుగా నిర్మింపబడెను. ఇంతియేకాక కావ్యపురుషు నకు రసము ఆత్మయనియు, ఛందస్సమూహము కేశసంచయమనియు, ప్రశ్నోత్తరాదులు సంభాషణమనియు, అనుప్రాసోపమాదు లలంకా

రములనియు రాజశేఖరుడు కావ్యమీమాంసలో రచించెను. ఈ ఉపమానమే కాలక్రమమున అలంకారగుణరీత్యాదినూతనమతముల కాలవాలముగా జెలంగియుండును. ఆయామతముల సంగ్రహముగ నాయాస్థలముల జర్చింపనుంటచే నింతతో విరమింతుము. ఈసాదృశ్యమును మమ్మటవిశ్వనాథాది నవీనులుగూడ సమ్మతించిరి. కావ్యమునకు శరీరము శబ్దార్థములు, ఆత్మ రసాదులు, గుణములు శౌందర్యాదులు, దోషములు కాణత్వాదులు, రీతులు అవయవసంస్థానవిశేషములు, అలంకారములు కటకకుండలాదులుగా జెలువొందునని విశ్వనాథుడు సాహిత్యదర్పణమున వచించెను. ఇటుల భామహాచార్యుడు మొదలుకొని జగన్నాథపండితునిదాక వెలసిన ఆలంకారికు లెల్లరును శబ్దార్థములే కావ్యశరీరమని సమ్మతించుటచే, కావ్యజీవాత్మల స్వరూప మెరుంగవలయు నను తలంపున వేర్వేరుమతములు నెలకొనెను. మరియు సహృదయహృదయాబ్జముల పరమానందాబ్ధి నోలలాడించు దివ్యవస్తుతత్త్వమును గాంచుట కాలంకారికు లన్వేషింప నారంభించిరి. ఈఅన్వేషణావసరమున సుప్రసిద్ధాచార్యు లెల్లరును వైయాకరణ నైయాయికశాస్త్ర సంప్రదాయానుసారముగ శబ్దార్థముల పురస్కరించుకొనియే తమతమ మతముల బ్రతిపాదించి కావ్యాత్మతత్త్వమునకు స్వరూపసంఘటన మొనర్చిరి.

అందుచే కావ్యశరీరము శబ్దార్థమయమనియు, ప్రాణసమము అలంకారసందోహమనియు భామహ, ఉద్భట, రుద్రటప్రముఖుల భావమని మన మూహింపవలసియున్నది. కావ్యము శబ్దార్థసహితమని భామహుడును, శబ్దార్థములే కావ్యమని రుద్రటుడును వచించిరి. ఈలక్షణమును కుంతలరాజశేఖరాదు లంగీకరించిరి. ప్రాచీనులచేగూడ కావ్యసాహిత్యశబ్దములు పర్యాయపదములుగ

ప్రయోగింపబడినవి. కాన శబ్దార్థముల సహభావమే సాహిత్య మనియు, శబ్దార్థములు రెండును వేరువేరుగ స్థూలదృష్టికి గోచరమగు చున్నను, వానికి సత్యముగ గల పరస్పరబాంధవ్యమే కావ్యమనియు సర్వమతములవారలును సమ్మతించిరి. ఇంక భామహాదులు అలంకార ములే కావ్యజీవముగా దలంచినట్లు వారి గ్రంథనామములేకాక గ్రంథరచనాసందర్భముగూడ వ్యక్తీకరించును. భామహుడు గ్రంథాదినే, వనితానన మెంత కాంతివంతమైనను భూషణరహిత మైనచో నది ప్రకాశింపనేరనిరీతినే కావ్యమున కలంకారము లత్యం తావశ్యకము లనుభావమును సూచించెను. మరియు రూపకాద్య లంకారములు బాహ్యాలంకారములుగా పరులు దలంతురనియు, సుబంతతిజంత సాధుత్వములే సౌశబ్ద్యమనియు, ఇదియే వాగ్వ్యు త్పత్తికి హేతుభూతమనియు, అర్థవ్యుత్పత్తివిషయమున నిట్టివి లేవనియు, తనకు శబ్దాభిధేయాలంకారభేదములు రెండునుగూడ సమ్మతమనియు భామహుడు రచించెను. వక్రోక్తిజీవిత, కావ్య ప్రకాశకారు లీపక్షము నంగీకరించిరి. అలంకారమతానుసారి గాకున్నను, దండ్యాచార్యుడు 'ఇష్టార్థవ్యవచ్ఛిన్నమైన పదావళియే కావ్య'మని స్ఫుటతరముగ లక్షణమును విధించుటచేత నాలక్షణము భామహాదుల లక్షణముకన్న మిన్నగ నున్నదని చెప్పకతప్పదు.

కావున భామహాచార్యులనాటినుండియే కావ్యకామినికి అవ యవసంస్థాన మతిశయించి, అలంకారధారణాభిలాష మభివృద్ధిజెందె నని మన మనవచ్చును. విమర్శనావివేక మంతగా గానరాకున్నను, కావ్యహేతుప్రయోజనాలంకారాదుల తత్త్వముమాత్రము సంశయ గ్రస్తముగ లేదని రూఢిగ జెప్పవచ్చును. భామహుడు ప్రారంభము వనే ధర్మార్థకామమోక్షసంపాదనమునకును, కళానైపుణ్యసంగ్ర

హణమునకును, ప్రీతికీర్తిసమార్జనమునకును సాధుకావ్యనిబంధన మను కూలించునని చెప్పెను. ఈకావ్యరచనాఫలములను ప్రాచీనార్వాచీను లందరును సమ్మతించిరి. భరతమునిచే వివక్షితములైన క్రీడనీయకవినోదకరణము లే భామహునికాలమునకు ప్రీతిగాను, దండ్యాచార్యుల సమయమునకు విదగ్ధగోష్ఠీవిహరణముగను, రాజానకకుంతలునినాటికి హృదయాహ్లాదకరమైన అంతశ్చమత్కారముగను దినదినాభివృద్ధి నొందెను. ఈఅలంకారాచార్యులు కావ్యజీవాత్మవిచారము నొనరించువేళల స్వచ్ఛందప్రవృత్తిగలవారైనను, కావ్యస్వరూపమును నిర్ణయించుపట్టుల దమయిచ్చవచ్చినచొప్పున లక్షణము విధించినను, కావ్యఫలితముల వేర్కొనునప్పుడుమాత్రము భిన్నాభిప్రాయులు గాక సర్వమతములవారలు కావ్యము చతుర్వర్గఫలోపేతమని సమ్మతించిరి. మరియు సరసమై, జ్వలదుజ్జ్వలవాక్ప్రసరమై, విమలమై, సకలలోకకమనీయమై చెలంగు కావ్యమును రచించిన మహాకవికి, అర్థము, అనర్థోపశమము, ఆకల్పమనల్పయశము లభించునని రుద్రటుడు పలికెను. ఇట్టి మహాకావ్యమును జదువువారలకు పరమానందానుభవము, శాస్త్రేతిహాసాదివిజ్ఞానము, లోకవ్యవహారకళాకౌశలమును జేకూరును. వీనినన్నిటినంగీకరించినను అభినవగుప్తపాద మమ్మటాచార్యాదులు వేదపురాణేతిహాసకావ్యములకు గల భేదమును జర్చించి, కావ్యమువలన గలుగు ముఖ్యప్రయోజనమును నిశ్చయింప యత్నించిరి. అభినవగుప్తుడు ధ్వన్యాలోకలోచనమున భామహాచార్యుల కావ్యఫలితముల విమర్శించుచు, "ఈకావ్యప్రయోజనములలో ప్రీతియే ప్రధానము; కానిచో ప్రభుసమ్మితములైన వేదాదులు, మిత్రసమ్మితములైన పురాణేతిహాసాదులవలనగూడ వ్యుత్పత్తి గలుగుచున్నది; ఇంక కావ్యరూపమున

గలుగ వ్యుత్పత్తికి విశేష హేతువు జాయాసమ్మితత్వలక్షణమై విల సిల్లును; అందుచే కావ్యమున ఆనందమే ప్రధానాంశమై వెలుగొం దును; మరియు చతుర్వర్గవ్యుత్పత్తికిగూడ ఆనందము పార్యంతిక ఫలమై ప్రకాశించు" నని రచించెను. దీనికి దోడుగా మమ్మటా చార్యుడు గ్రంథాదిని కవిభారతిని వర్ణించుచు నయ్యది నియతికృత నియమరహితము, అనన్యపరతంత్రము, హ్లాదైకమయమునని వచించెను. పేరుకీర్తుల సంపాదించుటకును, సిరిసంపదల నార్జించుటకును, ఆచారవ్యవహారముల బోధించుటకును, అమంగళాశ్లీలముల బాపుట కును, ఐహికాముష్మికానందభోగముల నాపాదించుటకును, కాంతా సమ్మితముగ నుపదేశించుటకును కావ్య మనుశూలించునని కావ్య ప్రకాశము నుడువుచున్నది. ఇచట కాంతాతుల్యముగ కావ్య ముపదే శించు ననుటలో గల విశేష మేమనగా, వేదములవలె శబ్దప్రధానము లును, పురాణములరీతి నర్థప్రధానములును గాక, శబ్దార్థమిళితము, రసప్రధానము, విలక్షణము నై కాంతామణివోలె గావ్యము, సరస తాపాదినియై సహృదయుల సమ్ముఖులుగా నొనరించి, ప్రేమపూరిత కటాక్షాంచలముల రామాదులవలె వర్తింపవలయుననియు, రూక్షేక్షణ ప్రసరణముల రావణాదులకైవడి చరింపరాదనియు సలేశసూచన ములమూలముననే, విగళితవేద్యాంతరమైన బ్రహ్మాస్వాదసదృశానంద మును లభింపజేయునని మనము దలంపవలయును. మమ్మటుని మత మున నిదియే సకలప్రయోజనమౌళీభూత మనబడును. అతీంద్రి యమును, ఆత్యంతికము, బుద్ధిగ్రాహ్యసుఖమనియు, "రసోవై సః; రసంహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" యనియు శ్రుతిస్మృతులలో స్తుతింపబడిన రసాస్వాదానందానుభవమే కావ్యమునకు పరమ ప్రయోజనము. ఈ ప్రీతి, లేక ఆనందము అలౌకికమనియు, భగ్నా

వరణవిశిష్ట మనియు, ఆతన్మయీభవనము నిజసహృదయతావశోన్మి షిత మనియు, ప్రాగ్వినివిష్టవాసనారూపమై పరిపక్వ మందుననియు జగన్నాథపండితుడు వచించెను. కావున భామహాచార్యుల ప్రీతి మూలకప్రయోజనమే పండితరాయల అలౌకికానందానుభవఫలమై పరిణమించెనంటయే దీనిభావమై చెలంగును.

---

## (కావ్యాంగములు - భేదములు)

కావ్యప్రయోజనముల వక్కాణించి, భామహుడు కావ్య నిర్మాణాధారభూతములైన కావ్యాంగములగురించి నుడివెను. వీనిని కావ్యయోనులు, లేక కావ్యహేతువులుగ దలంతురు. ఈవిషయముల నీతడు వామనాచార్యులవలె విపులముగ జర్చింపక సంగ్రహముగ చేర్కొనెను. ఈసందర్భమున మన కొకసంగతి దెలియవచ్చును. అది యేదనగా, కొందఱాలంకారికులు కవిత్వము నొక లలితకళా విశేషముగా భావింపక, సామాన్యశిల్పముగ నెంచి దాని కనుకూల ములు, సహాయకములు నైన వ్యుత్పత్త్యభ్యాసములకు ఖలసిన పరికర ముల, నుపకరణముల నత్యంతశ్రద్ధతో బోధింప మొదలిడిరి. చిట్టచివర కిది కవిశిక్షామార్గమును, బోధనాభ్యసనపాఠశాలయు నై చెలంగును. ఈకవిశిక్షామార్గమును మున్ముందు పరిపూర్ణముగ బ్రదర్శింపవలసి యుంట నిట దానిని దిఙ్మాత్ర ముదాహరించెదము. కవిశిక్షకు ప్రాచీనులు పరాఙ్ముఖులు గాకున్నను, సత్కవిత్వమునకు ప్రతిభా విశేష మత్యంతావశ్యకమని వారందరును రూఢిగ నమ్మిరి. భామహ దండ్యాదు లీప్రతిభ నైసర్గికము, లేక సహజ మనిరి. రుద్రటు డీ

ప్రతిభ, లేక శక్తి సహజమనియు, ఉత్పాద్యమనియు, వీనిలో జన్మ సిద్ధముగాన సహజమే శ్రేష్ఠమనియు బలికెను. ప్రతిభయే కవిత్వ బీజమని వామనాచార్యుడు వచించెను. ఈప్రతిభావిశేషము దండి మతమున పూర్వవాసనాగుణానుబంధియు, వామనునిమతమున జన్మాంతరగత సంస్కారవిశేషమును నై వెలుగొందును. రుద్రటాచార్యుడు ప్రతిభకుపయోగించిన పర్యాయపదమైన శక్తియే కవిత్వమునకు గారణమని మమ్మటుడు నుడివెను. ఈప్రతిభ దలంపగా, అపూర్వవస్తునిర్మాణక్షమమైన ప్రజ్ఞయనియు, రసావేశవైశద్యసౌందర్య కావ్యనిర్మాణక్షమత్వమే ప్రతిభావిశేషమనియు, వర్ణనీయవస్తువిషయనూతనోల్లేఖశాలిత్వమే శక్తియనియు, అభినవగుప్తపాదాచార్యులు లక్షణమును వివరించి, కవికంతర్గతమై భావము జెలంగునను మునివరుని వచనమును ప్రమాణముగ లోచనమున నుదాహరించెను. మరియు, 'కవే రంతర్గతం భావ' మనుశ్లోకమునందు 'అంతర్గత'మనుదానికి 'అనాదిప్రాక్తన సంస్కారప్రతిభానమయమేకాని లౌకికవిషయజన్యముగా' దని అభినవగుప్తుడు,వ్యాఖ్యానమొనరించెను.'నవనవోల్లేఖశాలిని యైనప్రజ్ఞయే ప్రతిభ' యను ఉపాధ్యాయభట్టతౌతుని లక్షణమున కనుకూలముగ అభినవగుప్తపాదుల నిర్వచనము జెలువారుచున్నది. ఉపాధ్యాయ భట్టతౌతుని లక్షణమును శిష్యశిరోమణి అభినవగుప్తపాదుడు శిరసా వహించినట్లే, అభినవగుప్తపాదాచార్యుల నిర్వచనమును మమ్మటాది నవీను లౌదలదాల్చిరి. ఈప్రతిభావిశేషము లోకోత్తరము, వైచిత్ర్య సంపాదకమునుగా జెలంగునని అభినవగుప్తపాదమమ్మటాచార్యాదులు వచించిరి. ఈలోకోత్తరప్రతిభాసంపాదితమైన వైచిత్ర్యమే విచ్ఛిత్తి, చారుత్వము, సౌందర్యము, హృదయత్వము, రమణీయత్వము నను వేర్వేరుపేరుల వ్యవహరింపబడును.

# కావ్యాత్మ - ప్రాచీనమతములు

కవిప్రతిభావిషయమున ప్రాచీనాచార్యుల కున్న దృఢనిశ్చయమే బహునిర్మలశ్రుతమునందును, అమందాభియోగమునందును గూడ గలదు. ఈశ్రుతాభియోగములు కొంతకాలమునకు వ్యుత్పత్త్యభ్యాసము లను పేరున బిలువబడెను. కాన కవియగువాడు కొంత సాధనసామగ్రి నాతడు సంపాదింపవలయును. ఈకావ్యకారణ సముదాయమునకు, కావ్యాంగసంగ్రహమునను భామహరుద్రటులకు భేద మించుకయు లేదు. ఛందోవ్యాకరణ కళాదుల బఠించి, లోకస్థితిపదపదార్థవిజ్ఞానమును సంపాదించి, యుక్తాయుక్తవివేకము నెరింగి, అధిగతసకలజ్ఞేయుడై, సుకవీశ్వరుడు, సుజనసాన్నిధ్యమున దివారాత్రములు శుశ్రూష నొనరించి, మహాకావ్యమును రచించినచో, హిమధవళము, సకలలోకకమనీయము, స్ఫారస్ఫురదురుమహిమాన్వితము, కల్పాంతస్థాయియు నైన యశము గాంచునని రుద్రటాచార్యుడు వచించెను. వామనాచార్యుడీ వ్యుత్పత్త్యభ్యాసముల విపులముగ విమర్శించెను. లోకము, విద్యలు, ప్రకీర్ణము లని కావ్యాంగముల మొదట మూడువిధముల విభజించి, తరువాత వానిని ప్రత్యేకముగ వివరించెను. అభిధానకోశము, శబ్దశాస్త్రము, ఛందశ్శాస్త్రము, కళలు, కామశాస్త్రము, దండనీతి మొదలైన విద్యల నేర్చి, వీనికన్న మిన్నగ లోకవృత్తము నెరింగి, సమగ్రముగ వ్యుత్పత్తి సంపాదించి, కవిత్వాభ్యాస మొనరింపవలెనని వామనుడు నుడివెను. యమకాలంకారభేదముల నెరింగి, సువిహితపదభంగముగను, సుప్రసిద్ధాభిధానముగను వానిని రచించుచు, శబ్దానుశాసన మశేషముగ నధిగమించి, వివిధాభిధానకోశసమ్మతముగను, దేశభాషానుకూలముగను శ్లేషభిత్తికను మహాకవి నిర్మింపవలెనని రుద్రటుడు బోధించెను. ప్రాచీనకవిసమయముల ననుసరించి వర్ణించుచు, ప్రతిబింబకల్పముగను, ఆలేఖ్యప్రఖ్యముగను,

దాసులు నైన కుకవులను వేనవేలను మనము గనుఁగొనుచున్నాము. వీర లిరువురలో స్వాతంత్ర్యజీవుల కావ్యకాంతాలలామము పాధ్వీ మతల్లి గాను, పాదోపజీవుల ప్రబంధము సామాన్యవనితగాను ప్రాచీ నార్వాచీనాచార్యు లందరిచే భావింపబడెను.

ఇంక నింతతో సాధారణసంగతుల చర్చ ముగించి, భామహా లంకారమున గల మిగిలిన విషయముల బరిశీలింతము. శబ్దార్థ సహితమై కావ్యము వెలుంగునని భామహాచార్యు లనుటచే నతడు కావ్యమున శబ్దమునకు, నర్థమునకు సమప్రాధాన్య మంగీకరించెను. ఈకావ్యలక్షణమునకు విశేషణద్వయమును భామహుడు జేర్చెను. అందు మొదటిది నిర్దోషము; రెండవది సాలంకారము. కావున నిర్దోషసాలంకార శబ్దార్థసహితము కావ్యమని భామహుని మతమున సంపూర్ణ లక్షణముగా విలసిల్లును. తరువాత భామహుడు కావ్యము నీక్రిందివిధమున విభజించెను:

౧. పద్యాత్మకము; గద్యమయము.

౨. భాషావిభాగము - సంస్కృతము, ప్రాకృతము, అప భ్రంశములన భాషాశ్రయమై కావ్యము మూడువిధముల వెలయును.

3. వస్తువిషయము-దివ్యము, మానుషము, ఉత్పాద్యము, శాస్త్రములన నాల్గు తెరగులు.

౪. సంఘటనాభేదము - సర్గబంధము లేక మహాకావ్యము, అభినేయార్థము లేక రూపకాదులు, ఆఖ్యాయిక, కథ, అనిబద్ధ కావ్యము లనగా గాథలు, చాటువులు మొదలైనవని పంచవిధముల నీవిభాగము చెలువొందును.

# అలంకారమతము - కావ్యాంగములు : భేదములు

భామహాచార్యుల మహాకావ్యలక్షణము కావ్యాదర్శ, అగ్నిపురాణాదుల లక్షణమును బోలియున్నది. అష్టాదశవర్ణనోపేతమై, చతురోదాత్తనాయకమై, చతుర్వర్గఫలాయత్తమై సర్గబంధము వెలుఁగవలయునని నియమము గలదు. అభినేయార్థలక్షణము నితరులు వచించుటవలన భామహుడు రచింపలేదు.

ఇంక ఆఖ్యాయికాకథలవిషయమున భామహు డొనరించిన సునిశితవిభాగమునకు దండివామనులు సుప్రసన్నులుగారైరి. ఆఖ్యాయికాకథలకు సంగ్రహముగ నీ క్రిందిభేదములు గన్పట్టును. నాయకవాచ్యమై, వక్త్రాపరవక్త్రవృత్తసమన్వితమై, కవిభావకృతచిహ్నితమై, ఉచ్ఛ్వాసపరిచ్ఛేదసంపన్నమై, కర్తృవంశప్రశంసాయుతమై, కన్యాహరణ సంగ్రామవిప్రలంభవిపత్తిసంచయరీతి వృత్తిప్రవృత్తిదీప్తమై ఆఖ్యాయిక భాసించుచుండును. నాయకేతరవాచ్యమై, గాథాశ్లోకమాత్రాదిసంకలితమై, క్వచిల్లంబకపరిచ్ఛేదలక్షితమై, స్వవంశసంక్షేపప్రశంసాన్వితమై, అపభ్రంశభాషాశ్రయమై కథ వెలుఁగొందుచుండును. ఈలక్షణప్రకారము ఆఖ్యాయిక స్వీయచరిత్రలలో నొకభేదముగా మనకు దోచును. ఇందు నాయకుడు జదువరుల లాభమునకై తన చరిత్రమును జెప్పును. ఇంక కథలో నితరుడు నాయకునిచరిత్రమును నాయకునకుగాని, చదువరులకుగాని వినిపించును. అందుననే ఆఖ్యాయిక నాయకవాచ్యమనియు, కథ నాయకేతరవాచ్యమనియు భామహుడు నుడివెను. భామహుని లక్షణము బాణుని ప్రశస్తగ్రంథముల రెంటిని గమనించినట్లును, గుణాఢ్యుని బృహత్కథను కథగా సమ్మతించినట్లును గన్పట్టదు. ఈబృహత్కథలో నరవాహనదత్తుడు స్వవిజయముల వర్ణించును. భామహుని మతమున అభిజాతుడైన జనుడు స్వగుణావిష్కృతి సలుపరాదు.

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

భామహాచార్యుల ఆఖ్యాయికాకథాలక్షణములకు సమాధానముగా భూతార్థమును ప్రశంసించునప్పుడు స్వగుణావిష్కృతి దోషము గాదనియు, వక్త్రృభేదమాత్రమున భేదమును గల్పించుట యుక్తి దూరమనియు, లంబకోచ్ఛ్వాసాది భేదప్రకల్పన మసమంజసమనియు దండ్యాచార్యుడు కావ్యాదర్శగ్రంథమున రచించెను. ఈకారణము లచే రుద్రటదండ్యాదులు ఆఖ్యాయికాకథలకు గల స్వల్పభేదముల ననాదరించి నవీనమార్గప్రదర్శకు లైరి. నవీనమతానుసారముగ సుఖప్రబోధలలితము, సువర్ణఘటనోజ్జ్వలము నైన శబ్దశయ్యారచనా ప్రతిపాదితమై చెలంగు హర్షచరితమును ఆఖ్యాయికగాను, రుచిర స్వర్ణపదయు, రసభావవతియు, తరుణీసరణి సరసజనమనోహారి ణియు నై మెలంగు కాదంబరిని కథగాను మనము స్వీకరింపవల యును. ఇంక పద్యాత్మకము, గద్యమయమను విషయమున గొందరు మిశ్రము లేక గద్యపద్యోభయమయమను మూడవతరగతినిగూడ నంగీకరించిరి. ఈ మూడవతరగతికి రూపకాదులే లక్ష్యములుగా వెలుంగును. మరియు మిశ్రమనుచో, గద్యపద్యమిశ్రమనియు, లేక భాషామిశ్ర మనగా సంస్కృతప్రాకృతాదిమిశ్ర మనియు కొందర రందురు. ఏదియెట్లున్నను, ఆర్యావర్తసీమ నాలంకారికులు కావ్య లక్షణము విధించునపుడు కవిప్రతిభావిశేషమున కనంతావకాశ ముల గల్పించిరని చెప్పకతప్పదు. వృత్తఘటితము, పద్యనిర్మితము గానే కావ్యము జెలంగవలెనను కఠిననియమము లేదు. అట్టినియ మమునే పాటించినచో స్మృతులు, వైద్యగ్రంథములుగూడ మహా కావ్యములు గావలయును. కావుననే ప్రాచీనులు గద్యమే కవుల నికషముగా నిశ్చయించి, బృహత్కథాహర్షచరితకాదంబర్యాదుల గూడ మహాకావ్యములుగా గణించిరి. మనవాదమున కింతకన్న వేరేమి నిదర్శనము గావలయును ?

---

(కావ్యాలంకారములు - వక్రోక్త్యాదులు)

ఆఖ్యాయికా కథలకు గల విభేదముల దండ్యాదులు నిరాదరించినట్లే, గుణరీతులకు గల విచక్షణల భామహుడు నిరాకరించెను. దండ్యాచార్యులవలె మార్గ భేదములను, వామనాచార్యులరీతి రీతివిశేషములను నొక్కి వక్కాణింపక, భామహాచార్యులు వైదర్భి గౌడ కావ్యముల నించుక సూచించి, వానికి గల 'పైపై పెపూత మెరుంగులు, జగ్గునిగ్గులు' వట్టికల్లలు రిత్తలను భావమును వెలిబుచ్చెను. దీనికి ననుగుణముగ నాతడు గుణగణముల సొగసువగలను, ముద్దుముచ్చటలను గాని, రీతిరచనల 'సుధా ప్రపూరబహుళభంగ ఘుమంఘుమఘుంఘుమార్భటులను', 'వియద్వాహినీ చకచకద్వికచోత్పలసార సంగ్రహోద్యాతకుమార గంధవహహారి సుగంధ విలాసములను' గాని వీసమేనియు భామహుడు కావ్యాలంకారమున బొందుపరచకయుండెను. మునిచంద్రుడు పేర్కొనిన దశగుణముల నిరసించి, మాధుర్యము, ఓజము, ప్రసాదములను మూటినిమాత్రమే చర్చించెను. ఈసందర్భమునసైన భామహుడు గుణములకును, రీతులకును గల సంబంధబాంధవ్యముల గురుతింపకయే, స్థూలదృష్టి నీగుణములు సమాససంఘటనాస్వరూపమున నాధారపడియున్నవనిమాత్రమే వచించెను.

ఇటుల సంగ్రహముగ గుణత్రయము నంగీకరించి భామహుడు కావ్యాలంకారముల లక్షణము గూర్పదొడంగెను. రెండు మూడు అధ్యాయములలో నీకావ్యాలంకారముల లక్ష్యలక్షణముల జర్చించి, మొదటి అధ్యాయమున విమర్శింపని కావ్యదోషములను నాల్గవ యధ్యాయమున నిరూపించి, ఐదవ, ఆరవ అధ్యాయముల న్యాయవ్యాకరణ సాధుత్వనియమముల వివరించి, భామహుడు గ్రంథమును ముగించెను. ప్రమాణ, ప్రజ్ఞా, హేతు, దృష్టాంతాది న్యాయవైశేషిక విశే

షయములను పంచమాధ్యాయమునను, సౌశబ్ద్యమూలకములైన వ్యాకర ణాంశములను షష్ఠాధ్యాయమునను జర్చించెను. ఈ కావ్యాలంకారము నందలి కడపటి మూడుఅధ్యాయములును దోషనివారణోపాయముల బోధించునేకాని, కావ్యోపస్కారకారణముల కరతలామలకముగ నొన రింపవు. ఇంక నీ గ్రంథమునం దలంకారముల తత్త్వము నెరింగించు ద్వితీయతృతీయాధ్యాయములే మనకత్యంతావశ్యకములు. ఈయధ్యాయ ద్వయమును బరిశీలించినచో నాలంకారిక శాస్త్రసంప్రదాయలక్షణ ముల ననుసరించియే కావ్యకల్పనాకౌశలము జెలంగు నని భామహా చార్యులు తలంచినట్లు మనకు గోచరించును. ఈ కారణముననే లక్ష్యలక్షణముల నాతడు నిరూపించి, నిర్వచించి గ్రంథము రచించి యుండనోపును. కావుననే కావ్యరచనాభిలాషుల కీగ్రంథము ఆచా ర్యకము, ఆదర్శప్రాయము నై వెలుగొందుచున్నది.

అలంకారములకు లక్షణము రచించునప్పుడు, భామహుడు వీనినన్నింటికిని సాధారణాంశ మెదియైయుండునా యని తలంచి, వానికన్నిటికిని వక్రోక్తియే బీజమని నిశ్చయించి, వక్రస్వభావోక్తి మూలకము లైనప్పుడే కావ్యాలంకారములుగా నంగీకరించి, ఆయా అలంకారముల వక్రతావిశేషమునందలి తరతమభావముల గమనించి, కొన్నిటిని ముఖ్యములుగను, మరికొన్నిటిని అముఖ్యములుగను గణిం చినట్లు మనకు స్పష్టమగును. భామహుని వక్రోక్తిలోగల విశేషాంశ మేది యని మనము ప్రశ్నించినచో నయ్యది నవీనుల శ్లేషకాకుగర్భిత వక్రోక్తి శబ్దాలంకారమని బోధపడును. వామనాచార్యుల మతానుసార ముగ నది నవీనుల శబ్దాలంకారముగాక, లక్షణామూలకమైన అర్థాలం కారమగును. దండ్యాచార్యులవోలె నీవక్రోక్తినామమే వాఙ్మయశ్రీ సంపాదకమైన సర్వాలంకారసామాన్యవచనముగా భామహా ర్య

లంగీకరించెననుటకు,-"సైషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే, యత్నో౽స్యాంకవినా కార్యః కో౽లంకారో౽నయావినా" అనుశ్లోకము మనకు ప్రబలప్రమాణమై వెలయును. ఈశ్లోకసహాయముననే రాజానకకుంతలాచార్యుడు వక్రోక్తియే కావ్యజీవిత మను నూతనమతమును మునుముందు నెలకొల్పసాహసించుట జదువరు లెఱుంగగలరు. ఈ వక్రతయే వైచిత్ర్యాంతరవిశిష్టమనియు, వైదగ్ధ్యభంగీభణితి స్వభావమనియు, కవిప్రతిభానిర్వర్తితవ్యాపారమనియు వక్రోక్తిజీవితకారుడు వచించెను. మిగిలిన విశేషాంశముల వక్రోక్తిమతమున విమర్శింతము.

ఈవక్రోక్తిసందర్భముననే దీని ప్రతికక్షియు, యథావస్థితపదార్థరూపకథనమూలకము, నైసర్గికస్వరూపమనోహరవర్ణనాకీర్ణమునై వెలింగి, సర్వశాస్త్రసామ్రాజ్యసదృశమై, సర్వాలంకారహారనాయకరత్నమై, దండ్యాదులచే నాద్యాలంకారముగా గొనియాడబడిన స్వభావోక్తిని, భామహకుంతలులు కావ్యాలంకారప్రభేదముగనైన సమ్మతింపలేదని మన మెఱుంగవలయును. స్థావరజంగమాదిపదార్థముల, జాతిగుణక్రియాద్రవ్యవివిధప్రకారావస్థల, స్వరూపవిశేషముల, ప్రత్యక్షసదృశములుగ సాక్షాత్కారకరణమే జాతి, లేక స్వభావోక్త్యలంకారమని దండ్యాచార్యాదుల మతముగా జెలంగును. కావున వస్తుసంచయస్వరూపస్ఫుటీకరణసమర్థమైన అసాధారణధర్మవర్ణనమే స్వభావోక్త్యలంకారమునకు సంగ్రహలక్షణ మననొప్పును. వక్రోక్తిబీజ మిసుమంతయు నీయలంకారమునందు లేకుంటచేకాబోలు, వక్రతావైచిత్ర్యవైదగ్ధ్యభంగీగర్భితాభిధేయాలంకారపక్షపాతులైన భామహాదులు, స్వభావోక్తిస్వరూపసౌందర్యాతిశయావలోకనమునకు పరాఙ్ముఖులైరి. మరియు, ప్రాకృతవస్తుజాలస్వాభావికస్వరూపవర్ణన మొనర్చుట చమ

త్కారకారి గా నేరదని వారి యాశయముగావచ్చును. కాని భామహ కుంతలులు దలంచిన ట్లిది వైచిత్ర్యవిహీనము గాదు. స్వభావోక్త్యలంకారమున కవీశ్వరుడు సామాన్యజనాభిప్రాయానుసారముగను, తత్తత్పదార్థప్రయోజనాపేక్షితములను గమనించి వస్తుస్వరూపమును వర్ణింపడు. ప్రాకృతజనములకరణి కవిచంద్రుఃడును, వర్ణనీయవస్తుసమస్తమునకును స్వపరవిషయసంబంధము లుండవు. ఆయాపదార్థముల సత్యస్వరూపమును మహాకవి వీక్షించి, తన్మనోద్రేకచిత్తుడై, వానిని లోకాతిక్రాంతగోచరముగా వర్ణించును. దీనిని రమణీయత, లేక లోకోత్తరత్వముగా సహృదయులు పేర్కొందురు. మరియు లోకోత్తరాహ్లాదజనకజ్ఞానగోచరతయే రమణీయతగాను, ఆహ్లాదగతచమత్కారాపరపర్యాయమై, అనుభవసాక్షిభూతమైన జాతివిశేషమే లోకోత్తరత్వమనియు పండితరాయలు వచించెను. ఈ రామణీయక, లోకోత్తరత్వములు స్వభావోక్త్యలంకారమునం దంతర్గతములైన కారణముననే దండ్యాదులు వక్రతను సర్వాలంకారసామాన్యబీజముగ నంగీకరింపక, వక్రోక్తికి సపత్నిగా స్వభావోక్తినిగూడ సంస్మరించిరి. మరియు వాఙ్మయవనితావదనారవిందమకరందరసపానలాలసమైన, వామపక్షిణనేత్రాపరభ్రమరయుగళిగా, వక్రోక్తిస్వభావోక్తులు ఆలంకారికవిధాతలచే సృజింపబడెనని మనము భావింపవచ్చును.

మనోహరాభిరామమైన స్వభావోక్త్యలంకారమునకు సర్వలక్షణసంపన్నమైన భావికమును సోదరాలంకారము గలదు. ఈభావికమును సంగ్రహముగ ప్రబంధవిషయకగుణముగ భామహదండ్యాచార్యులు భావించిరి. కథాసంవిధానము చిత్రోదాత్తాద్భుతార్థత్వవిశిష్టమై, స్వాభినీయతా శబ్దానుకూలతాహేతుభూతమై విలసిల్లినచో

ప్రబంధగుణమై ప్రకాశించునని భామహుని మతము. మరియు భూత భావిపదార్థప్రత్యక్షీకారాత్మకమై, కవిగతభావము శ్రోతలకు సహృదయులకును ప్రతిబింబత్వమున భాసించినచో అలంకారమై చెలువారును. భామహుని లక్షణమును దిలకించినచో నాతడు గుణా లంకారములకు విభేదమును గల్పింపక భావికమును ప్రబంధగుణముగను, ప్రత్యేకాలంకారముగనుగూడ భావించెనని తెలియవచ్చును. ఇట్లొన రింపక, అలంకారముల నెల్ల జర్చించినవెనుక, భావికాలంకారమును విమర్శించి, దానిని ప్రబంధవిషయగుణముగ నిరూపించుటచేతను, భూతభవిష్యద్వృత్తాంతముల ప్రత్యక్షమొనర్చు భావికమును, వర్త మానవస్తుస్వరూపసాక్షాత్కారముగలిగించు స్వభావోక్తిని సమగ్ర ముగ జర్చించి తత్తదుచితస్థానముల బ్రతిష్ఠించుటచేతను భామహుని కన్న దండ్యాచార్యుడే విలక్షణవిమర్శనాజ్ఞానమును బ్రదర్శించె నని చెప్పకతప్పదు. ఈ దండ్యాచార్యుల భావికవిచారము, ప్రబంధమున కొక విశేషార్థము గలదా ? ఆవిశేషార్థము పూర్వాపరవిరోధశూన్య మై, అక్లిష్టతారహితమై, కవిభావమును ప్రకాశింపజేయునా ? తత్తదవయవవాక్యతాత్పర్యములు మహావాక్యతాత్పర్యమునకు సంపూర్ణముగ సమన్వయించునా, లేక సమన్వయింపవా ? అను ఉత్తమోత్తమవిమర్శనావిజ్ఞానానుకూలము లైన ప్రశ్నాంకురముల నెన్నిటినో సహృదయహృదయాలవాలమున మొలకలెత్త జేయును.

భామహాచార్యుల మతమున కావ్యప్రాశస్త్యము వక్రోక్తి రామణీయకముపై నాధారపడియున్నదని మన మీవరలో గ్రహించి తిమి. రీతిగూడ కావ్యోపస్కారకముగా గన్పడినను, వక్రోక్తియుక్త శబ్దార్థసహితమై కావ్యము ప్రకాశించుననియు, వక్రతారహిత మైనచో కావ్యము చమత్కారశూన్యమనియు, కావ్యరచనావసర

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

మున వక్రతాసంపాదనకై మహాకవి ప్రధానముగ ప్రయత్న మొన రింపవలయుననియు భామహుడు బోధించెను. ఇట్టివాడు వక్రోక్తి లేశమైన లేని, హేతుసూక్ష్మలేశాద్యలంకారముల నిరసించె ననినచో మనము నిర్విణ్ణులము గానక్కరలేదు. భామహాచార్యు లేలనో తన కావ్యాలంకారమున నీవక్రతాస్వరూపస్వభావముల విశదముగ వ్యక్తీకరింపలేదు. ప్రాచీనాలంకారికులకు స్వమతముల సమగ్రముగ సమన్వయించి, స్వరూపసందర్శనప్రకటనావిజ్ఞానము లేకపోవచ్చును. అటుగానిచో వక్రోక్తితత్త్వము పూర్వాచార్యుల నాటనుండి పరంపరగా వచ్చుట సర్వులకు కరతలబదరీఫలసదృశమై యుండవచ్చును. ఏది యెట్లున్నను కావ్యాలంకారము బోధింపజాలి నంత మనశక్తికొలంది సంగ్రహింతము. అలంకారలక్షణము నిర్ణ యించి, అతిశయోక్తిలక్షణమునుగూడ విధించి భామహాచార్యులు ముక్తకంఠముగ "సైషా సర్వైవ వక్రోక్తి" యని వచించె. మరియు కావ్యాలంకారమున ప్రథమాధ్యాయమున "యుక్తం వక్రస్వభావోక్త్యా సర్వమే వైత దిష్యతే" యనియు, "వక్రాభి ధేయశబ్దోక్తి రిష్టా వాచా మలంకృతిః" అనియు నుగ్గడించెను. అతిశయగర్భితమై వక్రోక్తి దీపించుననియు, వక్రోక్తివైచిత్ర్యము ప్రకాశించునప్పుడు అతిశయ మాఖిచిత్రమార్గమునకు ప్రధానాంశమై చెలువొందుననియు కుంతలుడు వచించినప్పు డాతడు భామహుని లక్షణమును శిరసావహించె ననవచ్చును. అతిశయోక్త్యలంకార మొక్కటియే లోకసీమాతివర్తినీవిశేషవర్ణనాపరాయణమై సర్వా లంకారసంచయమున వెలుగొందునని వాచస్పతిపూజనీయమహిమా న్వితుడుగూడ పలుకునని దండ్యాచార్యుడు అతిశయోక్తిని ప్రశం సించెను. ఈసందర్భమున, శబ్దార్థవైచిత్ర్య మతిశయోక్త్యధీనమై

చెలువొందుచుంట నిది సర్వాలంకారబీజభూతమనియు, అతిశయ జననత్వముకన్న మిన్నయైన భూషణ మింకొకటి లేకుంట నీఅతిశయోక్తియే అలంకారాంతరములకుగూడ నుపస్కారకమనియు వ్యాఖ్యానముజేయబడెను. భామహుడు రచించిన అతిశయోక్తి వక్రోక్తులవిషయమున ఆనందవర్ధనాచార్యుల విమర్శనమును బరిశీలించినచో వీని తత్త్వము మనకు తేటపడును. ఏఅలంకారమునం దతిశయోక్తి కవిప్రతిభావశమున నధివసించియుండునో, దానియందు చారుత్వాతిశయయోగ ముండుననియు, మిగిలినవన్నియు నలంకార మాత్రము లనియు, సర్వాలంకారశరీరస్వీకరణయోగ్యమునను, అభేదోపచారమూలకమునను అతిశయోక్తి సర్వాలంకారరూపతం జెందునని మన మూహింపవలయునని ఆనందవర్ధనుడు నుడివెను. ఇందువలననే అతిశయోక్తి సర్వాలంకారసామాన్యరూపమనియు, ఈఅతిశయోక్తికతమున సకలజనోపభోగపురాణీకృతమైన అర్థముసహితము విచిత్రతరరూపమున భాసించుననియు అభినవగుప్తపాదుడు రచించెను. ఈఅతిశయోక్త్యలంకారము కవిత్వమునకు జీవితభూతము, ప్రాణప్రాయముగా మమ్మటుడు పలికెను. ఈపైవిచారణవలన వక్రోక్త్యతిశయోక్త్యలంకారములకు గల పరస్పర సారూప్యసాదృశ్య సంబంధము బోధపడి, చదువరులకు వక్రోక్తితత్త్వము తెల్లమగును.

ఈమతమున వక్రోక్తివైచిత్ర్యము, లేక అలంకారప్రాచుర్యమే ప్రాణసమముగ బరిగణింపబడినప్పుడు రసాదులు అలంకారాంతర్గతము లయ్యెనని వేరుగ జెప్పనక్కర లేదు. ఏలనన: భరతుని మతమున రసమునకు గల కృత్యమును భామహాచార్యుడు రసవదలంకారమునకు విధించెను. భామహమతానుయాయిగా మనము ఉద్భటాచార్యుల నంగీకరించినచో రసవదలంకారమేకాక, ఊర్జస్విప్రేయో

లంకారములుగూడ రసస్ఫూర్తి నుపచరించుచున్నవి. మరియు "సైషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే" అను భామహ శ్లోకమున గల 'విభావ్యతే' అనుపదమునకు 'ప్రమదోద్యానాది విభావతను బొంది, విశేషముగ భావింపబడి, రసమయ మగును' అని అభినవగుప్తపాదుడు వ్యాఖ్యానమునరించి, 'రసాలంకారములు రెండును వక్రోక్తిమూలమున జనించినవే' యనుభావమును వెలి బుచ్చెను. సర్వమతముల నుత్తమోత్తమమగను, పరమరమణీయమగను సమ్మతింగాంచిన ధ్వనిమతమునుగూర్చియు, వ్యంగ్యార్థమునుగురించియు భామహాచార్యులు వివరింపలేదు. అందుచే నాతడు ధ్వన్యర్థమును సుంతయు నెరుంగడని మనము జెప్పసాహసింపలేము. పర్యాయోక్తము, వ్యాజస్తుతి, అప్రస్తుతప్రశంస, సమాసోక్త్యలంకారముల లక్షణమును బరిశీలించినచో అన్యార్థము గమ్యమానమగుట మనకు గానవచ్చును. అన్యప్రకారమున నభిధీయమానము పర్యాయోక్త్యలంకారమని భామహుడు విధించిన లక్షణమునకు, వాచ్యవాచకవృత్తిశూన్యమై పర్యాయోక్త మవగమాత్మకమని ఉద్భటాచార్యుడు విశేషణమును విరచించెను. దీనివలన పర్యాయోక్త్యలంకారమున నర్థము ప్రకారాంతరమున బోధపడునని తలంపవలయు. ఆనందవర్ధనాచార్యుల మహోపదేశ మీవిషయమున నూతనవికాసమును వెదజల్లుచున్నది. భామహోదాహృతసదృశపర్యాయోక్త్యలంకారమున వ్యంగ్యార్థమునకు ప్రాధాన్యము లేదనియు, వాచ్య మచటనుపసర్జనీభావమున నవివక్షితముగాదనియు, వాచ్యత్వప్రసిద్ధములైన రూపకాద్యలంకారములు ప్రతీయమానార్థద్యోతకములుగా భట్టోద్భటాదులచే బహుళముగ ప్రదర్శితము లయ్యెననియు, నాహేతువున ధ్వనిపథమున నివి అలంకారధ్వనికి లక్ష్యములనియు ఆనందవర్ధనుడు బోధించెను.

## అలంకారమతము-కావ్యాలంకారములు: వక్రోక్త్యాదులు

ఈకారణములచే భామహోద్భటప్రభృతులు, మల్లినాథుడు భ్రమించినట్లు ధ్వన్యభావవాదులు గారనియు, భాక్తవాదులు, అవగా నంతర్భావవాదులనియు, వీరి సంప్రదాయమున అభినవగుప్తపాదుడు వచించినట్లు 'ఉపచరితశబ్దార్థవ్యాపారమే ధ్వనన' మనియు, 'అభగ్ననారికేళకల్పయథాశ్రుతతద్గ్రంథోద్గ్రహణమాత్రమై' ధ్వనిమార్గ మునీర్లిఖితనుద్యోగనియు మనము గ్రహింపవలయును. నవీనులచే కావ్యాత్మగా నాదరింపబడిన ధ్వన్యర్థమును ప్రాచీను లలంకారాంతర్గతముగా భావించిరని పలుకుటచే, ఆనందవర్ధనాచార్యుల వాదమును ప్రతీహారేందురాజు బలపరచె ననవచ్చును. దీనికిదోడుగా పర్యాయోక్త్యలంకారప్రకరణమున జగన్నాథుడు క్రిందివిధమున బ్రసంగించెను. సమాసోక్తివ్యాజస్తుత్యప్రస్తుతప్రశంసాద్యలంకార నిరూపణమున నెంతయో కొంత గుణీభూతవ్యంగ్యభేదమును ధ్వనికారపూర్వాచార్యులు నిరూపించుటవలనను, వ్యంగ్యప్రపంచమునంతయు పర్యాయోక్తకుక్షినిక్షేపము గావించుటచేతను భామహోద్భటప్రభృతులు స్వగ్రంథముల ధ్వన్యాదిశబ్దవ్యవహారము కొంచెమేనియు గావింపలేదనియు, ధ్వన్యాదుల స్వీకరింపలేదనియు నాధునికు లాడుపలుకులయుక్తియుక్తములనియు పండితరాయలు వచించెను. మరియు ప్రతీయమానార్థము వాచ్యోపస్కారకత్వమున నలంకారపక్షనిక్షిప్తముగా భామహోద్భటప్రభృతిచిరంతనాలంకారికులు భావింతురని సంగ్రహముగ రాజానకరుయ్యకుడు అలంకారసర్వస్వమున విరచించెను. కావ్యానుశాసనమున, ధ్వనితాభిధానమే పర్యాయోక్త్యలంకారమని వాగ్భటుడును, వ్యంగ్యోక్తియే పర్యాయోక్తమని హేమచంద్రాచార్యుడును లక్షణముల విధించిరి. ఈలక్షణవిధానమున మన కొకవిశేషాంశము గోచరించును. ప్రాచీనాచార్యుల లక్షణముల కపూ

ర్వార్థకల్పన మొనరించి, రసధ్వనిమతముల ప్రాచీనతను స్థాపించుట కర్వాచీనాలంకారికులు ప్రబలప్రయత్నము లొనరించిరని తేట పడును. ఇంతమాత్రముననే పూర్వాచార్యులు రసధ్వనిజ్ఞానశూన్యు లనుట మహాసాహసము. రసమును, వ్యంగ్యార్థమును వార లెరింగి యున్నను, వాని సారస్యమాధుర్యముల వార లాధునికులవలె సమగ్ర ముగ జవిగొనలేదనియు, వానిని వాచ్యోపస్కారకముగ భావించి ప్రమోదించిరేకాని, వాచ్యాలంకారములు రసధ్వనుల కంగములుగా నుపచరించునని విపులముగ విమర్శింపలేదనియు మనము దలంప వలయును.

---

( అలంకారములు - అనుప్రాసవృత్తిభేదములు - ఉద్భటుడు )

భామహాచార్యుడు విశేషముగ విమర్శించిన వక్రోక్తిని, రాజానకకుంతలుడు మరల నొకపరి స్మరించెనేకాని, మిగిలినవా రెవ్వరును దానిమాటయే తలపెట్టరైరి. భామహమతావలంబకుడైన భట్టోద్భటుడు వక్రోక్తితత్త్వమును కావ్యాలంకారవివృతియను భామహవివరణమున వివరించియుండును. కాని మన కాగ్రంథము నేడు లభ్యముగాదు. ఇంక నీతడు రచించిన అలంకారసంగ్రహము సత్యముగ నలంకారసంగ్రహమే. పాఠకుల ప్రయోజనమునకై అలంకార సంగ్రహమునందలి సంగతుల నధ్యాయక్రమమున నిట వివరింతును.

౧-వ అధ్యాయమున పునరుక్తవదాభాసము; ఛేకానుప్రాసము; వృత్త్యనుప్రాసము (వృత్తిత్రయసమేతము); లాటానుప్రాసము;

రూపకము; దీపకము (మూడువిధములు); ఉపమాప్రతివస్తూపమాలంకారములు.

౨. ఆక్షేపము; అర్థాంతరన్యాసము; వ్యతిరేకము; విభావన; సమాసోక్తి; అతిశయోక్తి (చతుర్విధము).

3. యథాసంఖ్యము; ఉత్ప్రేక్షాస్వభావోక్తులు.

౪. ప్రేయము; రసవత్తు; ఊర్జస్వి; పర్యాయోక్తము; సమాహితము; ఉదాత్తము (రెండుతెరగులు); శ్లేషాలంకారము

౫. అపహ్నుతి; విశేషోక్తి; విరోధము; తుల్యయోగిత; అప్రస్తుత ప్రశంస; వ్యాజస్తుతి; నిదర్శన; సంకరము(నాల్గువిధములు); ఉపమేయోపమ; సహోక్తి; పరివృత్త్యలంకారములు.

౬. ససందేహము; అనన్వయము; సంసృష్టి; భావికము; కావ్యలింగము, లేక హేతువు; కావ్యదృష్టాంతము(దృష్టాంతము) లను అలంకారములు క్రమప్రకారమున లక్షణోదాహరణసమన్వితముగ జర్చింపబడెను. ఇందు అనుప్రాసభేదములతోఁగూడ నలువదియొక్క అలంకారముల లక్షణము గలదు.

ఇంతకన్న నెక్కువగ నీగ్రంథము మనకు బోధింపదు. అలంకారముల క్రమమునను, లక్షణరచనావిధానమునను ఉద్భటుడు చాలవరకు భామహపథానువర్తియైనను కొన్నిచోట్ల క్రొత్తసంగతుల రచించెను. భామహుడు పేర్కొనని అతిశయోక్తిభేదముల నాలుగింటిని ఉద్భటు డుదాహరించెను. ఈఅతిశయోక్తిభేదములు నవీను లంగీకరించినవియే. భామహుడు గ్రామ్యానుప్రాస, లాటీయానుప్రాసలను రెండింటినిమాత్రమే సమ్మతించెను. ఈరెండువిధములును గ్రామ్య, ఉపనాగరికావృత్తులపై నాధారపడినవని ప్రతీహారేందు

రాజు 'భావించెను. ఇంక ఉద్భటుడు ఛేకానుప్రాస, లాటానుప్రాస, వృత్త్యనుప్రాసలను మూడింటిని పేర్కొనెను. ఈ మూటిలో వృత్త్యనుప్రాసము గ్రామ్యము, లేక కోమలము, పరుషము, ఉపనాగరికావృత్తుల ననుసరించి మూడువిధముల జెలంగును. ఇటుల వృత్తివ్యవహారమునకు గడంగినవారిలో భట్టోద్భటుడే ప్రథముడు. భామహుడు దీని నెరుంగడు. ఇది ఆనందవర్ధనుని కాలమువరకు మనకు శ్రవణగోచరమగును. ఈభావమునే అభినవగుప్తుడుగూడ లోచనమున వెలిబుచ్చెను. ఉద్భటుని వృత్తిత్రయమునకు మారుగ రుద్రటుడు వృత్తిపంచకమును గల్పించెనని మన మచిరకాలమున నెరుంగగలము. కాని ఆధునికులు మమ్మటాచార్యరాజానకరుయ్యకాదులు భట్టోద్భటుని వృత్తిత్రయము నంగీకరించి వానిని రసపథానుకూలముగ నవలోకించిరి. మరియు భామహుడు సంగ్రహముగ సూచించిన, వ్యాకరణప్రయోగానురోధములగు ఉపమాభేదములు భట్టోద్భటుని గ్రంథమున ప్రకాశితములై, నవీనాలంకారికులకు ఆదరపాత్ర మయ్యెను. భామహునివలె నీతడు వ్యాకరణదోషములకును, సౌశబ్ద్యకౌశలమునకును ఒక అధ్యాయమును ప్రత్యేకించి దానిలో శబ్దశక్తిసంస్కారములగురించి చర్చింపకున్నను, శబ్దశాస్త్రసంప్రదాయమును గౌరవించి, వత్, క్యచ్, క్యఙ్, క్విప్, కల్పప్ మొదలుగాగల వాచకలుప్తోపమాప్రభేదముల విమర్శించెను. ఈ ఉద్భటాచార్యుల ఉపమావిభాగమే నవ్యులచే నౌదలదాల్పబడెను. శేషించిన ప్రత్యేకాలంకారముల లక్షణములగూడ నచ్చటచ్చట కొన్నికొన్ని మార్పులు పొడగట్టుచున్నవి. ఉద్భటుని తుల్యయోగితాలంకారలక్షణము మమ్మటాచార్యుల లక్షణమునకు సరిపోవుచున్నది. కాని భామహుని లక్షణము మమ్మటుని దీపకాలంకారలక్షణమును బోలి

యున్న దనవచ్చును. ఇంక కావ్యదృష్టాంతము, కావ్యహేతువులను-దృష్టాంతకావ్యలింగాలంకారములకు లక్షణమును భామహుడు రచింపనే లేదు. ఈ రెండలంకారములకును లక్షణము విధించినవారిలో ఉద్భటుడే మొదటివాడు. పూర్వులలో యమకాలంకారమును-పూర్తిగ పరిత్యజించినవాడు ఉద్భటు డొక్కడే. ఉపమాసహోక్తి హేత్వలంకారములలో శ్లేష సంభవించునని భామహుడును, సర్వాలంకారములను శ్లేష పోషించునని దండ్యాచార్యుడును సమ్మతించిరి. శబ్దశ్లేష అర్థశ్లేషగా గణింపబడిన సుప్రసిద్ధవిభాగము భట్టోద్భటుని నాటినుండియే తలచూపెనని రుయ్యకుడు వచించెను. ఇతరాలంకారములతో గూడినచో శ్లేషాలంకారము బలీయమై, స్వప్రకాశమున దానిని గప్పివేయజాలునని ఉద్భటుడు నొక్కివక్కాణించెను. కావ్యాలంకారములలో రసమునకు ముఖ్యత నొసంగుటచేతను, విభావానుభావశబ్దముల ప్రయోగించుటవలనను తన పూర్వులకన్న భట్టోద్భటుడు సూక్ష్మదృష్టి బరిశీలింపజొచ్చెనని మనకు దెలియుచున్నది. సంసృష్ట్యలంకారప్రసంగము భామహ, భట్టి, దండి, వామనుల గ్రంథముల గానవచ్చుచున్నది. దండ్యాచార్యు లుదాహరించిన రెండుతెరంగుల సంసృష్ట్యలంకారమును ఉద్భటు డంగీకరింపక పోవుటయేకాక, సంకరసంసృష్ట్యలంకారముల రెంటికిని గల విభేదమును చక్కగ విమర్శించెను.

ఈపైసంగతుల- నన్నిటి బరికించినచో, భామహాచార్యులు ప్రతిపాదంచిన అలంకారమే కావ్యజీవమను మతమునకు వన్నెబెట్టి, క్రొత్తతళుకుల మెరపించి, భట్టోద్భటుడు చూపరులకనుల మిరుమిట్లు గొనజేసెనని మనకు దెలియవచ్చును. ఆకారణముననే ప్రథమాచార్యునిగా భామహుని ప్రశంసించినను, లక్షణరచనావిధానమునను,

భేదప్రభేదనిరూపణమునను, భట్టోద్భటుడే అలంకారమతాచార్యుడుగా నవీను లెల్ల రంగీకరించిరి. ఉపమాది భేదములు, శ్లేషవిభాగములు నన్నియు ఉద్భటునికాలమునుండియే ప్రబలజొచ్చెనని ఆనందవర్ధన, అభినవగుప్త, రుయ్యకాదులుగూడ వచించిరి. కావున సునిశిత విమర్శన మొనర్చి, సూక్ష్మసూక్ష్మతర భేదప్రభేదముల నేర్పరచి, అలంకారముల సంఖ్య నభివృద్ధిసేయుమార్గమునకు దారిజూపినవాడు ప్రాయశముగ భట్టోద్భటుడు గానోపును. అందువలననే మమ్మట రుయ్యకాదుల లక్షణములకు ఉద్భటుని లక్షణ మాచార్యక మొనరించి వివిధాలంకారస్వరూపమును విలక్షణముగ విధింపగల్గెను. భామహుని వక్రోక్తికి విపులప్రచారమును గలిగించి, వక్రోక్తివైచిత్ర్యమే కావ్య జీవిత మని ప్రతిపాదించి రాజానకకుంతలాచార్యుడు నవీనమతమును స్థాపించినను, అలంకారములే కావ్యమున ప్రధానములనియు, అలంకారమే కావ్యజీవమను ప్రాచీనమతమునకు ప్రాబల్యము సంపాదించి, భామహాలంకారమతాభ్యుదయమునకు ప్రయత్నించి, ఫలోన్ముఖుడైన వాడు భట్టోద్భటుడేయని మనము చెప్పకతప్పదు. దండ్యాచార్యు లుపదేశించిన గుణాతిశయమాహాత్మ్యశ్రీ మూలగా నొకవంక వామనాచార్యులు రీతిమతరచనకు గట్టించుచున్న సమయముననే, భామహాచార్యులు నెలకొల్పిన అలంకారమతామూల్యతను వేరొకదెస ఉద్భటాచార్యులు కాశ్మీరదేశపండితమండలికి బోధింపజొచ్చెను. ముందు ముం దీమతమహానదీనదములన్నియు ఆనందవర్ధనాచార్యుల ధ్వని సాగరమున లీనమై, పరస్పరానురాగప్రకటన మొనర్చుటను మనము కన్నులార గని సంతసింపగలము.

ఉద్భటుడు సృజించిన అలంకారోక్తిమయప్రపంచము యొక్క సత్యస్వరూపమును ప్రదర్శించుటకు ప్రతీహారేందుని ప్రకా

శము జాలదు. ఏలననగా నీతడు ఉద్భటునితరువాత రమారమి నూరు సంవత్సరములు గడచినవెనుక వర్ధిల్లెను. కాన తనకాలమునందలి విశేషాంశము లన్నియు మూలకారుని గ్రంథమున గలవని నిరూపింప ప్రతీహారేందురాజు ప్రయత్నించెను. ధ్వన్యర్థమును భట్టోద్భటు డెరుంగుననియు, దీనివిషయమై స్పష్టముగ నత డెచ్చటను ప్రసంగింప లేదనియు మన మెరుంగుదుము. ఇట్టి సందర్భమున ధ్వన్యర్థమును విస్పష్టముగ వివరించి, ఉద్భటుడు దీని నలంకారాంతర్గతము గావించె నని నిరూపించుటకై ప్రతీహారేందుడు మూలమునకు విశేషార్థకల్పనము గావింప సమకట్టెను. ఇంతియేకాక ప్రతీహారేందునకు రీతి మతమునందు విశేషాభిమాన మున్నట్టు పొడగట్టును. కారణ మేమన, గుణాలంకారములకు గల సంబంధమును వివరించుచు, వామనాచార్యుల చేరొక్కని, యాతని లక్షణమును ప్రతీహారేందు డనుసరించెను. భామహోద్భటులు గుణాలంకారముల తారతమ్యమును గణింపనే లేదు. ఉద్భటాదు లన్ననో గుణాలంకారములకు ప్రాయశముగ సామ్యమునే సూచించిరని రుయ్యకుడును, కావుననే గడ్డరికాప్రవాహమునసే గుణాలంకారభేద మున్నదని భామహవివరణమున భట్టోద్భటుడు రచించెనని హేమచంద్రుడును వచించిరి. ఇంక వామనాచార్యుడన్ననో గుణాలంకారముల భేదమును వివరించి, రీతిపై విశేషాదరాభిమానముల జూపెను. కావున ప్రతీహారేందుడు వామనుని విశేషాంశములనెల్ల విచ్చలవిడిగా ననువదించెనని మనము దలంపవలయును.

భామహుడు రీతిని సమయోచితముగ స్మరించెను. దానిని భట్టోద్భటుడు విస్మరించినను, వామనుని రీతిత్రయమున కుపమానమై, అనుప్రాసాలంకారమున కనుకూలమై చరించు వృత్తిత్రయమును

విధించెను. రీతి గుణమునందు పర్యవసితమను అభినవగుప్తుని వచనము ననుసరించి వామనాచార్యుల రీతిత్రయమునకును, ఆనందవర్ధనుని గుణత్రయమునకును సాదృశ్యము గలదని మనము దలంపవచ్చును. ఇంతమాత్రముననే వామనుని రీతిత్రయమునకును, ఆనందవర్ధనుని గుణత్రయమునకును గల సామర్థ్యము ఉద్భటుని వృత్తిత్రయమున కున్నదని మనము భావింపరాదు. సంఘటనాధర్మములుగా గుణములను భట్టోద్భటాదు లూహించిరని అభినవగుప్తుడు పలికెను. కాని మన మీసంఘటనయే వామనుని రీతిగా నెంచరాదు. ఏలననగా నీసంఘటన అసమాస, దీర్ఘసమాస, మధ్యమసమాసాకలితములని మూడువిధములని, ఇవి మూడును రసాదుల నాశ్రయించి చెలంగుననియు ఆనందవర్ధనుడు రచించెను. మరియు సంఘటనా గుణము లైక్యములా, లేక వ్యతిరేకములా? అని విమర్శించుచు, ఆనందవర్ధనాచార్యులు గుణములు సంఘటనాస్వరూపములు గావనియు, సంఘటనాశ్రయమై గుణము లుండవనియు నిష్కర్షగా వచించెను. ఈప్రకారముననే రసమునుగురించి ముచ్చటించుచు ప్రతీహారేందుడు రసమే కావ్యాత్మగా బలికెను. ఉద్భటుడు రస ప్రాముఖ్యము నెంతగా గురుతించినను, కొన్ని అలంకారముల కది ఉపచరించుననిమాత్రమే తలంచెనుగాని దీనికన్న నెక్కువగ నెంచె నంటకు మనకు దగిన ప్రమాణము లేమియు గానరావు. ఉద్భటుని విషయమున మరికొన్ని విశేషాంశములు గలవు. "వాక్యమునకు అభిధావ్యాపారము త్రివిధముగ ఔద్భటులు గణించి"రనియు, 'విచారితసుస్థము', 'అవిచారితరమణీయము' నని అర్థము రెండు తెరంగు లనియు, మొదటిది శాస్త్రములను, రెండవది కావ్యములను గాన వచ్చుననియు ఉద్భటమతానుసారులు దలంచిరని రాజశేఖరుడు

రచించెను. మరియు 'అభిధాధర్మములుగాగాక, శబ్దార్థసామ్రములు గానే చిరంతనులచే నలంకారములు ప్రతిపాదితము లయ్యె'నను అపరి చితసిద్ధాంతము నొకదానిని వ్యక్తివివేకవ్యాఖ్యానము భట్టోద్భటునకు కారోపించెను. ఈ ఆరోపాంశములెల్ల పూజార్థముగా మనము ఎంచ వలయును. ఇంతకన్న నెక్కువగ వీనిని గణించి, భట్టోద్భటుడు నొక్క నూతనమతము స్థాపించెననియు, ఉద్భటమతానుసారులు కొందరు గలరనియు మనము సంకల్పించుటకు ప్రమాణాంతరము లేవియు లేవు. కాన భామహమతమును ఉద్భటుడు పోషించి ప్రచార యోగ్యము గావించెనని తలంచుచు నీతని వృత్తాంతము ముగింతము.

---

(అలంకారాభ్యుదయము; భాషావిభాగము;
వర్ణవృత్తివిభేదము - రుద్రటుడు)

రసమతాభిమానమును వెలిబుచ్చినను రుద్రటుడు అలంకార మతానుసారియనియే మనము భావింపవలయును. రసము నాదరించి, తనగ్రంథమున రసవిచారమునకు నాలుగధ్యాయముల వినియోగించి నను, కావ్యమున రస మప్రధానముగను, బాహ్యవ్యాపారపారీణతా మూలకముగను భావించి, అలంకారము లత్యంతావశ్యకము లను తలంపున నలంకారలక్షణవిధానమును పది అధ్యాయములలో సలిపి రుద్రటుడుగూడ భామహోద్భటులకైవడినే తనగ్రంథమునకు కావ్యా లంకారమని పేరిడెను. కావున నీతడుగూడ, అలంకారసహిత శబ్దార్థసమితియే కావ్యజీవముగ భావించినవాడని మన మెంచవచ్చును. రుద్రటుడు అలంకారప్రాముఖ్యమును సమ్మతించెనని యీతని

వ్యాఖ్యాత నమిసాధుడు పలికెను. దండ్యాచార్యునివలె రీతులు రెండనియు, వామనాచార్యునిపగిది మూడనియు దలంపక, రుద్రటాచార్యుడు పాంచాలీ, లాటీయా, గౌడీయా, వైదర్భీరీతులని నాల్గు తెఱంగుల నిరూపించినను, తనగ్రంథమున మిక్కుటముగ పైవారివోలె గుణములు ప్రాణములనియు, రీతి కావ్యాత్మయనియు విచారణ మొనరింపలేదు. లఘు, మధ్యా, యతసమాసరచనముపై నాధారపడి, పాంచాలీ, లాటీయా, గౌడీయారీతు లుండుననియు, అసమాస రచనపై నాధారపడి వైదర్భీరీతి మెలంగుననియు, నీకారణముననే వైదర్భీరీతియే మేలుబంతిగ వన్నెకెక్కెననియు రుద్రటుని యభిప్రాయము. రీతివిషయమునగాక, గుణవిచారణమునమాత్రము భామహుఁ డిట్టివిభాగమాత్రమునే ప్రయోగించెను. రుద్రటాచార్యుల పక్షమున శబ్దసమాసవతియగువృత్తియే రీతియై భాసించుచున్నది. రుద్రటుడు ధ్వనివిషయమై సుంతయు విచారణసలుపలేదు. కావున ధ్వని ధర్మము నాతడు గణించినట్లు గన్పట్టదు. పర్యాయోక్తిభావాద్యలంకారములపట్టున భామహభట్టోద్భటులవలెనే రుద్రటుడుగూడ వ్యంగ్యార్థము వాచ్యోపస్కారకముగ నుపచరించుననిమాత్రము సూచించెను. రుద్రటు డుదాహరించిన భావాలంకారలక్ష్యములను అభినవగుప్తమమ్మటాచార్యులు విమర్శించిరి. వ్యంగ్య మచ్చట పదార్థోపస్కారకారియనియు, వాచ్యమే ప్రధానమనియు, వాచ్యప్రాధాన్యముననే భావాలంకార ముండుననియు, భట్టోద్భటమతమున భావాలంకారమే ప్రేయోలంకారమనియు లోచనము మనకు ప్రదర్శించుచున్నది. ఈసందర్భమున రయ్యకుని తియ్యనిపలుకుల వినుడు. రుద్రటుడెన్నో భావాలంకారము ద్వివిధముగ బలికెననియు, రూపకదీపకాద్యలంకారములు వాచ్యోపస్కారకత్వము

గను, ఉత్ప్రేక్షాలంకారము స్వయముగనే ప్రతీయమానముగను, రస వద్ప్రేయః ప్రభృతులు వాచ్యశోభాహేతుత్వమున రసభావాదులుగ ప్రోక్తములనియు, నీప్రకారమున ప్రతీయమానము త్రివిధముంగూడ నలంకారపరముగ ఖ్యాపితమయ్యెనని రాజానకరుయ్యకుడు బోధించెను. రుద్రటుని భావాలంకారమున వస్తుధ్వని మనకు వినవచ్చును గాని రసాలంకారధ్వనుల ప్రతీతి సుంతయు గలుగుటలేదు. కావున ఉద్భటమతమువోలెనే రుద్రటమతముగూడ ప్రస్తుతమున మన కపరిచితము, విచారణీయముగా నున్నదని చెప్పనగును.

కావ్యాలంకారమున నలంకారములగురించి రుద్రటు డొనర్చిన సమగ్రవిచారణము గ్రంథనామమును సార్థకపరచుచున్నది. ఈ విచారణ మామూలముగ నత్యంతముగ నుండుటయేకాక, విలక్షణముగ, విశుద్ధముగ మనకు గోచరించుటంజేసి, రుద్రటుడు భామహునికన్న నవీనుడగుటచే నాత డొక నూతనాలంకారమతము ననుసరించి గ్రంథము రచించియుండనోపునని మనకు దలంపుగలుగుట కవకాశ మున్నది. కాని మన మూహించుటకు దగిన ప్రమాణములు లేవు. ఉద్భటుని అలంకారముల సంఖ్యకు రుద్రటుడు ముప్పదిస్వతంత్రా లంకారములను జేర్చుటయేకాక, వానికి భేదప్రభేదముల గల్పించి, దండ్యాచార్యులవలెనే యాతడుగూడ చిత్రబంధసంబంధమంతయు వేరుగ నొక అధ్యాయమున జర్చించెను. రుద్రటుని కావ్యాలంకారము నందలి విషయానుక్రమణిక నిట సంగ్రహముగ రచింతము. ఉద్భటు డంగీకరించిన అలంకారములు నలువదియొక్కటి; అలంకారవిభేద ముల లెక్కింపనిచో, రుద్రటుడు సమ్మతించిన స్వతంత్రాలంకార ములు అరువదియెనిమిదిగా గన్పట్టును. రుద్రటు డీ క్రిందివిషయముల పదునారధ్యాయములలో జర్చించెను.

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

౧. కావ్యప్రయోజనఫలితములు; కావ్యాంగములు మొదలైనవి.

౨. పాంచాలీ, లాటీయా, గౌడీయా, వైదర్భీరీతులు; ప్రాకృత, సంస్కృత, మాగధ, పిశాచ, శూరసేన, అపభ్రంశ భాషలు; ఐదువిధముల శబ్దాలంకారములు.

3. యమకాలంకారము; దాని భేదప్రభేదములు.

౪. శ్లేషాలంకారము; దాని భేదవిభేదవిశేషములు.

౫. చిత్రబంధము; దాని వివిధవిచిత్రరచనాప్రకారములు.

౬. శబ్దదోషములు; పదవాక్యదోషములు.

౭. వాస్తవము, ఔపమ్యము, అతిశయము, శ్లేషలను అర్థాలంకారచతుర్విధాధారములు; వాస్తవమూలకాలంకారములు.

౮. ఔపమ్యమూలకాలంకారములు.

౯. అతిశయమూలాలంకారములు.

౧౦. శ్లేషమూలాలంకారములు.

౧౧. అర్థదోషములు ; ఉపమాదోషములు.

౧౨. పదిరసములు; శృంగారరసవిచారము.

౧3. సంభోగశృంగారాదులు.

౧౪. విప్రలంభశృంగారము; తత్తదుచితోపాయములు.

౧౫. ఇతరరసముల స్వరూపలక్షణములు.

౧౬. కావ్యభేదములు; వాని లక్షణములు.

ఈరీతిగా పదునారధ్యాయముల విభజించి కావ్యాలంకారమును రుద్రటుడు రచించెను. ఇందలి విషయములను, వేరొకచో

పొందుపరుపబడిన ఉద్భటాలంకారసంగ్రహమునందలి విషయములతో పోలిచి చూచినచో ఉద్భటరుద్రటుల మధ్యకాలమున నలంకారశాస్త్ర మెంత వృద్ధినొందినదియు, వీరి విచారణల తారతమ్యమును చదువరులు చక్కగ గ్రహింపగలరు.

భరత భామహులకైవడి భట్టోద్భటుడుగూడ శబ్దాలంకార, అర్థాలంకారముల విభేదమును విమర్శింపకున్నను, ఉద్భటుని విచారణాక్రమము మొదట నాలుగుశబ్దాలంకారములను, పిదప నర్థాలంకారములను వివరించినట్లు మనల భావింపజేయును. స్పష్టముగ వివరింపకున్నను దండ్యాచార్యుడుగూడ నీక్రమ మవలంబించెనని యే చెప్పవచ్చును. ఇంక రుద్రటాచార్యుడన్నచో వామనాచార్యులు వోలెనే శబ్దప్రాధాన్యమును, అర్థప్రాముఖ్యమును గుర్తించి, అలంకారములను శబ్దాలంకారములు, అర్థాలంకారములుని రెండువిధములుగ విభజించెను. మరియు నలంకారముల సామాన్యలక్షణములను, సాదృశ్య సంబంధములను బరికించి, వానిని వేర్వేరుప్రకరణములుగ కల్పించిన వారిలో రుద్రటుడే మొదటివాడు. వక్రోక్తి, శ్లేష, చిత్ర, అనుప్రాస, యమకమూలకములుగా శబ్దాలంకారముల నైదువిధముల నిరూపించెను. ఇంక అర్థాలంకారముల నీక్రింది తెరంగున గుమిగూర్చెను :

౧. వాస్తవ మూలకములు - సహోక్తి, సముచ్చయము, జాతి, యథాసంఖ్యము, భావము, పర్యాయము, విషమము, అనుమానము, దీపకము, పరికరము, పరివృత్తి, పరిసంఖ్య, హేతువు, కారణమాల, వ్యతిరేకము, అన్యోన్యము, ఉత్తరము, సారము, సూక్ష్మము, లేశము, అవసరము, మీలితము, ఏకావళ్యలంకారములన ఇరువదియూ డలంకారములు.

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

౨. ఔపమ్యమూలకములు - ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము, అపహ్నుతి, సంశయము, సమాసోక్తి, మతాలంకారము, ఉత్తరాలంకారము, అన్యోక్తి, ప్రతీపము, అర్థాంతరన్యాసము, ఉభయన్యాసము, భ్రాంతిమంతము, ఆక్షేపము, ప్రత్యనీకము, దృష్టాంతము, పూర్వము, సహోక్తి, సముచ్చయము, సామ్యము, స్మరణము అను ఇరువదియొకటి అలంకారములు.

౩. అతిశయగర్భితములు - పూర్వము, విశేషము, ఉత్ప్రేక్ష, విభావన, తద్గుణము, అధికము, విరోధము, విషమము, అసంగతి, పిహితము, వ్యాఘాతము, హేతువు అను పండ్రెండు అలంకారములు.

౪. శ్లేషగర్భితములు-శుద్ధము, సంకీర్ణమునన శ్లేష ద్వివిధము. ఇందు శుద్ధశ్లేషమూలకము - అవిశేషము, విరోధము, అధికము, వక్రము, వ్యాజము, ఉక్త్యలంకారము, అసంభవము, అవయవము, తత్త్వము, విరోధాభాసమునన పది అలంకారములును, సంకీర్ణము రెండు అలంకారములును గలసి శ్లేషభిత్తికాశ్రితాలంకారములు పండ్రెండుగా విభజింపబడెను.

ఈ అలంకారవిభాగవిషయమున వామనాచార్యుడు సర్వాలంకారములును ఉపమాప్రపంచితములనియు, ఔపమ్యమే వివిధాలంకారబీజమనియు దలంచి విభాగమొనరించెను. రుద్రటుడీవిభాగమున కనుకూలుడు గాడు. నవీనాలంకారికులుగూడ రుద్రటుని మతము నంగీకరించిరి. అపూర్వాలంకారముల నెన్నిటినో నిర్మించి, అలంకారముల సంఖ్య నతిశయింపజేసిన దండ్యాచార్యుడే మన కొక మహోపదేశము గావించెను. ఒకానొకభేదమున కొకానొక అలంకారమును సృజింపదలంచినచో నలంకారము అనంతసంఖ్యాకము

లగునని దండి పలికెను. ఈఉపదేశవాక్యము రుద్రటుని విభాగమున కు, లక్షణవిధానమునకు ననుకూలించుచున్నది. ఈ విభాగమునకు ఫలితముగ నొక్కే అలంకార మొక్కే పేరున రెండుమూడు విభాగము లలో గానవచ్చును. సహోక్తి, సముచ్చయాలంకారములు ఔపమ్య వాస్తవమూలకములై, రెండుకక్ష్యలలోను గనవచ్చును. అటులనే ఉత్ప్రేక్షాలంకారము ఔపమ్యమూలకము, అతిశయగర్భితమునను రెండువర్గములను జూపట్టుచున్నది. ఈకారణముననే రుద్రటు డంగీకరించిన అలంకారములు కొన్ని కాలక్రమమున పేరు లేక పోయెను; మరికొన్ని రూపరి భంగపడియెను. ఇందుకు నిదర్శన ముగ రుద్రటుడు చేర్కొనిన భావ, మత, సామ్యపిహితాలంకారము లను కావ్యానుశాసనము రచించిన వాగ్భటు డొక్కడుదక్క మిగిలినవా రెవ్వరును సమ్మతింపలేదు. రుద్రటుని హేత్వలంకార మును మమ్మటుడు నిరాకరించెను. మరియు రుద్రటుని అవసరాలం కారము మమ్మటుని ఉదాత్తాలంకారద్వితీయభేదముగను, రుద్రటుని పూర్వాలంకారము మమ్మటుని అతిశయోక్త్యలంకారచతుర్థభేదము గను విపరిణామము జెందెను. వీనిని వాగ్భటాలంకారకారు డంగీ కరించెను. ఇంక నవీనులలో కొందరు భట్టోద్భటుని, మరికొందరు దండ్యాచార్యులను అనుసరించి తమతమ విభాగముల నారంభించిరి. ఇందువలన రుద్రటాచార్యుల విభాగనై పుణ్యముగాని, లక్షణకౌశలము గాని కుంటువడలేదు. మమ్మటాచార్యు లంతటి మహామహిమాన్వితుడు గూడ చాలవరకు రుద్రటమతానుసారముగను, అలంకారసర్వస్వ కారుడుసహితము భట్టోద్భటుమమ్మటభట్టుల మార్గానుకూలముగను లక్షణవిభాగముల నెరపుటవలన రుద్రటుని విభాగవైలక్షణ్యము విపులవిఖ్యాతి గాంచెను. ఇంతియేకాక రుద్రటాచార్యు డేకమతావ

లంబియు, నేకపథానువర్తియు నైనను, భామహోద్భటుల విభాగలక్షణముల నతిక్రమించి, స్వతంత్రసరణి జరించి, విశేషాంశముల వివరించి, అలంకారశాస్త్రాభ్యుదయమున కమితప్రయత్న మొనరించెనని మన కాతనిగ్రంథము బోధించుచున్నది.

రుద్రటుని శబ్దాలంకారముల బరిశీలించినచో నాతని వక్రోక్తి శ్లేషకాకుస్వరములపై నాధారపడియున్నది. దీనికిని ప్రాచీనుల వక్రోక్తికిని ఇంచుకంతయు పోలిక గన్పట్టదు. రుద్రటుని కాకు వక్రోక్త్యలంకారము పాఠధర్మత్వమున నాధారపడిన దనుకారణమున రాజశేఖరహేమచంద్రులు దీని నంగీకరింపలేదు. వీరు నిరాకరించినను, వామనుని వక్రోక్తిలక్షణమును పరిభవించి, కుంతలుని వక్రోక్తి జీవితము విజృంభించుదనుక రుద్రటుని వక్రోక్తి లక్షణ మే విక్రమించి మమ్మటాదినవీనుల లక్షణమునకు బీజమయ్యెను. మరియు రుద్రటుని అనుప్రాసలక్షణము, మధుర, పరుష, ప్రౌఢ, లలిత, భద్రములను పంచవిధముల వర్ణవృత్తిసమాశ్రితమై చెలంగును. ఇంక ఉద్భటుని మూడుతెరగుల అనుప్రాసములో వృత్త్యనుప్రాస మొక్కటియే పరుష, ఉపనాగరిక, గ్రామ్యము, లేక కోమలము లను వృత్తుల నాశ్రయించి మెలంగును. ఈ అనుప్రాసవిషయమున నూతనులు భట్టోద్భటు ననుసరింతురు భరతభామహులు యమకాలంకారము నత్యంతముగ వర్ణించినను, భట్టోద్భటు డేకతమునతో దీనిని నామమాత్రమునకైన స్మరింపలేదు. ఈకారంతను రుద్రటాచార్యుడు దీర్చివైచెను. అలంకారప్రభేదముల నిరువురును వేరుతెరవుల జరించినను, దండ్యాచార్యునితరువాత రుద్రటాచార్యుడే పరిపూర్ణపరిశీలనకు ప్రారంభించిన ప్రతిభావంతుడై ప్రసిద్ధిగాంచెను. చిత్రాలంకారములేనిచో మహాకావ్యమాహాత్మ్యము మాయమగునని

మాఘకవి మొరపెట్టినను భరత, భామహ, భట్టోద్భటులు చిత్రాలంకారవిషయము నేలనో కాని విస్మరించిరి. ఈ లోపమునుగూడ రుద్రటదండ్యాచార్యులే చక్కబెట్టిరి. చిత్రాలంకారభేదముల గొన్నిటిని దండ్యాచార్యుడు రచించెను. రుద్రటు డాతని తలదన్ని చిత్రాలంకారభేదము లశేషముగ వివరించెను. ఈ శబ్దచిత్రము నంతగా గౌరవింపకున్నను మమ్మటు డీసందర్భమున రుద్రటుని లక్ష్యముల నన్నిటిని సంగ్రహించెను. శబ్దాలంకారదోషముల బేర్కొనుచు, పునరుక్తము దోషముగాదని రుద్రటుడు లక్ష్యముల నెన్నిటినో ప్రదర్శించెను. ఈసందర్భములన్నియు ఉద్భటునిమతమున పునరుక్తవదాభాసములుగా జెలంగునని నమిసాధుడుగూడ వచించెను. అర్థాలంకారముగ శ్లేషను గణించి, ఉద్భటుడు దీనిని శబ్దార్థశ్లేషలని ద్వివిధముగ పరిగణించెను. ఈవిభాగమే నవీనుల మతమున అభంగసభంగశ్లేషలుగా వ్యవహరింపబడును. రుద్రటాచార్యుడన్నచో శ్లేషాలంకారము ప్రధానముగ శబ్దాలంకారమని వచించి, దీనికిని అర్థాలంకారశ్లేషకును గల విభేదమును చక్కగ విమర్శించి, అర్థాలంకారశ్లేషభిత్తికాసముపాశ్రితములైన విశేషాలంకారముల పండ్రెండింటిని నిరూపించెను. దీనికి వ్యతిరేకముగ వర్ణ, లింగ, ప్రకృతి, ప్రత్యయ, విభక్తి, వచనములుగా శబ్దాలంకారశ్లేషను విభజించి, 'ఇది శబ్దశ్లేషయా లేక అర్థశ్లేషయా?' అను నవీనాలంకారికుల తర్కవితర్కములను రుద్రటాచార్యవర్యు డవలీల నతిక్రమించెను.

ఇంక అర్థాలంకారదోషప్రకరణమున భామహాదులవలె ఏడు దోషములను, వామనునిరీతి ఆరుదోషములను వచింపక రుద్రటుడు వైషమ్యము, అసంభవము, అప్రసిద్ధము, సామాన్యశబ్దభేదములను

నాలుగు ఉపమాదోషములమాత్రమే విధించెను. ఈకడపటిదోషము
లింగ, వచన, కాల, కారక, విభక్తిభేదములవలన ఉపమానోపమేయ
ములకు సంభవించు శబ్దభేదమూలమైన సమస్తదోషములను సంగ్రహ
రూపమున నిర్వచించును. వైయాకరణమతానుసారముగ వాచక
లుప్తోపమాదిభేదముల నన్నిటిని భట్టోద్భటుడు వివరించెనని మన
మీవరలో దెలిసికొంటిమి. ఆభేదాంతరముల సరకుగొనక రుద్రటు
డన్నిటిని సముదాయముగ సమాసోపమాప్రత్యయోపమలలో గలిపి
వైచెను. వాక్కునకు ఉత్తమభూషణమై వెలుంగునని దండ్యా
చార్యుడు హేత్వలంకారము నెంత నుతించినను, వక్రోక్తివైచిత్ర్య
రహితమను హేతువున దానిని భామహాచార్యుడు నిరసించెనని
మనము వింటిమి. మరియు కావ్యలింగము, లేక కారకహేతువు,
అనుమానము, లేక జ్ఞాపకహేతువునను దండ్యాచార్యుల విభాగము
నందు, ఉద్భటుడు కావ్యలింగమునుమాత్రమే స్వీకరించి, దానికి
కావ్యహేతువని పేరిడి, దీనికిని కావ్యదృష్టాంతాలంకారమునకును
గల భేదమును స్పష్టమొనరించెను. దీని స్వభావస్వరూపముల విపుల
ముగ విమర్శించి, అర్వాచీనాలంకారికుల కందర కాదర్శప్రాయమైన
సంపూర్ణలక్షణము విధించిన సమర్థుడీరుద్రటాచార్యుడే. ఈరీతి నుదా
హరణముల గుణించుట గ్రంథబాహుళ్యసంపాదనకు దోడగుగాన
నింక ప్రస్తుతాంశమును విచారింతము. ఈవిషయములవలన భామహ
భట్టోద్భటుల మతమునకును, రుద్రటాచార్యుల మతమునకును విశేష
భేదము మనకు బుద్ధిగోచరమగుచున్నది. ఇంతియేకాక మనవాద
మును సమర్థించుట కెన్నియో నిదర్శనముల నిచ్చి, రాజానకరుయ్య
కుని వచనప్రమాణమునుగూడ నుదాహరింపగలము. కాని స్వప్రతిభా
విశేషమున నపూర్వకల్పనాతిశయమహిమాసమన్వితుండైన రుద్రటా

చార్యుడు స్వతంత్రరచనాభిలాషియై, విలక్షణవిమర్శన మొనర్చి సర్వాలంకారసంచయమును, వాస్తవ, ఔపమ్య, అతిశయ, శ్లేష సముపాశ్రితములుగ విభజించెననియో, లేక భామహ, భామహాను చరుల మతమునకన్న భిన్నమై వన్నెకెక్కిన అలంకారమతసంప్ర దాయానుసారముగనో తనగ్రంథమును రచించెనని మనము దలంప నగును. అలంకారము లసంఖ్య నభివృద్ధిచేయుటయే కాని రుద్రటుడు శాస్త్రప్రాశస్త్యమునకు ప్రయత్నింపడయ్యె. అలంకారశాస్త్రమును అలంకారమయ మొనర్చుటయేకాని, కావ్యాత్మతత్త్వవిచారము సల్పుట రుద్రటుని దృక్పథమున లేదనియే చెప్పవచ్చును. విభిన్న రచనావిశేషమువననో, కావ్యాత్మవిమర్శనరాహిత్యమువననో కాని రుద్రటపథానువర్తులు నవీనులలో గానరారు అందుచే అలంకార మతాచార్యులలో రుద్రటాచార్యుడే కడపటివాడు. ఈతనివెనుక అలంకారమతము రసరీతిమతములవోలెనే మహోన్నతధ్వనిమతమున లీనమగును.

---

(అలంకారసంఖ్యావృద్ధికారణములు; విభాగసూత్రవిభేదములు)

ఈ అలంకారమతాస్తమయము, రీతిమతాభ్యుదయము నించు మించుగ నేకకాలముననే సంభవించినట్లు గానవచ్చును. గుణాలంకార మతముల సాధనసంపత్తిమూలముననే రీతిమతసౌధము నిర్మింపబడెను. అలంకారరీతిమతముల మధ్యకాలముననే గుణమతము ప్రబలెను. అలంకారముల ప్రాధాన్యమును దండ్యాచార్యు డనుమతించినను, గుణముల కలంకారము లుపచరించి, మార్గానుకూలములుగా నుండునని వచించెను. గుణాలంకారములు కావ్యశోభాసంపాదకములైనను, గుణములు వైదర్భీమార్గమునకు ప్రాణములనియు, అలంకారములు

# కావ్యాత్మ - ప్రాచీనమతములు

వైదర్భీగౌడమార్గముల రెంటికి నుపయోగించుననియు దండ్యాచార్యుల మతము. దీనిని దోషముగాఁ గొని గుణములు నిత్యశోభాకరధర్మములనియు, అలంకారము లనిత్యసౌందర్యసంపాదకధర్మములనియు, గుణగణోపేతమైన కావ్యప్రాశస్త్యము నలంకారము లతిశయింపజేయుననియు వామనాచార్యుడు వక్కాణించి, రీతిమతమును ప్రతిపాదించెను. కాని ధ్వనిమతచంద్రోదయానంతరమున రససుధాసాగర మభంగతరంగపరంపరల నెల్లి విరిసి, వేలాతిక్రాంతగభీరఘోషణధ్వానముల, గుణాలంకారజనితకలకలస్వానముల ముంచివైచెను. అంతనుండియు గుణములు, సన్నిహితసంబంధమున రసము ననుగమించి, కావ్యనాటకముల కుత్కర్షను సంపాదించెను. ఇంక అలంకారములన్ననో, కటకహారాదులకైవడి పైపైవన్నెల బచరించి, బాహ్యోపస్కారకములై చెలంగుచుండెను. ఈవిషయములు రీతిధ్వనిమతములలో జర్చింపబడును. అందువలన గుణాలంకారములు రచనాసౌష్ఠవమునుమాత్రమే పెంపొందించి, శరీరసౌందర్యము నినుమడింపజేయుటచే అర్వాచీనులెల్లరు వీని నప్రధానముగ నెంచి, ప్రధానాంశపరిగణన మొనర్ప ప్రయత్నించిరని మనము దలంపవలయును. ఈ అలంకారములు దేని నలంకరించునని ప్రశ్నించి, ప్రాచీనులు యుక్తియుక్తముగ కావ్యదేహము, లేక కావ్యశరీరము నలంకరించునని సమ్మతించి, ఆవిధముననే గుణములు కావ్యగుణములుగా భావించిరేకాని, కావ్యజీవము, కావ్యాత్మలను, గురించి వారు విమర్శింపప్రయత్నించినట్లు సూచనలేవియు గానరావు. స్వతంత్రమతస్థాపనాసమర్థులైన దండివామనులు గూడ అలంకారమతనిరంకుశాధికారమునకు విధేయులై, శిరములు వంచి, కరములు జోడించి వర్తించిరని వారి గ్రంథములందలి అలంకారలక్షణప్రకరణములే సాక్ష్యమొసంగుచున్నవి. ఆనందవర్ధనా

చార్యు డొక్కడే అలంకారమతశాసనోల్లంఘన మాచరింప సమకట్టిన మహాత్ముడు. ఆతనితరువాతివార లాతని స్వతంత్రపక్షమున సంచరింప సమర్థులు గారైరి. మమ్మటాదినవీనమత ప్రతిష్ఠాపకులు సహితము రసధ్వనిస్వరాజ్యసంస్థాపన కమితోత్సాహావేశపూరితచేత స్కులైనను, తమతమ గ్రంథరాజములందు అలంకారమతసహాయాభిలాషమును ప్రకటించు లక్షణములనుమాత్రమే శాసించిరి. పెద్దల త్రోవనే పిన్నలుగూడ నడచుటంజేసి అలంకారము లసంఖ్యాకములనంతములుగ నభివృద్ధిజెంది, రానురాను అలంకారశాస్త్ర మన్వర్థాభిధానసంపన్న మయ్యెను.

ఈ అలంకారము లే ప్రకారమున నభివృద్ధినొందినదియు మన మొకదృష్టాంతమును దిలకించినచో తేటపడును. వనితావదనసౌందర్యమును పరిపరివిధముల వర్ణించిన వివిధాలంకారములుగ బరిణమించును. ఈవిషయమున ఆలంకారికు లందరు నంగీకరించిన సామాన్యోదాహరణమును జేరొ్కందము:

I. "చంద్రునివలె నీమోము వెలుంగును" అన్నచో ఉపమానాలంకారము. ఈ సాదృశ్యమూలకమైన ఉపమాలంకారమే ఉక్తిభంగీభేదమున ననేకాలంకారభావమును భజించును. ఎట్లనగా—

II. ౧. "చంద్రునివలె మోము, మోమువలె చంద్రుడు గలడు" అనినచో ఉపమేయోపమాలంకార మగును.

౨. "మోము మోమువోలె నున్నది" అనినచో అనన్వయము.

3. "మోమువోలె చంద్రుడు గలడు" అనిన ప్రతీపము.

౪. "చంద్రుని గాంచినంతనే ముఖమును స్మరించితిని" స్మరణాలంకారము.

౫. " మోమెసుమా చంద్రుడు " అనినచో రూపకము.

౬. " ముఖచంద్రునివలన తాపము తగ్గును " అనిన పరిణామము.

౭. " ఇది మోమా, లేక చంద్రబింబమా ? " అనిన సందేహము.

౮. " చంద్రుడని చకోరములు నీమోముదెస పరువెత్తును " భ్రాంతిమంతము.

౯. " చంద్రుడని చకోరములు, సరోజమని చంచరీకములు నీమోమును దలంచును " అనినచో ఉల్లేఖాలంకార మగును.

౧౦. " ఇది చంద్రబింబము; మోముగాదు. " అనినచో అపహ్నవాలంకారము.

౧౧. " ఇది నిజముగ చంద్రబింబమే " అనినచో ఉత్ప్రేక్షాలంకారము.

౧౨. " చంద్రబింబమే ఇదిసుమా " అనినచో అతిశయోక్త్యలంకారము.

౧౩. " ఈమె మోముచే చంద్రకమలముల జయించెను " తుల్యయోగిత.

౧౪. " రేల జాబిల్లియు, నీమోమును నాకు మోదము గూర్తురు " దీపకము.

౧౫. " నీమోముగాంచ నా కానందము, చంద్రునిగాంచ చకోరముల కానందము గలుగును " అనినచో ప్రతివస్తూపమాలంకారము.

# అలంకారమతము - అలంకారసంఖ్యావృద్ధికారణాదులు

౧౬. "అంబరతలమున చంద్రుడు; అవనీతలమున నీముఖము" దృష్టాంతము.

౧౭. "మోము చంద్రసంపదల బొందెను" అనిన నిదర్శనాలంకారము.

౧౮. "కళంకము లేని నీమోము చంద్రుని మించెను" వ్యతిరేకాలంకారము.

౧౯. "రాత్రుల ప్రీతిగూర్చుట చంద్రుడు నీమోమునకు సాటి" సహోక్తి.

౨౦. "నేత్రాంకరుచిరమై, స్మితజ్యోత్స్నపశోభితమై నీ మోము గానవచ్చును" అనినచో సమాసోక్త్యలంకారమగును.

౨౧. "హరిణాహితసక్తివక్త్రి మబ్జసదృశము" అనిన శ్లేషాలంకారము.

౨౨. "నీమోముముందర చంద్రుడు కాంతిహీనుడు" అప్రస్తుతప్రశంస.

ఈరీతిగా ఉపమాశైలూషియే చిత్రభూమికాభేదమును బొంది కావ్యరంగమున నృత్యమొనర్చుచు, రసికజనమనముల నలరింప జేయును. మరియు పూర్ణలుప్తోపమావిభాగములు, వాక్య, సమాస, ప్రత్యయ, విశేషగోచరములై శబ్దశాస్త్రవ్యుత్పత్తికౌశలప్రదర్శన మాత్రప్రయోజనములుగా భాసించునేకాని, వేరొండు ప్రకాశమును సంపాదింపజాలవనుభావమును చిత్రమీమాంసాకారుడు ప్రకటించెను.

వివిధాలంకారికులును ప్రత్యేకముగ దాము వేర్వేరలంకారముల నైజస్వరూపలక్షణముల రచించునప్పుడు భిన్నభిన్నాభిప్రాయములనే

ప్రకటించిరి. భావనాసంపద ప్రబలినకొలందియు, విమర్శనా వివేకము వృద్ధిజెందినప్పటినుండియు అలంకారప్రయోజనస్వరూప ముల సూక్ష్మసూక్ష్మతరసూక్ష్మతమభేదప్రభేదవిభేదములు పెం పొందె, లక్షణరచనావసరమున వివిధాచార్యుల దృక్పరిసారము భిన్నభిన్నమార్గముల సంచరించియుండును. సర్వాలంకారవంశవృక్ష మును, శాఖోపశాఖాసంచయంబుతో పత్రపుష్పఫలసమేతంబుగ మన గ్రంథోద్యానవనంబున నాటి, నీరువోసి, పెంచుటకు స్థలసమయ పరిస్థితు లనుకూలింపవు. కావున ప్రస్తుత మొండురెండు లక్ష్యముల గాంచి సంతసింతము. ఆక్షేపాలంకారమునకు పలువురు పలువిధముల లక్షణము విధించిరి. వామనుడు 'ఉపమానాక్షేప మే ఆక్షేపాలం కారము'గా భావించెను. ఈసూత్రమునకు 'ఉపమానాక్షేప మని వచో ప్రతిషేధమనియు, తుల్యకార్యార్థమునకు నైరర్థక్యము వివ క్షితమనియు' వృత్తిని రచించెను. వస్తువర్ణన మొనర్చుటచేతే ఉప మానమును జేర్కొనుట ప్రయోజనకారి కానేరదను తలంపున ఉప మానమును నిరసించుటయే ఆక్షేపాలంకారమునందలి విశేషము. ఈ అలంకారమున విశేషార్థముకు బ్రకటించుటకై సామాన్యముగ ఉపమానమును నిషేధింతురు. ప్రాచీనుల మతమున నుదాహరింప బడిన ఆక్షేపాలంకారము ఆధునికుల మతమున ప్రతీపాలంకారముగా మారెను. పైసూత్రమునకు 'ఉపమానముయొక్క ఆక్షేపత, అనగా ప్రతిపత్తి' యనిగూడ సూత్రార్థమని వామను డింకొకవిధమున వివ రించెను. దీనివలన ఉపమానమునకు ప్రతీతి గలిగినచో మనము ఆక్షే పాలంకారముగా భావింపవచ్చును. అట్లు భావింపబడినప్పు డిది సమాసోక్త్యలంకారమగును. ఇంక దీనికి భిన్నముగ 'ప్రతిషేధో క్తియే ఆక్షేపాలంకారము' అని రచింపబడిన దండ్యాచార్యుల లక్ష

ణము నిరవధికముగా నున్నది. ఈలక్షణమునందు ప్రతిషేధము, మనము చెప్పినదానికిని (ఉక్తమునకు), లేక మనము చెప్పదలచిన దానికిని (వక్ష్యమాణమునకు) మాత్రమే సంబంధింపదు. ఈప్రతిషేధము దేనికి సంబంధించినను సంబంధింపవచ్చును. దండ్యాచార్యుల లక్షణము రీతినియమరహితముగాక, భామహభట్టోద్భటమమ్మటాచార్యుల లక్షణములు నియమసహితముగా, అనగా ఉక్తవక్ష్యమాణముల విషయముననే ప్రతిషేధము వర్తించునని చెప్పును. రుయ్యక, విద్యాధర, విశ్వనాథులు భామహాదుల లక్షణము ననుసరించినను 'అనిష్టవిధ్యాభాసమందుగూడ ఆక్షేపాలంకారమే వర్తించు'నని పక్షాంతరమును గల్పించిరి. ఈసందర్భమున పండితరాయల పలుకులు సమంజసములుగా నున్నవి. 'ఇతరులన్నచో నిషేధమాత్ర మాక్షేపమనియు, అలంకారసామాన్యలక్షణప్రాప్తమై చమత్కారత్వ ముండుననియు, అది వ్యంగ్యార్థమున్నచో సంభవించుననియు, ఆవ్యంగ్యమే నిషేధమనియు, కావున సర్వముంగూడ ఆక్షేపాలంకారమే' యని జగన్నాథపండితుడు రసగంగాధరమున రచించెను. ఇందు వ్యంగ్యనిషేధమను తృతీయపక్షము సమ్మతింపబడెను. ఇచట విశేషార్థము ప్రతీయమానమగుటవలన ధ్వనిమతసంప్రదాయానుసారమై ఆక్షేపాలంకారము దీపించును. ఈఆక్షేపాలంకారమున వాచ్యార్థము ప్రధానముగను, వ్యంగ్యార్థ ముపసర్జనముగను ఉండుటంజేసి, గుణీభూత వ్యంగ్యమను మధ్యమకావ్యముగా దీనిని గణింతురు. ఈకారణముననే కాబోలు 'ధ్వనివలన వ్యజ్యమానమగుటచే నిది ఆక్షేపధ్వని' యని అగ్నిపురాణము వచించెను. ఈఉదాహరణమువలన ఆలంకారికు లెంత సవిమర్శముగ, సమగ్రముగ నలంకారభేదప్రభేదముల వివరించిరో చదువరు లెఱుంగగలరు. ఈరీతినే ఉపమాలంకారమును, ప్రాణ్ణో

పమ ఆరువిధములనియు, లుప్తోపమ కొందరు పందొమ్మిది తెరగులు, మరి కొందరు ఇరువదిరీతులు, వేరుగా కొందరు ఇరువదియొక్క భేదములు, ఇంక కొందరు ఇరువదియేడుమార్గములుగాను విభజించిరి. మరియు ఉత్ప్రేక్షాలంకారము ముప్పదిరెండువిధములనియు, వ్యతిరేకాలంకారము నలువదియెనిమిది తెరగులుగాను, విరోధాలంకారము పదితెరగతులుగను వివరింపబడెను. ఇటుల కాలక్రమమున అలంకారవిభేదములుగాక, ప్రత్యేకాలంకారముల సంఖ్యయే నూరు, నూటఇరువదివరకు పెరిగి, నవీనాచార్యుల అలంకారసర్వస్వ, చంద్రాలోక, కువలయానందాదిస్వతంత్రగ్రంథముల రచన కవకాశము గలిగించె.

ఇట్లుకాక సాధారణధర్మము ననుసరించి అలంకారములను శబ్దాలంకారములు,అర్థాలంకారములునను రెండువిధముల రుద్రటాదులు విభజించిరి. మరికొంతకాలమునకు శబ్దార్థాలంకారము అనుమూడవ తరగతి బయలుదేరెను. ఈవిభాగము అగ్నిపురాణముననే మొదట గానవచ్చును. పిదప దీనిని భోజుడు సరస్వతీకంఠాభరణమున చేర్చెను. ఈవిభాగమునకు గల ఆవశ్యకతను, ఔచిత్యమును గురించి వాదప్రతివాదములు ప్రబలెను. 'ఏ అలంకారము దేనినాశ్రయించి మెలంగునో, అది ఆ అలంకార మనబడు'నను సూత్రముపై నీవిభాగ మాధారపడియుండును. అనగా శబ్దము ప్రధానమైన శబ్దాలంకారమనియు, అర్థము ప్రధానమైనచో అర్థాలంకారమనియు వ్యవహరింపబడెను. ఈ 'ఆశ్రయ ఆశ్రయిసంబంధము' నంగీకరింపనివార లెందరో గలరు. ఈశబ్దార్థవిభాగము అన్వయవ్యతిరేకములపై నాధారపడియుండవలయుననియు, ఒకానొక అలంకారము పరివృత్తిసహత్వముం గలిగియున్నదా, లేదా ? అను విషయనిర్ణయసూత్రముచేతనే విభాగ మొనరింపవలయుననియు మమ్మటాదులు వివరించిరి

## అలంకారమతము-అలంకారసంఖ్యా వృద్ధికారణాదులు

ఒకశబ్దమునకు పర్యాయపదమును ప్రయోగించినంతమాత్రముననే అలంకార మదృశ్యమైనచో నది శబ్దాలంకారమనియు, కానిచో నది అర్థాలంకారమనియు భావము. కావుననే శబ్దాలంకారముల సంఖ్య వృద్ధినొందలేదు. భోజుని మతమున ఇరువదినాలుగు శబ్దాలంకారములే కలవు. ప్రాచీనార్వాచీను లెంతపాటుపడిన నీసంఖ్య నతిక్రమింప జాలరైరి. శబ్దవైచిత్ర్యము రసవిరోధక మనుకారణముచేత ఆనంద వర్ధనమమ్మటాద్యాఘనికులు శబ్దాలంకారముల గౌరవింపలేదు. అర్థాలంకారములవిషయమున వీరు చాల కృషిసల్పిరి. అందువలన వీని సంఖ్య విచ్చలవిడి పెరుగజొచ్చెను. భరతుడు అర్థాలంకారముల నాలుగింటినిమాత్రమే రచించెను. భామహోద్భటవామనులు ముప్పది నలువదివరకు విరచించిరి. రుద్రటునికాలమున అరువదియెనిమిది వరకు పెరిగెను. ఇదియే తుదిమెట్టు. ఇంతనుండియు వానిసంఖ్య సన్న గిలజొచ్చెను. భోజమమ్మటరుయ్యకాదుల కాలమున అర్థాలంకార ప్రవాహము పోటునకు దిరిగెను. ఈసమయముననే చంద్రాలోకము సంభవించెను. వెనువెంటనే ప్రవాహమునకు పోటు ప్రారంభమయ్యెను. తరువాత కువలయానందసందర్భనమున అర్థాలంకారములు శతాధిక సంఖ్యాసముపేతము లయ్యెను. తానుగూడ ప్రవాహపతితుడై, పంకిలశరీరుడైనను, పాపము! దండ్యాచార్యుడు ఒక్కొక భేదవిశేష మున కొక్కొక పేరు పెట్టినచో నలంకారము లసంఖ్యాకము లనంతము లగునని మనకు నుపదేశించెను. కాని నవీను లీతని పలుకుల పెడ చెవింబెట్టిరి. దండ్యాచార్యుడు, అర్థాలంకారములను స్వభావోక్తి వక్రోక్తులను రెండుకత్యులుగ చేర్పరచెను. ఔపమ్యమే సర్వాలంకారములకును ప్రధానసూత్రముగా వామనుడు భావించెను. రుద్రటుడు వాస్తవ, ఔపమ్య, అతిశయ, శ్లేషలను భిత్తిచతుష్టయము నంగీక

రించెను. అర్థాలంకారవిభాగమున మమ్మటునకొక సూత్రము న్నటు లించుకేనియు గానుపించదు. ఔపమ్య, విరోధ, శృంఖలా, న్యాయ, గూఢార్థప్రతీతి, సంసృష్టి, సంకరములను తంతువట్ల మును రాజానకరుయ్యకు డుపయోగించెను. విద్యాధర, విశ్వనాథు లీ విభాగమునే స్వీకరించినను, న్యాయవిభాగమును తర్క, వాక్య, లోకన్యాయములను మూడువిధముల విభజించిరి. మరియు విద్యానాథుడు ఔపమ్యమును సాధర్మ్యమని వ్యవహరించుటయేకాక, అధ్యవసాయము, విశేషణవైచిత్ర్యములను రెండు క్రొత్తవిభాగ సూత్రముల వచించెను. ఈశబ్దార్థాలంకారములను, వీనివిభాగసూత్రముల నింక నటుండనిచ్చి, మనము వేరొక ముఖ్యాంశమును గమనించవలయు. అదియేమనగా, నవీనాభిప్రాయవిశేషములు కావ్యాలంకారములవిషయమున నాలంకారికుల మనముల మొలకలెత్త నారంభించెను. ఈకావ్యాలంకారములు కొంతవరకు వాచ్యాలంకారములతో తులదూగుచున్నను, వీని కొకవిధమైన వైచిత్ర్యమును, విచ్ఛిత్తిని నూతనముగా లాపాదింప మొదలుపెట్టిరి. ఈవిచ్ఛిత్తివైచిత్ర్యములు కవిప్రతిభాకౌశలములపై నాధారపడి కావ్యాలంకారముల కపూర్వకామనీయకరామణీయకముల సంపాదించునందురు. ఈఅభిప్రాయలతాంకురమును దొలుత రాజానకకుంతలాచార్యుడు నాటెను. అవల రాజానకరుయ్యకజయరథాదులు నీరిడి, పెంచి ప్రత్యేకాలంకారములరూపమున పూచి, ఫలింపజేసిరి. వీని నాయాస్థలముల వివరింపనెంచి ప్రస్తుతమలంకారమతచరిత్రమును ముగింతము

---

# కావ్యాత్మ

## ప్రాచీన మతములు

---

### 3. గుణమతము

(భాషారచనావిభాగము : గుణగణప్రాచుర్యము-దండి)

భామహ, భట్టోద్భట, రుద్రటాదికళాదకరకౌశలమున నిర్మింపబడిన సువర్ణమయ శబ్దార్థచిత్రాలంకారబాహ్యభూషణభూషితాంగియై, 'నడుమంత్రపు గల్మి బల్మి నిక్కుచు నీల్గుచు విఱ్ఱవీఁగుచున్న' కవితాయువతీమణిం జేరఁజీరి, తండ్రియై దండ్యాచార్యవర్యుఁడు, మున్ను మునిచంద్రుఁడు గరపిన ప్రసాదమాధుర్యాదిగుణగణమణినికరామూల్యతను స్మరణకుం దెచ్చి, మరల మఱువరాని తెఱంగున బుద్ధి జెప్పెను. అనఁగా దండ్యాచార్యులకాలమున నలంకారముల ప్రాధాన్యముకన్న గుణముల కాదరము హెచ్చెనని మన మెఱుంగవలయును. అలంకారమతాభిమానియైన భామహాచార్యులతరువాత గుణమతప్రతిపాదకుఁడైన దండ్యాచార్యుఁడు వెలసెను. మరియు గుణమతము నూతఁగాఁ గొని రీతిమతము జనింపజేసిన వామనాచార్యుఁడు, దండ్యాచార్యుల కనంతరమున నుద్భవించిన భామహవివరణకారుఁడు, అలంకారమతప్రదీపకుఁడు నైన భట్టోద్భటునకు సమకాలీనుఁడుగా వెలంగెనని మనము భావింపవలయును. భామహునివెంటనే దండ్యాచార్యులగురించి రచింపవలసియున్నను, భట్టోద్భటరుద్రటు లలంకారమతాను

సారు లగుటం జేసి వీరల కాలక్రమమును గణుతింపక స్వతంత్రమత ప్రతిపాదనమును మాత్రమే గమనించి వారివారల సమన్వయవ్యతిక్రమ మొనరించినందులకు సహృదయులు క్షమింపవలయును.

వైదర్భిగౌడకావ్యభేదమును భామహాచార్యులు పరిహసించి నిరసించినకారణమున రీతిమతము భామహునకుపూర్వమే ప్రచారమున నున్నదని మన మనవచ్చును. దీనికివోడుగా 'ఉదీచ్యులలో శ్లేషప్రాయము, ప్రతీచ్యులలో అర్థమాత్రకము, దాక్షిణాత్యులలో ఉత్ప్రేక్షావచనము, గౌడులలో అక్షరడంబరము' ను గానవచ్చునని బాణకవీంద్రుడు వచించుటచే నీరీతివిభేద మాతనికన్న మున్నే కలదని చెప్పవచ్చును. దండ్యాచార్యుడుగూడ వీరివోలె గౌడమార్గమునకు విముఖుడయ్యెను. ఈమార్గములు, రీతులు నను పేరు లలంకారశాస్త్రమున చిరపరిచితములు గాకున్నను, వీని ప్రశంసాప్రయోజనములుమాత్రము క్రొత్తలని చెప్పజాలము. ఏలనన దండివామనుల గ్రంథములలో పూర్వుల ప్రమాణవాక్యములు గొన్ని మనకు గానవచ్చుచున్నవి. కావున రీతిమతమునకుగూడ స్వతంత్రసంప్రదాయచరిత్రములు గలవనియు, రసాలంకారధ్వనిమతములతో సాటిగ గుణరీతిసోదరమతములు సైతము చాలకాలమునుండియు తమతమ వృద్ధికై పాటుపడజొచ్చెననియు గమనింపవలయును.

అలంకారమతాధికారమునకు దండ్యాచార్యుడు లోనయ్యెననియు, దానికతమున నీత డలంకారరీతిమతములకు మధ్యవర్తియై మెలంగెననియు మే మీవరలో జెప్పియుంటిమి. అలంకారరీతిమతముల సంధిసమయమున గుణమతము ప్రబలెననుటచే దండ్యాచార్యు డలంకారమతము నొదలబూనెనని మనము దలంపరాదు. శాస్త్రసంప్రదాయపరిశీలనమున నీతడు పూర్వాచారపరాయణుడుగాక, నవీన

మార్గావలంబకుడై రీతిమతరచనకు దారిజూపెనని మనము భావింపవలయు. దండ్యాచార్యుల కాలమున మీలితావస్థనున్న గుణమతకోరకము వామనాచార్యుల సమయమున రీతిమిళితకుసుమముగా వికసించి, కావ్యోద్యానవనమును మందమధురరచనాసురభికృతము గావించి, సహృదయమలయానిలకుమారపరీవృత మొనరించెనని పలుకవచ్చును. అందుచే గుణరీతిమతముల సంప్రదాయము లలంకారమతశాసనములసరణి సందిగ్ధావస్థనుండి సంశయగ్రస్తములుగా లేవు. కావుననే గుణములే ప్రాణములని దండ్యాచార్యుడును, రీతియే కావ్యాత్మయని వామనాచార్యుడును నూతనమతముల నెలకొల్పసాహసించిరి. పదలాలిత్యసంపదల వెదజల్లు శ్లోకముల దండియు, సారవంతములు, విశ్వతోముఖములు, స్వల్పాక్షరసమన్వితములు నైన సూత్రముల వామనుడును గుణరీతిమతముల నసందిగ్ధముగ, నస్తోకముగ, ననవద్యముగ ప్రతిపాదించిరి. ధ్వనిమతము ప్రబలునంతదనుక వీని ప్రభుత్వ మలంకారశాస్త్రమున నిరంకుశముగ సాగెను.

కావ్యసాధారణవిషయములలో పూర్వాచార్యులకును, దండ్యాచార్యునకును అంతగా భేదము గానరాదు. వారితోపాటు దండియు కావ్యశరీరమైన శబ్దార్థములకు శోభను సంపాదించుటకే ప్రయత్నించెను. దండ్యాచార్యుల సర్గబంధాదికావ్యవిభాగము భామహుని విభాగముతో నించుమించుగా నేకీభవించును. దండ్యాచార్యుడు పద్యకావ్యమును ఐదువిధములుగను, గద్యకావ్యమును మూడుతెరగులుగను విభజించెను. పద్యసంఘటనము—

౧. సర్గబంధము, లేక మహాకావ్యము.

౨. ముక్తకము (ఒకపద్యము).

౩. కులకము (ఐదుపద్యములు).

౪. కోశము (ఒకదాని కింకొకదానికిని సంబంధములేని అనేక కవుల పద్యములు).

౫. సంఘాతము (ఒకదానికి వేరొకదానికిని సంబంధములేని ఒకేకవి రచించిన పద్యముల సముదాయము).

ఇంక గద్యరచనము- ౧. కథ, ౨. ఆఖ్యాయిక, ౩. చంపువులన జెలంగును. ఈ సందర్భమున వామనుడు పద్యగద్యములు నిబద్ధములు, అనిబద్ధములు నని రెండువిధముల నిరూపించి, పద్యము పలుతెఱంగులనియు, గద్యము ౧. వృత్తగంధి, ౨. చూర్ణము, ౩. ఉత్కలికాప్రాయమునని మూడువిధముల విభజించెను. ఆఖ్యాయికా కథల విషయమున భామహదండ్యాచార్యులకు గల భేదాభిప్రాయముల నీవరలో సూచించితిమి. మరియు నీకథను ౧. ఆఖ్యానము, ౨. నిదర్శనము, ౩. ప్రవహ్లికము, ౪. మతల్లికము, ౫. మణికుల్యము, ౬. పరికథ, ౭. ఖండకథ, ౮. సకలకథ, ౯. ఉపకథ, ౧౦. బృహత్కథలని పదివిధముల నాలంకారికులు వేర్కొనిరని హేమచంద్రుడు కావ్యానుశాసనమున వచించెను. వీనిలో పరికథ, ఖండకథ, సకలకథలను మూడుతెరగుల కథలనుమాత్రమే ఆనందవర్ధనాచార్యు డంగీకరించెను. కావ్యము రచనావిశేషము ననుసరించి పద్యము, గద్యము, మిశ్రములనియు, భాషావిభాగము నాశ్రయించి సంస్కృతము, ప్రాకృతము, అపభ్రంశము, మిశ్రములనియు దండ్యాచార్యుడు వచించెను. ఈరెండుభాగములలో గల మిశ్రకావ్యద్వయమును, అనగా గద్యపద్యమిశ్రము, భాషామిశ్రములనువానిని భామహుడు సమ్మతించలేదు. ఈ వాఙ్మయమున మహర్షులు సంస్కృ

తమును దేవభాషగా వ్యవహరింతురనియు, తద్భవతత్సమదేశ్యములను ప్రాకృతముగా పేర్కొందురనియు, ఆభీరాదుల భాషను అపభ్రంశమని పిలుతురనియు దండ్యాచార్యుడు వచించెను. సంస్కృతమును శాస్త్రములలోను, అపభ్రంశమును తదితరములందును ప్రయోగింతురు. మ్లేచ్ఛశబ్దోపచారమై వెలయుటవలన నపభ్రంశము జాతిభాషయేగాని దేశభాషగాదని దండ్యాచార్యుల భావము. ప్రాకృతమే అపభ్రంశమని నమిసాధుడు సంగ్రహముగ బలికెను. అపభ్రంశమునందు గ్రామ్య-అపభ్రంశమని వేరొకవిధ మున్నదని హేమచంద్రుడు నుడివెను. ఈభాషారచనావిభాగ సూత్రముల సంయోగమున నాల్గువిధముల కావ్యము లుదయించెను. సర్గబంధమును సంస్కృతమునను, స్కంధకమును ప్రాకృతమునను, ఓసరమును అపభ్రంశమునందును, నాటకమును మిశ్రభాషలోను రచింపవలెనను నియమ మేర్పడెను. శ్రవ్యప్రేక్ష్యకావ్యములను ప్రాచీనవిభాగమును పేరునకుమాత్రము దలంచి దండ్యాచార్యు డంతట మార్గప్రకార ప్రదర్శనమునకు ప్రారంభించెను.

ఈపైన వివరించినవన్నియు నలంకారశాస్త్రమందలి సాధారణవిషయము లగుటచే సర్వమతములవారి గ్రంథములలో నొకేవిధమున జర్చింపబడును. కావున వామనాదులుగూడ మొదట కావ్యవిశేషములు, కావ్యాంగములు, అధికారినిరూపణము మొదలైనవానిని గురించి రచించిరి. అటులనే దండియు కావ్యసామాన్యవిషయముల వచించి, విశేషాంశముల విమర్శించుటకు బూనెను. ప్రాచీనులపగిదినీత డలంకారములు కావ్యశోభాకరధర్మములని సాధారణలక్షణము రచించినను, దానితో తనివినొందక కావ్యాలంకారబీజ మేదియనియు, కావ్యశరీరసౌందర్యసంపాదకములు గుణములనియు, గుణగణము

వాగ్విచిత్రమార్గానుకూలమనియు నుతించెను. ఈమార్గనిర్మాణమునకు ప్రా ణ్యమువలననే కవిప్రతిభాప్రభావము గానవచ్చును. ఇందుచేతనే దండ్యాచార్యుడు, అలంకారరీతిమతములకు మధ్యస్థమైన మార్గము ననుసరించె నందురు. అలంకారముల ప్రాధాన్యమును గుణములదెస నీతడు మరలించుటవలన మార్గము నిష్కంటకమై చెలంగెను. అంతట వామనాచార్యుడు రీతిమతమును నిరాతంకముగ నెలకొల్ప సమర్థుడయ్యెను. దండివామనులకు గల తరతమభేదముల విశదముగ బరిశీలింపక, కొందరు వీర లిరువురును రీతిమతావలంబకులేయనియు, మరి కొందరు దండ్యాచార్యుడుగూడ అలంకారమతానుసారియే యనియు వచింతురు. దండ్యాచార్యుడు రీతిపదమును గ్రంథమునం దెచ్చటను బ్రయోగింపకున్నను, తుల్యార్థదాయకమగు మార్గము, వర్త్మములను శబ్దముల నుపయోగించుటచే నీతడు రీతిమతావలంబకుడని భ్రమించి యుందురు. ఇతరులు దండి కావ్యాదర్శమున విశేషభాగ మలంకారములగురించి ప్రశంసించెనుగాన నీతడు అలంకార మతాభిమానియని భావించియుందురు. వీరి కనుకూలముగ దండ్యాచార్యుల కావ్యలక్షణము జెలంగు నందురు. 'ఇష్టార్థవ్యవచ్ఛిన్నమైనపదావళియే కావ్య'మని దండి వచించెను. ఈ కావ్యలక్షణము స్థూలదృష్టికి సగ మలంకారమయముగను, సగము రీతిపరముగను గన్పించునుగాని సూక్ష్మదృష్టి వీక్షించినచో కేవలగుణాత్మకమై వెలుగొందును. కవిప్రతిభోల్లాస విషయీభూత చమత్కారపూరితపద సముదాయముచే సరసమనోహరార్థముల వర్ణించుటయేయని దండ్యాచార్యుల లక్షణమునకు తాత్పర్యమై చెలంగును. ఇదియే కావ్యశరీరమై మెలంగును. దీనిని సంపాదించుటకు విచిత్రమార్గములు రెండుగలవనియు, ఈవైదర్భ గౌడమార్గములలో మొదటిదానికి పదిగుణములు ప్రాణములనియు

దండ్యాచార్యుడు స్పష్టముగ బలికెను. ఇట్లు వచించుటవలన నీత డెంతమాత్రమును రీతిమతానుసారి గాడని తేటపడుచున్నది. ఇంక అలంకారమతాచార్యులకును దండ్యాచార్యునకును గల విశేషభేదము నీవరలోనే వివరించితిమి. కావున దండ్యాచార్యుని మతము అలంకారమతమునకన్న భిన్నమై, రీతిమతమునకన్న భిన్నమై, వన్నెలొలుకు గుణమతముగా మనము గణింపవలయును. మరియు గుణములే ప్రాణములై వెలుంగుచున్న వైదర్భ మార్గమునకును, వీని విపర్యయముల ప్రభావమున ప్రకాశించు గౌడవర్త్మమునకును ప్రస్ఫుటాంతరము గలదని పలికి, దానిని విపులముగ వివరించి దండ్యాచార్యుడు గుణవిపర్యయములస్వరూపమును విలక్షణముగ విమర్శించి ప్రదర్శించెను. ఈ మార్గద్వయమున వైదర్భమార్గమనినచో నాతనికి విశేషాదరమున్నట్లు గానవచ్చును. గుణములగురించియు, వైదర్భగౌడ కావ్యభేదములగూర్చియు భరతభామహాదులు ప్రస్తావవశమున వచించిరేకాని, దండ్యాచార్యులవలె నివియే ప్రధానములు, ప్రాణప్రాయములు అని వినుతించి నవీనమతమును స్థాపించుటకు నేర్వరైరి.

---

(దశవిధగుణస్వరూపనిరూపణము - మార్గద్వయవిభేదనిర్వచనము)

పరస్పర సూక్ష్మభేదములుగల వాగ్రచనాప్రకారము లనేకములున్నవనియు, వీనిలో వైదర్భగౌడమార్గముల జంటయే ముఖ్యమనియు దండ్యాచార్యుడు వచించెను. ఈరెంటిలో వైదర్భమార్గమునకు పదిగుణములును ప్రాణము లనియు, ఈ గుణవిపర్యయము ప్రాయికముగ గౌడవర్త్మమున గాన్పించు ననియు నతడు వచించెను. శ్లేషప్రసాదాది గుణగణముల భేదములను, గుణవిపర్యయముల స్వభావ

మును చదువరులు గురుతించుటకు దండ్యాచార్యుడు వీని కిచ్చిన లక్ష్యలక్షణముల భావము నిట వివరింతును:

౧. అస్పృష్టశైథిల్యమై "శ్లిష్టము" లేక "శ్లేషగుణ"ముండు నందురు. శిథిల మనగా అల్పప్రాణాక్షరోత్తరము. కావున అసం యుక్తాల్ప ప్రాణాక్షరబహుళ్లమై శ్లేషగుణము భాసించును. శ్లిష్టమును లేక శ్లేషను వైదర్భమార్గావలంబకులును, దీనివిపర్యయమైన శైథిల్యమును అనుప్రాసప్రియు లైన గౌడవర్త్మానుసారులును స్వీకరింతురు. ఉదాహరణములు: శ్లేష - మాలతీదామము భ్రమర సంఘలంఘిత మయ్యెను. శైథిల్యము - మాలతీమాల లోలాలికలిల మాయెను.

౨. ప్రసిద్ధార్థప్రతీతి గలచోట "ప్రసాదగుణ" మందురు. అర్థము వెంటవెంటనే బోధపడి చదువరుల మానసములకు సంతోష ము గలుగును. ఈ గుణమునకు విపర్యయము "వ్యుత్పన్నము". వైదర్భ మార్గమున ప్రసాదగుణమును, గౌడవర్త్మమున వ్యుత్పన్నమును గాన వచ్చును. వ్యుత్పన్న మనగా వ్యుత్పత్తియుక్తము. ఈ గుణవిపర్యయ మునందు గాఢబంధవైచిత్ర్య ముండుటచే దీనిని గౌడీయు లాదరింతురు.

ఉదా: ప్రసాదము - ఇందీవరకాంతుల నీను కళంక మిందుబిం బమున కనూన సంపదల సంపాదించెను. వ్యుత్పన్నము - అనత్యర్జు నాబ్జన్మసదృక్షాంక వలక్షుగుడై చంద్రుడు వెలుంగుచున్నాడు.

ఇచట అర్జున మనగా ధవళవర్ణమునకు పేరు. అతి అర్జునము కానిది అనత్యర్జునము. అబ్జన్మ మనగా నీట బుట్టినది, కమలము; దానిని బోలిన కళంకము. వలక్షు మనగా తెల్లనిరంగు. గోవులనగా కిరణములు. వీనిని గలిగి చంద్రుడు ప్రకాశించుచున్నా డని కవి

భావము. ఈ ఉదాహరణ మర్థమగుటకు విశేషముగ వ్యుత్పత్తియు, సమగ్రముగ సాహిత్యమును చదువరుల కుండవలయును. ప్రసాదగుణ మునందువలె కవిభావ మిా విపర్యయమున చదువరులకు సుగమము గాదు. ఈలక్ష్యమున ప్రయోగింపబడిన 'అగ్గున', 'అబ్జన్మ', 'వల క్షగు' శబ్దములు 'ధవళము', 'కమలము', 'కిరణము'లను ప్రసిద్ధార్థ పరముగ గ్రంథములలో గానరావు. మనఃక్షోభము, బుద్ధిక్లేశము నను భవించినఁగాని దీనిభావము గోచరింపదు. కావున వైదర్భమార్గావ లంబకులు దీని నాదరింపలేదు.

3. బంధవిషమ మున్నచో దానిని "సమతాగుణ" మందురు. కావ్యమున రచన విశేషముగ సమముగ నున్నచో బంధవిషమముగా వచింతురు. ఇచట 'విషమ'మను పదమునకు 'అవిషమ'మని కొందరు పాఠాంతరము గల్పింతురు. విషమమను పాఠమునకు విశే షముగ సమ మనియు, అవిషమ మనుచో సమ మనియు నర్థముజెప్పు దురు. ఈరెంటిలో విషమ మనుపాఠమే విశేషార్థమును స్ఫురింపజే యును. సమతాగుణ మున్నచో మొదటినుండియు తుదిదాక ప్రబంధ మున రచనాప్రకార మేకరూపముననే ప్రకాశించును. ఈరచన, లేక సంఘటన మృదురచన, స్ఫుటరచన, మిశ్రరచన అని మూడు విధ ముల జెలంగును. ఈ మృదుస్ఫుటమధ్యమబంధ సమతాగుణము వర్ణ విన్యాసముపై నాధారపడియుండును. కావున అక్షరముల కూర్పును, పదముల పొందికను గమనించి వైదర్భమార్గానుసారులు తమకావ్య ముల సమతాగుణము నాదరింతురు. పరుష, కోమల, వర్ణమిశ్ర మనోహరరచనామూలకమై వెలుంగు సమతాగుణమును పరిత్యజించి గౌడమార్గావలంబకులు అర్థాలంకారడంబరము, వికటబంధాద్యర్థ ప్రకటితమునై చెలంగు "వైషమ్యము" నంగీకరించిరి.

ఉదా: సమత- ౧. మృదుబంధము - కోకిలాలాపసానాలసమై మలయానిలము నాపై వీచెను.

౨. స్ఫుటబంధము - ఉచ్ఛలచ్ఛీకరాచ్ఛాచ్ఛ నిర్ఝరాంభః కణోక్షితమై మలయానిలము నాపైవీచెను.

౩. మిశ్రబంధము - చందన ప్రణామోద్గంధియై మందమలయమారుతము నాపై వీచెను. వైషమ్యము: రుద్ధముద్ధైర్యస్పర్ధమై వరరామాననానిలముల మలయమారుతము నాపై వీచెను.

౪. సరసమైన వాక్యము మధురము. దీనిలో "మాధుర్యగుణము" దీపించుచుండును. మందారమకరందబిందుపానమున కిందిందిర బృందముచందమున సహృదయవతంససముదాయము దేనిచే నానందము బొందునో దానినే రస మందురు. అనగా తేనెసోనల గురియు పూవుగుత్తు లేరీతి తుమ్మెదలగముల జేరబీరునో ఆరీతినే రసవంతమైన వాక్యము తియ్యనిచవుల నెయ్యుర నోరూరజేయును. ఇట్టి వాక్యములు గల కావ్యము రసికశిరోమణుల జిహ్వాంచలముల మాధుర్యము జిలికి, కలకలస్వనముల శ్రవణపేయముగ బలికి, వారి మానసాలవాలముల రసానందానుభవసౌఖ్యమును మొలకలెత్తజేయును. విశిష్టవర్ణ విన్యాసరూపమైన శ్రుత్యనుప్రాసమే రసావహ మని వైదర్భానుమతము. ఇంక శ్రుత్యనుప్రాసము, కంఠ, తాలు, మూర్ధ, దంతాది స్థానసామ్యమున సంభవించును. అనుప్రాసమూలమున వాగ్రసమును, అగ్రామ్యత్వమువలన వస్తురసమును పోషింపబడును. శ్రుత్యనుప్రాసమును వైదర్భులును, వర్ణావృత్తిని గౌడులును గౌరవింతురు. గ్రామ్యత్వము నుభయమార్గములవారును పరిత్యజింతురు. శ్రుతిసుఖ సంపాదకమును, చమత్కారసాక్షాత్కారియు నైన శ్రుత్యనుప్రాసము

నైదర్భమార్గమునను, అసూరవర్తినియు, పూర్వానుభవ సంస్కార బోధినియు నైన పదగత,పాదగత వర్ణావృత్తి గౌడవర్త్మమునను విశేషముగ గానవచ్చును. అనుప్రాసభేదముల లక్ష్యలక్షణముల వలయు వారలు భోజరాజాదుల గ్రంథముల నవలోకింపవలయు. విస్తర భయమున నిట వివరింపలేదు. ఈమాధుర్యగుణమునకు విపర్యయమును దండ్యాచార్యులు వచింపలేదు.

ఉదా: అనుప్రాస - శ్రుత్యనుప్రాస - ఆ బ్రాహ్మణప్రియుడైన రాజర్షి లక్ష్మిని బొందినంతనుండియు లోకమున ధర్మము పెంపొందెను.

వర్ణావృత్తి. ౧. శరన్నిశోత్తంస మైన చంద్రుడు కుంద స్తబక శోభను, ఇంద్రనీలనిభ మైన చిహ్నము భ్రమరవిభ్రమమును బొందెను.

౨. ఓభీరురాలా, మన్మథాక్రాంత మైన మన్మనమును నిర్దయ దహింప నుద్యమించుచున్న చారుశారదచంద్రబింబము నంబరంబున గాంచుము.

౫. అనిష్ఠురాక్షరప్రాయమై "సుకుమారతాగుణము" చెలంగుచుండును. అనగా కోమలాక్షరముల కూడిక గలచోట సౌకుమార్యము చెలువారును. బంధశైథిల్యదోషముగూడ సర్వకోమలవర్ణప్రయోగమున గానవచ్చును. మౌక్తికముల మధ్యమధ్య రత్నములగూడ గూర్చునటుల, కోమలాక్షరాంతరాంతరంబున పరుషవర్ణవిన్యాస మొనర్చి, ప్రబంధసౌకుమార్యమును మహాకవిమాలాకారులు సంపాదింతురు. కావుననే రససంపర్కశూన్యము నలంకారదూరముగా విలసిల్లుచున్నను, వర్ణవిశేషవిన్యాసాత్మకసౌకుమార్యగుణాశ్రిత మైనచో నాపద్యము సహృదయశిరోమణుల ముఖ మారోహించు నని దండ్యా

చార్యులు వచించెను. ఈ సౌకుమార్యమునకు విపర్యయము "దీప్తము". పరుషవర్ణ ఘటితము, కృచ్ఛ్రోచ్చారణభూయిష్ఠము నై చెలంగు దీప్తమును గౌడవర్త్మరతు లాదరింతురు. ఇంక పదలాలిత్యసంపదల బొందలు సౌకుమార్యమును వైదర్భమార్గలాలసులు సేవింతురు.

ఉదా: సౌకుమార్యము - జీమూతమాలాసముపేత కాలమున, మధురగీతికాకలితకంఠముల కలాపినులు బర్హముల మండలీకృతము గావించి నృత్యమొనరించును. దీప్తము - న్యక్షునిచే క్షత్రియపక్షము క్షణములో క్షపితమయ్యెను. ఇచట నిర్గతమైన అక్షులుగలవాడు న్యక్షుడు - అనగా కన్నులు లేనివాడని భావము. అతడు ధృతరాష్ట్రుడు. కావున ధృతరాష్ట్రుని దుర్మంత్రమువలన రాజకులము సర్వమును నిముసములో నాశన మయ్యె నని తాత్పర్యము.

౭. అర్థముయొక్క అనేయత్వమే "అర్థవ్యక్తిగుణ" మందురు. అనేయత్వ మనగా అధ్యాహారము మొదలైన కష్టకల్పనలు లేకుండ, కవిచే ప్రయోగింపబడిన పదముల కర్థము వెంటనే బోధపడుటయే. ఈ అర్థవ్యక్తిగుణమునకు విపర్యయము "నేయత్వము". శబ్దాన్వయ బోధపద్ధతిని నేయత్వ మతిక్రమించును గాన నీ విపర్యయము నుభయ మార్గములవారలును నిరసించిరి.

ఉదా: అర్థవ్యక్తి - ఖురక్షుణ్ణనాగరుధిరలోహితోదధినుండి శ్రీహరి భూదేవి నుద్ధరించెను.

ఇచట సాగరమునకు లోహితవర్ణ మెట్లు కలిగెనో దానిని విశేషణముల మూలమున స్పష్టముగ కవియే వివరించెను. వరాహరూపధారియైన శ్రీహరిఖురమర్దనములచే పాతాళమునందలి సర్పములనేకములు మృతి నొందెను. డెక్కలతాకుడుసందడి నలిగిన పాముల

రక్తము మున్నీటినీటితో గలసెను. అందువలన సముద్రమునకు లోహితవర్ణము చేకూరె నని కవిరేః వచించెను.

౭. చెప్పబడినవాక్యమువలన నెచట జదువరుల కుత్కర్ష ప్రతీతి కలుగునో అచట "ఉదారతాగుణము" సంభవించును. అనగా కవివర్ణనముచేత లోకోత్తరచమత్కారకారి యైన ధర్మ విశేషము సహృదయులకు జ్ఞానగోచర మగు నని తాత్పర్యము. ఔదార్యగుణప్రభావముననే వైదర్భగౌడమార్గద్వితయము సనాథ మగు నని దండి పలికెను. మరికొందరు శ్లాఘ్యము లైన విశేషణములతో గూడిన ఉదారతాగుణము నభిలషింతురు. దీనినే విశేషణౌదార్య మని పేర్కొందురు. ఈ గుణమునకు విపర్యయమును దండ్యాచార్యుడు వచింపలేదు.

ఉదా: ఉదారత-౧. వర్ణనౌదార్యము- ఓదేవా! అర్థిజనముల దీనదృష్టులొకసారి నీమోమున వ్రాలినచో, మరల నాదురవస్థచే వారితరులమోము గాంచరుసుమా! ఇచటయాచకులు వేరొకదాతను జూడరని చెప్పుటచే, భంగ్యంతరమున భూపతిదానమాహాత్మ్యము వినుతింపబడి సహృదయుల కపూర్వచమత్కారవిశేష ముదయించును.

౨. విశేషణౌదార్యము - లీలాంబుజ, క్రీడాసరో, హేమాంగదాదులు. ఇచట "లీలా" పదముచే వర్ణము, ఆకారము, సౌరభమును, "క్రీడా" విశేషణముచే కమలములు, కలహంసలు, చక్రవాకములును, "హేమ" శబ్దముచే అమూల్యతయు, రత్నఖచితత్వము మొదలుగాగల విశేషములు సూచింపబడును. ఇటులనే మణినూపురము, రత్నకాంచిక, పుష్పమాలాదులలోని విశేషణములకుగూడ నర్థము గల దందురు.

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

౮. సమాసభూయస్త్వ మెచట విలసిల్లునో దానిని "ఓజో గుణ" మందురు. ఇదియే గద్యజీవిత మనియు, అదాక్షిణాత్యు లనగా గౌడమార్గానుసారులు పద్యములలో గూడ ఓజోగుణమును విశేషాదర మున బాటింతు రనియు దండ్యాచార్యుడు వచించెను. ఉభయపక్షములవారికిని సమాసబాహుళ్య మంగీకార మైనను, గౌడవర్త్మానుసారులు "ఆకులము" అనగా 'ఉద్భటరచన' నాకాంక్షింతు రనియు, వైదర్భమార్గావలంబకులు "అనాకులము" అనగా "హృద్యరచన"ను గద్యపద్యముల నాదరింతు రనియు దండ్యాచార్యులు రచించెను.

ఉదా: ఓజము - ౧. ఆకులము లేక ఉద్భటరచన - అస్తమస్తకపర్యస్తసమస్తార్కాంశుసంస్తరము, పీనస్తనస్థితాతామ్రకమ్రవస్త్రముసరణి వారుణీతరుణీమణికి భాసించెను.

౨. అనాకులము లేక హృద్యము-పయోధరతటోత్సంగసంలగ్నసంధ్యాతపాంశుకమై మురువుసెరపు వారుణీరమణీలలామ మే మానవుని మానసము కామావిలము గావింపదు?

౯. లౌకికార్థము నతిక్రమింపక సర్వజగత్కాంతముగ వస్తువర్ణన మొనరించినచో దానిని "కాంతిగుణ" మందురు. ఇట్టి పట్టుల లోకప్రసిద్ధి కనుగుణముగ వస్తువర్ణనము చెలువ మలరుచు, నర్థబోధసౌకర్యము గలిగి పండితులు మొదలు బాలురవర కందరకు చమత్కార మొదవించుచు, సర్వజనమనోహరమై కాంతిగుణము వెలుంగును. ఈకాంతి గుణము "వార్తాభిధానము" "వర్ణనావిశేషము" నని రెండువిధముల విలసిల్లును. అనగా లౌకికోపచారవచనములను, ప్రశంసావాక్యములను గూడ కాంతిగుణము గన్పట్టు నని భావము. కావున కేవలసామాన్య పదప్రయోగకథనమునను, సహృదయహృదయహారివిశిష్టవర్ణనా

ప్రకారమునను కాంతిగుణము ప్రకాశించుచుండును. అందుచే సరస మతులు లోకయాత్రానువర్తులై వార్తాభిధానవర్ణనల కాంతివంత ముగా నొనరించుచుండ, విదగ్ధధీశాలురు లోకాతీతార్థమును స్వప్ర తిభావిశేషమున గల్పించి వర్ణింప నిచ్ఛగింతురు. ఈ "అత్యుక్తి"ని కాంతిగుణవిపర్యయముగా వచింతురు. లౌకికార్థానతిక్రమణవర్ణనము వైదర్భభూషిత మనియు, లోకాతీతార్థాధ్యారోపప్రకాశనము గాడోపలాలిత మనియు దండ్యాచార్యులు రచించెను. కావున మొదటి మార్గమునందు చాలవరకు స్వభావోక్తియు, రెండవదానిలో విశేష ముగ అతిశయోక్తియు మనకు గానవచ్చును. ఉదా:

కాంతి-౧. వార్తాభిధానము - తపోమూర్తులైన భవాదృశుల పాద పాంసువుల నేది సంభావింపబడు నదియే గృహ మను పేర బరగును.

౨. వర్ణనము-ఓ అనవద్యాంగీ, విజృంభమాణము లగు స్తనముల కవకాశము లేశమేని నీబాహులయంతరంబున గానరాదుగదా!

అత్యుక్తి.౧.వార్తాభిధానము-యుష్మత్పాదరజఃపాతధౌతనిఃశేషకిల్బి షమైన నాగృహ మింతనుండియు దేవాలయమువోలె నారా ధనీయ మగును.

౨. వర్ణనము-ఆలోచన లేకయే విధాతచే నాకాశ మల్పముగా నిర్మితం బైన చందంబున నీపయోధరజృంభణము మున్ముందు గానోపుసుమా శ్యామాలలామా!

౧౦. అన్యధర్మము నొకానొకదానిని, లోకసీమానురోధి యైనకవి, వేరొకచోట లెస్సగా నుపయోగించినచో నప్పుడు "సమాధిగుణ" మందురు. అనగా లోకవ్యవహారపరిపాలకు డైన

కవీశ్వరుడు, గుణక్రియారూపము లైన అప్రస్తుతధర్మములను ప్రస్తుత వాక్యార్థమునందు సమ్యగాధాన మొనరించినచో నచట సమాధి గుణము వెలయును. గౌడవైదర్భమార్గములరెంటికి నీగుణము సమమే. ఇది క్రియారోపము, గౌణవృత్తివ్యపాశ్రయము, బహుధర్మారోపము అని మూడుతెరంగుల జెలంగు నందురు. ఈ సమాధిగుణము చారుత్వాతిశయాధానమువలన కావ్యసర్వస్వప్రాయమై వెలుంగు నని దండ్యాచార్యుడు వచించెను. ఉదా:

సమాధి-౧. క్రియారూపము-కుముదకమలములు నిమీలనోన్మీలనముల జెలువారుచున్నవి.

ఇచట కుముదకమలధర్మము లైన సంకోచవికాసములకు మారుగ నిమీలనోన్మీలననేత్రక్రియ లారోపింపబడెను.

౨. గౌణవృత్తి - పద్మము లరాళ్కాంశునిష్ఠ్యూతము లైన పావక స్ఫులింగముల ద్రావి మరల వాంతి సేయుచున్నవో యన నరుణరేణువులు వానిముఖములనుండి యుద్గీర్ణ ము లగుచున్నవి.

ఇందు అభిధావృత్తిప్రయుక్తములై, ముఖ్యార్థబోధకములై, చెలంగు నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాదిశబ్దములు సహజముగ గ్రామ్యతా దోషదూషితములై యెలంగుచున్నను, ప్రస్తుతవర్ణనమున నవి గౌణవృత్తివ్యపాశ్రయములై, లక్ష్యార్థబోధకము లైన కారణముచే మనోహరములై వెలుంగుచున్నవి.

3. బహుధర్మారోపము - గురుగర్భభరాక్లాంతములై స్తనించుచు, మేఘపంక్తు లచలాధిత్యకోత్సంగమున శయనించుచున్నవి.

## గుణమతము-దశవిధగుణస్వరూప నిరూపణాదులు

ఈ మేఘవర్ణనమునందు స్తననము, క్లమము, ఉత్సంగశయనము లాదిగాగల గర్భిణీధర్మము లనేకము లేకకాలమందే కవిచే ప్రయోగింపబడెను.

ఈ పైన రచింపబడిన లక్ష్యలక్షణసంగ్రహముచే, వైదర్భగౌడమార్గములకు ప్రాణములుగా పరిగణింపబడిన గుణవిపర్యయముల స్వరూప మచ్చొత్తినట్లు మనబుద్ధికి గోచరించును.

భరతముని వచించిన కావ్యగుణముల లక్షణముకన్న దండ్యాచార్యులలక్షణము విభిన్నముగ నున్నను, మన మిదియే సక్రమముగ, సమగ్రముగ నున్నదని చెప్పుటకు వీలు లేదు. ఏల నన దండ్యాచార్యుల అర్థవ్యక్తిగుణమును ప్రసాదగుణమునం దంతర్గతము గావింపవచ్చును. ఈతని ఉదారతాకాంతిగుణముల లక్షణములు విస్పష్టముగ గన్పట్టవు. మరియు మాధుర్యగుణము మొదట శబ్దగుణముగా మొలకలెత్తి, పిదప నర్థగుణముగా పూవు పూచి, తుదకు స్వరూపనిరూపణాతీతమై ఫలించి మించెను. ఇచట శబ్దార్థగుణము లని దండ్యాచార్యులు విభజింపకున్నను, మాధుర్య మిందు గల దిందు లేదని వేరు పరుప తరముగాని తెరగున దానికి లక్షణము రచించెను. సమాధిగుణలక్షణముగూడ నించుమించుగ నీరీతినే విలసిల్లుచున్నది. ఇంక నితని సమాధిగుణమునకును రూపకాలంకారమునకును చాల పోలిక గానుపించును. సమాధిగుణమున నొకదాని క్రియలు వేరొకదాని కారోపింపబడును. రూపకాలంకారమున నొకధర్మికి మారుగ వేరొక ధర్మిని, లేక ఒక ధర్మమునకు బదులుగ వేరొకధర్మమును కవు లుపయోగింతురు. ఈ అధ్యారోపము లక్షణామూలకముగ దనరారుచుండును. మరియు దండ్యాచార్యుల సమాధిలక్షణము వామనాచార్యుల సాదృశ్యలక్షణామూలక మైన వక్రోక్త్యలంకారముగా జెలువారును.

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

దండ్యాచార్యులు గుణములను శబ్దగుణములు, అర్థగుణములు నని వామనాచార్యులరీతి వేరువేరుగ వివరింపలేదు. కాని వానిలక్షణముల బరిశీలించినచో కొన్నిగుణములు శబ్దమునకును, మరికొన్నిగుణము లర్థమునకును సంబంధించియున్నవి. మాధుర్యసౌకుమార్యములు ప్రాయికముగ శబ్దగుణములుగా గానవచ్చును. ఎందుచేత ననగా శ్రుతిసుఖసంపాదక మైన అనుప్రాసముపై మాధుర్యమును, వర్ణవిశేషవిన్యాసాత్మక మైన కోమలాక్షరసంయోగముపై సౌకుమార్యమును నాధారపడియున్నవి. కాని అగ్రామ్యత్వమును సూచించువర్ణములను, పదములను మాధుర్యగుణమున కవిచంద్రుడు ప్రయోగింపరా దని నియమించుటచే నిది కేవలశబ్దగుణ మని మనము నిశ్చయించుట కవకాశము లేదు. ఇటులనే ఓజః, శ్లేష, సమతా, సుకుమారతాగుణములకు దండ్యాచార్యులు విధించిన లక్షణములను విమర్శించినచో, నవి నవీనులమతమున శబ్దగుణములుగను, అర్థవ్యక్తి, ఉదారతా, కాంతి, ప్రసాదగుణములు అర్థగుణములుగను, మాధుర్యాదిగుణములు కొన్ని మాత్రము ఉభయగుణములుగను చూపట్టుచుండును. గౌడవైదర్భమార్గములు రెంటికిని వేర్వేరు కవు లాదరించిన భిన్నభిన్నమార్గములకును గల భేదవిభేదములను, వాని స్వరూపనిరూపణములనుసల్పుటకు శక్యము గాదనియు, ఇక్షుక్షీరగుడాదుల మాధుర్యాంతరనిర్వచనమువోలెనే గౌడవైదర్భాదిమార్గవిభేద వర్ణనము నొనరించుటకు సరస్వతీదేవికి గూడ శక్యము గా దనియు దండ్యాచార్యుడే వచించెను. ఇట్లనుటచే దాను రచించిన మాధుర్యాదిగుణగణలక్షణవిధానము సంపూర్ణముగ లే దని దండ్యాచార్యులే సందియ మందినట్టుల దోచుచున్నది.

---

## గుణమతము - గుణాలంకారదోష తారతమ్యాదులు

(గుణాలంకారదోష తారతమ్యము - స్వభావోక్తిప్రాశస్త్యము)

వైదర్భ గౌడమార్గద్వయమునకు ప్రాణప్రాయమై వెలుంగు గుణవిపర్యయముల నైజస్వరూపమును వివరించి, దండ్యాచార్యుడు కావ్యశోభాకర ధర్మములైన అలంకారముల నిరూపించెను. దండ్యాచార్యులు కావ్యశోభాకరధర్మము లలంకారము లని వచించుటచే నిది సామాన్యలక్షణముగాని విశేషలక్షణము గాదని మనము దలంపవలయును. కావ్యశరీర సంస్కారమునకు, కావ్యమనోహరతా సంపాదనమునకు నలంకారము లుపచరించు ననుటవలన నీలక్షణము గుణాలంకారములకు రెంటికిగూడ వర్తించును. మరియు శ్రుత్యనుప్రాసాద్యలంకారములను మును సున్నే మార్గవిభాగప్రసంగమున వచించితిననియు, ఉపమా, రూపక, దీపకాదిసాధారణాలంకారజాతము నింక రచింతు ననియు ద్వితీయపరిచ్ఛేదప్రారంభముననే దండ్యాచార్యులు ప్రతిజ్ఞజేసెను. ఇచట సాధారణాలంకారము లనుటచే నవి గౌడవైదర్భమార్గములకు రెంటికినిగూడ సమానమేయని వ్యాఖ్యానమొనరింపబడెను. దీనివలన శోభాకరత్వమే అలంకారసాధారణలక్షణమనియు, నందుచే గుణములగూడ నలంకారములుగా భావించి శ్లేషాదిగుణాత్మకాలంకారములను మార్గప్రభేదప్రదర్శనావసరమున వచించె ననియు, కావుననే రెండవపరిచ్ఛేదమున మార్గద్వయ సామాన్యాలంకారములను దండ్యాచార్యులు వివరించె ననియు చదువరులు దలంపవలయును. అంతియేకాని వామనాదులవలె గుణాలంకారములకు విభేదము నతండు కల్పింపలేదు. వాని సామాన్యధర్మమును గణించి రెంటినిగూడ నలంకారములుగానే దలంచెను. ఇట్లు గన్పట్టుచున్నను దండ్యాచార్యులమతమున గుణముల కగ్రస్థానమొసంగబడె ననియు, అలంకారము లనంతరమున గణింపబడె

వనియుమాత్రము మనము గమనింపవలెయును. అప్రధానములుగ నలం కారములను, ప్రధానములుగ గుణములను గౌరవించినను, కావ్య రామణీయకమునకు గుణాలంకారద్వయ మావశ్యకమనియే దండ్యా చార్యుల తాత్పర్యము. వామనాదుల రీతివిశేష భేదమును బాటింప కున్నను, గుణములు సహజముగ మార్గమునకు సంబంధించిన వనియు, అలంకారములు సామాన్యముగ కవివాక్కు నలంకరించు ననియు జెప్పుటచే వీనిరెంటికిం గల తారతమ్యమును దండ్యా చార్యులు గుర్తించినట్లు స్పష్టపడుచున్నది. కావున నీతడు అలంకార రీతిమతములకు మధ్యకాలమున నుండె నని నిశ్చయించుట కిది యొక్క ప్రబలాధారము.

ద్వితీయ తృతీయపరిచ్ఛేదములలో దండ్యాచార్యులు శబ్దార్థా లంకారములకు లక్ష్యలక్షణముల రచించెను. అర్థాలంకారములను, శబ్దాలంకారములను వేరుగ వివరింపకున్నను, యమకాదిశబ్దాలంకార ములు "నైకాంతమధురము" లని సామాన్యాభిప్రాయము నీతడు వెలిపుచ్చెను. వీనివిషయమున భామహునికన్న దండియే విపులముగ జర్చించెను. భామహుడు నామమాత్రమున నుదాహరించిన 'ప్రహే ళిక' ను గురించి రచించుచు, దాని పదియునారు భేదములను సోదా హరణములుగ దండ్యాచార్యులు ప్రదర్శించెను. ప్రహేళి కాదిచిత్రబంధములగూర్చి రుద్రటాచార్యులుగూడ విపులముగనే వివ రించెను. ఆనందవర్ధనాచార్యాదులు చిత్రకావ్యరచనను నిరసించి నంతనుండియు దీని ప్రాముఖ్య మంతరించి కాలక్రమమున నిది నామమాత్రావశేష మయ్యెను. ఇంతియేకాక దండ్యాచార్యులు యమకచక్రమున విశేషముగ అర్ధభ్రమ, గోమూత్రికా, సర్వతో భద్రాది బంధవై చిత్ర్యమును లక్ష్యసమన్వితముగ వివరించెను.

# గుణమతము-గుణాలంకారదోష తారతమ్యాదులు

దీనికి దోడుగా అర్థాలంకారములవిషయమున దండ్యా చార్యులు విశేషాదరమును ప్రకటించెను. అత డీక్రిందిక్రమమున నర్థా లంకారముల లక్ష్యలక్షణముల జర్చించెను:

స్వభావోక్తి, ఉపమ, రూపకము, దీపకము, ఆవృత్తి, ఆక్షే పము, అర్థాంతరన్యాసము, వ్యతిరేకము, విభావన, సమాసోక్తి, అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, హేతువు, సూక్ష్మము, లేశము (లవము), యథాసంఖ్యము (సంఖ్యానము లేక క్రమము), ప్రేయము, రసవద లంకారము, ఊర్జస్వి, పర్యాయోక్తము, సమాహితము, ఉదాత్తము, అపహ్నుతి, శ్లేష, విశేషోక్తి, తుల్యయోగిత, విరోధము, అప్రస్తుత ప్రశంస, వ్యాజస్తుతి, నిదర్శనము, సహోక్తి, పరివృత్తి, ఆశీస్సు, సంకీర్ణము, భావికము లను ముప్పదియైదు అలంకారములు.

వీనిని పూర్వాచార్యులు సమ్మతించి రని ప్రారంభముననే వచించి పదంపడి వానికి దండ్యాచార్యులు లక్షణమును, లక్ష్యమును రచించెను. భామహునిపగిది నీతడుగూడ 'అతిశయోక్తియే సర్వాలంకారబీజభూత' మని ప్రశంసించెను. మరియు భణితిభంగీ రూపా లంకారముల శోభను శ్లేషాలంకారము పోషించునని పలికి ఉద్భటా దులకు దారిచూపెను. ఇంక దండ్యాచార్యుల మతమున కావ్యవాఙ్మయ మంతయు స్వభావోక్తి, వక్రోక్తు లను రెండుకక్షలుగా విభాగింప బడెను. ఈ స్వభావోక్తిస్వరూపమును వక్రోక్తిసందర్భమున మున్ను కొంతవరకు వివరించితిమి. స్వభావోక్తియే 'ఆద్యాలంకార'మనియు, జాతిక్రియాగుణ ద్రవ్యస్వభావాఖ్యానముల నిది పెంపొందు, శాస్త్ర ములను సామ్రాజ్యమై, కావ్యములలో గాంక్షితమై, ప్రకృతి వివిధ విచిత్రవర్ణనముల విలసిల్లి వెలుంగునని దండ్యాచార్యులు వచించెను. వ్యాజరహితముగ వస్తుస్వరూపమును వినుతించుటయే స్వభావాఖ్యా

నమై చెలువారుగాన శబ్దార్థవక్రతావైచిత్ర్యములకై కవి పాటుపడ నక్కఱలేదు. ఇంక దండ్యాచార్యుల మతమున వక్రోక్తి ప్రత్యేకాలంకారముగాక సర్వాలంకారసాధారణవాచకమని వ్యాఖ్యాతలు వివరించిరి. దీని విషయమును విశేషముగ అలంకారమతముననే చదువరు లెఱింగిరి. ఇంక వక్రోక్తిజీవితమతమున మిగిలినదానిని వార లెఱుంగగలరు. ఆవృత్తి, లేశము, వ్యాజస్తుతి లేక వ్యాజోక్తి, సూక్ష్మము, హేతువులను ప్రత్యేకాలంకారములుగ గణించినవారిలో ప్రథముడు దండ్యాచార్యుడే. వీనిలో హేత్వలంకారమును కావ్యలింగమునం దంతర్గతముగా భట్టోద్భటుడు వచించెను. మఱియు అనన్వయసనందేహాలంకారములను అసాధారణ, సంశయోపమా ప్రభేదములుగను, ఉపమారూపకము, ఉత్ప్రేక్షావయవములను రూపకోత్ప్రేక్షాలంకారవిభేదములుగను దండ్యాచార్యుడు చర్చించెను. భామహాచార్యు లుదాహరించిన వార్తాలంకారమును నవీనులు స్వభావోక్తిభేదముగా నెంచి రనవచ్చును. దండ్యాచార్యుల సమాహితాలంకారలక్షణమునకును, ఉద్భటవామనాచార్యుల లక్షణమునకును భేదము గలదు. ఉపమావిభేదముగ ప్రతివస్తూపమాలంకారమును దండ్యాచార్యు డంగీకరించెను. ఈనిదర్శనములవలన సంశయగ్రస్తములుగను, సందేహాస్పదములుగను పూర్వాచార్యులు వదలిన సందర్భముల నెల్ల తన విమర్శనావివేకముచే శోధించి, కల్పనాశక్తిచే నూహించి, సత్యస్వరూపమును ప్రదర్శించి, నూతనాంశముల నెన్నిటినో నెలకొల్పి, దండ్యాచార్యులు అలంకారశాస్త్రప్రాశస్త్యమునకు చాల పాటుపడెనని మనకు దెలియవచ్చును.

ఇంక కావ్యమునకు అపకర్ష హేతువులుగ గణింపబడిన దోషములగురించి మనము కొన్ని సంగతుల నెఱుంగవలయు. ముని

వచనము లమోఘములని తలంచికాబోలు, దోషముల సంఖ్యావిషయ మునగూడ దండ్యాచార్యు డాతనితో సమ్మతించెను. కాని వాన్నిల్లో పెక్కింటికి లక్షణరచనమున దాను స్వాతంత్ర్యమును ప్రకటించెను. అభిధానస్వరూపములందు దండి వచించిన దోషములు భామహుడు ప్రథమమున నుదాహరించిన అపార్థాదిదోషములకు సరిపోవును. భామహుడు నుడివిన పదునొకండవ దోషమైన తర్కశాస్త్రదోష మును దండి నిరాదరించెను. ఇంక కావ్యాత్మకత్త్వమునకు సంబంధించిన భామహుని నేయార్థాదిదోషములు చాలవరకు గౌడవర్త్మమున ప్రకటితములైన విపర్యయములుగా గన్పట్టును. ఈవిపర్యయముల గురించి చదువరులు గుణముల సందర్భమున దెలుసుకొనియే యున్నారు. దండ్యాచార్యులు వీనికి వేరువేరుపేరుల బెట్టెను. ఇచట గుణముల, నాయా విపర్యయముల వివరింతుము—

౧. శ్లేషగుణమునకు విపర్యయము శిథిలమని వచింపబడును.

౨. ప్రసాదగుణమునకు విపర్యయము వ్యుత్పన్న మనబడును.

౩. సమతాగుణమునకు విపర్యయము వైషమ్యమని పిలువబడును.

౪. సుకుమారతాగుణమునకు విపర్యయము దీప్తమన భాసించును.

౫. కాంతిగుణమునకు విపర్యయము అత్యుక్తియన ప్రకాశించును.

౬. అర్థవ్యక్తిగుణమునకు విపర్యయము నేయత్వమనవెలుగొందును.

ఇంక ఓజము, మాధుర్యము, ఉదారత, సమాధులను నాలుగు గుణములకును విపర్యయములను దండి వివరింపలేదు. కావున నీగుణము

ఉభయమార్గములకును సమానములనియు, పైవానిలో గుణములు వైదర్భ మార్గమునకును, విపర్యయములు గౌడవర్త్మమునకులనియు దండ్యాచార్యులు పలికెను. ఇట్లనుటచే భామహుని పది దోషములకు బదులుగా దండి విపర్యయముల నారింటిని మాత్రమే నిరూపించె ననవచ్చును. అంతియే కాని 'గుణములన నేమి? దోషాభావములను గుణములనవచ్చునా? కూడదా?' అనునట్టి ప్రశ్నములను దండి స్మరింపనే లేదు. భరతుని మతమున దోషాభావములు గుణములుగాగాన వచ్చునని మన మీవరలో నెరింగితిమి. దీనివలన దోషములు ప్రధానములై, గుణము లప్రధానములై చెలంగుటయేకాక, దోషవిచారణానుకూలకమై గుణస్వరూపనిరూపణము చెలువొందుచున్నది. దండిమతమున గూడ భామహుని మతమునందువలెనే కావ్యశరీరమునకు సంబంధించిన దోషములు ప్రధానములై భాసించును. ఇంక కావ్యజీవమునకు సంబంధించిన దోషప్రాయములన్నచో వైదర్భమార్గమునకు ప్రాణభూతములైన గుణములకు విపర్యయములై వెలుగొందుచు గౌడవర్త్మమునకుమాత్రమే ప్రధానములు, నత్యంతావశ్యకములు నై ప్రత్యేకముగ ప్రకాశించుచున్నవి. ఇచట వైదర్భగౌడమార్గములకు విభేదము నేర్పరచి, గుణవిపర్యయములకు ప్రాముఖ్యము నంగీకరించి, వానివానికి స్వతంత్రస్థానముల విధించుటవలన దండ్యాచార్యవర్యులు శుష్కతర్కములకు, వృథావివాదములకు తావొసంగలేదు. ఇంక వామనాచార్యులన్నచో, భరతమునిమతమునకు ప్రతికూలుడై, రీతిమతానుకూలముగ గుణములే ప్రధానములు, ప్రత్యేకములు నని నిశ్చయించి 'గుణవిపర్యయాత్మకములు దోషము' లనియు, 'కావ్యశోభాధాయకధర్మములు గుణము' లనియు స్పష్టముగ విధించెను. కావున నీతని మతమున గుణస్వరూపనిరూపణమున దోషావ

గనుక వ్యాఖ్యాతపడియున్నది. ఐనను సాకల్యార్థమై దోషప్రపంచమును బ్రదర్శించుచుంటినని వామనుడు నుడివెను. వీనిని పద, పదార్థ, వాక్య, వాక్యార్థదోషములని నాలుగువిధములుగ విభజించెను. శబ్దార్థసహితమై కావ్యము వెలంగునని పలికినకారణమున గాబోలు రుద్రటుడు గుణదోషముల రెంటికిని ప్రత్యేకత నంగీకరించి, దోషములు శబ్దగతములు, అర్థగతములునని రెండుతెరంగుల నిరూపించెను. ఇందు మొదటి విభాగమునందు - ౧. అసమర్థము, ౨. అప్రతీతము, 3. విసంధి, ౪. విపరీతకల్పనము, ౫. గ్రామ్యము, ౬. దేశ్యము నని పదదోషములు ఆరు అనియు, ౧. సంకీర్ణము, ౨. గర్భితము, 3. గతార్థమునని వాక్యదోషములు మూడనియు, రెండువిధముల దోషములును గలసి తొమ్మిదిశబ్దదోషములనియు వక్కాణించెను.

ఇంక రెండవభాగమున ఉపమాదోషములు నాలుగునుగాక ౧. అపహేతుకము, ౨. అప్రతీతము, 3. నిరాగమము, ౪. బాధయతి, ౫. అసంబద్ధము, ౬. గ్రామ్యము, ౭. విరసము ౮, తద్వత్తు, ౯. అతిమాత్రమునని దోషములు తొమ్మిదనియు, రెండుతెరగుల దోషములును జేరి పదమూడు అర్థదోషములనియు పేర్కొనెను.

కాని ధ్వనిమతము వ్యాపించినంతనుండియు, గుణదోషములు రసానుకూలములుగాను, రసప్రతికూలములుగాను విచారింపబడెను. అనగా రసస్ఫూర్తికి గుణము లెంతవరకు నుపచారకములనియు, రసోదయమునకు దోషము లెంతదనుక నిరోధకములనియు జర్చింపబడుచుండెనని భావము. అందువలన గుణదోషముల ప్రత్యేకతాప్రాధాన్యములు నశించెను. ఇంక రసానుభవమునకు గుణము లుత్కర్షహేతువులుగను, దోషము లపకర్షకారణములుగను భావింపబడెను. ఈగుణదోషవిచారము రసౌచిత్యము నాశ్రయించి

సంచరింపఁజొచ్చెను. కాలక్రమమున శబ్దార్థదోషములతో పాటు రస దోషములు కొన్ని గురుతింపబడెను. కావున శబ్దదోషములు, అర్థ దోషములు, రసదోషములు ననునవి మూఁడునుగూడ రసాపకర్ష కములు, రసభంజకములుగనే భావితములయ్యెను. మరియు 'దోషములు నిత్యములా, లేక అనిత్యములా ?' అని మున్ను భామహప్రభృతులు ప్రశ్నించిరి. రసోదయమున కనుకూలించినచో దోషములుగూడ గుణములుగా మారునని పలికినచో వారి ప్రశ్నకు తగిన సమాధాన మగును. ఆధునికులైన మమ్మటాచార్యాదు లనినచో పద, వాక్య, అర్థ, రస, అలంకారదోషములని ఐదువిధముల దోషముల వచించిరి. ఇటుల కొన్నిచోట్ల దోషములు గుణవిపర్యయములుగను, మరికొన్ని పట్టుల గుణములు దోషాభావములుగను, వేరుగ కొన్నిస్థలముల గుణ ములు కేవల కావ్యసౌందర్యసంపాదనసాధనములుగను, దోషములు సహజముగ కావ్యశరీరవికారకారణములుగను గానవచ్చినను, నవీనా లంకారికుల మతమున గుణములకు ప్రాముఖ్యమును, దోషములకు ప్రాధాన్యమును స్పష్టముగ నగపట్టును. తుదకు దండ్యాచార్యుడు గూడ చతుర్థపరిచ్ఛేదమున గుణవిపర్యయములుగానట్టి పది ప్రత్యేక దోషములను జర్చించెను. ఈనూతనదోష విచారణయే వాని ప్రాధా న్యమును భంగ్యంతరమున వచించును. కావున ప్రాచీనాచార్యులైన భరతభామహాదుల మతముల సారమును సంగ్రహించి, దానికి తన భావగాంభీర్యమును, పదలాలిత్యమును, వాఙ్మాధుర్యమును గూర్చి గుణవిపర్యయముల స్వరూపనిరూపణ మొనరించి, కమనీయకావ్య కన్యకాలలామను కాంతిమతిని, ప్రాణవతిని దండ్యాచార్యుడు చేసెనని తాత్పర్యము.

---

# కావ్యాత్మ

## ప్రాచీన మతములు

---

### ౧. రీతిమతము

(శబ్దార్థగుణలక్షణ వివేచనము ; రీతిత్రయవిభాగవివేకము - వామనుడు)

దండ్యాచార్యుల మాధుర్యౌదార్యసౌకుమార్యప్రసాదాదిగుణ గణశ్రీవిలాసమునకు, అపూర్వరీతిరచనాసమగ్రసౌభాగ్యాతిశయమును సమకూర్చి, సాహితీశ్యామలలామసౌందర్యసర్వస్వమును, విదర్భ పాంచాలాది దేశవిద్వన్మణివిపణిప్రదేశముల వామనాచార్యవర్యుడు ప్రదర్శించి,...సహృదయహృదయసువర్ణకోశధనసంచయమును మూల మట్టుగ సంగ్రహించెను. వామనాచార్యుడు రచించిన కావ్యాలం కారసూత్రవృత్తిని పరికించినచో నాతడు దండ్యాచార్యు లొనరిం చిన కావ్యలక్షణవిచారమును గ్రహించి దానికి వైశిష్ట్యమును, వైలక్షణ్యమును సంపాదించెనని సమ్మతింపకతప్పదు. మార్గనిర్మాణ మునకు ప్రాణసమూహముగా దండి వచించిన గుణగణమును వామనా చార్యు డంగీకరించి, కావ్యకాంత కపూర్వరీతిరచనారామణీయక మును గల్పించి ప్రాణమునకన్న మిన్నగా వన్నెగన్న కావ్యాత్మ తత్త్వవిచారమునకు గడంగెను. ఆత్మతత్త్వవివేకముననే కాక గ్రంథ రచనాప్రకారమునగూడ వామనుడు స్వవిమర్శనావిజ్ఞానవిశేషమును విజృంభింపజేసెను. పూర్వాచార్యులవలె తన గ్రంథమును హృద్య

పద్యమయముగా జేయక, అల్పాక్షరము, అసందిగ్ధము, అస్తోకము, అన వద్యములైన సూత్రజాలమున వామనాచార్యుడు రచనాసౌష్ఠవమును వెలిపుచ్చెను. ఈసూత్రగ్రథనమునగూడ ప్రాచీనసూత్రకారులవలెగాక తా నొక క్రొత్తత్రోవ ద్రొక్కెను. మొదట అధ్యాయముల, పిదప నధికరణముల రచింపక, సామాన్యరచనాప్రకారమును తారుమారొనరించి, వామనుడు గ్రంథమునంతయు నైదు అధికరణములుగ విభజించి, వానిని అధ్యాయములుగ విడదీసెను. ఈగ్రంథసంగ్రహ మీరీతిగా నున్నది:

౧. అధికరణము. కావ్యశరీరము; అధికారనిరూపణము; రీతినిశ్చయము.

౨. దోషదర్శనము; పదపదార్థ వాక్యవాక్యార్థదోషవిభాగము.

౩. గుణవివేచనము; శబ్దార్థగుణవివేకము.

౪. శబ్దాలంకారవిచారము; ఉపమాప్రపంచాధికారము.

౫. ప్రాయోగికము; కావ్యసమయశబ్దశుద్ధిప్రసంగము.

ఈవిభాగమును, విచారమును మనము బరిశీలించినచో ఆనందవర్ధనాచార్యుల పూర్వులలో వామనాచార్యు డొక్కడే ప్రప్రథమమున కావ్యస్వరూపమును, కావ్యతత్త్వమును విలక్షణముగ విమర్శించిన వివేకవంతుడని తెలియవచ్చును. ఏలనన: వామనుని పూర్వాచార్యు లందరును విశేషముగ కావ్యశరీరసౌందర్యమునకే ప్రయత్నించిరిగాని, ఆత్మతత్త్వవివేకమున కంతగా పాటుపడినట్లు కన్పట్టదు. ఇంక వామను డన్నచో, గుణాలంకారసంస్కృతములైన శబ్దార్థము

లకే కావ్యశబ్దము వర్తించుననియు, రీతియే కావ్యాత్మయనియు స్పష్టముగ ప్రథమాధికరణముననే వచించెను. ఇచట రీతి యననేమి ? అనినచో విశిష్టపదరచనయే రీతియని వక్కాణించెను. ఈపదరచనా విశేష మెట్టిదని మనకు తలంపు గలుగవచ్చును. ఈ వైశిష్ట్యము తాను జెప్పబోవు గుణరూపమై వెలుగొందునని వామనుడు నుడివెను. ఇటుల ఆత్మతత్త్వమును, గుణస్వరూపమును, శరీరసౌందర్యమును, మనకనులయెదుట కదలక మెదలక నిలుపదలచి, వామనాచార్యు డొక సూత్రమున కింకొకసూత్రము జేర్చి కూర్చి, కావ్యశంపాలతాంగిని తన గ్రంథాకాశసౌధసీమాంతరంబున బంధించివైచెను.

ఈతని మతమున వైదర్భీగౌడీయాపాంచాలీభేదముల రీతి మూడువిధముల జెలువారుచున్నది. ఇందు సమగ్రగుణసంపన్నమై వైదర్భియు, ఓజఃకాంతిగుణసంయుతమై గౌడియు, మాధుర్యసౌకుమార్యఘణసమేతమై పాంచాలీరీతియు వేర్వేర వెలుగొందుచుండును. వామనాచార్యు డీరీతి రీతివిభాగ మొనరించి, రేఖాశ్రితమై చిత్రపటము చెలువొందుచెలువున, రీతిత్రయప్రతిష్ఠితమై కావ్యము వెలుగొందునని రచించెను. ఈరీతుల మూటిలో కవులు వైదర్భీరీతికొరకే పాటుపడవలెనుగాని మిగిలిన గౌడీయాపాంచాలీరీతులకై పాటుపడరాదని వామనాచార్యుల యాశయము. ఏలనన వైదర్భీరీతియే గుణగణరత్నాకరమై ప్రకాశించును. తక్కినవి రెండును స్తోక గుణసమన్వితములై భాసించును. కానికొందరు వైదర్భీరీత్యారోహణార్థ మితరాభ్యాసము నిచ్చగింతురు. వీరితో వామను డేకీభవింపలేదు. శణసూత్రవానాభ్యాసమున నారితేరిన కువిందుడు త్రసరసూత్రవానవైచిత్ర్యలాభమును బొందలేనట్లు గౌడీయాపాంచాలీరీతుల రచింపగలిగిన కవీంద్రుడు కవితావైదర్భీకరగ్రహణసౌఖ్యము ననుభవింపలేడని వామ

నని భావము. అనగా గోగునారతో సంచులల్లు సాలెవాడు పట్టునూలుతో తాపితాలను నేయజాలనిపగిది నొకరీతి రచింపజాలినవాని కింకొకరీతిని రచించుటకు కౌశలము గలుగదని తాత్పర్యము. కావున మొదటి నుండియు సమగ్రగుణసంపన్నమైన వైదర్భీరీతిరచనమునందే కవికుల చక్రవర్తులు లక్ష్యము నుంచవలయును. ఈ సందర్భమున రీతుల కీపేరులు దేశవశమున సంభవించెననియు, విదర్భాదిదేశముల గల కవుల కావ్యములలో గానవచ్చుచున్న రచనాగుణస్వరూపముల ననుసరించి రీతిత్రయవిభాగసమాఖ్యానము లొనరింపబడెననియు వామనుడు వచించెను. దీనిచే రీతివిభాగములు, వాని విభేదములును చాల కాలమునుండీ వచ్చుచున్నవని మనము తలంపవలయు. బాణునకు పూర్వ మీవిభాగము గలదని గుణమతముననే సూచించితిమి. ఈ కావ్యరచనము దండ్యాచార్యుల కాలమునకు స్ఫుటస్వరూపము నొంది మార్గద్వయమై మన్ననగాంచెను. అందు దండ్యాచార్యుడు వైదర్భమార్గము నాదరించి గౌడవర్త్మమును నిరాదరించెను. ఇంక భిన్నరుచిగల లోకమున కాలవైపరీత్యము ననుసరించి, గుణవిపర్యయమునకు కొందరిచే నతిగౌరవము లభించినను, గుణగ్రహణపారీణులైన సహృదయశిరోమణు లనారతము సరస్వతీవిభ్రమజన్మభూమియైన వైదర్భమార్గమును తమ ప్రసన్నదృష్టులతో వీక్షింపజొచ్చిరి. శ్రుతిసుఖానుభవము చూరగొనజేయుటకుగాబోలు, కొందరు అక్షరడంబరసంఘటనాస్వరూపమైన గౌడీయరీతిని, మరికొందరు విపంచీస్వరసౌభాగ్యసర్వస్వమైన వైదర్భీరీతిని కావ్యముల రచించి రసికుల కీరీతిరచనాతరతమమధురిమల జవిచూప మొదలిడిరి. ఇటుల రెండుతెరగుల కావ్యరచన చెలంగుచుండ, ఈ రెంటికిని సంభవించిన బాంధవ్యమున పాంచాలీరీతి క్రొత్తగ పుట్టువొందెను. ఈ

మాటికిని గల ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమాదిగుణగణముల
నుస్త్రరించి వామనుడు వాని స్వరూప, సౌందర్య, సౌష్ఠవ, సౌకు
మార్యముల దెలకించి తత్తదుచితాసనముల నొసంగి గౌరవించెను.

రీతి కావ్యాత్మ యనియు, ఈరీతి, లేక పదరచనము గుణవిశే
షమున నాధారపడినదనియు వామనుడు పలికి కావ్యశోభను గలుగ
జేయు ధర్మములే గుణములని లక్షణము విధించెను. 'ఈకావ్యశోభా
కరధర్మము దేనిది?' అని ప్రశ్నించి శబ్దార్థముల ధర్మమని సమా
ధాన మొసంగెను. ఇటుల శబ్దార్థశోభాకరధర్మములే గుణములనుట
సామాన్యలక్షణముగాని విశేషలక్షణము గాదని వ్యాఖ్యాత రచిం
చెను. నిజమునకు గుణములు రీతినిష్ఠములుగా నుండవనియు, ఇచట
భక్తిచే, ననగా ఉపచారమూలకమై గుణములు శబ్దార్థమాత్రములుగా
వచింపబడెననియు వ్యాఖ్యాన మొనరింపబడెను. అందువలననే పదర
చనావైశిష్ట్యము గుణాత్మగా విధింపబడెను. ఇంక నీశోభాసంపా
దకధర్మములు నామమాత్రములు, మిథ్యాస్వరూపములు ననువారి
వృథావాదములకు " నాసంతః, సద్వేద్యత్వాత్ (సంవేద్యత్వాత్) "
అనుసూత్రమున సమాధాన మొసంగెను. అనగా నీగుణములు సహృ
దయసంవేద్యములని భావము. ఈగుణము లన్నిచోట్లను గానరావు.
వీనికై పాటుపడి రచించిన పద్యములలోనే గుణము లుండి చదువరు
లకు ముదము నొదవింపగలుగును. ఇవి పాకధర్మములుగాకుంటచే
సర్వత్రప్రవృత్తములు గావని వామనుడు నుడివెను. దండ్యాచార్యుల
వలెనే వామనాచార్యుడుగూడ సౌందర్యసంపాదకములైన గుణ
ములు దశసంఖ్యాకములని వచించినను, వీనిని శబ్దగుణములనియు, అర్థ
గుణములనియు వేర్వేర నిరూపించుటచే వాని సంఖ్య ద్విగుణిత
మయ్యెను. ఈగుణములను ప్రత్యేకముగ శబ్దపరముగను, అర్థపరముగను

పరిశీలించుటంజేసి నామమాత్రమున దశగుణములుగా గానవచ్చినను, గుణస్వరూపవివేచనావసరమున వాచ్యవాచకద్వారమున ప్రత్యక్షముగ వింశతిగుణములై వెలుంగుచున్నవి. ఈగుణగణలక్షణసమాలోచనమునందు భరతాచార్యదండ్యాచార్యులకన్న మిన్నయైన విమర్శనావివేకమును వామనాచార్యుడు ప్రకటించెనని చెప్పకతప్పదు. కావున నీతని లక్షణవిధానము వారి లక్షణరచనకన్న విలక్షణము, విశిష్టము నై భాసించుచున్నదని మొదటనే వచించితిమి. అందుచేత భరతాదుల కపరిచితములైన లక్షణములనో, లేక వారి కపూర్వములైన సంప్రదాయములనో స్వీకరించి వామనుడు కావ్యాలంకారసూత్రములను రచించియుండవచ్చును. ఈవాదమున కనుకూలముగ నాతడు ప్రాచీనశ్లోకముల నెన్నిటినో గ్రంథమునం దుదాహరించెను. ఈవరలో భరతాదుల లక్షణముల భావము నాయామతసంపర్భముల రచించితిమి. ఇచట వామనాచార్యుల శబ్దార్థగుణముల లక్షణసారమునుగూడ వివరింతుము. వానిని దీనితో సరిపోల్చి చూచినచో వామనాచార్యుల విమర్శనావివేకమును చదువరు లవలీల నెరుంగగలరు. వామనుని గుణముల క్రమము—ఓజము, ప్రసాదము, శ్లేషము, సమత, సమాధి, మాధుర్యము, సౌకుమార్యము, ఉదారత, అర్థవ్యక్తి, కాంతి-ఇవి పదిగుణములు. శబ్దగుణములకు, అర్థగుణములకు గూడ నివియే పేరులు.

౧. శబ్దగుణము - గాఢబంధత్వము "ఓజము". ఇచట బంధమనగా పదరచనము. అందుచే శబ్దగుణము లన్నియు బంధగుణములని కూడ పిలువబడును.

అర్థగుణము - అర్థగాంభీర్యమే "ఓజము". దీనినే అర్థప్రౌఢి యందురు.

౨. శబ్దగుణము - బంధశైథిల్యము "ప్రసాదము."

అర్థగుణము - అర్థవైమల్యమే "ప్రసాదము."

3. శబ్దగుణము - మసృణత్వమే "శ్లేషము".

ఎచట బహుపదములున్నను ఏకపదమువోలెనే భాసించునో దానిని మసృణత్వ మందురు.

అర్థగుణము-ఘటనయే "శ్లేషము". ఇచట క్రమకౌటిల్యానుల్బణత్వోపపత్తియే ఘటనమని వామనుడు వృత్తిని రచించెను. అనగా బంధగుణమున ననేకపదములున్న నొక్కపదముపగిది గాన వచ్చునట్లే అర్థగుణము ననేకభావము లున్న నన్నియు గలసిమెలసి పాలునీరువోలె నొండొంటి నంటి వేరుపరుపరాక నెలంగునని తాత్పర్యము.

౪. శబ్దగుణము-మార్గాభేదమే "సమతాగుణము". అనగా నే మార్గమున శ్లోకముగాని, కావ్యముగాని ప్రారంభింపబడునో దానిని వదలకుండుటయే సమత్వముగా దలంతురు.

అర్థగుణము-అవైషమ్యమే "సమతాగుణము". ప్రక్రమమున భేదము లేకుంటయే అవైషమ్య మనబడును. అనగా కవిభావములకు పూర్వోత్తరవిరోధము లేక క్రమక్రమముగా నొకదాని కింకొకటి చేదోడువాదోడుగా మెలంగుటయే అవైషమ్యమని పేర్కొనబడును. దీనినే సుగమత్వ మందురు. ఇదిగలనో సమతాగుణము దీపించును.

౫. శబ్దగుణము-ఆరోహావరోహక్రమమే "సమాధిగుణము". సంగీతమున రాగాలాపమువలెను, సాగరమున తరంగసంచయము వోలెను పద్యమున పదరచనాబంధమును, కావ్యమున రీతినిర్మాణ

వైచిత్ర్యమును క్రమక్రమముగా హెచ్చుచు తగ్గుచు, దిగ్గుచు నెక్కుచు వినువారి చెవులకు విందొనరించుచో సమాధిగుణ మందురు.

అర్థగుణము - అర్థదృష్టియే "సమాధిగుణము."

అవహితచిత్తుడు గాకున్నచో నర్థావలోకన మొనరింపలేడు. కావున సమాధియే అర్థావగమమునకు కారణ మందురు.

౬. శబ్దగుణము - పృథక్పదత్వమే "మాధుర్యము."
అర్థగుణము - అర్థవైచిత్ర్యమే "మాధుర్యము."

౭. శబ్దగుణము - అజరఠత్వమే "సౌకుమార్యము."
అర్థగుణము - అపారుష్యమే "సౌకుమార్యము."

౮. శబ్దగుణము - వికటత్వమే "ఉదారతాగుణము."

ఎచట శబ్దములు నృత్యముసేయుచున్నట్లు గన్పట్టునో అచట వికటత్వ మందురు. అనగా మాటలు నీటులుగులుకుచు, ముందువెనుకలకు దుముకుచు, గంతులిడుచు, సయ్యాటలాడునటుల గాన వచ్చుచో దానినే వికటత్వమని పిలుతురు. దీనినే లీలాయమానత్వమని కూడ చెప్పుదురు.

ఇట్టిపట్టుల నుదారతాగుణము ప్రకాశించును.

అర్థగుణము - అగ్రామ్యత్వమే "ఉదారతాగుణము."

౯. శబ్దగుణము - అర్థవ్యక్తిహేతుత్వమే "అర్థవ్యక్తిగుణము."

దీనికి వామనుడు "ఝటితిత్యర్థప్రతిపత్తిహేతుత్వ"మని వృత్తిని రచించెను. అనగా కన్నులకుగట్టినట్లుగా కవిభావము వెంటవెంటనే మదికి తట్టినచో నర్థవ్యక్తిగుణము.

అర్థగుణము - వస్తుస్వభావస్ఫుటత్వమే "అర్థవ్యక్తిగుణము."

౧౦. శబ్దగుణము-ఔజ్జ్వల్యమే " కాంతిగుణము. "

బంధమునకు ఉజ్జ్వలత్వము లేనిచో దానిని పురాణచ్ఛాయ యందురు.

అర్థగుణము-దీప్తరసత్వమే " కాంతిగుణము. "

శృంగారాదిరసములే దీప్తరసములు. ఇవిగలచో కాంతిగుణ ముండును.

ఈ లక్షణసంగ్రహమును గమనించినచో భరతాదుల గుణముల కును, వామనుని గుణములకును చాలభేదము గలదని తెలియవచ్చును. దీనిని నిరూపించుటకు రెండుమూడు నిదర్శనముల నిట వివరింతుము. వామనుని ఓజోగుణలక్షణము దండి విధించిన శ్లేషగుణలక్షణముతో తులదూగును. ఇంక దండ్యాచార్యుని మాధుర్యగుణమును రెండు భాగములొనరించి, వామనాచార్యుడు శబ్దార్థగుణములుగా గ్రహించెను. వామనుని అర్థగుణమైన అర్థవ్యక్తిలక్షణము దండ్యాచార్యుల స్వభావోక్త్యలంకారమునకు సరిపోవును. మరియు దండ్యాచార్యుడు మాధుర్యగుణమున పేర్కొనిన రసమును వామనుడు అర్థగుణకాంతి లక్షణమున విధించెను. ఈ విషయమం దీతని లక్షణము భరతుని కాంతి గుణలక్షణమునకు దీటనవచ్చును. ఇట్లు వామనాచార్యు డొనరించిన లక్షణము సవిమర్శముగ వెలుంగుచున్నను గుణనిరూపణావసరమున నాతడు జూపిన వాచ్యవాచకవిభేదమువాత్రము నవీనాలంకారికుల ప్రశంసకుపాత్రము గాలేదు. ఈశబ్దార్థగుణవిభాగమును మమ్మటు మాణిక్యచంద్రజగన్నాథాదు లాక్షేపించిరి—నిరసించిరనియే మనము చెప్పవచ్చును. ఇంక నీగుణవిభాగము సత్యమునకుగాక సంప్రదా

యమునకై చేయబడె ననవచ్చును. శబ్దార్థసహితము కావ్యమని పలుకుట వలన గుణములుగూడ శబ్దగుణములు, అర్థగుణములు నని విభజించినచో బాగుండుననని తలంచి వామనాచార్యుడు ద్వివిధగుణవివేచనమునకు పాటుపడియుండును. వామనుని గుణముల లక్షణమును విమర్శించినచో వానిలో గొన్ని విపర్యయములుగ మనకు పొడగట్టును. వామనుని శబ్దగుణప్రసాదలక్షణమును దిలకించినచో నిది ఓజోగుణవిపర్యయముగా జూపట్టును. ఆతడే దీనిని ఓజోగుణవిపర్యయముగా భావించి, ప్రసాదగుణము శుద్ధమైనచో దోషమనియు, ఓజోగుణసంప్లవమున నది గుణముగా భాసించుననియు వచించెను. విరుద్ధములైన వీనిరెంటి కిని సాంగత్య మెట్లు సంభవించునని ప్రశ్నించి, 'కరుణప్రేక్షణీయ ములలో సుఖదుఃఖసంప్లవమువోలెనే విరుద్ధగుణములైన ఓజమునకును ప్రసాదమునకును సమావేశ మనుభవసిద్ధ'మని వామనుడు శ్రమపడి సమర్థించెను. మరియు వామనుని శ్లేషమును ప్రత్యేకగుణముగ నంగీ కరింపక మమ్మటాచార్యు డిది ఓజోగుణవిభేద మని వచించెను. వామ నుని సౌకుమార్యము పారుష్యదోషాభావమేకాని వేరొండుగాదనియు గ్రామ్యత్వదోషాభావమే ఉదారతాగుణముగా ప్రకాశించుననియు నాధునికులు పలికి వీనిని ప్రత్యేకగుణములుగా సమ్మతింపరైరి. ఇంతియేకాక వామనుని సమాధిగుణము కేవలగుణముగా నేరదనియు, చిత్తసమాధి, అనగా అవహితచిత్తత లభింపనిచో కావ్యరచనయే సంభవింపదనియు నవీనాచార్యులు నొక్కివక్కాణించిరి. ఈరీతిగా వివిధాక్షేపణ లొనరించి, వామనుని వింశతిగుణవివేచనమునకు స్వస్తి మంత్రము పఠించి, వీనిలో రసోపస్కారకములై చిత్తమునకు ద్రుతి, విస్తర, వికాసముల నొదవించు మాధుర్యము, ఓజము, ప్రసాదము లను మూడుగుణములమాత్రమే ముఖ్యముగ సంగ్రహించిరి.

---

# రీతిమతము-గుణాలంకార నిత్యానిత్యసంబంధాదులు

(గుణాలంకార నిత్యానిత్యసంబంధము–
సర్వాలంకారమూలసూత్రనిర్ణయము)

ఈ రీతిమతమున నొక క్రొత్తవిశేషముగూడ గలదు. భామహోద్భటాదుల కాలమున రూపకాలంకారముగా నెన్నబడినది దండిసమయమునకు సమాధిగుణముగా మార్పునొందెను. ఇటులనే అలంకారమతమునందలి రసవదలంకారము వామనుని చేతులలో అర్థగుణకాంతిగా ప్రకాశించెను. దండ్యాచార్యుల స్వభావోక్త్యలంకార మిటులనే వామనుని నాటికి అర్థగుణమైన అర్థవ్యక్తిగా పరిగణితమయ్యెను. ఈరీతినే దండ్యాచార్యుల కాంతిగుణమును హేమచంద్రాదులు అతిశయోక్త్యలంకారముగా నంగీకరించిరి. మరియు అలంకారమతమునకు బీజప్రాయముగా భామహాచార్యుడు వినుతించిన ఉక్తివైచిత్ర్యమును వామనాచార్యుడు అర్థగుణమాధుర్యముగా స్వీకరించెను. ఈ ఉక్తివైచిత్ర్యబీజమే కాలవసంతాగమప్రభావమున కుంతలాచార్యప్రతిభాలవాలమున మొలకలెత్తిన నవనవలావణ్యతారుణ్యకావ్యలతికాలలామకు జీవభూతమై చెలువొందుటను చదువరులు మున్ముందు తిలకింపగలరు. ఈ గుణములగురించి నవీను లొనరించిన విమర్శనమును హేమచంద్రమాణిక్యచంద్రుల గ్రంథముల గాననగును. అందు హేమచంద్రుని విమర్శనావాక్యముల చాలవరకు భరతుని రసమతసందర్భమున వివరించితిమి. దీనివలన భరతదండివామనుల లక్షణములు చాలవరకు వేరువేరుగా నున్నవనియు, అందుచే వీరిలక్షణము సంపూర్ణముగానేరదనియు దెలియుచున్నది. ప్రస్తుతమున భరతుని ఓజోగుణమును పరిశీలింతము. వివిధవిచిత్రపదసంయుతమై, ఉదారసానురాగస్వరసంపన్నమై, సమాసవంతమైన వాక్యమున ఓజోగుణము ప్రకాశించునని భరతుడు వచించెను.

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

ఈలక్షణము దండ్యాచార్యుల ఓజోగుణలక్షణముతో కొంతవర కనుకూలించును. సమాసప్రాచుర్యమే ఓజోగుణమని దండి పలుకుటచే నది ప్రాయికముగ గద్యరచనాభూషణముగా గన్పట్టును. ఇంక నిదియే పద్యరచనావిషయమున గౌడవర్త్మమునకు ప్రాణప్రాయము. ఈసందర్భమున 'న్యూనవస్తువులకు ఉత్కర్షత వర్ణించుటయే' ఓజోగుణసారమని హేమచంద్రాదులు రచించిరి. మరియు భరతుని ప్రసాదలక్షణము దండిసమాధిలక్షణమునకు సాటివచ్చును. దీనిని వామనుడు వక్రోక్త్యలంకారముగా గ్రహించెను. ఇదియే నవీనుల మతమున లక్షణ, లేక ఉపచారవక్రతగా మారెను. భరతుని ఉదారగుణమునకును వామనుని ఉదారగుణమునకును విశేషభేదము గలదు. భరతుని లక్షణమునందువలె వామనుని ఉదారతాగుణమున రసభావాదులకు తావులేదు. కాని వీనికి వామనుని అర్థగుణకాంతియందు స్థలముంటచే దీనిని దానికి సరిపోల్పవచ్చును. ఈస్వల్పభేదములు విశేషముగ గన్పట్టుచున్నను, భరతాచార్యుని గుణగణమణినికరమునకు వామనాచార్యుడు బుద్ధివిశేషమున మెరుగువెట్టి, తళుకులొలుకునటుల వెలుగజేసె ననవచ్చును. ఈపగిది దా నెంత శ్రమ కోర్చి శక్తిసామర్థ్యముల వెచ్చపెట్టినను, గుణవివేచనారీతి రచనాసౌష్ఠవముల సంపూర్ణముగనే చెలంగి, సహృదయుల హృదయముల వశమొనరించుకొనలేకపోయెను.

ఆధునికులైన హేమచంద్రమాణిక్యచంద్రాదులు ఓజోగుణలక్షణవిధానమున మంగళుడనువాని నొకని ప్రమాణముగా వచించి దండ్యాచార్యుల లక్షణమును విమర్శించిరి. ఈఓజము గౌడీయోనే కాక రీతులన్నిటిలోను సామాన్యముగ గానవచ్చును. రాజశేఖరుడు గూడ మంగళుని పేర్కొని వాని లక్షణము కొంచె మించుమించుగా

వామనుని లక్షణముతో తులమూగునని చెప్పెను. దీనివలన రీతిమతము వామనాచార్యులకుపూర్వమే ప్రచారమున నున్నట్లు తేటపడును. కాని దానికి స్వరూపవైలక్షణ్యమును బ్రసాదించి, కావ్యాత్మతత్త్వవివేకమునకు ప్రారంభించి, ప్రాశస్త్యమును సంపాదించినకారణముననే, రాజశేఖరజయరథాదులు ఔద్భటులతో పాటు వామనీయులగూడ విశేషగౌరవభావమున ప్రమాణముగా వచించిరి. గుణవివేచనానంతరమున వామనుడు అలంకారలక్షణమును రచించెను. ఈఅలంకారములగురించి వామనుడు గ్రంథాదినే సూచించెను. అలంకారములవలననే కావ్యము గ్రాహ్యమనియు, సౌందర్యమే అలంకారమనియు మొదటనే వామనుడు నుడివెను అలంకృతియే అలంకారమనియు, కరణవ్యుత్పత్తిచేతనే అలంకారశబ్దము ఉపమాదుల వర్తించుచున్నదనియు వృత్తిని రచించెను. ఇట్లు పలుకుటచే వామనుడు క్రమప్రకారము దండ్యాచార్యుల లక్షణమును వృద్ధిపరచినటుల గానవచ్చును. వామనుని మతమున కావ్యమున కలంకారము లత్యంతావశ్యకములుగావు. సౌందర్యసంపన్నమైనచో కావ్యము శోభించును. ఈసౌందర్యము, అలంకారస్వరూపమీరీతి నుండునని వామనుడు నిరూపింపలేదు. ఈ సౌందర్య మనిర్వచనీయముగా గన్పట్టును. ప్రాయికముగ గుణాలంకారసంస్కృతశబ్దార్థములకే కావ్యనామము వర్తించుచున్నది. అందు గుణరీతులు ముఖ్యముగ కావ్యసౌందర్యసంపాదకమ్ములై చెలంగును. కావున గుణరీతులు కావ్యశోభకు ప్రధానములుగను, అలంకారములు అప్రధానములుగను మనము దలంపవలయును. దండ్యాచార్యు డీవిధమున గుణాలంకారములకు విభేదమును వివరింపలేదు. దండిమతమున గుణాలంకారములు రెండునుంగూడ కావ్యశోభాకరధర్మమ్ములై వెలుగొందును.

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

ఇంక వామనుని మతమువందన్నచో గుణములే కేవలముగ కావ్య శోభ నాపాదించు ధర్మములై ప్రకాశించును. గుణగణము సంపాదించిన కావ్యశోభ నలంకారసముదాయ మతిశయింపజేయును. అందువలననే గుణములు నిత్యములనియు, ఈ గుణనికరము లేనిచో కావ్యమునకు శోభ గలుగదనియు వామనుడు స్పష్టముగ వచించెను. ఈ గుణములు నిత్యము లనుటవలన అలంకారములు అనిత్యములని వేరుగ జెప్పనక్కరలేకయే మన కాభావము తేటపడునని వ్యాఖ్యాత రచించెను. దీనిచే కావ్యమునకు గుణములు సమవాయసంబంధమును (నిత్యసంబంధము), అలంకారములు సంయోగసంబంధమును (అనిత్యసంబంధము) గలిగి మెలంగుచున్నవని మన మెరుంగవలయును. అనగా కావ్యాత్మయైన రీతికి సంబంధించి గుణములును, కావ్యశరీరమైన శబ్దార్థములకు సంబంధించి అలంకారములును వెలుగొందునని భావము. ఈనిత్యము, లేక సమవాయసంబంధము ఓజము మొదలైన గుణములతో సమానముగనే, అనుప్రాసోపమాదులైన అలంకారములకు కొన్నిటికిగూడ గలదని మమ్మటాచార్యుడు రచించెను. నవీను లెట్లు భావించినను, వామనాచార్యుడుమాత్రము గుణరహితమై, అలంకారసహితమైనను కావ్యము శోభావహము గానేరదనియు, గుణసహితమై, అలంకారరహితమైనను కావ్యము సౌందర్యసంపన్నమై ప్రకాశించుననియు దలంచెను.

ఇంక అలంకారవిచారమునగూడ వామనుడు నూతనమార్గము ననుసరించెననియే మనము చెప్పవచ్చును. ప్రాచీనులలో స్వల్పసంఖ్యాసంయుతముగ నలంకారసంచయమును గ్రంథపేటికాంతరమున గుప్త మొనరించినమాత్రముననే పరమానందభరితుడైనవాడు వామనాచార్యు డొక్కడే. ఈ సంఖ్యావిషయముననేకాక లక్షణరచనా

సందర్భమునఁగూడ వామనుఁడు స్వతంత్రపథానుసారియే. వామనుఁడలంకారముల నీక్రిందివిధముగ విభజించెను :

౧. శబ్దాలంకారములు-యమకము; అనుప్రాసము.

౨. అర్థాలంకారములు-ఉపమ; ప్రతివస్తూపమ ; సమాసోక్తి; అప్రస్తుతప్రశంస ; అపహ్నుతి ; రూపకము ; శ్లేష ; వక్రోక్తి ; ఉత్ప్రేక్ష ; అతిశయోక్తి ; సందేహము ; విరోధము ; విభావన ; అనన్వయము ; ఉపమేయోపమ ; పరివృత్తి ; క్రమము ; దీపకము ; నిదర్శన ; అర్థాంతరన్యాసము; వ్యతిరేకము ; విశేషోక్తి; వ్యాజస్తుతి; వ్యాజోక్తి ; తుల్యయోగిత ; ఆక్షేపము ; సహోక్తి; సమాహితము; సంసృష్టి.

ఇటుల వామనుఁడు ముప్పదియొక్క శబ్దార్థాలంకారములతోనే సంతుష్టుఁడయ్యెను. ఇందు శబ్దాలంకారములు రెండుమాత్రమే. మిగిలినవన్నియు నర్థాలంకారములే. ఇంక నర్థాలంకారవర్గమంతయు ఉపమాప్రపంచగర్భితముగా వామనుఁడు భావించెను. ఈఉపమాలంకారప్రభావము భామహాచార్యులకాలమునుండియు పరంపరగా వచ్చుచున్నది. ఈకారణముననేకాబోలు అర్వాచీనాచార్యవర్యులు సాదృశ్యమూలకములు, లేక ఔపమ్యగర్భితములైన అలంకారములకు ప్రథమముననే అర్ఘ్యపాద్యాదిసత్కారము లొసంగి, అతిథిపూజన మాచరింపజొచ్చిరి. అనేకప్రకారవైచిత్ర్యముచే ఉపమాలంకారమే బీజభూతమని ప్రథమముననే నిర్దేశింపబడెనని రాజానకరుయ్యకుఁడును, సాదృశ్యవిచ్ఛిత్తివిశేషముల రూపకదీపకాద్యనేకాలంకారబీజత్వమున ఉపమాలంకారమే మొదటనే నిరూపింపబడెనని మల్లినాథసూరియు వచించిరి. కాని వామనుడు సర్వాలంకారప్రపంచమును ఉపమా

గర్భగోళమున లీనముగానున్నట్లు ప్రదర్శించి చూపరులకు భ్రాంతి గొలిపెను. ఈకతముననే వామనాచార్యుని అలంకారలక్షణముల కును మిగిలినవారి లక్షణములకును విశేష భేదము గానవచ్చును. ఉపమాగర్భితముగాకుంటచే వామనుడు, ఉదాత్త, భావిక, పర్యాయోక్త, సూక్ష్మ, రసవ, దూర్జస్వి, ప్రేయోలంకారములను పరిత్యజింపవలసివచ్చెను.

వెండియు, సాదృశ్యలక్షణయే వక్రోక్త్యలంకారమని వామనుడు మనము కనివినియెరుంగని లక్షణమును రచించెను. ఇతని విశేషోక్తిలక్షణము జగన్నాథుని రూపకలక్షణమును బోలును. వామనుని ఆక్షేపాలంకారము నవీనులలో కొందరి ప్రతీపాలంకారమునకును, మరికొందరి సమాసోక్త్యలంకారమునకును సాటివచ్చును. సమానవస్తువుచే అన్యాలాపమే అపహ్నుత్యలంకారమని వామనుడు లక్షణము విధించెను. తుల్యవస్తువర్ణనమున వస్త్వంతరనిహ్నవము అపహ్నవాలంకారమున ప్రకాశించును. అనగా అపహ్నవాలంకారమున మనము ఉపమేయమును గప్పివెట్టి ఉపమానమును వెలిపుచ్చుచుందుము. ఈసందర్భమున దండ్యాచార్యు డీఅపహ్నవాలంకారము ఔపమ్యమూలకమై చెలంగనక్కర లేదనియు, ఒకవస్తువును గప్పిపుచ్చి దానికి మారు వేరొకదానిని చేర్కొనినచో సరిపోవుననియు రచించెను. దండిమతమననుసరించి విశ్వనాథాదినవీనులు 'గమ్యమానౌపమ్యరహితమైన ద్వితీయభేదము'ను అపహ్నుత్యలంకారమున నంగీకరించిరి. ఇట్టి లక్షణవిభేదము లెన్నియో కలవు. గ్రంథగౌరవభయమున నింతతో విరమింతుము.

---

## రీతిమతము-ప్రాచీనప్రస్తుతమత తారతమ్యాదులు

(ప్రాచీనప్రస్తుతమతతారతమ్యము–రసరీతివృత్తిసంబంధవిభేదము)

ఈరీతిమతసంగ్రహము చాలవరకు గుణమతసారమును బోలియున్నను, దానికన్న నిదియే మిన్నయని మనము నిక్కముగ వక్కాణింపవచ్చును. అలంకారమతముకన్న గుణమతము విలక్షణముగను, గుణమతముకన్న రీతిమతము విశిష్టముగను నెలుంగుచున్నదని భావము. అలంకారములు కేవలబాహ్యసౌందర్యసంపాదకములు; అనిత్యములై కావ్యశరీరభూషణమాత్రములై మెలంగుచున్నవి. ఇంక గుణములు సంతత మాంతరంగికామూల్యతాపాదకములు; నిత్యములై కావ్యప్రాణప్రాయములై వెలుంగుచున్నవి. కావున పూర్వులు శరీరశోభకుమాత్రమే ప్రాకులాడిరి. తరువాత దండ్యాదులు గుణప్రాశస్త్యమునకై పాటుపడిరి. అందువలన కావ్యలక్షణము మొదట దేహమునకును, పిదప ప్రాణమునకును, తుదకు ఆత్మకును సంబంధముగలిగి, క్రమక్రమముగా విమర్శనావిజ్ఞానసర్వస్వ మభ్యుదయముగాంచెను. ఆత్మతత్త్వవిజ్ఞాన మను నూతనాంశ మాలంకారికుల దృక్పథము నాకర్షించెను. ఈ ఆత్మతత్త్వాన్వేషణ మొనరించినవారిలో వామనాచార్యుడే ప్రథముడు. ఇతడు రీతియే కావ్యాత్మగా నిశ్చయించెను. వామనుడు ప్రథముడగుటవలన నీతని విమర్శనము సమగ్రము, సమీచీనము గావచ్చును, గాకపోవచ్చును. ఏది యెట్టులైనను ఆత్మతత్త్వవివేక మను విశేషాంశ మొకటి వామనుని నయనపథమున గోచరమాయెను. అందుచే వామనునితరువాతివారందరును ఆత్మతత్త్వవివేచనకొరకై స్వకీయప్రతిభావిశేషమును వినియోగించిరి. ఇదియే భామహదండివామనాచార్యుల మతములంగల తారతమ్యము. శక్తిసామర్థ్యరహితులగుట నస్ఫుటస్ఫురితముగ కావ్యతత్త్వమును రీతిప్రవర్తితములుగా చిరంతనాచార్యులు వచించిరని ఆనందవర్ధను డాడినమాటలు

## కావ్యాత్మ - ప్రాచీనమతములు

కావ్యాత్మతత్త్వ విమర్శనమునకు గడంగినవారిలో వామనుడే మొదటి వాడని సూచించుచున్నవి. రసవిషయమునగూడ వామనుడు భామహాదులమేర మీరి ముంపంజవేసె ననుటకు ప్రమాణము గలదు. కావ్యవిశేషవిచార మొనరించుచు ప్రబంధములందు దశరూపకము (నాటకాదులు) శ్రేయమనియు, దశరూపకము చిత్రపటమువోలె విశేషసాకల్యముచే స్వాపయంగమమనియు వామనుడు రచించెను. ఈతడు నాటకమునం దత్యంతాదరము గలవాడగుటనే రసభావాదులకు, నిత్యశోభాదాయకములైన గుణములలో నవకాశము గల్పించెను. అర్థవ్యక్తిగుణమున భావములను, కాంతిగుణమున రసములను తావొసంగెను. వామనుని కావ్యలక్షణము సంకుచితస్వరూప స్వభావసంపన్నము గాదు. ఈతడు రసవంతములు, రసహీనములు నయిన వానికిగూడ జోటిచ్చెను. ఈతనిమతమున సౌందర్యమే కావ్యసర్వస్వమై వెలుగొందును. ఈ సౌందర్యము దోషహానమునను, గుణాలంకారాదానమునను సంభవించును. ఈ నియమము సర్వజనసమ్మతము. ఇటుల వామనాచార్యు డెంత శ్రమపడి సంకల్పించినను, పాప మీరీతిమతము - రసాలంకారగుణమతములవోలెనే - విశేషాభ్యుదయము గాంచనోచదయ్యె. వామనునివెనుక ప్రజ్ఞాశాలియు, ధీమంతుడును నైన రీతిమతావలంబకుడు కరవయ్యెను. మరియు, ఆనందవర్ధనమమ్మటాచార్యాద్యర్వాచీనాలంకారికులు గుణాలంకారరీతిమతముల ఖండించుటకై తమతమ ప్రతిభావిశేషమును ధారవోసిరి. ఏది యెటులున్నను, ప్రాచీనమతప్రభావమాహాత్మ్యములే నవీనమతసౌధనిర్మాణసంస్థాపనకు మూలస్తంభములై విరాజిల్లెను.

ఆధునికు లీరీతిమతము నెంతగా నిరసించినను, వా రీమతమునం గల సారముం గ్రహించి, నూతనమతముల కనుకూలించిన

రీతి దను మార్పుల నేర్పు మెయిం గావించిరి. రసధ్వనిపరిపోషకము
లై నంతవరకు వర్ణసంఘటనాదులను, సహృదయహృదయావర్జనాతి
శయనిమిత్తము లై నంతదనుక మాధుర్యాదిగుణములను నూతనాచా
ర్యులు పరిగ్రహించిరి. అనవసరముగ గుణముల సంఖ్య హెచ్చింప
బడెనని తలంచి, నవీను లాయాగుణముల ప్రయోజనముల బరిశీలించి,
మాధుర్యము, ఓజము, ప్రసాదములను గుణముల మూడింటినిమాత్రమే
సమ్మతించిరని మే మీవరలో రచించితిమి. ఈమూడుగుణములకును
వామనుని మూడురీతులకును సంబంధము గుదుర్చబడెను. ఇవియే
వైదర్భీ, గౌడీయా, పాంచాలీరీతులన పేరొందెను. ఆనందవర్ధనాదు
లీమూడుగుణములను, మూడురీతులను మాత్రమే సమ్మతిం
చిరి. ధ్వనిమతానుసారులు ఆనందవర్ధనాచార్యపథానువర్తులైరి.
కాని రీతిధ్వనిమతములకు జెందనివారు గొంద రీరీతివిచక్షణ
మునగూడ గృషిసల్పినట్లు మనకు నిదర్శనములు గలవు. వామనుని
మూడురీతులకన్న భిన్నమైన లాటీరీతిని రుద్రటాచార్యుడు పేర్కొ
నెను. ఈరీతివిభాగమునకు రుద్రటుడు నూతనలక్షణము ననుసరించెను.
సమాసరచనయే రీతిగా నాతడు గణించెను. ఈ పాంచాలీ,
లాటీయా, గౌడీయారీతులు క్రమముగా లఘు, మధ్యా, యతసమాస
రచనాభేదములని రుద్రటాచార్యుడు వచించెను. రెండుమూడుపద
ముల కూర్పుచే పాంచాలీరీతియు, ఐదారుపదముల పొందికవలన
లాటీశైలియు, యథాశక్తి సమాసభూయిష్ఠమై గౌడీమార్గమును
బ్రకాశించు నందురు. అగ్నిపురాణకర్త నాలుగురీతుల నంగీకరించి
నను, రీతివిభేదము పరుష, సరళ, సుకుమారాక్షరసంయోగముపై
నాధారపడు ననుభావమును వెలిబుచ్చెను. ఈరీతిచతుష్టయమునకు
భోజుడు ఆవంతికా, మాగధీభేదముల మరిరెంటిని జేర్చి, రీతు లారవి

నిశ్చయించెను. వైదర్భీపాంచాలీరీతులకు మధ్యస్థమై మాగధీరీతియు, ఖండరీతిగా ఆవంతికయు జెలంగునని యాతడు పలికెను. కావ్యమీమాంసలో రాజశేఖరుడు వామనుని మూడురీతుల వచించినను, కర్పూరమంజరిలో వత్సగుల్మ, మాగధీ, పాంచాలీరీతుల జేర్కొనెను. వాగ్భటాచార్యుడు గౌడీయా, వైదర్భిరీతుల రెంటినిమాత్రమే వక్కాణించెను; ఇందు మొదటిది స్వల్పసమాససంయుతము; రెండవది సమాసరచనాశూన్యము. ఇంక కుమారవాగ్భటుడన్నచో, రీతిత్రయమును సమ్మతించి, దీనికి గుణత్రయ మాధారమని పలికె. ఉద్భటుని వృత్తిత్రయమువలెనే వామనుని రీతిత్రయముగూడ రసధ్వని కుపచరించునని ఆనందవర్ధనాచార్యుల తాత్పర్యము. ఉద్భటాచార్యుల లలిత, పరుష, కోమలాత్మకానుప్రాసము, లేక ఉపనాగరికా, పరుష, మధ్యవృత్తులే వామనాదుల మతమున వైదర్భీ, గౌడీయా, పాంచాలీరీతులై వరుసగా పరిణమించెనని మమ్మటాచార్యుడు స్పష్టముజేసెను. మమ్మటాచార్యుల పలుకులవలన మన మీరీతివృత్తులు రెండును పర్యాయపదములనియు, వీనికి విశేషభేదము లేదనియు దలంపరాదు. మమ్మటుని వాక్యము సంగ్రహవాక్యముగా మనము భావింపవలయును. రీతివృత్తుల సత్యస్వరూపభేదము నీవాక్యము ప్రకటింపజాలదు. రీతికిని వృత్తికిని విశేషభేద మున్నది. వీని విభేదమును భోజుడు సరస్వతీకంఠాభరణమున విస్పష్టముగ వివరించెను. ఎట్లన—"వైదర్భాదికృతము లైన పంథలు కావ్యమార్గములుగా స్మరింపబడుచున్నవి. వ్యుత్పత్త్యర్థమును బరిశీలించినచో రీతికి గతియని అర్థము. ఇంక వికసించినచో విక్షేపముం బొందునట్లును, సంకుచితమైనచో విస్తరించునట్లును చిత్తమును వర్తింపజేయునదియే వృత్తియనబడు" నని భోజుడు

వచించెను. ఈలక్షణమును సూక్ష్మదృష్టి బరికించినచో సర్వలక్షణ సంపన్నమై, శబ్దార్థసమన్వితమై వెలయు పదసముదాయ సంఘటనమే రీతియని తేటపడుచున్నది. దీనికి భిన్నముగా సహృదయ హృదయరంజకమంజులశబ్దసంచయ రచనావైచిత్ర్యమే వృత్తియని బోధపడును. అనగా పదముల కొండొంటికి గల పొందికయే రీతియనియు, ఈపదముల కొండొంటికి గల పొందికవలన చదువరుల డెందముల నందళింపజేయునదియే వృత్తియనియు మన మెరుంగవలయును. అందువలననే రసవిషయవ్యాపారజననకారణవర్ణరచనావిశేషమే వృత్తియని రాజానకరుయ్యకుడు పలికెను.

ఇటుల పదరచనాబాహ్యసంఘటనమే రీతిగాను, దానిచే నాంతరంగికముగ నుదయించు చిత్తవృత్తివిశేషమే వృత్తిగాను దలంచుటంజేసి పూర్వులు రీతిభేదముల కుచితములైన వృత్తిభేదములగూడ గల్పించిరి. ఈ వృత్తులు క్రొత్తగ వచ్చినవిగావు. భరతమునినాటికే నాటకాదులలో ప్రచారముం గల్గి పరంపరగా కావ్యభేదములలో గూడ గాలిడజొచ్చెను. ఈ వృత్తుల పుట్టుకగురించి మునివరుడీతెరగున బలికెను. ఋగ్వేదమునుండి భారతీవృత్తియు, యజుర్వేదమువలన సాత్వతీవృత్తియు, సామవేదమునుండి కైశికీవృత్తియు, అథర్వవేదమువలన ఆరభటీవృత్తియు జన్మించెను. ఈనాలుగు వృత్తులలో వాక్ప్రధానము, పురుషప్రయోజ్యము, స్త్రీవర్జితము, సంస్కృతవాక్యయుక్తమునై భారతీవృత్తి ప్రకాశించుచుండును. సత్త్వగుణయుక్తము, న్యాయవృత్త సమన్వితము, హర్షోత్కటము, సంహృతశోకభావమునై సాత్వతీవృత్తి వెలుంగుచుండును. స్త్రీసంయుతము, బహునృత్తగీతోపేతము, శ్లక్ష్ణనేపథ్యవిశేష చిత్రాన్వితము,

కామోపభోగప్రభవోపచారము నై కైశికీవృత్తి వెలుఁగొందును. చిత్రయుద్ధసంకలితము, ప్రస్తావపాతప్లుతలంఘితచ్ఛేద్యాదిమాయాకృతేంద్రజాలాపరీవృతము నై ఆరభటీవృత్తి భాసించును. ఇట్లు భరతుడు విధించుటచే నీ వృత్తిచతుష్టయము నాటకనేపథ్యసంగీతాభినయాదులకును, తత్తద్రసభావోదయపోషణాదులకును సాహాయ్యకముగ నుండి, సామాజికుల చిత్తవృత్తిని యథావసరముగ సమయసముచితముగ మార్పునొందించుచుండెనని తేటపడును. ఈసందర్భముననే, హాస్యశృంగారకరుణరసప్రయోగములందు కైశికీవృత్తిని, వీరాద్భుతరసములలో సాత్వతీవృత్తిని, రౌద్రభయానకరసముల నారభటీవృత్తిని, బీభత్సకరుణరసములలో భారతీవృత్తిని పండితు లుపయోగింతురని భరతమునియే ఆయారసముల కాయావృత్తుల విభజించెను. ఈవృత్తివిభాగమున విశ్వనాథకవిరాజు కొంచెము మార్పుగలిగించెను. శృంగారరసమున కైశికీవృత్తియు, వీరరసమున సాత్వతియు, రౌద్రబీభత్సములలో నారభటియు, భారతీవృత్తి సర్వరసములందును ప్రయోజ్యమనియు, ఈవృత్తులే నాట్యమాతృకలనియు సాహిత్యదర్పణమున విశ్వనాథుడు వివరించెను. రీతు లారని పలికినట్లే భోజుడు వృత్తు లారని వచించెను. పైనాలుగువృత్తులకును మధ్యమారభటీవృత్తిని, మధ్యమకైశికీవృత్తిని జేర్చి ఆఱురీతుల కనుకూలించునటుల నారువృత్తుల గల్పించెను. ఇంక భోజదేవుడనినచో, సుకుమారార్థసంపన్నమై కైశికీవృత్తియు, ప్రౌఢార్థసందర్భమై ఆరభటీవృత్తియు, కోమలార్థము కోమల ప్రౌఢసమన్వితము నై భారతీవృత్తియు, ప్రౌఢార్థము, కోమలప్రౌఢసముపేతము నై సాత్వతీవృత్తియు, కోమలార్థము ప్రౌఢసంయుతము నై మధ్యమకైశికీవృత్తియు, ప్రౌఢార్థము, కోమలబంధయుతము నై మధ్యమారభటీ

వృత్తియు ప్రకాశించునని సరస్వతీకంఠాభరణమున శాసించెను. ఈ లక్షణమును గమనించినచో భోజుడు సూక్ష్మభేదములగూడ పాటించినట్లు గానవచ్చును. కాని చాలమంది నాలుగు వృత్తులను మాత్రమే సమ్మతించిరి. మరియు, ఒకరీతిలో ననేకవృత్తులును, ఒకవృత్తిలో ననేకరీతులును గలుగుట కవకాశ మున్నను, ప్రత్యే కరీతులకు ప్రత్యేకవృత్తులనుమాత్ర మాలంకారికులు విధించి యూన మూనిరి. నాటకముల కుపయోగించు వృత్తులకును, కావ్యముల కను కూలించు వృత్తులకును భేదము గలదు. అర్థప్రధానమై నాటకవృత్తి వెలంగును. దీనికి విపరీతముగా అక్షరప్రధానమై కావ్యవృత్తి వెలుంగును. వృత్తియనగా వ్యవహారమనియు, వాచ్యాశ్రయములైన వ్యవహారములే కైశిక్యాదివృత్తులనియు, వాచకాశ్రయములైనవే ఉపనాగరికాదివృత్తులనియు ఆనందవర్ధనాచార్యుడు నాట్యకావ్యవృత్తుల విభేదము వెలిపుచ్చెను. రసాదితాత్పర్యసన్నివేశితములై వృత్తులు కావ్యనాటకముల కపూర్వచ్ఛాయాసంపాదకములై, జీవభూతములై చెలువొందునని ఆనందవర్ధనాచార్యుడు రచించెను.

ఇంక నీగుణములను, రీతులను గురించి అభినవగుప్తపాదాచార్యు డిట్లు సంగ్రహముగా బలికెను. అన్యోన్యమేళనక్షమత్వమునను, సముచితచిత్తవృత్త్యర్పణమునను గుడమరీచాదిసంఘాతరూపతం జెందిన పానకమువోలెనే దీప్తలలితమధ్యమవర్ణనీయవిషయమై, గౌడీయ వైదర్భపాంచాలదేశహేవాకప్రాచుర్యమై త్రివిధరీతులు ప్రఖ్యాతిగాంచెనని అభినవగుప్తపాదుడు వచించెను. ఇట్లనుటవలన ఓజోమాధుర్యప్రసాదగుణముల మూడింటిని, వాని కనుకూలించిన రీతులు మూడింటినిమాత్ర మీతఁ డంగీకరించెనని చెప్పవలెను. మరియు గుణములకన్న భిన్నముగను, మిన్నగను రీతివృత్తులు లేవని

కూడ నీతడు సూచించెను. ఇందువలన విమర్శనావివేకము ముందంజవేసినకాలందియు ఉద్భటుని వృత్తులును, వామనునిరీతులును క్రమముగా వెనుకంజవేయజొచ్చెనని మనము దలంపవలయును. ఇంక నెవరైన నొకానొకవేళ వీనిని పేర్కొనినచో, గుణాలంకారరీతివృత్తులు కావ్యమున నుత్కర్ష హేతువులుగమాత్రమే నుతించిరి. అందుచే శౌర్యాదులవలె గుణములును, కటకకుండలాదులకైవడి నలంకారములును, అవయవసంస్థానవిశేషముభాతి రీతియు వచింపబడెను. కావున గుణాభివ్యంజకపదవిన్యాసమే రీతియై, కావ్యాంగసంస్థాహేతుభూతమై, కావ్యాత్మతత్త్వమై ప్రకాశించుచున్న రసధ్వన్యాదుల నుత్కర్షాధాయకమై వెలుంగుననియే పలుకబడెను. దీనివలన రీతియే కావ్యాత్మ గా నేరదనియు, గుణాలంకారము లింకమీద రీతికిగాక రసాదులకు సంబంధించినవనియు, రసాదులే కావ్యమునందు ప్రధానాంశములనియు తాత్పర్యము.

మరియు, అచలస్థితి నొంది గుణములు అంగియైన రసమునకు ఉత్కర్ష హేతువులుగ వెలంగునని ఆనందవర్ధనుని తరువాతివా రందరును భావించిరి. అందువలన రసాదులే కావ్యమున కత్యంతముఖ్యములుగాని, వామను డెంచినట్లు రీతి గాదని మమ్మటాదులు దలంచిరి. అనుప్రాసోపమాద్యలంకారము లంగద్వారమున హారాదులపగిది నుపచరించును. కావున అలంకారములు కావ్యశరీరమైన శబ్దార్థములకు సౌందర్యము నాపాదించి శరీరమూలమున కావ్యాత్మభూతమైన రసాదులకు శోభాతిశయము సంపాదించునని మమ్మటాదుల మతము. ఇందు గుణములు శబ్దార్థములకు సంబంధించునని పలికినప్పుడు, లక్షణామూలకముగను, ఉపచారమాత్రముగను సంబంధించునని చదువరు లెంచవలయును. ఇటుల భావించియే గుణములు సమవాయసంబంధమునను,

అలంకారములు సంయోగసంబంధమునను జెలంగునని మమ్మటుఁడు వాడెను. గుణములు శబ్దార్థముల కౌపచారికములని మమ్మటుడు పలికిన వచనముల నంగీకరింపక జగన్నాథపండితుడు వామనుని మతము ననుసరించి, గుణములు రసమాత్రధర్మములే కావనియు, మాధుర్యాదిగుణములు శబ్దార్థములకుగూడ వర్తించుననియు, కావున ఉపచారమును గల్పింప నక్కరలేదనియు వచించెను. ఇంక వామనాచార్యుడు కావ్యసౌందర్యమునుసరించి పలికిన పలుకుల నెల్లమతములవారు నామోదించిరి. అదియే నవీనుల గ్రంథముల విచ్ఛిత్తి, వైచిత్ర్యము, కవిప్రౌఢోక్తియు నై ఫలించి సర్వాలంకారబీజప్రాయమై మొలకలెత్తెను. ఇటుల రీతిమత మలంకార శాస్త్రమున విమర్శనావిజ్ఞానవికాసము నెంతప్రకటించినను దీనిని నవీను లాచూలముగ నంగీకరింపరైరి. అందువలన ధ్వనిమతమున కీరీతిమతము ప్రతికక్షిమతముగా నిలచి, దాని ప్రాబల్యము నరికట్టుటకు దగినంతశక్తిగలది గాలేకపోయెను. వామనుడు కేవలబాహ్యరచనాసౌందర్యవివశుడై, రీతియే కావ్యాత్మగా భ్రాంతినొందెను. నవీనుల విజ్ఞానసూర్యోదయకాంతుల కట్టెదుర వామనుని వివేకము ఖద్యోతప్రాయమై ప్రకాశపుంజమును ప్రసరింప జేయలేకపోయెను. మరియు ఆనందవర్ధనాదుల ననుసరించియే, ఆధునికుడైన విశ్వనాథు డిట్లు రీతినిగురించి రచించియుండును. "వామనుడు పలికినట్లు రీతి కావ్యాత్మ గాదు. సంఘటనావిశేషమే రీతిగా జెలంగును. అవయవసంస్థానరూపమై సంఘటనము మెలంగును. ఇంక ఆత్మయన్నచో దీనికన్న భిన్నమై వెలుంగు" నని సాహిత్యదర్పణమున వ్రాసెను. ఇంక వామనుని రీతివిభాగము స్వకపోలకల్పితము. ఏలననగా, రీతిస్వరూప

విశేషవర్ణనములు సరస్వతికిగూడ నశక్యమని దండి పలికిన పలుకుల గుణమతమున రచించితిమి. కావున అముఖ్యములను ముఖ్యములుగా భ్రమించి అప్రస్తుతప్రశంసను దండివామనులు గౌరకొనుచుచేగాబోలు, ఆనందవర్ధనమమ్మటాద్యర్వాచీనాచార్యవర్యులు తమ తమ ప్రతిభావిశేషమున గుణములలో ప్రధానములనుమాత్రమే స్వీకరించి, రీతిమతసత్యస్వరూపమును ప్రకటించి, మునిచంద్రుడు ప్రసాదించిన నాట్యరసమును కావ్యరసామృతముగా నంగీకరించి, ధ్వనిమతమణిదర్పణమున ప్రతీయమానార్థలావణ్యమును పరిపూర్ణముగ ప్రతిబింబింపజేసిరి. అందుచే నీరీతిసువర్ణమయశృంఖలలచే విశృంఖలవిహారసంచారసంకులభావమత్తచిత్తయైన కావ్యకామినియొక్క కాదంబినీవేణీశిరోమణిని వామనాచార్యవర్యులు స్వకీయప్రజ్ఞాప్రభావ మంత్రతంత్రసూత్రజాలములబంధించివైచినను, ఆతరళాయతేక్షణాసౌదామినీకలితకటాక్షవిలాసరసామృతధారాసార సముత్క్రాంతాయమానమానసులైన రసికజనమయూరకుమారవతంసు లామెకు బంధవిమోచనము గావించి, నూతనమతమందిరోద్యానవనసీమాంతరంబుల సరసపదవిన్యాససల్లాపలాస్యాభినయముల ప్రవర్తించుట కవకాశము గల్పించిరి. కావుననే గుణరత్నఖచితసువర్ణరుచిరాలంకారకృతరీతిరచనావిలాససౌష్ఠవమే కవితాసుధాంశువదనాసౌందర్య సర్వస్వము గావని నవీనాచార్యుల తాత్పర్యముగా విలసిల్లుచున్నది.

---

# కావ్యాత్మ

## ప్రాచీన మతములు

### ౫. రసమతసమాలోచనము

(భామహుడు - రుద్రటుడు - నాట్యరసచరిత్రము)

నాట్యాచార్యవాగ్జాలజటాజూటవినిర్గత రసామృతామరకల్లోలిని, మహోత్సాహతరంగసంఘసంహతి రసాతలసీమ ప్రవేశించి, భోగిలోకసాంగత్యముం గాంచి, భోగవతియై కొంతకాలము వసించి, స్వకీయశీతలత్వపావనత్వమాహాత్మ్యమున మర్త్యుల కమర్త్యత్వముం బ్రసాదించి, వారిని విబుధేంద్రుల గావింప గంగామతల్లియై మర్త్యము లోకమునం దవతరించెను. ప్రథమమున మునిచంద్రుడు నాట్యరసములను, తత్తద్రసోచితములైన విభావానుభావవ్యభిచారాదులను జర్చించినతరువాత భామహదండివామనాదులు తమశక్తికొలంది అలంకారశాస్త్రాభ్యుదయమునకై అలంకార, గుణ, రీతిమతముల నెలకొల్పి, కావ్యసౌందర్యసంపాదనమునకై ప్రయత్నించిరి. ఈవిధమున పూర్వాచార్యులు తమ బుద్ధికుశలత నంతయు నుపయోగించి కావ్యాలంకారగుణాదులకై ప్రత్యేకముగ ప్రయత్నముల నల్పుటం జేసి రసానుభవసౌఖ్యము కేవలముగ దృశ్యకావ్యరంగముననే సంచరించెను. దీనిని స్వప్రతిభావిశేషమున శ్రవ్యకావ్యసీమకుం దెచ్చి సామాజికులతోపాటు సాటిగా సహృదయులకుగూడ రసచర్వణా

సౌఖ్యమును గలిగించుటకు విశేషప్రయత్నమును గావించిరి. ఒకవేళ నాలంకారికులు కొందరు పొరబడినను, రసమును గుణాలంకారాదులకు నుపస్కారకముగానే తలంచిరి. ఈప్రకారము కొందరు కావ్యబాహ్యారామణీయకమునకై కృషిసల్పుచుండ, మరికొందరు భరతమునీంద్రుని రససూత్రసమాలోచనమునకై కష్టించుచుండిరి. వారి రససూత్రార్థసమాలోచనము చాలవరకు దృశ్యకావ్యములకుమాత్రమే సంబంధించి మెలంగుచుండెను. గుణాలంకారరీతిమతముల ప్రాబల్యమున రససూత్రార్థసమాలోచనాఫలితములు శ్రవ్యకావ్యసౌధాంతరమును బ్రవేశించలేకపోయెను. కావున నాలంకారికులు కేవలముగ నలంకారములకే శక్తిని వినియోగించిరి. కాని ఆత్మతత్త్వపర్యాలోచనకై ప్రయత్నింపలేదని మన మెఱుంగవలయును. ఆనందవర్ధనాచార్యులతరువాతనే రసప్రాచుర్యప్రాశస్త్యములు కావ్యములలోగూడ గణింపఁబడెను. ఈమధ్యకాలమున రసమతసమాలోచనమున భిన్నమతములు ప్రబలి దృశ్యకావ్యముల వెల్లివిరిసి, శ్రవ్యకావ్యమున జెలరేగిన అలంకార, గుణ, రీతిమతములలోగూడ కొంచెము కొంచెముగ రసమతతరంగభంగఘోషను ప్రతిధ్వనింపజేసెను. అనగా రసమతస్వరూపము సంపూర్ణముగ జర్చింపబడి నాటకములలో దాని ప్రాశస్త్యము గణింపబడెను. నాటకములు గణుతించిన రసస్వరూపమును భామహాదులు వీక్షించి, ఆరసమును తమతమ మతముల కనుకూలించినంతవరకు కావ్యములలోగూడ నుపయోగించిరి. అందుచేతనే గుణాలంకారములలో రసము స్వప్రభావమును క్రమక్రమముగా వ్యాపింపజేసెను. ఇంతతో నుదాసీనులుగాక నవీనులు రసాలంకారగుణరీతుల యోగ్యతను పరిశీలించి రసమునకు సముచితసత్కారమును సల్పిరి.

రసమునుగూర్చి భామహాదులు ప్రకటించిన భావముల పరీక్షించినచో దీనినిజము మనకు దెలియును. అలంకారము, లేక వక్రోక్తియే కావ్యజీవముగా భామహాదులు దలంచిరి. రసప్రభావమును భామహుడు సరిగ గురుతించినట్లు గానరాదు. రసవదలంకారసందర్భమునసే రసప్రసక్తి నాతడు దెచ్చెను. శృంగారాదిరసములు స్ఫుటముగ దర్శితములైనచో నది రసవదలంకారమని భామహుడు నుడివెను. దీనిచే రసమును భామహు డలంకారములలో జేర్చెనేకాని దానికన్న నెక్కువగ నాతడు గణింపలేదని తేలుచున్నది. అలంకారముల కుపచరించునంతమాత్రముగనే రసము గ్రహింపబడెను. మరియు "సైషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే" అని వక్రోక్తినిగురించి భామహుడు స్తుతించినదానికి అభినవగుప్తు డిట్లు వ్యాఖ్యాన మొనరించెను: "ప్రమదోద్యానాదుల విభావితముగా జేయును; విశేషముగ భావిత, మనగా రసమయముగా జేయును." అని అభినవగుప్తుడు ధ్వన్యాలోకలోచనమున 'విభావ్యతే' పద ప్రయోగమునకు స్వాభిప్రాయానుకూలముగ నర్థము జెప్పెను. దీనివలన రసాలంకారములు రెండునుంగూడ వక్రోక్తిమూలముననే సంభవించునని భామహాభిప్రాయముగా. భాసించును. కావున శృంగారాదిరసముల భామహు డెరుంగును; కాని రసమాహాత్మ్యమును పరిపూర్ణముగ నత డెరుంగునని చెప్పుటకు దగిన ప్రబలాధారము లేవియు లేవు. మరియు దండిపలుకులవోలెనే భామహుని వచనములుగూడ రసవిషయమున సందిగ్ధములు, సంశయాస్పదములుగానే కాన్పించుచున్నవి. అంతియేకాని నవీనుల విభావానుభావాదిపారిభాషికపదములంతగా వీరి గ్రంథములలో చదువరుల నెదుర్కొని వారి మానసముల నాకర్షించుటలేదు. భామహుని మతమున రసము కావ్యమునం

దంతటను ప్రవహింపనక్కర లేదు; వక్రోక్తిసందర్భమున రసస్ఫూర్తి గలిగినచో జాలును. మహాకావ్యమున నెల్ల రసములును పోషింప బడవలయునని మాటవరుసకు భామహుడు వ్రాసినను, శాస్త్ర నిబంధనకాఠిన్యమును కావ్యరసము తగ్గించు ననుభావమును వెలి పుచ్చెను. ఈతని భావమునకు రుద్రటుడు చేయూత నిచ్చెను. దీనిని చెట్టబట్టియే కాబోలు, అభినవగుప్తపాదుడు శాస్త్రములు ప్రభుసమ్మితము లనియు, కావ్యములు జాయాసమ్మితము లనియు ముక్తకంఠముగ వచించెను. మరియు వృత్తులే కావ్యమాతృకలని పలుకుచు, ఇతివృత్తము రసోచితమై చెలంగవలయునని భరతుడుప దేశించుటంజేసి రసజీవితత్వము సమ్మతింపబడెనని అభినవగుప్తుడు లోచనమున రచించెను. స్వాదుకావ్యరసోన్మిశ్రమై వాక్యార్థ మను భవింపబడు నను భామహుని ప్రమాణవాక్యమును అభినవగుప్తుడుదాహ రించెను. దీనికి నాధారముగ రసాదితాత్పర్యసన్నివేశితములైన వృత్తులు కావ్యమున కపూర్వశోభ నొసంగునని ఆనందవర్ధనుడు వచించెను. కావున నవీను లేరీతిగా బలికినను భామహాదులు కావ్య మున రసప్రాధాన్యము నంగీకరింప లేదనియు, చమత్కారిత్వమే కావ్యజీవముగా దలంచుటవలన కావ్యరసమును ప్రాచీను లముఖ్యము గానే భావించిరనియు మనము గ్రహింపవలయును. ఇచట కావ్య రసమునకును నాట్యరసమునకును చాలభేదము గలదు. కావ్యరస మనినపుడు పూర్వుల మతమున రసము కావ్యమునకు ప్రధానము గాదు; నాట్యరస మనినచో రసము నాటకమునకు జీవితభూతము. కాలక్రమమున రసము కావ్యమునకుగూడ ప్రాణప్రాయముగా స్వీకరింపబడెను. కాని భామహాదిచిరంతనులుమాత్రము కావ్య రసమనినచో వక్రోక్తి మొదలైనవిగానే తలంచిరని మనము గమనింప

వలయును. అందువలననే స్వాదుకావ్యరసోన్మిశ్రమని భామహుడును, రసవంతమైన వాక్యము మధురమని దండియు పలికిరి.

ఈ రసవిషయమున భామహునికన్న దండి మిన్నయని మనము దలంపవచ్చును. భామహునిపగిది నలంకారములలో రసమునకు తావొసంగినంతనే తా నూరకొనలేదు దీనికి గుణములలోగూడ స్థల మొసంగి, భామహునికన్న దండ్యాచార్యుడు రసమును విశేషముగ గౌరవించెను. మరియు వాక్యములలోను, వస్తువునందునుగూడ రస ముండునని దండి పలికెను. రసవదలంకారమును జర్చించుచు, మాధుర్య గుణమునందలి రసమునకును, దీనికిని గల భేదము నొకింత సూచించెను. అంతియేకాక వాగ్రసము, వస్తురసమునన రెండుతెరగుల రసము వెలుగొందును. అనుప్రాసాదులచే వాగ్రసమును, అగ్రామ్యత్వమువలన వస్తురసమును దీపించును. శ్రుతివర్ణానుప్రాసములచే వాగ్రసమును, అగ్రామ్యాభిధేయతచే వస్తురసమును దండిమతమున గాన్పించునని హేమచంద్రాచార్యుడు రచించెను. హేమచంద్రుని భావముతో మాణిక్యచంద్రు డేకీభవించెను. కావున అనుప్రాసముగలచోటను, గ్రామ్యత్వములేనిచోటను రసావహమని దండిమతము. రసవదలంకారమున రసము లెనిమిదివిధములని పలుకుటవలన నాతడు ప్రాచీనుల మార్గముననే శాంతరసమును సమ్మతింపలేదని స్పష్టమగును. మరియు రసవదాద్య లంకారముల విమర్శనమున, శృంగారరౌద్రవీరకరుణరసముల నలంకార ములుగా దండ్యాచార్యుడు గ్రహించెను. ఈరీతిగానే బీభత్సహాస్యా ద్భుతభయానకములుగూడ రసవదుదాహరణములుగా గైకొనవచ్చునని దండి పలికెను. ఇట్లు ఊర్జస్విప్రేయము రసవదలంకారములలోనే కాక మహాకావ్యలక్షణమునగూడ రసభావముల ప్రసక్తి నాతడు దెచ్చెను. దీని ననుసరించియే 'రూపబాహుళ్యయోగమున రతియే

శృంగారరసము'గాను, 'ఉత్కృష్టకోటి నధిష్ఠించి క్రోధము రౌద్ర రసము'గాను మార్పుజెందునని దండ్యాచార్యుని మతముగా అభినవ గుప్తపాదాచార్యులు వచించెను. దండ్యాచార్యులరసమతము భట్ట లొల్లటుని మతమును బోలియున్నదనియు, దానిచే విభావాను భావముల సంయోగమున ప్రతీయమానమగు స్థాయిభావమే రస మనియు దండి భావించినట్లు అభినవగుప్తహేమచంద్రులు రచిం చిరి. కాని కావ్యాదర్శమునందలి రసవదాద్యలంకారసందర్భమున గల రసాదివివేచనమును పరిశీలించినచో నింతస్ఫుటముగా నది గోచ రింపదు. శృంగారాదిరసముల నెనిమిదింటిని, రత్యాదిస్థాయిభావముల నెనిమిదింటినిమాత్రమే దండి పేర్కొనెను. ఆయాస్థాయిభావములు పరిపోషణముజెంది, ఆయారసములుగా దీపించి, తాము రసవదలం కారముగా ప్రకాశించుననిమాత్రమే దండ్యాచార్యులు భావించెనని చెప్పవచ్చును. ఇంతకన్న నెక్కువగా పలంచుటకు దగిన సాధన సామగ్రి కావ్యాదర్శమున గన్పట్టదు. దండ్యాచార్యు లీసందర్భమున రసభావాదుల నలంకారములుగానే స్మరించెనుగాని వేరొకరీతిగా నెంచలేదు. రసము స్వోత్కర్షకుగా ఘోషింపబడక, వాచ్యాలంకార సౌందర్యసంపాదనార్థముమాత్రమే ప్రశంసింపబడెను. ఈప్రకారమే భావమునుగూడ వాచ్యవాచకశోభాధాయకముగానే దండి వ్రాక్రు చ్చెను గాని దీనికన్న నెక్కువగ దాని వినుతింపలేదు. అందువలననే భామహాదు లలంకారములకును, దండిగుణములకును ప్రాముఖ్యము నొసంగి దీని కనుకూలముగనే వారు రసభావాదుల నలంకారములలోను, గుణములలోను గలిపి చర్చించిరేకాని ప్రత్యేకములుగను, ప్రధానములు గను విమర్శింపరైరి. కావున గుణాలంకారములతోపాటు రసభావముల విషయమునగూడ భామహునికన్న దండ్యాచార్యుడే విశేష విను

ర్శనావివేకమును ప్రకటించెను. దీనివలన భామహునినాటికన్న దండి కాలమునకు రసప్రభావము క్రమముగా గణింపబడి కావ్యములలో దానికి తావొసంగబడెనని మన మూహించుట కవకాశమున్నది.

కావ్యగుణములు, కావ్యాత్మవిషయమునను వామనుడు దండ్యాచార్యుల నతిశయించినను, రససందర్భమునమాత్రము వెనుకబడెననియే చెప్పవలయును. ఉపమాప్రపంచగర్భితముగా సర్వాలంకారముల సంగ్రహించినకతమున వామనునకు రసవదాద్యలంకారముల జర్చించుటకు వీలులేకుండెను. అందుచే నతడు రసమును నిత్యశోభాధాయకములైన గుణములలో గణించెను. దీప్తరసత్వమే అర్థగుణకాంతిగా వామనుడు లక్షణము గూర్చెనని చదువరు లెరుంగుదురు. ఈరీతిగా రసములను సుగుణములలో స్వీకరించుటకు భరతుని కాంతి ప్రసాదగుణముల లక్షణము వామనునకు దోడ్పడియుండును. ఈ సందర్భమున దండ్యాచార్యుడు రసమును మాధుర్యగుణమునను, రసవదాద్యలంకారములను రెంటిలోను గణించెను. ఇంక వామనుడు రసము నొక్క కాంతిగుణమునందుమాత్రమే గ్రహించెను. అందుచే వామను డితరవిషయముల నెట్లు దండిని మించినను రససందర్భమున మాత్రము వెనుకబడెననియే చెప్పకతప్పదు.

భామహమతానుసారులముగనే ఉద్భటుడు రసవదూర్జస్విప్రేయోలంకారముల సందర్భముననే రసమును జర్చించెను. ఈతడు రసములు తొమ్మిదనియు, స్థాయిసంచారి విభావాభినయాస్పదమై రసము ప్రకాశించుననియు, చైతన్యభేదమున నాస్వాదితమై రసవదలంకారము భాసించుననియు వచించెను. మరియు రసభావాదుల గురించి ఊర్జస్వి అలంకారమునను, రసభావతదాభాసప్రశమబంధనములగురించి సమాహితాలంకారమునను చేర్కొనెను. దీనివలన

భట్టోద్భటుడు రసభావాదుల నన్నింటిని అలంకారపరముగానే భావించెనని మనము తలంపవలయును. ఈఅలంకారలక్షణమును విమర్శించినచో రసమునుగురించి ఉద్భటుడు పూర్వులకన్న నెక్కువగనే వివరించెనని చెప్పవచ్చును. దండివామనులకన్న విశేషాంశముల మన మీతని గ్రంథమునుండి నేర్వగలము. ఎనిమిదిరసములనుమాత్రమే దండి వచించెను. ఉద్భటుడు శాంతరసమునుగూడ చేర్చెను, విభావానుభావస్థాయిసంచారిభావములను, రసభావాభాసప్రశమాదులను, నాట్యరసాదులను మొదలుగాగల విశేషముల నెన్నిటినో సంగ్రహముగ వివరించెను. కాని భట్టోద్భటు డీరసపరికరముల నన్నింటిని రసవదాద్యలంకారపరముగానే భావించెనుగాని వేరుగా దలంపలేదు. ఈసందర్భమున నుద్భటుని వ్యాఖ్యాత ప్రతీహారేందురాజు రసభావాదుల స్వరూపమును, కావ్యమున కెంతవరకు రసము జీవముగా వెలంగు నను సంగతుల నెల్ల వ్యాఖ్యానమున రచించెను. కావ్యహేత్వలంకారవ్యాఖ్యానమున రసాద్యధిష్ఠిత మైన కావ్యము జీవరూపమై వెలుంగుననియు, అందుచే రసాదులకు కావ్యాత్మత్వము సిద్ధించెననియు ప్రతీహారేందుడు నిశ్చయించెను. దీనిచే నిదియే భట్టోద్భటుని భావమని మనము భ్రమింపరాదు. కావ్యాలంకారసంగ్రహమునందు రససమాలోచన మసంగతమనియో, లేక గ్రంథగౌరవభయముననో ఉద్భటాచార్యుడు రసవిషయమును విశేషముగ వివరింపలేదు. ఈతడు ప్రసంగించిన భాషణములచే అలంకారోపస్కారకముగనే రసము ఉద్భటునిచే స్వీకరింపబడె ననియు, భామహదండివామనులకన్న భట్టోద్భటునకు రసపరిజ్ఞానము మిన్నయనియు మన మెన్నవలయును.

# రసమతసమాలోచనము-నాట్యరసచరిత్రము

ప్రాచీనాలంకారికులలో రుద్రటాచార్యు డొక్కడే రసమును సరించి స్పష్టముగ వచించెను. ఈతడు రసవివేచనమునకు నాలు గధ్యాయముల వినియోగించెను. రసవంతములైన కావ్యముల రచించి కవులు వన్నెగాంతురని ప్రకటించుచు రుద్రటుడు మొట్టమొదటనే మహాకవుల నుతించెను. ఈ వర్ణనము రసమాహాత్మ్యమును చెప్పకయే చెప్పును. దీనికిదోడుగ నీతడు పదిరసముల పేర్కొనెను. దండి యొనిమిదిరసములకు ఉద్భటుడు శాంతరసమునుగూర్చినట్లే ఉద్భటుని తొమ్మిదిరసములకు రుద్రటుడు ప్రేయ మను క్రొత్తరసము నొక దానిని జేర్చి మొత్తము పదిరసములని వచించెను. భామహాదుల ప్రేయోలంకారము రుద్రటుని ప్రేయోరసముగా మారియుండును. మధురాదులవలెనే రసనవలన రసత్వము సంభవించునని ఆచార్యులు చెప్పిరని రుద్రటుడు వచించెను. ఇచ్చట "ఆచార్య" పదము భరత మునీంద్రునకు సంబంధించునని వ్యాఖ్యాత రచించెను. ఇందువలన రసవిషయమున రుద్రటుడు మునిమతము నవలంబించెనని చెప్ప వచ్చును. ఇంతతో మానమూనక రుద్రటుడు సంభోగవిప్రలంభ శృంగారముల స్వరూపమును వివరింపజొచ్చెను. మరియు రసము ననుసరించి కావ్యమును రచింపవలయుననియు, నిట్లు రచింపబడిన కావ్య మాబాలవృద్ధమున కానందసంధాయకమనియు, విరసమైన కావ్యము హీనమనియు రుద్రటుడు నుడివెను. రససమ్మిశ్రమైనచో కావ్యము చతుర్వర్గఫలప్రదమనియు నాతడు వచించెను. కడపట రసోచితములైన రీతులగూడ నిర్ణయించి రుద్రటు డీరసప్రసంగము నుపసంహరించెను. సమాసరచనాభేదమే రుద్రటుని మతమున రీతిగా జెలంగునని మన మీవరలో జదివితిమి. ప్రేయము, కరుణము, భయా నకము, అద్భుతము నను నాల్గురసములకును వైదర్భీ, పాంచాలీ

రీతులను, రౌద్రరసమునకుమాత్రము లాటీయా, గౌడీయారీతులను రుద్రటుడు నియమించెను. దీనివలన మిగిలిన రసములకు రీతినిబంధన లేదని మన మెంచవలయును.

ఈసందర్భమున ఔచిత్యపదమును రుద్రటాచార్యు డుపయోగించెను. ఈ ఔచిత్యము ఆనందవర్ధనుని మతమున రసమునకు పరమరహస్యమై, క్షేమేంద్రుని మతమున కావ్యజీవితమై ప్రకాశించుట ముమ్ముందు జదువరులు గాంచగలరు. ఇంతకన్న రసమునుగురించి రుద్రటుడు విశేషముగ వచింపలేదు. ఈప్రసంగమునకైనను కావ్యమునకు రసము ప్రధానాంశ మగునో కాదో? భరతమునీంద్రుని రససూత్రార్థ మెట్టిదో? నాట్యరసము కావ్యమున కెంతవర కనుకూలించునో? రసోదయరసానుభవములు సహృదయశిరోమణుల కెట్లు లభించునో? మొదలైన విశేషసంగతుల నేమియు విప్పిచెప్పక రుద్రటుడు శృంగారాదిరసముల భేదములను, వానికి వలయు బాహ్యవస్తుసముదాయమునుమాత్రమే మనకు విశదపరచెను. మరియు నీతని గ్రంథమును పరిశోధించినచో రుద్రటుడు దానిలో మాడువంతులు కావ్యాలంకారాదులకుమాత్ర ముపయోగించెనని బోధపడును. ఇంక శాస్త్రాభ్యాసము రుచింపనివారికి రసావహముగా ప్రబంధమును రచించి ధర్మార్థకామమోక్షాదుల నుపదేశింపవచ్చును. కాన ప్రబంధము సరసముగా నుండవలెననియు, నట్టివారి హృదయము నాకర్షించుటకు రసము ముఖ్యమనియు, నీకారణముననే రుద్రటుడు రసప్రసంగమునకు ప్రారంభించినట్లును దోచును. రుద్రటుని మతమున శబ్దార్థసహితమై కావ్యము చెలంగుటంజేసి, అలంకారములు కావ్యసౌందర్యమునకు ముఖ్యములై, రసాదులుగూడ నలంకారములలో నొకవిభాగమై మెలంగునేకాని వేరేమియు గానేరదు. అందుచే

రుద్రటుడు అలంకారమతాభిమానియేకాని రసమతావలంబకు డని మన మెంచుటకు వీలులేదు. దీనికి విపరీతముగ రుద్రటుని మతము నందు శబ్దార్థములు కావ్యశరీరముగను, అలంకారములు భూషణము లుగను, రసాదులన్నచో సౌందర్యాదులవలె సహజగుణములుగను వెలుఁగొందునని నమిసాధుఁడు వ్యాఖ్యానమున వ్రాసెను. నమిసాధుని పలుకు లసత్యములని నిరూపించుటకు రుద్రటుని గ్రంథమున ప్రబల నిదర్శనము లేమియు గానరావు. మరియు రసభావధ్వనులు మూడును వాచ్యశోభాహేతువులుగా రుద్రటుడు గణించెనని రాజానకరుయ్యకుడు స్పష్టముచేసెను. అందుచే రుద్రటుడు అలంకారమతానుసారియై రసాదుల నలంకారపరముగా స్వీకరించెనని మన మెంచవలయును. కావున భామహోద్భటదండివామనుల రసపరిజ్ఞానముకన్న రుద్రటాచార్యుల రసస్వరూపవిజ్ఞానము విశేషమని తలంచనగును.

కావున ప్రాచీనాలంకారికు లందరును కావ్యశరీరసౌష్ఠవ సౌందర్యములకుమాత్రమే తమ శక్తిసామర్థ్యముల నుపయోగించినట్లు లీరసవివేచనసంగ్రహమువలన మనకు తేటపడును. అనగా పూర్వులు గుణాలంకారములవిషయమై విశేషప్రయత్నముసల్పిరి. అంతియే కాని, ఏది సహృదయుల కానంద మొసంగును? కావ్యమునకు ఆత్మ యొకటి గలదా? ఉన్నచో నది యేది? అను కావ్యాత్మతత్త్వము గూర్చిన ప్రశ్నలు చిరంతనుల చిత్తముల సుంతయేనియు గలంచలేదు. కావ్యాత్మనుగురించిన ప్రశ్నము ప్రథమమున వామనాచార్యుల మానసమునందే మొలకలెత్తెను. అతడు రీతియే కావ్యాత్మగా చాటించుటను చదువరులు వినియేయున్నారు. ఈరీతినిగురించి రీతిమతమున జర్చించియుంటచే నిచట మరల వచింప పనిలేదు. పద రచనాప్రకారము, లేక శబ్దసంఘటనాసంవిధానమునకును, గుణాలం

కార సంయోగమునకుమాత్రమే పూర్వాచార్యులు ప్రయత్నించిరి. ఇంతియేకాని గుణాలంకారరీతులకును, కావ్యానందసంధాయకమైన రసమునకును గల పరస్పరసంబంధమును గణుతించి తత్తదుచిత సన్నివేశమును జక్కగా ప్రదర్శించుటకు ప్రాచీనాలంకారికు లెరుంగరు. అందుచేతనే వారు రసమును గుణాలంకారములలో జేర్చి చర్చించిరి. ఇదియే వారలకు దెలిసిన రసపర్యాలోచనమై భాసించును. ఈలోపమును సవరింపనెంచి కొంద రాలంకారికులు భరతమునిచంద్రుని రససూత్రమును సమగ్రముగ, ససూక్ష్మముగ, సమీచీనముగ విమర్శించి రసోదయాస్వాదముల భిన్నభిన్నమతముల ప్రతిపాదించిరి. ఈపూర్వాచార్యుల విజ్ఞానపూర్వకభాషణములు రసధ్వనిమతగిరిగహ్వరముల మార్గమొగి సహృదయశ్రవణకుహరముల బ్రవేశించి హృదయానందవర్ధనములై క్రమక్రమముగా ప్రకాశించెను.

---

### (భట్టలోల్లటు, శ్రీ శంకుక, భట్టనాయకులు-రససూత్రార్థ వివిధవాదములు)

రసమే నాటకములకు జీవితమని భరతమునీంద్రుడు ప్రతిపాదించుటవలనను, భరతుని "విభావానుభావవ్యభిచారిసంయోగాత్ రసనిష్పత్తిః" అనుసూత్రమును వ్యాఖ్యాతలు వేరువేరుమతముల ననుసరించి నిర్వచించుటవలనను, రసమతము రూపకరంగమున సర్వాధికారసమన్వితమై క్రమక్రమముగా భామహాదులైన ప్రాచీనాలంకారికులచేగూడ తమతమ గ్రంథముల నలంకారాదులలో గొన్నిటి జేర్చబడినట్లు వెనుకటి యధ్యాయమున రచించితిమి. ఇంతకుమున్నే రససూత్రభాష్యములలోని సందిగ్ధపదములవలన భిన్నమతములు

వెలసెనని రసమతమున సూచించితిమి. కాన మునిచంద్రుని రస సూత్రసమన్వయమునను, రసోదయక్రమమునను వెలువడిన భిన్న మతముల సంగ్రహముగా నిట వివరింతును. విభావ, అనుభావ, వ్యభిచారిభావముల కలయికవలన రసము జనించునని భరతుడు నుడివెను. ఈసూత్రమును పరిశీలించి సమన్వయమొనరించినవారు నలుగురు. అందు భట్టలొల్లటుడు మొదటివాడు. రెండవవాడు శ్రీశంకుకుడు. భట్టనాయకుడు తృతీయుడు. కడపట నీముగ్గురి మతములు సమగ్రములుగా లేవని అభినవగుప్తపాదుడు క్రొత్తగ నొకమతమును నెలకొల్పెను. వీనిలో అభినవగుప్తపాదాచార్యుల మతమునే మమ్మటాదులు శిరసావహించిరి. మొదటిముగ్గురి గ్రంథములును మనకు లభ్యములు గాకున్నవి. వీరివీరి మతసంప్రదాయము ననుసరించి, సంగ్రహమురచించి, అభినవగుప్తపాదాచార్యులు నాట్యవేదవివృతి యను అభినవభారతివ్యాఖ్యానమునందు వారివారి వాదముల సంపూర్ణముగ విమర్శించెను. అందుచే ఆచార్యాభినవగుప్తపాదుని రసాధ్యాయవ్యాఖ్యానమునం గల సంగ్రహమునే వాగ్దేవతావతారుడని ప్రఖ్యాతిగాంచిన మమ్మటాచార్యుడు కావ్యప్రకాశగ్రంథమునందు పొందుపరచెను.

## ఉత్పత్తివాదము

ఈసంగ్రహము ననుసరించి భట్టలొల్లటుడు భరతుని సూత్రము నీక్రిందివిధమున జర్చించె ననవచ్చును: విభావమే రసమునకు గారణము. అందుచే నిది అనుకార్యము, లేక ఉత్పాద్యమును. ఇంక నిష్పత్తియనగా ఉత్పత్తి, లేక పుష్టియని అర్థము జెప్పవలయును. కాన వేషభాషాభినయాదిశేషముల రామాదులవలె నటించి, సామాజికుల రంజింపజేయు నటులయందు రామాదులయందలి రస మారోపింప

బడుచున్నది. అనగా సాక్షాత్సంబంధమున లేక ముఖ్యవృత్తిచే రామాదులలో గల స్థాయిభావమే నాట్యకళానైపుణ్యమున నాయకాదిపాత్రముల ప్రదర్శించి, చూపరుల చిత్తము నాకర్షించు నటునియం దున్నట్లు సమ్మతింపబడెనని మమ్మటాదులు స్పష్టమొనరించిరి. ఇచట రామాదులయందున్న రసము నటునియం దేవిధముగ గానవచ్చునో, నాయకునిలో నున్న రసము నటునిలో గలదని తలంచినంతమాత్రముననే చూపరు లెట్లు సంతసింతురో మనకు దెలియరాకున్నది. నటుడు గనబరచిన భావమును గాంచినంతనే, చూచువారి మానసముల నట్టిభావము పుట్టి మోద మొదవింపజాలదు. అటుల గానిచో కావ్యమునకన్న వేరైన ప్రాకృతజనశృంగారాదుల జూచుటవలనగూడ మన కానంద ముదయింపవలయును. భట్టలొల్లటుని మతమును విమర్శించుచు ననేకు లీభావమునే వెలిపుచ్చిరి. మరియు నీతని కార్యకారణభావము రసమునకును విభావాదులకును గల సంబంధమును స్థిరపరుపనేరదు. ఏలననగా కారణమునకు నాశము సంభవించినను కార్యము గానవచ్చును. దీనికి భిన్నమై విభావాదుల ఉత్పాద్య, ఉత్పాదకభావరూపమున రసోత్పత్తి కలుగుచుండును. మరియు విభావాదినాశనమున రసము నష్టమగును. అందువలన రసమును లౌకికకార్యముగా మనము స్వీకరింపరాదు. కార్యకారణసంబంధము సమకాలీనము గాదు. రసమును కార్యముగా గ్రహించినచో రసానుభవము విభావాదులతో సమకాలికముగా నుండరాదు. ఈసందర్భమున విశ్వనాథు డిటుల వివరించెను. విభావాదిజ్ఞానకారణకమై రసము కార్యమైనచో, రసప్రతీతికాలమున విభావాదిప్రతీతి గలుగదు. ఏలనన, కారణజ్ఞానతత్కార్యజ్ఞానాదు లేక కాలమునందే కానరావు. చందనస్పర్శజ్ఞానమును తజ్జన్యసుఖజ్ఞాన

మును నొకక్షణముననే సంభవింపవు. కావున విభావాదిసమూహా లంబనాత్మకమైన రసప్రతీతి విభావాదిజ్ఞానకారణజన్యకార్యము గాదని తాత్పర్యము.

అనుమితివాదము

మీమాంసాశాస్త్రసంప్రదాయానుసారు లైన భట్టలొల్లట ప్రభృతుల ఉత్పత్తివాదమును శ్రీశంకుకాదు లంగీకరింపరైరి. భట్టలొల్లటుడు సామాజికుల చిత్తవృత్తిపక్షము ననుసరించి భరతుని సూత్రమున కర్థము చెప్పలేదు. ఈతడు నటుని పక్ష మవలంబించి సూత్రార్థము వచించె ననవచ్చును. ఇంక శ్రీశంకుకుడన్నచో రస నిష్పత్తియన రసోత్పత్తి గాదనియు, ఇది సామాజికుల రసాను మితియే యనియు వచించెను. ఇది యేరీతి సంభవించుననగా, నటకుని నాట్యకౌశలమున రామాదులకును తనకును పోలిక గలదనునట్లు విభా వాదుల నటించుటచే, నాయకాదుల స్థాయిభావము, నిజముగను లేకున్నను, నటునియం దున్నట్లు చూపరు లనుమానించుచున్నారు. నటునియం దీభావ మున్నట్లు లనుమానించుటవలన చూచువారల డెందముల నొకానొకచంద మంచు ముడియించి, వలపుతలపులు మొలకలెత్తుటవలన గలుగు సుఖమే రసముగా భావింపబడుచున్నది. ఈమతమున విభావాదులు రసమునకు అనుమాపకములు; లేక గమక ములు. కావున రసము గమ్యము, లేక అనుమాప్యమై భాసించును. అందుచే అనుమాప్య - అనుమాపకసంబంధముననే రసనిష్పత్తి, యనగా రసానుమితి గలుగును. ఈఅనుమానము చిత్రతురగన్యాయ ముపై నాధారపడియుండును. ఇచట సత్యబుద్ధికిని, మిథ్యాబుద్ధికిని భేదమును గమనింపవలయును. నటుని జూచినంతనే మొదట "ఇతడు రాముడు" అని తలంచి పిదప "ఇతడు రాముడు గాడు" అని తోచి

నంతనే "ఇతడు రాముడు గావచ్చు, కాకపోవచ్చు" అనుసందియము గలిగె, తుదకు "ఇతడు రాముని వలెనున్నాడు" అను నియమవిషయమైన బుద్ధి గలుగును. ఇటుల సామాన్య, మిథ్యా, సంశయ, సాదృశ్య ప్రతీతులవలన, విలక్షణచిత్రతురగన్యాయమున "ఈరాముడు సుఖియే; అటుల నేనును సుఖినే" అను ప్రతీతిగల్గును. ఈమతమును విమర్శించుచు గోవిందుడు కావ్యప్రదీపమున నిట్లు వచించెను. ప్రత్యక్షమైన జ్ఞానమే చమత్కారము నొదవించును. అంతియేకాని అనుమితి మొదలైనవానివలన గలుగు జ్ఞాన మట్టిమోదముం గూర్పదను లోకప్రసిద్ధి నతిక్రమించి కల్పింపబడినకతమున నీమతము ప్రమాణము గాదని మహామహోపాధ్యాయుడు రచించెను. మరియు లౌకిక జ్ఞానసాధనములమూలముననే రసచర్వణసౌఖ్యము ననుభవించుటకు శక్యముగాదు. ఏలనన, రామాదుల చిత్తవృత్తివిశేషములు భూతకాలికము లగుటచే, వర్తమానములైన జ్ఞానకరణములవలన ననుమానించుట కసాధ్యము. ఈఅనుమానవాదము రసధ్వనికి సంబంధించినదగుటచే దీని నిచట విశేషముగ విమర్శింపక ఇంతతో విరమింతుము. స్థాయిభావమును నిశ్చయముగ నిరూపించుటకు విభావాదులను సాధనములుగ గ్రహించుటకు వీలులేదంటరయే శ్రీశంకుకాదుల మతమును ఖండించుటకు ప్రబలసాధనము. ఈసాధ్యసాధనసంబంధము స్థాయివిభావాదులకు సంభవింపదు. విభావాదులు కేవల వ్యంజకములుగానే వెలుగొందును. కావున విభావాదులు రసమునకు లొల్లటుడు దలంచినట్లు కారకహేతువులును, శంకుకుడు భావించినట్లు జ్ఞాపకహేతువులును గానేరవని నవీనులు వచించిరి. అందువలన నాయకాదుల భావవిశేషములు నేర్పరియైన నటుని యందున్నట్లు చూపరులు దలపోయుటచే, నటుని నటనమువలన

న్నాభావవిశేషములు చూపరుల మనముల నట్టిభావవిశేషములనే పుట్టించి, సంతోషము గలిగించునని భట్టలొల్లటుని భావము. ఇంక నటుని కపటనటనల చూపరులు తమ మనముల నాయకాదుల నిజ మనోభావముల ననుమానింతురని శ్రీశంకుకుని తాత్పర్యము.

## ఉత్పత్త్యాదివాద పూర్వపక్షము

ఈరెండుమతములును సంపూర్ణములు గావు. కారణ మేమన, విభావాదులవలన ఉత్పాద్యము, లేక అనుమాప్యముగా జెలంగు రసము విభావాదులు గానరాని సామాజికుల మానసముల నానందము నెట్లు గల్గింపగలదు? అనుప్రశ్నమునకు సరియైన సమాధానము నీమతములలో నొకటియు నొసంగుటలేదు. ఇంక నొకవేళ రసము సామాజికులలోగూడ వసించు నన్నచో, సామాజికులకన్న మిన్నయై, వేరైన రామాదినాయకుల ప్రత్యేకములైన చిత్తవృత్తివిశేషముల నేరీతి చూపరులు తమతమ చిత్తవృత్తివిశేషములుగా భావించి సంతోషము నెందగలరు? అనుప్రశ్నమునకు ప్రత్యుత్తరమును లొల్లటశంకుకుల మతము లొసంగనేరవు. ఈమతములంగల లోపముల నెల్ల భట్టతౌతభట్టనాయకు లీక్రిందివిధమున నత్యంతసమర్థముగ ప్రదర్శించిరని అభినవగుప్తపాదాచార్యులు ధ్వన్యాలోకలోచనమున సంగ్రహముగా రచించెను. "రసము పరగతమై ప్రతీయమాన మగుచున్న దన్నచో, నది తాటస్థ్యమై చెలంగునేకాని చూపరుల మనముల నిజముగ గరగింప నేరదు. రామాదిచరితాత్మకమై కావ్యాదుల వెలుంగుటచే నది స్వగతమై ప్రతీయమానము గాదు. స్వాత్మగతమై రసప్రతీతి గలుగుచున్న దన్నచో, స్వాత్మయందు రసోత్పత్తి నంగీకరింపవలయును. ఇది యుక్తముగాదు. ఏలనన విభావాదులవలె నుపచరించుట కేదియు లేకుంటచే సామాజికులయందు రసోత్పత్తి

గలదనుటకు వీలులేదు. కాంతాత్వము సాధారణము; వాసనావికాస హేతుభూతమై విభావనాప్రయోజక మగు ననినచో, దేవతావర్ణ నాదుల నెట్లిది సంభవింపగలదు? స్వకాంతాస్మరణము మన్యసంవే ద్యముగాదు. అట్టిచో, అలోకసామాన్యులైన రామాదుల సముద్ర సేతుబంధాదులైన విభావాదు లెట్లు సాధారణ్యమును భజించును? ఉత్సాహాదులుమాత్రమే స్మరింపబడవు. రామాదుల శక్తిసామర్థ్య ములకును, సామాజికుల శక్తిసామర్థ్యములకును పోలిక లేదు. శబ్ద ప్రతిపత్తివలన రసోత్పత్తి గలుగదు. కారణ మేమన, ప్రత్యక్షము గానే నాయకమిథునప్రతిపత్తి సంభవింపగలదు. ఉత్పత్తిపక్షము నంగీకరించినచో కరుణరసోత్పాదనమువలన సామాజికుల మాన సము దుఃఖభూయిష్ఠమై, కరుణప్రేక్షణాదుల చూపరుల కప్రవృత్తి గలుగును. ఇది సత్యముగాదు. ఇంక ఉత్పత్తిగూడ అభివ్యక్తియే యనినచో, నచటగూడ స్వగతమా, లేక పరగతమా యను పూర్వ దోషము గలుగును. కాన రసము కావ్యమువలన ప్రతీయమానము, లేక ఉత్పాద్యము, లేక అభివ్యఙ్గ్యముఅనుటకు వీలు లేదు."

భుక్తివాద సిద్ధాంతము

పైవిధమున పూర్వమతముల ఖండించి భట్టనాయకుడు రసానుభవవిషయమున నవీనవ్యాపారము నొకదానిని సృజించి నూతనమతమును ప్రతిపాదించెను. మమ్మటాదుల మతమున భట్ట నాయకుని వాదప్రతివాదము లిట్లు చెలంగును:

౧. విభావాదులు మిథ్యాభూతములైన కారణము లగుటవలన, సత్యసంపన్నమైన కార్యమైన రసోత్పత్తిని గలిగింప లేవు.

౨. రామాదినాయకాదులు ప్రత్యక్షముగ సామాజికులకు గన్పట్టకపోవుటచే, వారి చిత్తవృత్తివిశేషములైన విభావాదులు లభ్యములు గావు. అందువలన నలభ్యసాధనములచే ననుమానించుటకు శక్యముగాదు.

3. ఇంక నింతకుమున్నే శక్తిరూపమునుండి సామాజికుల కభివ్యక్త మగుచున్నదనుటకుగూడ వలనుపడదు. ఎందుచేననగా, వికాసమును బొందినంతట నచలభావములు క్రమక్రమముగా నంత రంగసీమనంతయు నావరించి రసప్రకృతి కాటంకము గలిగించును. ఇచటగూడ రసాభివ్యక్తి స్వగతమా, లేక పరగతమా యను సందియ ముదయించును.

ఈసంశయముల నెల్ల నశించుటకై, రసాస్వాదానందానుభవము భోజ్యభోజకభావసంబంధనుపయి నాధారపడియున్నదని భట్టనాయకుడు నుడివెను. కావున విభావాదులు భోజకములును, రసము భోజ్యము నై వెలుగొందును. ఈమతమున శబ్దాత్మకమైన కావ్యమునకు వ్యాపారత్రయము సమ్మతింపబడెను. ఈ మూటిలో మొదటిది మీమాంసకులచే, నైయాకరణులచే నంగీకరింపబడిన అభిధావ్యాపారము; రెండవది భావకత్వవ్యాపారము, మూడవది భోజకత్వవ్యాపారము నై చెలంగును. కావున అభిధాయకత్వ, భావకత్వ, భోజకత్వవ్యాపారత్రయసమన్వితమై శబ్ద మీ మత మున భాసించును. వీనిలో నిరంతరసాంతరార్థగతత్వమున అభిధ మెలంగుటచే లక్ష్యవిషయముగూడ నిం దిమిడియే యున్నది. ఇంక భావకత్వము, లేక రసభావనము అభినవగుప్తుడు సూచించి నట్లు భరతుని భావలక్షణమునుండి భట్టనాయకుడు సంగ్రహింపబోవును. సాధారణీకరణమునే భావకత్వ మందురు. ఈ వ్యాపా

రము వలన విభావములును, స్థాయిభావములునుగూడ సాధారణీకృతములుగా జేయబడును. కావున సీతాదివిశేషణములు కామినీత్వాదిసామాన్యములుగా నుపస్థితములై, స్థాయిభావాదులుగూడ సంబంధివిశేషానవచ్ఛిన్నత్వమున ప్రకాశించును. అనగా భావకత్వవ్యాపారము వలన సీత మొదలైన నాయికలు కేవలప్రత్యేకనాయికలుగాగాక, సాధారణకాంతాత్వమును బొంది, రామాదుల రత్యాదిస్థాయిభావాదులు, ప్రత్యేకసంబంధశూన్యములైన శృంగారాదిరసములను సామాజికులకు సాధారణముగ జనింపజేయును. ఇంక తృతీయమైన భోజకత్వవ్యాపారము మూలమున సాధారణీకృతమైన స్థాయిభావాదులు భుజింపబడును. ఇట్లు కావ్యమునను, నాట్యముననుగూడ భావకత్వవ్యాపారమువలన సాధారణీకృతముగా నొనరింపబడిన విభావాదులును, భోజకత్వవ్యాపార సాహిత్యమున నారీతిగా జేయబడిన రత్యాదిస్థాయిభావాదులును భుజింపబడుచున్నవి. అనన్యాలంబనము, సంవిత్స్వరూపము, లౌకిక సుఖానుభవవిలక్షణమునై సత్త్వగుణోద్రేకమువలన ప్రకాశించు ఆనందస్వరూపమే భోగమని సాంఖ్యసిద్ధాంతుల మతము. ఇది అనుభవ స్మరణప్రతిపత్తులకన్న విలక్షణమై వెలుంగును. మరియు ద్రుతి, విస్తర, వికాసాత్మమున రజస్తమోవైచిత్ర్యానను విద్ధసత్త్వమయనిజచిత్స్వభావనిర్వృతిచే ద్రుతివిశ్రాంతి లక్షణసమన్వితము, పరబ్రహ్మాస్వాద సచివమునై రసాస్వాదభోగము విలసిల్లును. ఈవ్యాపారత్రయమున అభిధాయకత్వము వాచ్యవిషయము; భావకత్వము రసాదివిషయము; భోక్తృత్వము సహృదయవిషయముగా ప్రకాశించును. మొదటి వ్యాపారమువలన వచింపబడిన విభావాదులు రెండవవ్యాపారమువలన సాధారణముగా నొనరింపబడును; మూడవవ్యాపారమువలన వానిని

సహృదయావతంసులు భుజింతురు. కావ్యార్థబోధ కలిగినవెంటనే భావకత్వవ్యాపారమునకు ప్రసక్తి కలుగును దీనివలన సీతాత్వరామత్వసంబంధము పోయి సామాన్యకామినీత్వరతిత్వాదులుమాత్రమే నిలచును. అంతట భోజకత్వవ్యాపారమహిమవలన సాధారణీకృతవిభావాదిసహకృతమైన రత్యాదులను సామాజికసహృదయశిరోమణులాస్వాదింతురు. కావున రసనిష్పత్తి యను భరతుని పదమునకు రసాస్వాదమని భట్టనాయకు డర్థముచెప్పెను.

ఈ రససమాలోచనావసరమున బయల్వెడలిన మూడు మతములును మీమాంసా, న్యాయ, సాంఖ్యసిద్ధాంతములపై నాధారపడి, ఆయామతసంప్రదాయములు కావ్యనాటకముల కన్వయింపబడినవని మనకు తేటపడుచున్నది. ఇందు భట్టలొల్లటుడు మీమాంసాశాస్త్రనిపుణు డగుటచే, అభిధాశక్తివ్యాపారముల సర్వవ్యాప్తత్వమును సమ్మతించి, రసధ్వన్యాదు లన్నియు ముఖ్యార్థమూలముననే బోధపడునని మనకు బోధించెను. ఇంక శ్రీశంకుకుడన్నచో న్యాయశాస్త్రపారావారపారీణు డగుటచే, ప్రతిజ్ఞాహేతూదాహరణాది ప్రమాణప్రాబల్యముననే రసప్రతీతిని నిశ్చయింప ప్రయత్నించెను. లోకసిద్ధమైన రసము వ్యాప్యవ్యాపకసంబంధమున వాచ్యార్థము వలన గ్రహింపబడుననియు, నర్తకాభ్యాసాతిశయమున విషయీకృతమై సామాజికచమత్కారమూలకముగ ననుమానింపబడుననియు వచించెను. పదంపడి భట్టనాయకుని మతమునం దొక విశేషాంశము మనకు గోచరించును. ఇచట రసము నటనిష్ఠముగాక సామాజికనిష్ఠముగా విచారింపబడెను. ఈ మతమున రసోదయరసాస్వాదానందానుభవ మంతయు సామాజికసహృదయచిత్తవృత్తి భావితముగానే విమర్శింపబడెను. ఈ విమర్శనమున రసభావనాభోగముల సందర్భ

మున భట్టనాయకుడు సాంఖ్యసిద్ధాంతుల సంప్రదాయముల శిరసా వహించెను. సాంఖ్యుల సిద్ధాంతములను,సంప్రదాయములను విపులముగ నిట జర్చింపక, కావ్యరసాస్వాదానందమునకు సంబంధించినంత మాత్రమే సంగ్రహముగ రచింతుము. భోగాపవర్గములే జన్మసాఫల్యములు. సుఖదుఃఖానుభవమే భోగ మనబడును. సచ్చిదానందజ్ఞానము వలన గలుగు ఆత్మనిర్వృతియే అపవర్గమని భావింపబడును. పరబ్రహ్మాస్వాదసబ్రహ్మచారిత్వమే వాస్తవరసాస్వాదసౌఖ్యమై ప్రకాశించునందురు. ఇచట పరబ్రహ్మాస్వాదానుభవసౌఖ్యమునకును రసాస్వాదానందానుభవమునకును భేదము గలదు. రసాస్వాదమునకు సంవిత్స్వరూపము గలదు. అది చిత్స్వభావసంపన్నమై చెలంగును. ఇచట స్వలాభశూన్యమైన చిత్తైకాగ్ర్యము సంభవించును. చిత్తవిశ్రాంతియే రసాస్వాదమునకు ఫలమై వెలుంగును. ఇంక పరబ్రహ్మాస్వాదము నన్నో, కామక్రోధాద్యరిషడ్వర్గముల జయించి, లేక త్యజించి, సుఖదుఃఖాతీతుడై జ్ఞాని, బుద్ధీంద్రియాతిరిక్తమైన యోగసమాధిలగ్నతం జెందును. వీనిరెంటియందును సాత్త్వికగుణప్రాధాన్యముననే చిత్తసమాధానము లభించును. యోగసమాధివిషయమున పూర్వవాసనావశముననే బుద్ధి, రజస్తమోగుణముల క్రమక్రమముగా దూరమొనరించి, సత్త్వగుణోద్రేకమును పెంపొందించును. అంత విజ్ఞానముదయించుటంజేసి, ప్రకృతిపురుషవిభేదమును గురుతించి, యోగితన చిత్తమును సమాధిసంలగ్నము గావించును. ఇట్టి సంపూర్ణచిత్తసమాధానము రసాస్వాదసమయమున సంభవింపదు.

ఇంక కావ్యప్రపంచ మెంచగా నెల్లరకు నాదర్శప్రాయమై చెలంగుచుండును. అందుచే ప్రాకృతజగమునకన్న నది మిన్నగ వన్నెలొలుకుచుండును. బాహ్యలోకమున మనల వేధించు మదమాత్స

ర్యాను లచ్చట గానరావు. దృశ్యశ్రవ్యకావ్యములందు మన కనులకు మనములకు నెదుర నడయాడు నాయికానాయకాదులతో మన కెట్టి విధమైన సంబంధబాంధవ్యమును గన్పట్టదు. ఇట్టి కేవలకవికపోల కల్పితపాత్రములు 'మన మనముల గొన్ని సెవ్వగల మాన్పి, అకాండసమ్మోదమ్ము ఘటించుటకును, కనుగొనుదానికన్న నద్భుతముగా నతీంద్రియార్థము లెరిగించుటకును దోడ్పడుచుండును. కావున కావ్యరసాస్వాదనావివశులైన వివేకవంతు లొక్క క్షణకాలమేని, బాహ్యప్రపంచఖేదమోదముల విస్మరించి, చిత్తవికాస విస్తరవిశ్రాంతుల ననుభవింతురు. అందుచే నీరసాస్వాదసౌఖ్య సౌధ ప్రవేశమునకు వ్యాపారత్రయ సోపాన పరంపరను నిర్మించి భట్టనాయకుడు సహృదయులకు మార్గదర్శకుడయ్యెను. ఇచట శబ్దార్థముల బోధించు అభిధావ్యాపార మత్యంత ప్రధానమ్ముగాకున్నను, దాని మూలముననే భావకత్వ వ్యాపారమునకు ప్రవృత్తిగలిగి రసభావనాభాగ్యము లభించును. ఇటుల సాధారణీకృతములైన విభావాదులే పిదప భోగీకరణముం బొంది, లౌకికము లీల సుఖదుఃఖమిళితము, పారమార్థికము భాతి సుఖదుఃఖగ్గళితము కానట్టి అలౌకికరసాస్వాదానందానుభవమును సామాజికసహృదయులకు సంభవింపజేయును.

---

## (శ్రీమదభినవగుప్తపాదాచార్యులు–రసధ్వనిమతానోన్య సాంగత్యము–వ్యక్తివాదము)

వెనుకటియధ్యాయమున సంగ్రహముగ రచించిన భట్టనాయకుని భుక్తివాదమునుగురించి చెలరేగిన వాదప్రతివాదముల గమనించినచో

నీతని మతమునకు మొదట ప్రబలప్రచారము గల్గెనని తెలియవచ్చును. భట్టలొల్లటశ్రీశంకుకుల మతముల రూపుమాపి భట్టనాయకుని మతము ఖ్యాతిగాంచెను. ఈభట్టనాయకుని నూతనమతము అభినవగుప్తపాదుని నవీనమతస్థాపనమునకు దారిజూపెను. ఆనందవర్ధనాచార్యుల ధ్వని మతమునం దత్యంతాదరమును, భరతమునీంద్రుని రసమతముపై నపూర్వాభిమానమును గలిగియుండుటంజేసి, అభినవగుప్తపాదాచార్యు లీరెండుమతములకును తన ప్రతిభాతిశయమున నన్యోన్యసంఘటన మొనరించి, కావ్యవరవర్ణినీలలామకు అభినవరసధ్వనిరత్న కాంచన కాంచీకలాపమును సమర్పించెను.

రసమునుగురించియు, రసధ్వనినిగూర్చియు ఆనందవర్ధనాచార్య, అభినవగుప్తపాదాదులు విశేషముగ పాటుపడిరి. నాట్యరస రూపక స్వరూపములగురించి భరతమునిచంద్రుడు విపులముగ జర్చించె నని రసమతమున జెప్పబడెను. భరతమతానుసారముగ నెనిమిది నాట్యరసములనియు, వీనిలో నొకదాని నాసమంతముగ నభివృద్ధి నొందించుటయే కవికి విధాయకకృత్యమనియు నిరూపింపబడెను. ఈ కారణముననే చిత్తవీధిని నర్తన మొనరించు భావాదులనుగూర్చి నాట్యశాస్త్ర మశేషముగ జర్చించెను. అందువలననే కావ్యాత్మ తత్త్వవిమర్శనవిజ్ఞానమును గురించి ప్రాచీనాచార్యులు ప్రయత్నించుట కవకాశము లేకుండెను. వారు బుద్ధివిశేషమునంతయు స్థాయి విభావానుభావాదుల సంబంధబాంధవ్యమునుగురించియు, రసోదయా స్వాదానుభవముల భిన్నమతములగురించియు వినియోగపరచిరి. ఇట్టి పరిస్థితులలో ఆనందవర్ధనాచార్యాభినవగుప్తపాదాచార్యులు జనించిరి. భరతాదులచే ప్రతిపాదింపబడి వృద్ధినొందింపబడిన నాట్య రసమును వీరు చేబట్టి కావ్యరసముగా పరిణమింపజేసి తమ

# రసధ్వనిమతానోన్యాన్యసాంగత్వాదులు

ప్రతిభాప్రభావమున ధ్వనిమతమును ప్రతిష్ఠించి రసధ్వనియే జీవితసర్వస్వముగా సంస్థాపించిరి. "రసాదితాత్పర్యమున కావ్య నిబంధనము భరతాదులలోఁగూడ సుప్రసిద్ధమే" అని ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున వచించెను. ఇట్లనుటచే భరతాదుల నాట్యరసమే ఆనందవర్ధనాదుల ధీవిశేషమున కావ్యరసముగా మార్పునొందెనని భావము. రసము సముదాయరూపమున నాట్యమున ప్రకాశించు ననియు, కావ్యార్థమూలముననే రసము కావ్యమున నాట్యాయమాన మనియు అభినవగుప్తుడు పలికెను. ఈరీతిగా వీరు రచించుటచే దృశ్యశ్రవ్యకావ్యముల రెండింటి లోను రసము ప్రధానమనియు, మానవచిత్తవృత్తివిశేషముల ప్రతిఫలింప జేయుటయే నాట్య కావ్యములవలని ముఖ్య ప్రయోజనమనియు మన మెరుంగవలయును. ఇటుల క్రమక్రమముగా రసభావాదులే కావ్యమునం దత్యంతావశ్యకములుగా గణింప బడెను. అంతనుండియు మున్ను కావ్యజీవముగాఁ పూర్వులు భ్రమించిన అలంకారగుణరీతిరచనాప్రకారములు కేవలవ్యంజకములుగా తెలంపుచు, రసభావపరీతములైన మానవచిత్తవృత్తివిశేషములను సహృదయులకు స్ఫురింపజేసెను.

భట్టలొల్లటాదుల రసమతసమాలోచనము హృదయంగమముగా లేకుండుటవలన అభినవగుప్తపాదుని ఖండనములకు గురియయ్యెను. ఈతడు భరతుని రసమతమును ఆనందవర్ధనుని ధ్వనిమతముతో సమ్మేళన మొనర్చి పూవుతావులవలె పొలుపొందజేసెను. మన కిచట ధ్వనిమత వివిధవిషయములతో నంతగా ప్రసక్తి లేదు. కాని రసమునకు సంబంధించినంతవరకు దానినిసరించి కొంచె మెరుంగననును. ధ్వనిమతాను సారముగ కావ్యమునకు ముఖ్యాంగములు రెండు గలవు. మొదటిది

వాచ్య మను పేర బరగును ; రెండవది వ్యంగ్య మన వెలుగొందును. వాచ్యము కవిభావమును మనకు వెల్లడించును. వ్యంగ్యము సహృదయుల కొక విశేషార్థమును సూచించును. వాచ్యార్థమూలముననే వ్యంగ్యార్థమును చదువరు లెరుంగుదురు. వాచ్యవ్యంగ్యము లన్యోన్యమైత్రి గలిగియుండును. వ్యంజనామూలముననే వాచ్యము వ్యంగ్యమును స్ఫురింపజేయును. ఈవ్యంగ్యమే కావ్యాత్మగా ధ్వనిమతమున గణింపబడెను. ఇటుల వాచ్యాతిరిక్తమే కావ్యాత్మగా ప్రకాశించుచున్న లోకశబ్దశాస్త్ర పారంగతులు పరిహసింపవచ్చును. కాని కావ్యార్థతత్త్వజ్ఞుల కీరహస్యము కరతలామలకమే. వక్రోక్తి, ఉపమా, లక్షణామూలకముగ భావమును వెలిపుచ్చుటయే ప్రాచీనపండితప్రకాండులకు స్వభావముగా జెలంగుటను జదువరులు అలంకారరీతిమతముల గ్రహించిరి. దీనికిని వ్యంగ్యమునకును భేదము గలదు. ఎంత గప్పిపెట్టినను వక్రోక్త్యాదులు వాచ్యమేగాని వ్యంగ్యము గానేరదు. మరియు వ్యంగ్య మెన్నటికిని వాచ్యముగాదు. వ్యంజనావ్యాపారముననే వాచ్యార్థము వ్యంగ్యార్థమును సహృదయశిరోమణులకు స్ఫురింపజేయును. అప్పుడే కావ్యము రమణీయార్థప్రతిపాదకశబ్దమై వెలుంగుచు సహృదయహృదయాహ్లాదకారి యగును.

కావున శబ్దార్థమూలకమై వ్యంగ్యము కొన్నిచోట్ల వస్తురూపముగను, మరికొన్నిచోట్ల అలంకారరూపముగను, చాలచోట్ల రసాదిరూపముగను ప్రకాశించుచుండును. దీనినే వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వనియని పేర్కొనుచుందురు. ఇటుల రసభావాదులు ప్రతీయమానముగా పరిగృహీతము లగుటచే రసధ్వనిమతద్వంద్వమునకు దాంపత్యసౌఖ్యము లభించెను. అందుచే దండ్యాచార్యుడు దలంచినట్లు ఇష్టార్థమును బోధించు పదసముదాయమే కావ్యము

గావనియు, రసభావాదులే కావ్యమున ప్రధానములనియు నిశ్చయింప బడెను. ఈరసభావాదులన్నచో వాచ్యమునకన్న భిన్నలు. వీనిని వచించుటకే మనకు శక్యమగునుగాని సంపూర్ణముగ వర్ణించి స్వరూప నిరూపణ మొనరించుటకు శక్యముగాదు. ఈ రసము, ఈ భావము అని పేరిడినంతమాత్రముననే దాని నిజస్వరూపము వెల్లడిగానేరదు. ఈ పేరులవలన మనము వానిని సూచింపగలమేకాని మన కంతకన్న నెక్కువగ దరముగాదు. కావ్యమునందు విభావాదులను రసోచితముగ కవివరుడు పోషించును. ఇట్లు వాచికములైన విభావాదులవలనను, వ్యంజకములైన శబ్దార్థములవలనను కవీంద్రుడు చదువరుల డెందముల గరగించి, రసమయము గావించి, వారల కలౌకికానందమును గలిగింప గలడు. అంతియేకాని రామాదినాయకుల వర్ణించుటచే కవిచంద్రుడు చదువరుల మనముల రామాదినాయకుల భావనావిశేషములను, చిత్తవృత్తివిభేదముల నొదవింప సమర్థుడుగాడు. అనగా నాయకాదుల రసభావాదులే సామాజికసహృదయుల మానసముల నుదయింపవు. కావున నాయకాదుల మనోభావములకు సరిపోవునట్టివానిని సృజించుటకు తగిన సూచనలమాత్రమే కవిశేఖరుడు గావింపగలడు. అనగా నట్టితలంపులు పుట్టుటకనువైన పరికరముల దన వర్ణనాతిశయమున కవి కల్పింపగలడు. ఇంక రసానుభవసౌఖ్యమును, దానివలన గలుగు అపరిమితానందమును సహృదయహృదయాధీనమై చెలువొందును. ఈరసాస్వాదానందానుభవ మనినచో ప్రతీయమానార్థవశోన్మిషితమై ప్రకాశించుచుండును.

భుక్తివాద పూర్వపక్షము

ఈ ప్రకారముగా సమన్వయించుటవలన రసరమణీ రామణీయకమున కపూర్వలావణ్యమహిమాతిశయము చేకూరెను. ఈ

సహాలోచనమువలన స్థాయిభావవిభావాదుల సంయోగము వ్యంజకమై, రసము వ్యంగ్యమై పరిణమించును. దీనిచే భరతుని రసనిష్పత్తియన రసాభివ్యక్తియని మనము తలంచవలయును. ఆనందవర్ధనాచార్య, అభినవగుప్తపాదాచార్యుల రసాభివ్యక్తి సందర్భమున భేదలేశము గన్పట్టుచున్నది. దానిని ధ్వనిమతమున వివరింపవలయునేకాని మన కిచట ప్రయోజనము లేదు. భట్టలొల్లట శ్రీశంకుక భట్టనాయకుల రససమాలోచనమును అభినవగుప్తపాదుడు విమర్శించి సత్యస్వరూపమును ప్రకటించెనని మమ్మటాచార్యాదులువచించిరి. ఇందు భట్టనాయకుని భుక్తివాదమునుగురించి అభినవగుప్తుడ్రిందివిధమున జర్చించెను. భావకత్వ భోగీకరణముల సమ్మతించుటకు దగిన ప్రమాణముగాని, ప్రయోజనముగాని కన్పట్టదు. ఈవ్యాపారద్వయము రసవ్యంజనాస్వాదములలో లీనమై కానవచ్చును. కావ్యార్థముల భావింపజేయుటచేతనే భావములనబడునని భరతుడు విధించిన లక్షణమువలన భావము లన్నిటికిని భావకత్వము సాధారణధర్మమని తెలియుచున్నది. ఇచట కావ్యార్థము కవిభావమును చదువరుల కుదయింపజేయును. మరియు కావ్యార్థమనగా రసాభివ్యక్తి గలిగించు ముఖ్యార్థమేకాని వేరొండు గాదు. అందువలన స్థాయివ్యభిచారాదులుగూడ భావములనుటచే వానియందిమిడియున్న భావకత్వమూలముననే, అలౌకిక రసాస్వాదానందము చదువరులకు జనించును. కావున కాంతాత్వరత్యాది సాధారణాంశము లప్రయత్నముగనే లభించును. దీనిచే స్థాయియే రసమునకు భావకము, లేక నిష్పాదకముగా జెలంగును. భట్టనాయకుడు పలుమారులు ప్రస్తుతించిన భావకత్వము అభినవగుప్తపాదుని మతమున సముచితగుణాలంకారపరిగ్రహాత్మకమై మెలంగెను. ఈ గుణాలంకారములను సముచితముగ పరిగ్రహించుటవలనను, శబ్దార్థ

ముల వ్యంజనావ్యాపారమూలమునను రసస్ఫూర్తి సంభవించును. అభినవగుప్తపాదు డిట్లు భట్టనాయకుని భావన, లేక భావకత్వమునకు నవీనసమన్వయము సంకల్పించి తరువాత భోగము, లేక భోగీకరణ వ్యాపారమును విమర్శింపబూనెను. ఈ సందర్భమునందు రసప్రతీతి కన్న భిన్నమైన భోగ మను వ్యాపారమును దా నెరుంగడనియు, సర్వపక్షములవారును రసప్రతీతిని సమ్మతించిరనియు, నింక ప్రతీతియే భోగమైనచో దానికి నూతనముగ నామకరణ మొనరించుట నిష్ప్రయోజనమనియు అభినవగుప్తుడు పలికెను. కావున చర్వణాస్వాదన భోగాపరనామముల రసప్రతీతి వెలుగొందును. అందుచే భట్టనాయకుని భోగీకరణవ్యాపారము కావ్యాత్మకరసవిషయధ్వనానాత్మరూపమేకాని వేరొండు గాదని అభినవగుప్తుని తాత్పర్యము.

## వ్యక్తివాద సిద్ధాంతము

అభివ్యక్తివలననే రసప్రతీతి గలుగుననియు, రసనా, చర్వణా, ఆస్వాదనారూపమై, వ్యంజనావ్యాపారమూలమై, రసానుభవ సౌఖ్యము సంభవించుననియు అభినవగుప్తపాదుని మతము. మరియు రసవిభావాదులకు వ్యంగ్యవ్యంజకభావ ముపపన్నమై, విభావాదిప్రతీతిసాహిత్యముననే రసప్రతీతి సహృదయులకు లభించునని భావము. ఇట్లగుటచే విభావాదిహేతుభూతమై, హృదయసంవాదాద్యుపకృతమై, లోకోత్తరరూపత్వమున రసము ప్రతీయమాన మగును. ఇచట ప్రతీయమాన మగునది రసానుభవమేకాని రసముగాదు. నాయకాదిరత్యాదిభావముల ప్రతిబింబములే సహృదయుల కానంద మొదవించునుగాని వేరేదియు గానేరదు. ఈ రసానుభవసౌఖ్యము, లేక రసాస్వాదానందానుభవము వ్యంజకమూలకము, లేక అభివ్యక్తి రూపాత్మకమై ప్రకాశించును. ఇచట వ్యంజకములైన విభావాదులు

లౌకికములు గాకుంటచేత, నీ ఆనందానుభవముగూడ లౌకికభిన్నము గానే చెల్లగును. ఈ కారణముననే కరుణబీభత్సాదిరసములుగూడ సహృదయహృదయావర్జకములై వెలుగుచున్నవి. ఏలనన, రసానుభవసౌఖ్యము చదువరుల కలౌకికానందానుసంధాయకమై విలసిల్లును. ఇందు స్వగతపరగతకష్టసుఖవిషాదసమ్మోదములు మన హృదయముల గలంచలేవు మదమాత్సర్యాధీనము గాక మానసము సంపూర్ణసమాధానముం జెంది, రసపానపారవశ్యమున మునుగుటం జేసి, శోకభయాదిప్రదర్శనముల చూచుచున్న నుచిత్తవిశ్రాంతి జేయుటయేకాని, సామాజిక సహృదయులకు దుఃఖభయాదులు గలుగనేరవు. ఒకానొకవేళ దుఃఖభయాదులు సంభవించినచో నవిగూడ సుఖానుభవసంపాదకములైనవిగానే చెల్లంగును. అందుచేతనే నాటకాదుల గాంచినవారు తమలోతాము 'దీనిని నేనుఅనుభవించితి' ననియు, 'ఇది నాకు ఆనందముగూర్చె' ననియు సామాన్యముగా పలుకుచుండుట మనము వినుచున్నాము. దీనికి నిదర్శనముగ సాహిత్యదర్పణమున విశ్వనాథు డిట్లు వచించెను. లౌకిక శోకహర్షాదులు లోకసంశ్రయములై శోకహర్షాదులనే కలిగించును. ఇంక కావ్యసంశ్రయములైన అలౌకికవిభావాదు లన్నియు సుఖమునే సంభవింపజేయును. లోకమున దుఃఖకారణములుగా దలంపబడుచున్న వనవాసాదులు కావ్యనాట్యసమర్పితములైనచో కారణశబ్దవాచ్యతను గోల్పోయి, అలౌకికశబ్దవాచ్యత్వమును భజించును. సురతసమయమునందు దంతక్షతములరీతి దీనివలన సుఖమే జనించును అందువలననే లౌకికశోకహర్షాదికారణములమూలమున లౌకికశోకహర్షాదులు పుట్టుచుండునని లోకమునందు నియమము గలదు. కావున సద్విభావాదుల వలనను సుఖమే సంభవించు నను కావ్యనియమమున కట్టిలోపమును గలుగజాలదు. అందువలన కావ్యనాట్యముల శ్రవణదర్శనములచే గలుగు అశ్రుపాతాదులు సుఖమయములేకాని దుఃఖదూషితములుగావు.

రసానుభవవివశమైన హృద్గతానంద మశ్రుపాతాదిరూపమున బహిర్గత మగును. ఈ విషయమున పండితరాయల వాక్యములు ప్రమాణములు: "అశ్రుపాతాదులు తత్తదానందానుభవమూలకములై కలుగునేకాని దుఃఖములవలన గావు. అందుచేతనే భగవద్వర్ణనాకర్ణనమున భక్తుల కశ్రుపాతాదులు సంభవించుచున్నవి. ఇచట దుఃఖానుభవము లేశమేనియు లేదు. అందువలననే, అరమణీయములైన శోకాదులుగూడ లోకోత్తరకావ్యవ్యాపారమహిమచే, అలౌకికాహ్లాదమును జనింపజేయును. ఈ కావ్యవ్యాపారసముద్భూతమైన ఆస్వాదము, ప్రమాణాంతరజగదనుభవముకన్న విలక్షణము, కమనీయము నై ప్రకాశించును." దీనిచే వ్యంజకములైన విభావాదులు లౌకికములు గావనియు, వీనిని లౌకికకారణములుగా మనముపరిగ్రహింపరాదనియు తేటపడుచున్నది. విభావాదికారణములు రసప్రతీతికి ముఖ్యములైనను, దీనిని లౌకికకార్యముగా మనము స్వీకరింపరాదు. అందువలన కార్యకారణసంబంధ మిచట వర్తింపదు. మరియు అలౌకికవిభావాదిశబ్ద వ్యవహార సంపన్నమైన కావ్యనాట్యముల లౌకికసంబంధవిశేష స్వీకారపరిహార నియమానవసాయమువలన సాధారణ్యప్రతీతి సంభవించును. ఈ సాధారణ్యమువలననే విభావాదిసంవలితము, రత్యాద్యవచ్ఛిన్నము, చిదానందావరణ భంగమునై ప్రకాశమానమగునట్టి ఆనందచిద్విషయము, విభావాదిసంవలితములైన రత్యాదిస్థాయిభావమే రసాభివ్యక్తి గలిగించును. కావున విభావాది సాధారణ్యబలమువలన రసానుభవకాలమందు విగళితపరిమితప్రమాతృత్వాదినిజధర్మపరమై, ప్రాదుర్భూతేతరజ్ఞానశూన్యాపరిమితభావమున ప్రమాతే ప్రకాశించును. ఈరసానుభవము పానకరసన్యాయమున చర్వ్యమాణ మగును. అనగా విభావాదిసమూహాలంబనరూపత్వముచే నొండొంటితో నసాధారణమైన వ్యక్త్యభావమువలన మిళితమై వ్యంజకత్వమును బొందుననిభావము. మరియు లోకమున ప్రమదాద్యాలం

బన కారణములచేతను, చంద్రికాద్యుద్దీపనకారణముల వలనను, అశ్రుపాతాదికార్యములచేతను, చింతాదిసహకారులవలనను అనుమితివిషయమై పరిశీలనబలమున వెంటవెంటనే చిత్తప్రవృత్తిగల సామాజికులలో వాసనారూపమున నంతఃస్థితమై రత్యాదిస్థాయిభావము చెలంగుననని అభినవగుప్తపాదాచార్యులు వచించెను. కావున శ్రవ్యదృశ్యకావ్యముల జదువునపుడును, గనునపుడును. వానిలోగల గుణాలంకార యోగముచేతను, కాయిక వాచికసాత్త్వికాహార్యరూపాభినయములవలనను సకలసహృదయసంవాదకారియు, అలౌకికచమత్కారకారియు నైన శృంగారాది రసములు మనకు ప్రతీతిగోచరములగును. ఇదియే రసచర్వణసౌఖ్యము, లేక రసాస్వాదానందము, లేక రసాభివ్యక్త్యనుభవముగా వెలుంగును.

రసచర్వణసౌఖ్యస్వరూప పరబ్రహ్మాస్వాదానందవిభేదవివేకము

ఇచట అభినవగుప్తపాదుడు నూతనమార్గము ననుసరించెను. పానకరసన్యాయమున రసము విభావాదుల సమూహాలంబనముగ సామాజికులచే నేకముఖముగ, నభిన్నముగ ననుభవింపబడునని పలికెను. ఇంతియే కాక, లౌకికకారణాదుల మూలమున సంభవించు స్థాయిభావము లింతకుముందే సహృదయుల హృదయముల వాసనారూపమున నెలకొనియుండును. అందువలన మన మొక నాటకమును జూచినపుడుగాని, ఒక కావ్యమును జదివినపుడుగాని మన మనముల సంస్కారరూపమున నీవరలోనే నివసించిన రత్యాదులు కాంతాదికారణములచే జిత్తముల నొకానొకవిధమైన వికాసాదులను సాధారణముగ గలుగజేయును. కావుననే విభావాదులు చదువరుల డెందముల ప్రత్యేకములుగా గాక సాధారణములుగనే భాసించును. ఇటుల సాధారణ్యము బొందుట భట్టనాయకుడని నటులు భా[illegible]వ్యాపారమునగాక, గుణాలంకారసముచిత సన్ని

వేశమునను, శబ్దార్థముల దీపించు వ్యంజనా వ్యాపారమూలముచను సంభవించునని అభినవగుప్తుని తాత్పర్యము. ఈ ప్రకారమునసే స్థాయిభావముకూడ సాధారణ్యమును భజించును. ఈ స్థాయిభావము సహితమితరభావములవలె చంచలమైనను, దీనివలన గలుగు సంస్కారము, లేక వాసనావిశేషము తదితర సంస్కారముల వలె నస్థిరముగాక రసానుభవ సౌఖ్యమునకు చేదోడుగా జెలంగును. ఈ భావమునే ప్రభావ్యాఖ్యాన మిట్లు ప్రకటించెను: "అంతః కరణప్రవృత్తిరూపములైన రత్యాదులు ఆశువినాశములైనను, సంస్కారాత్మమున చిరకాలస్థాయులై, రసప్రతీతికాలమునం దంతయు ననుసంధానములై చెలంగుటచే వీనికి స్థాయిత్వము సంభవించును." ఈరీతిగా స్థాయిభావమునకు సమన్వయము గన్పట్టుచున్నను, తొలుత దీని కీపే రేరీతి వచ్చె ననుసందియము గలుగవచ్చును. అవిరుద్ధములు, విరుద్ధములునైన భావము లేభావములకు విచ్ఛేదముగూర్ప లేవో, ఇతరములైన భావములచే నేభావములు పరిపోషణము నొంది, వానికి తాము తమ భావముల జేకూర్చునో వానినే స్థాయిభావము లని వ్యవహరింతురు. అనగా విభావానుభావవ్యభిచారిభావముల సంఘట్టన సంఘర్షణములవలన నేవిధమైన పరిణామమును జెందకుండునదియే స్థాయిభావమని తాత్పర్యము. కేవల స్థాయిభావమే రసము గానేరదు. ఇది వ్యక్తివిశిష్టము, విభావాదిమేలకము నైనప్పుడే చర్వణోపయోగమగును. కావున రసాస్వాదసమయమునందు విభావాదులసంపర్కము లేశమేనియు మనమనముల నుండదు. ఇవి సర్వమును సాధారణ్యమును బొంది దేశకాలాదినియమముల నతిక్రమించి అలౌకికానందమును జదువరులకును, జూపరులకును గలిగించును. అందువలన సామాజికుల పూర్వవాసనావిశేషము, సహృదయుల జన్మాంతరసంస్కారముపై నాధారపడి రసాస్వాదానందానుభవము వెలుగొందును. ఈవాసనావిశేషము

గలవారినే రసికులనియు, సహృదయులనియు వచింతురు. ఈప్రసం గమున విమలప్రతిభానశాలియైన హృదయము గలవాడే కావ్య నాట్య రసామృతాస్వాదనమునకు అధికారియనియు, కావ్యానుశీలనాభ్యాస వశమున మనోముకురము విశదీభూత మగుటచే నెవరు తన్మయీభవన యోగ్యతం జెంది హృదయసంవాదభాజులగుదురో వారలే సహృదయు లనియుఅభినవగుప్తపాదాచార్యులు ధ్వన్యాలోకలోచనమునరచించెను.

ఈ పైన వినుతింపబడిన కావ్యరసాస్వాదసౌఖ్యము సహృద యుల కేచందంబున లభించు ననినచో నది శబ్దార్థముల వ్యంజనావ్యా పారమహిమవలన జేకూరు నని అభినవగుప్తుడాడెను. పద, వాక్య, ప్రమాణ పారావారపారీణులచే జ్ఞానసంపాదనమునకు సాధనములుగా సమ్మతింపబడిన అభిధా, లక్షణా, తాత్పర్య, ప్రత్యక్ష, అనుమాన, స్మరణములకన్న నన్యమై వ్యంజనావృత్తివ్యాపారములు ప్రకాశించు చుండును. వీనికిని వ్యంజనకును గలభేదములతో మన కిట పనిలేదు. వీని తత్త్వమును ధ్వనిమతమున జదువరు లెరుంగగలరు. ఈసంపర్భమం దొకసంగతిని గమనింపవలయును. చర్వణాశబ్దమునకు పర్యాయపద ముగా తానుపయోగించిన అభివ్యక్తికి వీతవిఘ్నప్రతీతి యని అభినవ గుప్తుడర్థము జెప్పెను. దీనిని ప్రమాణముగా గొని భగ్నావరణమైన చిదంశమే వ్యక్తియని పండితరాయలు వచించెను.

దీనివలన అలంకారవేదాంతశాస్త్రముల కపూర్వసంబంధ మొక టిసంభవించెను. కర్మను త్యజించుటవలనను, అవిద్య నాశనమగుటచేతను మానవులకు మానససమాధానముజేకూరిపరబ్రహ్మాస్వాదానందానుభవము లభించును. దీనినే వేదాంతులు సంసారబంధవిమోచన మొనరింపజాలు మోక్షమని వచింతురు. ఐహికసౌఖ్యపాశజాలముల ద్రెంచుకొనగల్గి నప్పుడే జీవాత్మ కీపరబ్రహ్మతో నైక్యానుసంధానము సంభవించును.

# రసధ్వనిమతానోన్యసాంగత్యాదులు

ఈ వేదాంతశాస్త్రసంప్రదాయమును అభినవగుప్తపాదాదులు అలంకారశాస్త్రమునకు నన్వయించి, రసాభివ్యక్తియన నీవరలో లేనిదానిని జూపించుట గాదనియు, నింతకుమున్ను గప్పబడియుంటచే గానరాని దాని పైకప్పు దొలగించి, మనకు గనబడునపగిది నొనరించుటయే యనియు స్పష్టముచేసిరి. ఈ రసాస్వాదము బ్రహ్మాస్వాదమునకు సమమని వచించిరి. వీని ననుభవించుటకు మనల దట్టముగ జుట్టుముట్టిన విఘ్నములును, ప్రతిబంధములును మాసిపోవలయును. కావున జదువరుల మనముల ననగిపెనగి కలతవెట్టునట్టి సంకెలలన్నియు సడలిపడిననేకాని కావ్యరసమును గ్రోలుటకు వారర్హులు గాగలుగరు. అందువలననే విభావాదులను విఘ్నాపసారకము లనియు, నివి అలౌకికములనియు, రసనా, చర్వణా, ఆస్వాదములే వీని సారమనియు, తుదకు రసానుభవ మొక్కటియేకాని వేరేమియు జదువరులకు బోధకట్టదనియు వచింపబడెను. ఈ రసానుభవసౌఖ్యము విగళిత వేద్యాంతర మనియు, లేక వేద్యాంతర స్పర్శశూన్యమనియు నుతింపబడెను. కావుననే రసాస్వాదానందమును పరబ్రహ్మాస్వాదానందసబ్రహ్మచారిగా వర్ణించిరి. దీని సత్యమును నిరూపించుటకు ప్రమాణాంతరము లేకుండుటచే నిది సకల సహృదయహృదయ సంవేదన సాక్షికమని పొగడబడెను. ఈసుఖము 'సహృదయానుభవైకవేద్య' మగుటచే, "యోగీంద్రులవోలెనే పుణ్యవంతులు రససంతతి నాస్వాదింతు" రని స్తుతింపబడెను. కావున రసాస్వాదనసమయమున సహృదయులకును సామాజికులకును చిత్తవిశ్రాంతి లభించుటవలన నలౌకికానందము సంభవించునందురు. ఈచిత్తవృత్తివిశేషమును ఆస్వాదము, రసన, భోగము, సమాప్తి, లయ, విశ్రాంతి, లేక చమత్కారనిర్వేశమని వేర్వేరు పేరుల పిలుచుటంజేసి వేదాంతశాస్త్రమునకును, అలంకారశాస్త్రమునకును గల పరస్పరసంబంధము మనకు గోచరించును.

రసమత సమాలోచనసారము

ఇదియే ధ్వనిమతానుసారులు సమర్థించిన రసమతసమాలోచన సంగ్రహమై చెలంగును. ధనంజయుడు మొదలు జగన్నాథునివఱకు గల నవీను లెల్లరు దీని నంగీకరించిరి. ధ్వనిమత ప్రబల ప్రతిపక్షులు వని ప్రఖ్యాతి గాంచిన వ్యక్తివివేక కారుడుగూడ రససమాలోచన విషయమున భిన్నాభిప్రాయుడుగా లేదు కావున పూర్వజన్మసంచయసంచిత సంస్కారవిశేషమునను, కావ్యానుశీలనాభ్యాససంజనితవాసనావశమునను చూపరుల, చదువరుల మనముల బీజరూపమున నంతకుమును పే గాఢముగ నాటుకొనిన రత్యాదిస్థాయిభావములు నాటకముల గనుటవలనను, కావ్యముల వినుటవలనను, వానిలో నెలకొలుపబడిన ప్రమదాదివిభావములు, కటాక్షాద్యనుభావములు, ఔత్సుక్యాది వ్యభిచారిభావములు నని పిలువబడు ఆలంబన, ఉద్దీపన, సహకారికారణముల సాయమువలన క్రమక్రమముగా పల్లవించి, పుష్పించి, ఫలించి సామాజిక సహృదయ నయనరసనాంచలముల రసాస్వాదానుభవపారవశ్యమును గలిగించి, హృదయప్రదేశముల అలౌకికానందము నొదవించును. మరియు విభావాదులు జీవించినంతవరకు పానకరసముపగిది గ్రోలబడుచు, కన్నుమరనున్న కరణి గానవచ్చును, మానసమురీతి లోన జొచ్చుచు, సెల్లవోలె పైన గప్పుచు, అంతయు వేరైనసరణి మాయమగుచు, పరమపురుషుజవుల దేలు లీల రుచులూరజేయుచు, అలౌకికచమత్కారకారులై శృంగారాదిరసములు ప్రకాశించుచుండునని అభినవగుప్తపాదాచార్యుల రసమతసమాలోచనసారమై వెలుగొందుచున్నది. ఇంకమీద అభినవతారుణ్యలావణ్యముల జెలువమలరు కావ్యరసామృతకల్లోలినీలలామ గుణాలంకారమణిరత్నాకరుండైన ధ్వనిమతక్షీరవారాశి వీచికాభుజాంతరసీమ లీనమై సహృదయవతంసులకు హృదయానందవర్ధకముగా విలసిల్లును.

# కావ్యాత్మ

## నవీనమతములు

ఎవతె ముదుసలి వని పతిని విహసించి
సుకవివదనాంబురుహబద్ధసుస్థితి గొని
భువనమండల మన్యంబువోలె జూపు
నట్టి భారతి సతము జయంబు గాంచు.

## ౧. ధ్వనిమతము

(వృత్తిత్రయవిశేషము-విపక్షమతఖండనము)

మునిచంద్రుని తపోధనవిశేషమున జనించిన రసరమణీరామణీయకమునకు ధ్వన్యాచార్యవర్యులు ప్రసిద్ధావయవాతిరిక్త ప్రతీయమానార్థ నవీనలావణ్యామృతమును ప్రసాదించి, కావ్యకాంతాలలామను త్రిదశవరవర్ణినీ సదృశురాలను గావించి, నాకలోకదివ్యసౌఖ్యానుభవమస్నలుగా సహృదయవిభూషవతంసుల దీవించిరంటరదే ధ్వనిమతసంగ్రహమై వెలుగొందుచున్నది.

ఆనందవర్ధనాచార్యుడు ధ్వన్యాలోకమున "కావ్యస్యాత్మా ధ్వని రితి బుధై ర్యః సమామ్నాతపూర్వః" అని వచించుటంజేసి యీమతము చిరకాలమునుండి పెంపొందుచున్న దని మన మూహింపవలసియున్నది. దీనిని బలపరచుచు వృత్తిగ్రంథమున 'పరంపరయా యః

సమామ్నాతః సమాఖ్యాతః' అని రచించినాడు. అభినవగుప్తపాదాచార్యులీ 'పరంపరా' శబ్దమునకు 'అవిచ్ఛిన్నేన ప్రవాహేణ తైరేతదుక్తమ్ వినాపి విశిష్టపుస్తకేషు వివేచనా దిత్యభిప్రాయః' అని వ్యాఖ్యానము చేసియున్నాడు. ఈ ధ్వనిమతమును కొందరు సహృదయులు నూతనముగ నుపవర్ణించిరని భట్టనాయకుడు వచించెను. ధ్వన్యర్థమును నిర్వచించుటకు లక్షణామార్గమునకు శక్తి చాలకపోవుటచే విద్వాంసులు కుశాగ్రబుద్ధిచే నిరూపించుటకు ప్రయత్నించి, వ్యంజనావృత్తిని నిర్మించిరి. ధ్వనిమతమునందలి వ్యంజనామార్గము వైయాకరణమతానుసారముగ స్ఫోటమార్గము ననుగమించుచున్నది. "వైయాకరణులే ప్రథమవిద్వాంసులు; సర్వవిద్యలును వ్యాకరణమూలములు; వారు శ్రూయమాణవర్ణములను ధ్వనియని వ్యవహరించి" రని ధ్వనికారుడు ప్రథమోద్ద్యోతమున రచించెను. మరల తృతీయోద్ద్యోతమున "పరినిశ్చిత నిరపభ్రంశ శబ్దబ్రహ్మణాం విపశ్చితాం మత మాశ్రిత్యైవ ప్రవృత్తోఽయం మత" యని వచించెను. కాన ధ్వనిమతము స్ఫోటమార్గానుసార మని మనము గ్రహించిన చాలును. ఇచట స్ఫోటతత్త్వమును, శబ్దబ్రహ్మవిచారమును జేయుటచే శాస్త్రాంతరపరామర్శకు దొరకొనినవార మగుదుము గాన మానెదము. ఇట్లు స్ఫోటమతము నూతగా గొని ఆలంకారికు లీధ్వనిమార్గమును నిర్మించిరి. అనిర్వచనీయమైన యొకానొక రమణీయార్థమును వాచ్యార్థము స్ఫురింపజేయును. ఈ అర్థము లక్ష్యార్థతాత్పర్యార్థములకన్న భిన్నమై, ఉత్తమమై, రమ్యమై వెలుగొందుచుండును. ఈ అర్థమును సహృదయులు ధ్వని యనియు, ప్రతీయమాన మనియు, వ్యంగ్య మనియు సర్వదా ప్రశంసింతురు. స్ఫోటార్థమును ప్రకటన జేయు పదములకుగూడ వైయాకరణులు ధ్వనిపదము నుపయోగించి

రని ఆనందవర్ధనుడు నుడివెను. ఈ వ్యంగ్యార్థమును స్ఫురింపజేయుటకు, ఒకశక్తి పదమున కుండవలయును. అదియే వ్యంజనాశక్తి యనబడు చున్నది. మనము మున్నెన్నడును విని కని యెరుంగని నవీనార్థమును వ్యంజనాశక్తి కల్పింపదు. ఈవరకు నెలకొనినయర్థము నే ఘట దీపన్యాయమున స్ఫుటతరముగ నది ప్రకటీకరింపజేయును. ఈధ్వన్యర్థము వాగతీతము, అనాఖ్యేయము, అభావము అనువారి వాదముల నెల్ల ఖండించి, ఆనందవర్ధనాచార్యుడు సహృదయ హృదయాహ్లాద కరముగ వ్యంగ్యార్థతత్త్వమును ధ్వన్యాలోకగ్రంథమున విపులముగ జర్చించి ప్రదర్శించెను. కొందరీగ్రంథమున కారికాకారునకును, వృత్తికారునకును భేదమును గల్పించి, ఆనందవర్ధనుడు వృత్తిమాత్రమే వ్రాసెను గాని కారికలను రచింపలే దని వాదింతురు. రెండుపక్షములవారును కారణముల జూపింతురు. కాని మనకీసందిగ్ధవిషయముతో నిచ్చట ప్రసక్తివలన లాభ మిసుమంతయు లేదు.

ఈరీతిని ప్రాచీనుల మతములకన్న వేరైన యొకానొక వ్యంజనాశక్తిని, తన్మూలమున మరియొక కమనీయతరమైన వ్యంగ్యార్థమును ధ్వనిమత ముపపాదించెను. అంతమాత్రమున నితరమతములకు నీనూతన మతమునకు సంబంధము లే దని మనము తలంపరాదు. భరతభామహోద్భటవామనుల పలుమారులుఆనందవర్ధనుడుపేర్కొనియున్నాడు. కావున రసాలంకారరీతిమతములకు నీధ్వనిమతమునకును సంబంధ మెంతయో కొంత కలదు గాని లేకపోలేదు. ఆనందవర్ధనుడు రెండుసంకల్పములతో ధ్వన్యాలోకరచనకు గడంగెను. ధ్వనిమతమును ప్రతిపాదించి, ప్రాచీనమతము లీధ్వనిని గ్రహింపజాల వని నిరూపించుటయే ప్రథమ సంకల్ప మని గ్రంథనామమే వెల్లడించును. రసము, అలంకారము, రీతి, గుణము, దోషము మొదలయినవాని తత్త్వమును విమర్శించి, వీని

నన్నింటిని ధ్వనిమతమున లయింపి, నూతనమతనిర్మాణమునకు బూను టయే ద్వితీయోద్దేశము. మమ్మటుడు మొదలయిన తరువాతవచ్చిన ఆలంకారికు లందరును ధ్వనిమతమును అవతంసకుసుమముగా నంగీకరించుటచేతను, సహృదయశిరోమణు లీవ్యాంగ్యార్థామృతమును మనసార గ్రోలి బ్రహ్మానందానుభవమగ్ను లగుటవలనను, ఆనందవర్ధనాచార్యుల సంకల్పము సఫల మయ్యె ననవచ్చును.

శబ్దమునకు అర్థమునకు నొకానొక సంబంధము గలదు. ప్రతి శబ్దమునకు నొకశక్తి, సంకేతము, వ్యాపారమును గలుగుచుండును. 'ముఖ్యార్థము' లేక 'శక్యార్థము' నే వైయాకరణులు, నైయాయికులు, మీమాంసకులును 'అభిధ' యందురు. ఈశబ్ద మీయర్థమును బోధించవలయు ననునదియే. 'సంకేతము'. "అస్మా చ్ఛబ్దా దయ మర్థో బోద్ధవ్య ఇత్యాకారకశక్తిగ్రాహకసమయః" అని వ్యవహరింపబడుచున్నది. ఈ శక్తినిగురించి భిన్నాభిప్రాయములు గలవు. ఈ శక్తి ఈశ్వరేచ్ఛయా? లేక ఇచ్ఛామాత్రమా ? అను విమర్శనము మన కిచట వలదు. శబ్దప్రవృత్తిలోగూడ ఆలంకారికులు వైయాకరణులనే ప్రమాణముగా గైకొనిరి. "చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిః" అనుటవలన శబ్దప్రవృత్తి నాల్గుతెరగులు: జాతి, ద్రవ్య, గుణ, క్రియారూపములు. అభిధాశక్తిచే జనించిన అభిధార్థము అనుకూలము గానపుడు మరియొకశక్తి, మరియొక అర్థము నిచ్చును. ఇదియే లక్షణాశక్తి, లక్ష్యార్థ మనబడును. ఇది రూఢి, ప్రయోజనములపై నాధారపడును. ఈశక్తి నిజముగ అర్థవ్యాపారమునకు సంబంధించినది. కాని ఆరోపితశబ్దవ్యాపారముగ పరిగణింపబడుచున్నది. శబ్దమునకు తొలుత నాచ్యార్థము గలుగును. దీనినే ముఖ్యార్థము, లేక శక్యార్థమునని పేర్కొందురు. దీని ననుసరించి

లక్ష్యార్థము వచ్చును. అభిధార్థము నిరంతరము, లక్ష్యార్థము సాంతరమునై చెలంగును. ముఖ్యార్థము బాధిత మైనప్పుడే లక్ష్యార్థము అర్థనిష్ఠమై ప్రవేశించును. ముఖ్యార్థబాధ, తాత్పర్యానుపపత్తి, ప్రయోజనము లీమూడును లక్షణా బీజములు. వాచ్యార్థము వ్యావహారికసంకేతముపై నాధారపడినట్లే లక్ష్యార్థ మీ మూడుబీజములపై నాధారపడియుండును. కొందరాలంకారికులు లక్షణను అభిధలో భేదముగ జేర్చిరి. మరికొందరు దీనిని అభిధాపుచ్ఛభూత మని వక్కాణించిరి. ఒకపదము గౌణార్థమున నెట్టెట్టుల నుపయోగింపబడునో ఆయావివరములు విపులముగ న్యాయసూత్రమున నుదాహరింపబడినవి. ముకులభట్టు లక్షణను ఐదువిధములుగ విభజించెను: సంబంధము, సాదృశ్యము, సమవాయము, వైపరీత్యము, క్రియాయోగములు. ఈస్థలములలలక్షణకు ప్రవృత్తి గలుగును. 'బలిసినదేవదత్తుడు పవలు భుజింపడు'; 'మాణవకుడు సింహము'; 'గంగయందు గొల్లపల్లె'; 'ఈమూఢుడు బృహస్పతి'; 'మహాసమరమున నీవు శత్రుఘ్నుడవు'—యీ ఐదును క్రమప్రకారమున సంబంధ, సాదృశ్య, సమవాయ, వైపరీత్య, క్రియాయోగలక్షణలకు లక్ష్యములు. లక్షణావిభాగవిశేషాంశముల గురించి విమర్శింపక, చాలవరకు అలంకారము లీలక్షణ, లేక గుణముపై నాధారపడియున్న వనిమాత్రము మనము గ్రహింపవలయును.

లక్షణావిషయమున ఒకానొక వస్తువుయొక్క గుణములు, క్రియలును మరియొకవస్తువునకు ప్రయోగింపబడును. కావ్యశోభను సంపాదించుటయే దీనివలన కవికి గల ప్రయోజనము. "యౌవనమే జీవితమునకు వసంతర్తువు" అనువాక్యమున వసంతఋతువు అని ప్రయోగించుటవలన ఆఋతువునందలి అందచందములు, వికాసవిశేషములు, సౌఖ్యసంపదలు మొదలైన వెన్నియో మన మనముల

ననవెత్తి కొనలుసాగుచుండును. ప్రయోజన మిచట నుదాహృతము గాకున్నను, ఉద్దేశింపబడియే యున్నది. అభిధాలక్షణలకు దోషు వ్యంజనాశక్తి నొకదాని నొప్పుటకిది యొక కారణ మైయున్నది. ఈవ్యంజనాశక్తికతమున వాచ్యము కాని వేరొకవిశేషార్థము వ్యంగ్య మగును. ఇదిగాక తాత్పర్యశక్తి నొకదానిని కొందరుమాత్రమే సమ్మతించిరి. ఈశక్తివలన తాత్పర్యార్థము సంభవించు నందురు. ఇది అభిధాలక్షణాశక్తులకన్న భిన్నమై చెలంగును. ఆయాపదములకు గల ఆయా యర్థముల నన్నిటిని గుది గ్రుచ్చి, ఏకవాక్యత ననుసంధించి తాత్పర్యశక్తి, తాత్పర్యార్థమును గలిగించును. పదములకు తమంతి అన్వయసమర్థత లేదు; ఆకాంక్షాయోగ్యతాసన్నిధివశమున నాయా పదములకు అన్వయము సంఘటించును. ఈ అన్వయ మేర్పడినప్పుడే తాత్పర్యార్థము లభించును. ఈ తాత్పర్యార్థ మతమున నిరుకతులు గలవు. కొందరు అభిహితాన్వయవాదులు; వీరిది భాట్టమత మని వచింతురు; వీరు తాత్పర్యశక్తి నొప్పిరి. మరి కొందరు అన్వితాభిధానవాదులు; వీరిది ప్రభాకరమత మని పేరొ్కెం దురు; వీరు తాత్పర్యశక్తిని త్రోసిపుచ్చినను తాత్పర్యార్థమును సమ్మతించిరి. పదములు తమంత తామే తాత్పర్యార్థమును వెలి నేయును; వానిలో వాని కన్వయము స్వయముగనే సంభవించు నని వీరివాదము. పదములే వాచ్యలక్ష్యార్థములతోపాటు తాత్పర్యార్థ మునుగూడ నిచ్చును; కాన వేరొకశక్తిని మనము గ్రహింప నక్క రలే దని అన్వితాభిధానవాదు లందురు. ధ్వనిమతానుసారు లీసూక్ష్మ సూక్ష్మతరభేద ప్రభేదములకు గడంగక వృత్తిత్రయము నంగీకరించి తమ అలంకారగ్రంథముల రచించిరి. ఆనందవర్ధనుని తరువాతివా రందరును అభిధా, లక్షణావృత్తుల నొప్పిరి; తాత్పర్యవృత్తికి ప్రత్యే.

కత నొసఁగక దానిని వ్యంజనావృత్తిలో నంతర్గతముగ స్వీకరించిరి. ఈ వ్యంజనావృత్తియే ధ్వనిమతమునకు మూలాధారము. అభిధా, లక్షణాశక్తులచేత విశదముగాని విశేషార్థమును వ్యంజనాశక్తి ప్రకాశింపజేయును. కావున అభిధాలక్షణావృత్తుల కతీతమైన కమనీయార్థమును వ్యంజనావృత్తి కనులకు గట్టినట్లు గాన్పింపజేయు నని ధ్వనిమతము. శబ్దము వాచకము, లక్షకము, వ్యంజకముననియు, దానియర్థము వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యముననియు మూఁడు తెరంగుల వెలుంగునంటరే దీనిసారము. ఇట్టుల వాచ్యార్థమున కందరాని వ్యంగ్యార్థమును లభింపజేయు ధ్వనికావ్యమే ఉత్తమకావ్య మని మన మెఱుంగవలయును. వాచ్యార్థమునకన్న నధికచమత్కారకారి యైన వ్యంగ్యార్థమును ధ్వనింపజేయుటచే నిది ఉత్తమ మని విశ్వనాథుడు దీనికి వ్యుత్పత్త్యర్థమును రచించెను.

"ఈవ్యంజనావృత్తిని మన మేల నవీనముగ సృజింపవలెను? ఇది అభిధాలక్షణలలో నంతర్గతము గాదా? కుశాగ్రబుద్ధి నూహింప తార్కికానుమానమునకు దీనికిని భేద మేమిగలదు?" అని వాదోపవాదములు చెలరేగెను. ధ్వనిమతము నన్యపరముగ నిరూపించుపద్ధతుల నించుమించుగ పదియురెండింటిని గల శ్లోకమును జయరథుడు పేర్కొనెను. మన కాఖండనసమాధానములతో నవసరము లేదు. ధ్వనిప్రతికూలమతములు మూఁడు గల వని ఆనందవర్ధనాచార్యులే గ్రంథాదిని రచించెను. ఈప్రతికక్షులు అభావవాదులు, భాక్తవాదులు, అగోచరవాదులు నన జెలంగుదురు. ఈమూఁడుకక్షుల పరికింప మన కొకసంగతి విశదమగును. ఈముప్పురను రెండురీతుల మనము విభజింపవచ్చును. ఒకరు ధ్వనిని పూర్ణముగ తిరస్కరించి వ్యంజనావృత్తిని నిరసించిరి. రెండవవారు ధ్వనిని సమ్మతించిరి; కాని వ్యంజన

నంగీకరింపరైరి. అభిధా, లక్షణా, అనుమానములే చాలునని వీరి వాదము. తర్కవితర్కముల దగులొల్కనక తత్త్వ మెఱుంగఁగోరుదుమేని వ్యంజనావృత్తి నంగీకరించుటకు తగినంత కారణము లేకపోలేదు. కావ్యరామణీయకపర్యాలోచన మొనర్తుమేని, దీని నంగీకరించుట మనకత్యంతావశ్యకము. కావ్యసౌందర్యసంపాదకములైన రసాద్యంగముల నీ అభిధాలక్షణాదులు సంపూర్ణముగ వివరింపజాలవు. కాన వీనిని ప్రతిపాదించువిశేషశక్తి యేదియో యొకటి కలదు. అది యేది? ఈసందర్భమున మనము వ్యంగ్యార్థము నంగీకరించి, వ్యంజనావృత్తిని తిరస్కరించినవారి వాదముల నొకపరి పరికింపవలయును. ఈవ్యంగ్యార్థము అభిధావృత్తిమూలముననే స్ఫురించుచున్న దని కొందరు మీమాంసకుల వాదము. వీరిని దీర్ఘవ్యాపారవాదు లందురు. 'బలశాలియు, నేర్పరియు నైన ఒక మేటివిలుకానిచే విడువబడిన ఒకబాణ మేరీతి నతివేగముగ కవచమును గ్రుచ్చి, శరీరమును జొచ్చి, ప్రాణముల బుచ్చునో, ఆపగిదినే మహాకవిచే నుపయోగింపంబడిన ఒకపదమే, అభిధాశక్తిచేతనే అన్వయవిశేషమున వ్యంగ్యార్థమునుగూడ స్ఫురింపజేయును' కావుననే అభిధాశక్తికి దీర్ఘవ్యాపారమహిమచే సంకేతార్థమునకు దోడుగ సంపూర్ణార్థము నొసంగుటకు సామర్థ్యమును గలిగియున్న దందురు. "అభిధాశక్తికి దీర్ఘవ్యాపారము లేదు; సంకేతార్థమును గలుగజేసి అభిధ విరమించును; వస్త్వలంకారరసానుభవముల నభిధ గలిగింపనేరదు; రసాదులు సాంకేతికములు గావు; విభావాదుల చేరొక్కనివంతమాత్రమున రసోదయము గానేరదు; మరియు స్వశబ్దాభిధానము దోషముగా గణింపబడును" అని ప్రతివాదివాదము. అభిధకు దీర్ఘవ్యాపారము నంగీకరించినగాని మొదటివాదము సమంజసముగ గన్పట్టదు. దీర్ఘవ్యాపారతను గ్రహించుటకు

ప్రబలాధారము లేవియు లేవు. దీర్ఘవ్యాపారత అభిధాశక్తికున్నచో మన కిక లక్షణాశక్తివలనిఫల మేమి? వ్యంగ్యార్థమువలెనే లక్ష్యార్థముగూడ అభిధచేతనే సంభవింపదా? అను ప్రశ్నల కవకాశము గలదు.

అభిధాశక్తి సాంకేతికము ననుసరించి వాచ్యార్థము నిచ్చి, వెంటనే విరమించును; వ్యంగ్యార్థమునకు విశ్రాంతి లేదు. ఇది దేశ, కాల, పాత్రాదుల ననుసరించి మారుచుండును. వాచ్యార్థ వ్యంగ్యార్థముల క్రిందిభేదము గల దని మనము గురుతింపవలయును.

౧. విధిప్రతిషేధరూపముల నలరారు వాచ్యార్థమునకన్న భిన్నమై వ్యంగ్యార్థము కొన్నిపట్టుల జెలువారుచుండును.

౨. వాచ్యార్థము వాచకములైన శబ్దములపై నాధారపడి యుండును; వ్యంగ్యార్థ మన్నచో నది పదములు, వాని ప్రయోగ స్థలములు, ఉపసర్గనిపాతములు, లక్ష్యార్థము, అక్షరవిన్యాసము, రచనా విశేషము-వీని నాశ్రయించి వెలుంగుచుండును.

౩. వాచ్యార్థము ప్రకృతార్థబోధమాత్రమే గావించును; ఇంక వ్యంగ్యార్థము విశేషార్థప్రకాశనము గావించి, చిత్తవికాస మును గలిగించి, నిరతిశయసుఖాస్వాదానుభవము నాపాదించును.

౪. వక్తృవాచక ప్రకృతుల ననుసరించి వ్యంగ్యార్థమునకు విభేదము సంభవించుచుండును.

వాక్యమునగల వేర్వేరు భావముల కున్న సంబంధమును మన కెరింగించి, తాత్పర్యార్థమును బోధించినవెంటనే, దానివ్యాపారము నిలిచి పోవుటచే, తాత్పర్యశక్తిమూలముననే ప్రతీయమానార్థము సంభవించు నను నైయాయికులవాదముగూడ యుక్తియుక్తము గాదు. వాక్యము

బోధపడినతరువాతగాని వ్యంగ్యార్థమునకు ప్రవృత్తి లేదు. అట్టి పట్టుల నది వ్యంగ్యార్థము నేవిధమున స్ఫురింప జేయ సమర్థమగును?

అణీయమై, అతిరమణీయమై, సకలసత్కవికావ్యోపనిషద్భూతమై వెలుంగు ప్రతీయమానార్థమును ప్రకాశింపజేయుటకు లక్షణావృత్తికిగూడ శక్తిచాలదు ఈ విషయమున లక్ష్యార్థమే వ్యంగ్యార్థమనువారివాదముల నొకింత బరిశీలింతము. లక్ష్యార్థవ్యంగ్యార్థములు భిన్నములు గావు. ఇవి రెండు నొకటియే యని భాక్తవాదులు సమర్థింతురు. వీరివాదమును మూడుముఖ్యాంశములుగ విభజింపవచ్చును:

౧. లక్ష్యార్థవ్యంగ్యార్థములకు తాదాత్మ్యము, లేక తాద్రూప్యమున్నది.

౨. వ్యంజకమునకు వ్యావర్తకధర్మమై లక్షణ చెలంగును.

3. కొన్నిచోట్ల నిది ఉపలక్షణము, లేక తటస్థలక్షణమునయి తనరారును.

ఈ మూడుకారణముల నూతగా గొని భాక్తవాదులు లక్ష్యార్థవ్యంగ్యార్థములకు భేదము లే దందురు. దీనికి ధ్వన్యాలోక మీ క్రిందిరీతి సమాధాన మొసంగెను. ఈ మూటిలో మొదటివాదము నె గైకొందము. వీని రెంటికిని రూపభేదము విశేషముగ నుండుటచేత ధ్వనికి భక్తితో నేకత సంభవింపదు. ముఖ్యార్థబాధ లేనిచో భక్తి, అనగా లక్షణ ప్రవర్తింపదు. అది ఉపచారమాత్రమై సంభవించును. మరియు నది గౌణవృత్తిగా కావ్యముల గన్పట్టుచుండు నని అభినవగుప్తుడు వచించెను. ఇంక వ్యంగ్యార్థ మన్నచో నది ప్రత్యేకరూపమున వెలుంగుచున్నను వాచ్యార్థమున కేవిధమైన బాధయు గలుగజేయదు. నవీనులైన విశ్వనాథాదులు ప్రతీయ

నానార్థము ఉపలక్షణ కాదని విపులముగ జర్చించి వ్యంజనాశక్తి నొకదానిని పరిగ్రహించిరి. ప్రస్తుత మీలక్ష్యమును పరీక్షింతము. "గంగయందు పల్లెపల్లె" అనుచోట గంగాపదమునకు ప్రయోజన మేమి? శైత్యపావనత్వములు స్ఫురింపబడుటయే దాని ప్రయోజనము. ఈ అర్థము లక్షణామూలమా, లేక వ్యంజనామూలమా? అని మనకు సంశయము గలుగును. భాక్తవాదుల ననుసరించి లక్షణామూలముగనే భావింతము. గంగాశబ్దమునకు శైత్యపావనత్వములు లక్ష్యార్థమైనచో నింక ముఖ్యార్థ మేమి? గంగాపదమునకు తీరమని అర్థము జెప్పవల యును. దీని నంగీకరించినచో ప్రయోజనమైన శైత్యపావనత్వములును, లక్ష్యార్థమైన తీరమును నీరెండు నొకసారియే సంభవించును. ముఖ్యార్థ బాధ లేనిపట్టుల లక్షణ కవకాశము లేకుండుటచే, లక్షణను మనము సమ ర్థింప నెంచినచో మొదటి ప్రయోజనమునకు రెండవ ప్రయోజనమును, రెండవదానికి మూడవదాని నీరీతిగా ననంతములైన ప్రయోజనముల నుద్దే శింపవలయును. నిజమునకు ప్రయోజన మిట వివరింపబడలేదు. ప్రయోజన మవివక్షిత మైనచో దానిని మన మేరీతి నూహింతుము? ఈ ప్రశ్నకు సమాధానముగ ప్రయోజన మిచట ధ్వనిత మగుచున్న దని చెప్పకతప్పదు. అదియుగాక ధ్వన్యర్థము దేశకాలపాత్రముల నను సరించియు, వక్తృబోద్ధృవిషయస్వరూపభేదములవలనను, పదోపసర్గ నిపాతాదిదిభేదములచేతను సంభవించు నని మన మెరుంగుదుము. వాచ్యలక్ష్యార్థముల గూడి వ్యంగ్యార్థము నెలకొను నని మనము పలు కుటకైన వీలు లేదు; అది కొన్నిచోట్ల అక్షరములపై నాధారపడి ప్రకాశించుచుండు నని మమ్మటుడు సూచించెను. దీనివలన లక్షణా వ్యంజనలకు తాదాత్మ్యము, లేక తాద్రూప్యము లేదని తేలినది.

ఇంక వ్యావర్తకధర్మపక్షమును పరికింతము. ఈపక్షము అతివ్యాప్తి, అవ్యాప్తిదోషములచే దూషితమై గన్పట్టును. లక్షణా

ప్రయోజనము చమత్కారకారి కానప్పుడు వ్యంజనను స్వీకరింప రాదు. వివక్షితాన్యపరవాచ్యవ్యంగ్యముల లక్షణ కవకాశము గలదు. ఇచట వ్యంగ్యము లక్షణామూలమై చెలంగును.

కడపటివాదము నింక గమనింతము. ఇందు కొన్నిస్థలముల ధ్వని ఉపలక్షణమై వచ్చును. దీనిలో సత్య మున్నది. కావుననే ధ్వని మతానుసారులు దీనిని లక్షణామూలధ్వనిగ వచించిరి.

ఇంతమాత్రమున ప్రతివాదిమతము ననుసరించి లక్షణావ్యం జనల కభేదము నంగీకరింపలేము. కాన వ్యంజనావృత్తిని మనము సమ్మతింపవలయు ననుట నిర్వివాదాంశము.

ఈ వ్యంజనావృత్తికి ప్రాచీనులు, ప్రబలులు నైన ప్రతి వాదులు అనుమానమతవాదులు. ఆనందవర్ధనుడు వీరివాదముల ఖండించియే యున్నాడు. నవీనులలోగూడ నీ మతావలంబకులు గలరు. వారిలో నత్యంతసమర్థుడు మహిమభట్టు. ఇతడు వ్యక్తి వివేక మను ధ్వనిధ్వంసగ్రంథమును రచించెను. నైయాయికమతాను సారముగ వ్యంగ్యార్థము సాధ్యసాధనానుమేయవిషయములపై నాధారపడి యుండు ననియు, నందువలన వ్యంజనావృత్తిని స్వీక రింపరా దనియు సిద్ధాంతము చేయబడెను. ఈ వాదోపవాదము లన్నియు తర్కశాస్త్రముపై నాధారపడి అలంకారపక్షము నతిక్రమించిపోవుచున్నవి. మహిమభట్టారకుని మతమును వేరొక తావున విమర్శింపవలసి యుంటచే, ప్రస్తుతమున ఆనందవర్ధనుని కాలమున వ్యాప్తిజెందిన అనుమానమతమునందలి ప్రధానాంశములను, వానిసమాధానములను నిట పరిగణించిన జాలును. "లింగ ప్రతీతియే వ్యంగ్యప్రతీతి ; కాన నిచట లింగలింగిభావమే కాని వ్యంగ్యవ్యంజక భావ మిసుమంతయు గానరాదు." ఇదియే అనుమానవాదుల ప్రబల

పక్షము. వక్త్రభిప్రాయమును వ్యంగ్యార్థ మనుసరించు నని ధ్వని మత మొప్పుకొనుటయే పైవాదమునకు చేయూత నిచ్చెను. ఈ అభిప్రాయమే అనుమానమై చెలంగు నందురు. ఇంతమాత్రమున స్వపక్షసిద్ధికి భంగము గలుగ దని చెప్పి ఆనందవర్ధను డీక్రిందిరీతిని వాదించెను:

అనుమేయము, ప్రతిపాద్యము నని శబ్దవిషయము ద్వివిధము. అందు అనుమేయము వివక్షాలక్షణము. శబ్దస్వరూపప్రకాశనేచ్ఛ యనియు, శబ్దమువలన నర్థప్రకాశనేచ్ఛ యనియు వివక్ష రెండు తెరగులు. ఇందు మొదటిది ప్రాణిత్వమాత్రప్రతిపత్తిఫలిత మగుటచే శాబ్ద వ్యవహారాంగము గాదు. రెండవది శబ్దకారణవ్యవహారనిబంధనమై చెలంగును. ఇంక ప్రతిపాద్య మన్నచో నది ప్రయోక్తయొక్క అర్థ ప్రతిపాదన సమీహావిషయీకృతమై తనరారును. ఇది వాచ్యము, వ్యంగ్యము నని రెండురీతులుగా నుండును. కొన్నివేళల ప్రయోక్త, స్వశబ్దముచే నర్థప్రకాశనము నిచ్చగించును; మరికొన్నిపట్టుల ప్రయోజనాపేక్షానుసారముగను, స్వశబ్దానభిధేయముగను అర్థప్రకాశనము జేయును. ఈ ప్రతిపాద్యవిషయము లింగలింగిస్వరూపమున ప్రకాశింపనేరదు. ఇది కృత్రిమముగనో, అకృత్రిమముగనో, సంబంధాంతరముననో వెలుగొందుచుండును. ఇంక వివక్షావిషయత్వమైనదాని అర్థ మన్నచో నది శబ్దములకు లింగమూలమున ప్రతీత మగును గాని స్వరూపమాత్రమున గానేరదు.

కావుననే "శబ్దవ్యవహారము లింగమూలముననే సంభవించును. అట్టి శబ్దార్థమున మిథ్యాత్వాదివివాదము ప్రవర్తింపదు. స్వశబ్దాభిధేయత్వమే ప్రయోక్తృమత మైనచో అర్థము అనుమేయ మగును. స్వశబ్దానభిధేయత్వము కనిసమ్మతమేని వాచకానుమానముల కతీత మగును గాన వ్యంజన నంగీకరింపవలయును." అని ఆనందవర్ధనుడు

ధ్వన్యాలోకమున సప్రమాణముగ నిరూపించెను. అందుచే 'లింగప్రతీతియే వ్యంగ్యప్రతీతి' అను నైయాయికవాదము నిరర్థక మయ్యెను

---

(కావ్యత్రయవిభాగము : ప్రాచీనమతసమన్వయము)

ఇటుల ప్రతివాదిమతముల నెల్ల నిర్జించి ధ్వనిమతము పెంపొందెను. వ్యంజనము, ధ్వననము, గమనము, ప్రత్యాయనమునను పర్యాయనామములు గల ఒకానొక శక్తిని ధ్వనిమతము గ్రహించెను. వాక్యమున వ్యంగ్యార్థము ప్రధానమైనప్పుడు దానిని ధ్వని యని వ్యవహరింతురు. ఈ నవీనమతమున ధ్వనియే కావ్యాత్మగా చెలువొందును. వ్యంగ్యార్థము ననుసరించి కావ్యము మూడువిధముల నలరారుచుండును. వీనిలో ధ్వనికావ్యము ఉత్తమము. ఇందు వాచ్యార్థమునకన్న వ్యంగ్యార్థము మిన్నయై వన్నెలొలుకును. ఈవ్యంగ్యార్థము సారరూపమై, లలితోచితసన్నివేశచారువై, సహృదయశ్లాఘ్యమై కావ్యమున ప్రకాశించును. ఈధ్వన్యాలోకాంశమునకు అభినవగుప్తపాద విశ్వనాథాదులు సమ్మతించి, ప్రతీయమానార్థమునే కావ్యాత్మగ పరిగణించిరి. ఎచట శబ్దార్థములు తాము అప్రధానములై, విశేషార్థమును ప్రకాశింపజేయునో అదియే ధ్వని యని విద్వాంసులు వివరించి రని లక్షణము విధింపబడెను. అంగనామణులయందు ప్రసిద్ధావయవాతిరిక్తమై, లావణ్య మేరీతి వెల్లివిరియుచుండునో, ఆరీతినే మహాకవులపద్యముల వాచ్యమునకన్న వేరై ప్రతీయమానము ప్రకాశించు నని ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున వచించెను. ఇటుల జవులూరుచు జనువరుల నువ్విళ్లూరజేయునదియే ఉత్తమకావ్యము.

## ధ్వనిమతము - కావ్యత్రయ విభాగాదులు

ఎచట ప్రతీయమానము ప్రధానముగాక గుణీభూత మగునో అది మధ్యమకావ్యము. దీనిని గుణీభూతవ్యంగ్యకావ్య మందురు. ఇచట గుణీభావమున వాచ్యము చారుత్వప్రకర్షం బెందును. మొదటిదానియందు ప్రతీయమానము ప్రధానముగ నుండును. రెండవ దానియందు ప్రతీయమానము అప్రధానముగ నుండును. ఇందు వాచ్యార్థ, వ్యంగ్యార్థములు కలసిమెలసి చరించుటంజేసి దీనికి గుణీభూత మని పేరు వచ్చెను. ఇదియే ఉత్తమమధ్యమకావ్యములకుగల భేదలక్షణమై తనరారును. ఈ గుణీభూతధ్వనికావ్య మెనిమిదివిధముల విభజింప బడినది: ౧. అగూఢము, ౨. అపరాంగము, ౩. వాచ్యసిద్ధ్యంగము, ౪. అస్ఫుటము, ౫. సందిగ్ధము, ౬. తుల్యప్రాధాన్యము, ౭. కాక్వాక్షిప్తము, ౮ అసుందరము అని అష్టవిధముల నీ మధ్యమకావ్యము తెలంగు నని మమ్మటాచార్య విశ్వనాథకవిరాజులు వచించిరి. ఈ ఉత్తమమధ్యమకావ్యభేదవిభేదములకు లక్ష్యలక్షణముల నెరుంగగోరు వారు నాచే రచింపబడిన "అలంకారమంజరి" యందు గాంచగలరు.

ఎచట వ్యంగ్యార్థవాసన వీసమేనియు జేకూరదో, దానిని చిత్రకావ్య మందురు. దీనిని అవరకావ్యముగ ఆలంకారికులు గణించిరి ఈచిత్రకావ్య శబ్దార్థభేదముల ద్వివిధము. ఏది రస భావాదితాత్పర్యరహితమై, వ్యంగ్యార్థవిశేష ప్రకాశనశక్తిశూన్యమై, కేవలవాచ్యవాచకవైచిత్ర్యమాత్రాశ్రయోపనిబద్ధమై, ఆలేఖ్యప్రాయమై కానవచ్చునో, అది చిత్రకావ్యమని ఆనందవర్ధనుడు వచించెను. చిత్రశబ్దమునకు అభినవగుప్తపాదాచార్యుడు వేర్వేరువ్యుత్పత్త్యర్థముల నొసంగెను. విస్మయము గలుగజేయు వృత్తివిశేషముల చేతనో, కావ్యానుకారిత్వముననో, ఆలేఖ్యమాత్రముననో, లేక కళామాత్రముననో యీ తృతీయభేదము చిత్రకావ్య మని పిలువ

బడెను. దుష్కరయమకాది శబ్దాలంకారనిబంధనము లన్నియు నీచిత్రకావ్యముననే చేర్పబడినవి. దీనికి శబ్దవైచిత్రి వాగ్వికల్పములు ప్రధానములు. ఇది కావ్యానుకారము గాన కావ్య మనుటకు తగ దని ఆనందవర్ధనుడు నొక్కి వక్కాణించెను. ఏల నన, వ్యంగ్యార్థసూచన లేనిచోట నది కావ్యము గానేరదు. ఐనను నిశ్శృంఖలవాగ్వ్యాపారులైన కవీంద్రులు కొందరు రసాదితాత్పర్యాపేక్ష లేకయే, చిత్ర కావ్యప్రవృత్తికి చేయూత నిచ్చినకారణముననను, ప్రప్రథమమున కావ్యరచనకు గడంగు నవీనకవులకు, చిత్రకావ్యవ్యవహారము మీర రాని దగుటవలనను, దీని నొకకావ్యభేదముగ ఆనందవర్ధను డంగీకరించెను. ఆనందవర్ధనాచార్యునందలి గౌరవాతిశయమున మమ్మటాచార్యుడుగూడ నీచిత్రకావ్యము నధమకావ్యముగ పరిగణించెను. కాని కవితా జని ప్రఖ్యాతి గాంచిన విశ్వనాథుడు చిత్రకావ్యమునకు కావ్యత్వ మెంతమాత్రమును సమ్మతింపలేదు. ఇది క్షుద్రము, అనాస్వాద్యము నని త్రోసిపుచ్చెను.

ఈ మూడువిధముల కావ్యముల నత్యంతకౌశల ముపయోగించి ఆలంకారికులు భేదప్రభేదములుగ విభజించిరి. ఈ విభాగ విషయమున నలంకారశాస్త్రమర్యాద నతిగౌరవముగ నాదరించి, అంతరాంతరముల గమనించి, సహృదయహృదయాహ్లాదకత్వమునే ప్రబల ప్రమాణముగ పరిగ్రహించి, ప్రాచీనమతముల పరస్పరవైరమును దూర మొనరించి, వాని నన్నింటిని మెలకువతో మేళగించి, ఆనందవర్ధనాచార్యులు ధ్వనిమతమును ప్రతిపాదించిరి. ఈ మతమునంగల ఐదువేలమూడువందల ఏబదియైదు వ్యంగ్యవిభేదములతో, వాని లక్ష్యలక్షణములతో మన కిట ప్రయోజనము లేదు. రస రీతి

గుణదోషాలంకారముల కీమతమున నెట్టిస్థానము గలదో, దానిని సంగ్రహముగ వివరించుటయే మనకర్తవ్యము.

ఉత్తమమైన ధ్వనికావ్యము తొలుత రెండుశాఖ లయినది. మొదటిది అవివక్షితవాచ్యము, రెండవది వివక్షితాన్యపరవాచ్యమునని పిలువబడును. అవివక్షితవాచ్యమున వాచ్యార్థము వివక్షితము గాదు; ద్వితీయమున వాచ్యార్థము ప్రథమమున వివక్షిత మైనను తుద కది అన్యపరము, లేక వ్యంగ్యపర మయి వర్తించును. సమాసోక్తి, పర్యాయోక్తి, ఆక్షేపము, అపహ్నుతి, దీపకము మొదలైన అలంకారములు లక్షణామూలమున నొప్పారుచున్నవి. కావున లక్ష్యార్థము కావ్యమునందు చమత్కారకారియై చెలువారుచుండును. ఈ సంగతి గురుతెరింగియే గుణాలంకారరీతిమతములు లక్షణకు ముఖ్యత నంగీకరించెను. దండ్యాచార్యులు దీనిని సమాధిగుణమునను, వామనాచార్యులు వక్రోక్త్యలంకారమునను జేర్చిరి. ధ్వనిమతప్రతిపాదకుడైన ఆనందవర్ధనాచార్యుడు లక్షణాప్రాముఖ్యమును పాటించియే, దీని కుచితస్థానము నొసంగుతలంపున లక్షణామూల వ్యంగ్యమును అవివక్షితవాచ్యధ్వనిగా స్వీకరించెను. ఇందు అలంకారగుణరీతిమతము లిమిడియున్నవి. ఇంక వివక్షితాన్యపరవాచ్యవ్యంగ్యము అభిధామూలము. ఇందు వాచ్యము పేర్కొనబడినను తుద కది ప్రతీయమానపరమై ప్రకాశించును. ఈవిభాగమున రసమతము పూర్ణముగ మునిగియున్నది. ఈ వివక్షితాన్యపరవాచ్యధ్వని మరల అసంలక్ష్య క్రమవ్యంగ్యము, సంలక్ష్యక్రమవ్యంగ్యమునని రెండుతెరగుల విభజింపబడెను. ఇందు మొదటిదానిలో క్రమము గన్పట్టదు; రెండవదానిలో క్రమము గానవచ్చును. అసంలక్ష్యక్రమమున రసభావములును, సంలక్ష్యక్రమమున వస్త్వలంకారములును జేర్పబడెను. సంలక్ష్య

క్రమమున వస్త్వలంకారధ్వనులు శబ్దార్థోభయశక్తిమూలములై ప్రకాశించును. ఈ శబ్దము, అర్థము, శబ్దార్థము వీనివలన వస్తుమాత్రము, అలంకారము, రసాదులు-వీనిలో నేదేనొ యొక్కటి మనమనములకు ప్రతీయమాన మగును. అనిర్వచనీయములైన రసభావములే చాలచోట్ల వ్యంగ్యము లగును. రసస్ఫూర్తికి అంగములైన విభావానుభావవ్యభిచారిభావముల పేర్కొనుటకన్న వేరేమిచేయుటకును కవికి శక్తి లేదు. శృంగారము, వీరము, కరుణ అని పేరిడవచ్చును కాని దీనికి మించి వేరేదియు నొనరింప వీలు లేదు. రసోచ్చారణ జేసినంతమాత్రముననే రసోదయము కాజాలదు. అటులేని కవివరు డేమి చేయగలడు? అనినచో, తత్తద్విభావానుభావసంచారిభావముల తనబుద్ధికౌశలమున పోషించి, వర్ణనావిశేషమున చిత్రించి, చదువరులడెందముల మెత్తబరచి, రసోదయమున కభిముఖముగ నొనరించుటయే కవిచంద్రుని విధాయకకృత్య మని తేటపడును. ఈవాచ్యములైన విభావాదులు రసమునకు వ్యంజకములును, రసము వ్యంగ్యమునునై వెలుంగును. వాచ్యార్థాపేక్షితమై వ్యంగ్యార్థము విలసిల్లును. శతపత్రపత్రసూచీప్రవేశన్యాయమున నీరసస్ఫూర్తిలో క్రమమును నిర్ణయించుటకు వీలు లేదు. రసాస్వాదనావసరమున చిత్తము తన్మయోద్రేకపూరిత మగుటంజేసి క్రమమును గురుతించుటకు కించుకేనియు నవకాశ ముండదు. కావుననే ఆలంకారికులందరును దీనిని అసంలక్ష్యక్రమ మందురు.

ఉత్తమమైన ధ్వనికావ్యమునకు తోడునీడగ మధ్యమమైన గుణీభూతవ్యంగ్యకావ్యము మెలంగజొచ్చెను. ఎరిగియో, ఎరుగకయో వ్యంగ్యార్థమును వాచ్యాలంకారముల నంతర్గతముగా జేసిన ప్రాచీనాలంకారరీతిమతముల అనుభవములను, ఫలితములను సంగ్రహించి

వానిని ధ్వనిమతమునకు సంక్రమింపజేయుట కిచ్చట నవకాశము లభిం చెను. సమాసోక్తిదీపకాక్షేపరసవదాద్యలంకారముల నన్నిటి నీగుణీ భూతవ్యంగ్యమున ధ్వనిమతానుసారులు గుడి క్రుచ్చిరి. రసవదాదులలో వ్యంగ్యము అప్రధానమై వాచ్యమునకు ఉపస్కారకమై చెలంగును. ఇటుల ప్రధానాంశమైన రసమును స్ఫురింపజేయుకావ్యమును, మధ్యమ కావ్యముగ గణించుటచే నన్యాయము జరిగె నని మనము సమ్మతింపక తప్పదు. ఈప్రతీయమానము వస్త్వలంకారరసరూపముగ 'త్రిరూపాత్మ త్త్వః మై' నెలంసుచున్నది. ఇందులకు ఆనందవర్ధన, అభినవగుప్తు లంగీక రించిరి. ఈసందర్భమున మరల కారికాకార వృత్తికార భేదవాదములు తెలసూపును. వీరికి భేదమును గాని, అభేదమును గాని వెంటనే నిర్ణ యించుటకు తగన ఆధారములు గాని, గ్రంథాంతరములు గాని మన కందుబాటులో లేవు. ధ్వనిమతతత్త్వ మెరుంగుటయే మనముఖ్యోద్దేశ మగుటచేతను, వీ రిరువురును భిన్నులుగ నిరూపించుటకు ప్రబలాధార ములు లేకుంటచేతను కారికావృత్తులు రెండును ఆనందవర్ధనాచార్య కృతములే యని మనము భావించుట సమంజసము. గ్రంథవిస్తర భీతిచే నీప్రశ్న నింతటితో విరమించి ముఖ్యాంశములమాత్రమే గమ నింతము.

ఈవిధమున రసధ్వనియే కావ్యమునకు ప్రధాన మని ఆనంద వర్ధనాదులు ఐకకంఠ్యమున ఉచ్చైఃస్వరముతో ఘోషించి రని నచో నతిశయోక్తి కాదు. కావ్యమునందలి మంచిచెడుగుల మర్మమును వెలినేయుటకు రసధ్వనియే గీటురాయిగా విమర్శకుల కుపయోగిం చును. చిరంతనాలంకారికులచే గౌరవింపబడిన అలంకారవస్తువుల గూడ నాదరింపవలయును గాన వానికిగూడ నీధ్వనిమతమున స్థలనిర్దేశము గావింపబడియెను. ప్రబంధరచనావసరమున రసస్ఫూర్తికి

వస్త్వలంకారాదులు అంగములుగ నుండవలయునే కాని, ఇతివృత్తవ శాయాతము లని రసభంగహేతువులైన సంగతులను, సందర్భములను కవులు ప్రదర్శింపగూడదు. సిద్ధరసప్రఖ్యములైన రామాయణాదులలో గూడ గానవచ్చు అనుచితవిషయములనైన పరిత్యజింపవలయునే కాని మనము పరిగ్రహింపరా దని ధ్వనిమతాచార్యుల యాశయము. శబ్దార్థరచనావిశేషముల రసపరిస్ఫూర్తియే కవుల కాదర్శప్రాయముగ నుండవలయును. పరిపాకవంతులైన మహాకవీంద్రులకైనను రసాదితాత్పర్యవిరహమైన వ్యాపారము శోభావహము గానేరదు. కావున రసధ్వనియే కవితామతల్లికి హారనాయకమణియై వెలుగొందును. దీని ననుసరించి గుణాలంకారరీతులు చరింపవలయు నని ఆనందవర్ధనుడు స్పష్టముగ వచించెను. అంగియైన రసాది లక్షణము నవలంబించి శౌర్యాదులవలె గుణము లుండు ననియు, అంగములైన వాచ్యవాచకలక్షణముల నాశ్రయించి కటకాదులకైవడి అలంకారములు వెలంగు ననియు ఆనందవర్ధనుడు ద్వితీయోద్ద్యోతమున వచించెను. అక్షర, పద, వాక్యసంఘటనాస్వరూపమును, అసమాస, మధ్యమసమాస, దీర్ఘసమాసరచనావిశేషమును, వస్తు, విషయ, వాచ్య, వాచక, ప్రకృత్యౌచిత్యప్రాధాన్యమును జర్చించి, యివి యన్నియు కావ్యాత్మయైన రసధ్వని కేవిధముగ నుపస్కారకము లగునో తత్తద్విషయముల వేరొకచోట ప్రదర్శించెను. మరియు మధ్యమకావ్యమైన గుణీభూతవ్యంగ్యముగూడ రసాది తాత్పర్యపర్యాలోచన ననుసరించి ధ్వనిరూపతం జెందు నని వాక్రుచ్చెను. ఇటులనే తృతీయోద్ద్యోతమున ననేకస్థలముల రసావేశపరవశుడై ఆనందవర్ధనుడు 'రసాదులే కావ్యనాటకములకు జీవభూతము' లని వచించెను. దీనివలన రసామృతము ధ్వనికావ్యకాం

చనకలశమున నిండియున్న దని మనకు దెలియుచున్నది. ధ్వని మతావలంబకులు రసమును కావ్యజీవముగ గ్రహించినను, దానినే సర్వస్వముగా నంగీకరింపలేదు. రసము ధ్వనికావ్యమం దొక ప్రధానాంగమై వెలుగొందు నని వచించిరేకాని ప్రస్ఫుటముగ అభినవ గుప్తపాదాచార్యునివలె "రసమే కావ్యాత్మ; వస్త్వలంకారధ్వనులు రసమున కుపకరించును; వాచ్యమునకన్న నుత్కృష్ట మను తలంపునం జేసి ధ్వనియే కావ్యాత్మ యని సామాన్యముగ జెప్పబడెను" అని నిష్కర్ష చేయుటకు సాహసింపరైరి. ఆచార్యాభినవగుప్తుని శాస్త్ర మర్యాదాస్వేచ్ఛాతిక్రమణమే విశ్వనాథకవిరాజుల రసమతోద్ధరణ రూపమున ప్రతిబింబితము గానోపును. ఈ మర్యాదాతిక్రమణకు పాచితముగ కవిరాజు పండితరాయల విమర్శనములకు పాత్రుడయ్యెను. కావుననే ధ్వనిమతతత్త్వవేదియైన ఆనందవర్ధనాచార్యుడీక్లిష్టసమస్యను వాచ్యగత మొనరింపక వ్యంగ్యముగనే వదలెను. అనగా ధ్వనియే కావ్యాత్మగ స్వీకరించి, దానిలో వస్తువు, అలంకారము, రసాదులకు వేర్వేరుభాగముల నిరూపించెను. ఈ విభాగమున రసపరిస్ఫూర్తి లేనట్టియు, సందిగ్ధముగ గలట్టియు కావ్యములకుగూడ తావు గలదు. ఈ కారణముననే ధ్వనిమతము ప్రాచీన మతముల కన్నింటికిని ఆలవాలము, ఆశ్రయము నై చెలువారుచు వానికి మైత్రి గూర్చెను. ఇదియే ధ్వనిమతమునంగల మాహాత్మ్యము. ఈ మత మిటుల విశ్వరూపసందర్శన మొనరించి, తనయం దితరమత ముల నన్నిటిని లీనముగావించుకొనె నని మనము భావింపవలయును. పలుపలుకు లేల? భావాలంకార సౌష్ఠవ సౌందర్యముల వెలిచూపి, శబ్దరచనాకంచుకాంతరంబున వాచ్యవ్యంగ్యార్థసూచకనకకలశయుగళిని మాటుపరచి, కావ్యకాంతామణి, నిర్ణిక్తకాలమున, వివృతసర్వా

వయవయై, రసభావధ్వనిమయమణితరణితముల ప్రకటించి, రసిక జనశిరోమణుల మానసముల గరంచి, వారల పరబ్రహ్మానందాస్వాద సచివులగా జేసె నంటయే ధ్వనిమతసర్వస్వమై చెలువొందుచున్న దని చదువరు లూహింపవలయును.

ధ్వనిమతము రసమున కెట్టిస్థాన మొసంగినదియు పైన ప్రదర్శింపబడెను. గుణాలంకారరీతిమతముల నెటు లీమతము సమన్వయము చేసెనో దాని నింక పరిశీలింతము. రసపరిపోషణ కనుకూలముగ రీతి వర్తించును. రీతిగుణవృత్త్యాదిసంపర్కమున ఆనందవర్ధను డనవసరములైన భేదములను పూర్వులవలె గల్పింపలేదు. ఈవిషయమున నీతడు రీతి మతజనకుడైన వామనాచార్యులమార్గమునే కైకొనెను. వామనుడు 'రీతియే కావ్యాత్మ' యనియు, 'విశిష్టపదరచనయే రీతి' యనియు, 'విశేషము గుణాత్మ' యనియు, 'వైదర్భి, గౌడీ, పాంచాలు' లన రీతి మూడువిధముల దనరు ననియు వచించెను. ఈ మూడురీతులకు మూడుగుణములును, మూడువృత్తులును నియమింపబడినవి. దీనినిగురించి రీతిమతమున విశేషముగ జర్చించితిమి గాన పునరుక్తిదోషశంకను, గ్రంథగౌరవభయమునను నింతటితో ముగించి, ఆనందవర్ధనుని విభాగముల నిరూపించెదము. రీతివిషయమున నీతడు విశేషముగ విమర్శించక 'రీతి గుణమున పర్యవసిత' మని సంగ్రహముగ పలికెను. దీనివలన గుణములు రీతుల నిర్ణయించు నని తేలినది. ఈగుణములుగూడ రసానుకూలములుగనే చెలంగ వలయును. మాధుర్యము, ఓజము, ప్రసాదమునని మూడు గుణములు గలవు. మాధుర్యము శృంగారమునను, ఓజము రౌద్రమునను, ప్రసాద మన్నిరసములను ప్రయోజ్యమగును. ఈ మూడుగుణములును కొంచె మించుమించుగ వామనుని వైదర్భి, గౌడీ, పాంచాలీరీతులతో తుల

గూనను. ఆయా యక్షరము లాయా రసోద్బోధకము లనియు, గుణ ములకు సంఘటనాధర్మత్వ మున్న దనియు, సమాసరచనపై సంఘట నాస్వరూప మాధారపడు ననియు, తుదకు పైన పేర్కొన్న వన్నియు రసమునకంగములై చెలంగు ననియు నిర్దేశించుటలో ఆనంద వర్ధనుడు ప్రాచీనులైన ఉద్భట, రుద్రట, వామనాదుల నియమముల సంగ్రహముగ నిర్వచించెను. మరియు ధ్వన్యాలోకమునందు వాచ్య విషయవక్తృనియమముల వివరించి, అనౌచిత్యమే రసభంగకారణ మనియు, ప్రసిద్ధౌచిత్యబంధమే రసంబునకు పరమోపనిషత్తనియు నొక్కి చెప్పెను. తరువాత గుణములనురించి రచించుచు గుణములే సంఘటనాస్వరూపము గాదనియు, సంఘటనాశ్రయమై గుణములు లేవనియు ప్రదర్శించి, సంఘటన గుణములపై నాధారపడియున్న దని వచించెను గుణములకును రసమునకును గల సంబంధముతోపాటు, గుణములకును అలంకారములకును గల భేదమునుగూడ చర్చించెను. గుణాలంకారభేదమును విమర్శించుచు, నవీనాలంకారికులు రసధర్మ త్వము, రసావ్యభిచారిస్థితిత్వము, రసోపకారకత్వమును గుణమునకు లక్షణముగా వచించిరి. దీనివలన గుణరసములు సర్వదా కూడి యుండునేకాని వీడియుండవని మనకు తెలియవచ్చును. కొన్నిపట్టుల శబ్దమునకును, మరికొన్నిచోట్ల నర్థమునకును గుణము జెందియుండు నందుమేని అది ఉపచారమాత్రమని సమర్థించుచు, ప్రాచీనవిభేద మైన శబ్దగుణ, అర్థగుణముల మన మంగీకరింపవలసివచ్చును. కావున నీవిభాగము సహృదయులకు సమంజసముగ గన్పట్టదు.

ఇంక నలంకారము లన్నచో నవి ముఖ్యముగ శబ్దార్థముల కుపస్కారకములై, శబ్దార్థములమూలమున రసపరిపోషకము లగును. అనుప్రాసోపమాదులైన అలంకారములు హారాదులవలె అంగద్వార

మన రసమునకు శోభావహము లగు నని మమ్మటుడు వచించి, రసము లేని స్థలముల నవి ఉక్తివైచిత్ర్యమాత్రములుగ పర్యవసించు నని వృత్తిగ్రంథమున విశదపరచెను. అలంకారములకు అచలస్థితి గల దనియు, అవి శబ్దార్థములకు ప్రధానసంబంధమును, రసమున కప్రధానసంబంధమును గల్గియుండు ననియు పేర్కొనెను. అలంకారములు రసమున కేరీతి సౌందర్యము గూర్చునో దాని నానందవర్ధనుడు విపులముగ ప్రదర్శించెను. మొత్తముమీద నలంకారముల నాలుగువిధములుగ మనము గణింపవచ్చును:

౧. ఎచట కవిచంద్రుడు రసబంధమం దత్యంతాదరము గలవాడై అలంకారముల నంగిత్వమున గాక, రసపరత్వముననే ప్రయోగించునో,

౨. ఎచట తాను వానిని కాలానుగుణముగ పరిగ్రహించుచు పరిత్యజించుచు నుండునో,

3. ఎచట వాని నత్యంతము నిర్వహించుట కిచ్ఛగింపడో,

౪. ఒకానొకచోట నిర్వహించినను, రసపరిపుష్టి కంగత్వముగానే ప్రయోగించునో.

ఇట్టిపట్టుల నెల్ల నలంకారము లాదరణీయము లనియే ఆనందవర్ధనుని యాశయము. ఉక్తప్రకారాతిక్రమణము రసభంగహేతువై పరిణమించును. మరియు మమ్మటాచార్యుల కావ్యలక్షణమునందు గల 'అనలంకృతీ పునః క్వాపి' అను విశేషణము విశ్వనాథ జగన్నాథుల విమర్శనముల కెంతపాత్రమైనను, అలంకారముల కప్రధానత్వమునే సమ్మతించుచున్నది. గుణదోషములగూర్చి స్ఫుటతరముగ నిర్దేశించినట్లు, వాక్యార్థీభూతరసమును గురించి కాని, వ్యంగ్యా

ర్థము నుద్దేశించి కాని మమ్మటునిలక్షణము నొక్కి వక్కాణింపలేదు. ఇంతమాత్రమున వీ రలంకారముల నిరాదరించి రని మనము తలంప నక్కరలేదు. ఆనందవర్ధనుడే వేరొకపట్టున కావ్యవృత్తి అలంకారముల నాశ్రయించు దని నుడివి, వీనిని అంగియైన రసమున కంగముగ నంగీకరించెను. రసభావరహితములై, శబ్దార్థాలంకారభూయిష్ఠము లైనవానిని వాగ్వికల్పములుగ పరిగణించి, చిత్రకావ్యమున జేర్చెను. ఇట్టివానికి ధ్వనిప్రబంధమున నవకాశ మొసంగలేదు. ధ్వనిమతానుసారులైన రయ్యకాదు లీలోపమును గురుతించి సవరించిరి.

ఇంక దోషము లేవియో మన మెరుంగవలయును. ఈవిషయమున మనము ప్రాచీనమతముల నొకపరి తిలకింపవలయును. రస, గుణ, రీతి మతములకు గురువులైన భరత, దండి, వామనులకైవడిని, వారిమతావలంబకులవలెను పదిగుణములను, వీనిని మరల శబ్దగుణ, అర్థగుణములుగను విభజింపక, ఆనందవర్ధనుడు ముఖ్యముగ మూడు గుణములనే సమ్మతించెను. ఈ గుణత్రయము రీతిత్రయము నాశ్రయించి రసత్రయమున కాలంబ మగును. సామాన్యముగ 'మాధుర్య' గుణము 'వైదర్భి' రీతిలో నెలకొని శృంగార, కరుణ, శాంత రసముల బొదలి చదువరులడెందముల 'నాహ్లాద' మొదవించును. 'ఓజో' గుణము 'గౌడీ' రీతియం దుండి వీర, రౌద్ర, భయానక రసముల నిండి హృదయమును 'విస్తరింప' జేయును. ఇంక 'ప్రసాద' గుణము 'పాంచాలీ' రీతిలో విలసిల్లి 'రసములం దెల్ల' వర్తించి, శుష్కకాష్ఠముల నగ్ని చొచ్చునట్లు మానసమునకు 'వ్యాప్తి' గల్గించును. ప్రాచీనాలంకారికుల విభాగమువలె నిది శబ్దార్థముల నూతగా గొనక, రసభావోదయముల జెట్టపట్టినట్టుల గన్పట్టుచున్నది. పూర్వుల శ్లేష, సమాధి, ఔదార్యములు ఓజోగుణమునను, అర్థవ్యక్తి ప్రసాదమునను

గూడియేయున్నవి. ఇంక సౌకుమార్యము పారుష్యమునకును, కాంతి గ్రామ్యత్వమునకును విరోధములుగను, సమత రచనాదోష ముగను కొన్నిచోట్ల మన మెంచవచ్చును. కావ్యమునకు గుణములు ఉత్కర్ష హేతువులుగ జెలువారుచున్నచో, అపకర్ష కారణము లన్నియు దోషములుగా పరిగణింపబడును. ముఖ్యార్థవిరోధములుగను, రసభంజకములుగను దోషములు జెలంగును. కొన్ని దోషములు గుణాభావములుగను, కొన్ని గుణములు దోషాభావములుగను వెల యును గాన గుణములవలెనే దోషములుగూడ రసమునకు సంబం ధము గల్గియున్నవి. పునరుక్తి చాలచోట్ల దోషమే కాని రసవ్యం గ్యమునకు దోడయినప్పు డది గుణముగ వర్తించును. నిత్యములు, అనిత్యములు నని దోషములు రెండుతెరగులు. రసము ననుసరించి యొక దానిదోషము వేరొకదానిగుణముగ జెలంగును. ఇందుకు నిదర్శన ముగ 'శృంగారరసమున శ్రుతిదుష్టత దోషమైనను, రౌద్రరసపరిపోష ణమున నది గుణముగా వెలుంగు' నని ఆనందవర్ధనుడు వచించెను. వాచ్యార్థవ్యంగ్యార్థముల వేరుపరచి, ప్రతీయమానార్థ ప్రాధాన్య మును గణించి, కావ్యప్రాశస్త్యమును విమర్శింతుమేని, గుణదోషా లంకారములగూడ నూతనమార్గము కుశాగ్రబుద్ధులకు గానవచ్చును.

ఇక వాచ్యార్థ మన్నచో నది సరసకవితావనితామతల్లి విలా సార్థము పైన గప్పుకొన్న మేలిముసుంగై విలసిల్లును. ప్రాచీనాలం కారికమతాచార్యులెల్ల దీనికే ప్రాముఖ్యము నొసంగి, శబ్దార్థములే కావ్యజీవిత మనియు, వాచ్యార్థమే కావ్యమునకు సౌందర్యసింధు వనియు, గుణదోషాలంకారరీతులు శబ్దార్థసౌందర్య సాగరతరంగ సంఘ మనియు శుష్కతర్కపరంపర నలసి సొలసి భ్రమించిరే కాని, నవీనమతానుసారులైన సహృదయశిరోమణుల ప్రతీయమా

నార్థామృత రసాస్వాదనపరవశులు గాలేకపోయిరి. ఇంతమాత్రమున చిరంతనాలంకారికులకు మనము న్యూనత నాపాదింపరాదు. వారు నవీనులకు మార్గదర్శకు లైరి. వారు ప్రధాన మని తలంచిన వాచ్యార్థము వ్యంగ్యార్థమునకు వ్యంజకమై భాసిల్లుచున్నది. ఈ వ్యంగ్యార్థమును వస్త్వలంకారరసధ్వనులుగ విభజించి, ధ్వనిమతప్రతిపాదకులు కావ్యాత్మతత్త్వమును బోధించి, మనకు మహోపకార మొనర్చిరి. ఈ మూటిలో ఉత్తమోత్తమముగ రసధ్వనిని గణించుటం జేసి, కావ్య సౌందర్యమున కొక నూతనశోభ గలిగెను. ఇదియే సూత్రప్రాయముగ ధ్వనిమతసారమై వెలుంగుచున్నది. దీనివలన ప్రతీయమానార్థప్రకాశ నమే యీమతమునంగల విశేషాంశ మని మనకు తెలియవచ్చును. ప్రాచీనమతములం గల మేలిసంగతుల నెల్ల నేర్చి కూర్చి, ఆలంకారి కులు నిర్మించిన నూతనమత మీధ్వనిమతము. వేర్వేరు త్రోవల చదువరులహృదయములకు వ్యంగ్యార్థమును బోధించుటయే దీనిప్రయోజ నము. దీనిమూలమున కావ్యమాధుర్యమును, అనిర్వచనీయమైన రస చర్వణమును సహృదయచూడామణులకు లభించుచున్నది. పదభా వాలంకారములును, రీతిరచనాసంఘటనలును దీనికి దోడగుచున్నవి. ఇంతమాత్రముననే నూతనకవిత్వమున నేమి గానవచ్చు సలేశ సూచనములు, మౌనముద్రానిద్రితభావములు, అవాఙ్మానసగోచర తత్త్వములే వ్యంగ్యార్థామృతపూర మని మనము భ్రమింపరాదు. కావ్యాత్మతత్త్వ మీవిధమున గాఢాంధకారబంధురమై చెలువారుటకు ధ్వనిమతాచార్యు లంగీకరింపరైరి. వాచ్యమును వెన్నంటి వ్యంగ్యము మెలంగుననియు, రెంటికిని నిర్ణీతమైనసంబంధబాంధవ్యములు సత్యముగ జెలంగు ననియు, దీనిని కావ్యార్థతత్త్వజ్ఞులు కరతలామలకముగ నెరుంగ గల రనియు వీరిమహాశయము. శబ్దార్థశాసనజ్ఞానుల కీవ్యంగ్యార్థము

దురూహము, దురవగాహము నగును. ' సహృదయశిరోమణుల కీ ప్రతీయమానార్థసహజసౌందర్యసర్వస్వమును సరస్వతీదేవి స్ఫురింపజేసి, వారిమానసముల నవలీల నాకర్షించి, వారికి పరబ్రహ్మాస్వాదసబ్రహ్మచారి యైన రసాస్వాదసౌఖ్యమును ప్రసాదించును. ఈ కారణముననే అఖిలసౌఖ్యధామమై, కల్పితరూపమానమహిమమై, భవ్యాత్ములకు భోగ్యవస్తువై, స్ఫురితప్రసుప్తకల్పమై, సత్కావ్యతత్త్వవిషయమై, రసాశ్రయోచితగుణాలంకారశోభావహమై, విబుధోద్యానమున వెలుంగు ధ్వనిమార్గమును, సహృదయోదయలాభహేతువుగా ప్రవర్తించి, ఆనందవర్ధనుడు ప్రథితాభిధానుడై ప్రకాశించుచున్నా డని వచో సత్యమూరము గానేరదు.

---

(రసధ్వనిమతాన్యోన్యదాంపత్యము: ధ్వనిమతాభ్యుదయము)

ఈవరలో సంగ్రహరూపమున రచించిన ధ్వనిమతమునందు కొన్నిలోపతేశము లున్నను ఆనందవర్ధనునితరువాత వచ్చిన ప్రధానులైన ఆలంకారికు లందరును దీని నంగీకరించిరి. ఏవూలనో యొక మూల నొకరిద్ద రీమతమును విమర్శించ నెంచినంతనే మిగిలినవారు వీరిని శుష్కతార్కికులుగను, నాస్తికవాదులగను భావించి ఖండించివైచిరి. కావుననే వక్రోక్తిజీవితకార, వ్యక్తివివేక కారుల మతములు సమర్థము లైనను ధ్వనిమతము నున్మూలింపజాలవయ్యెను. ఆయామతముల కనుయాయులు లేకపోవుటచే, తుదకు వానిప్రచారముగూడ లేకపోయెను. ఈధ్వనిమతప్రతివాదులలో భట్టనాయకుడు చాల సమర్థుడై యుండవనోపు నని మనకు అభినవగుప్తపాదుని ఖండనములవలన తెల్లమగుచున్నది. వీరు వ్యంగ్యార్థమును సమ్మతిం

చినవారైనను దానిని వేరొకరీతి సమన్వయింప సమకట్టినంతనే ఖండనమండనములకు గురియైరి. నవీనుడైన విశ్వనాథునివిశ్వప్రయత్నములుగూడ విఫలము లయ్యెను. ఇంక ఆధునికులైన మమ్మటాచార్యాదులప్రయత్నము లన్నచో నవి ధ్వనిమతమును శిరసావహించి దాని భేదప్రభేదముల నిర్వచించి నిరూపించుటయందే పరిణమించెను. మరియు ఆనందవర్ధనునిచే సృజింపబడిన ధ్వనిమతమును అభినవగుప్తపాదుడు పోషించెను. ఇటుల నవీనాలంకారికమతమైన ధ్వనిమతము, ప్రాచీనమతవిశేషముల నన్నిటిని సమగ్రముగ, సమూలముగ జర్చించి, కావ్యాంగసంచయమైన గుణాలంకారరీతులకు సముచితస్థానము నిర్దేశించి అపూర్వము, అసమానము నైన కావ్యాత్మతత్త్వ విమర్శనవిజ్ఞానమును సహృదయనయనహృదయములకు ప్రత్యక్షప్రకాశమును గలిగించి, అర్వాచీనాలంకారికులగూడ వశ మొనరించుకొనెను.

ఈ ధ్వనిమతమున కింత ప్రఖ్యాతియు, ప్రశస్తియు నెట్లు లభించెను? ఇది సకలాచార్యులసమ్మతి నెట్లు గాంచెను? అను సందియములు జదువరులమదుల గలంచవచ్చును. రసమతసమాలోచనావసరమున పాఠకులు భట్టనాయక, అభినవగుప్తపాదాచార్యుల రససూత్రార్థసమన్వయముల జదివిగాంచియున్నారు. వీరు నిజమునకు ఆనందవర్ధనాచార్యుల తరువాత వెలసిరి. అందువలన వీరు రసమును గురించియు, ధ్వనినిగురించియు తమతమ భావముల వెలిపుచ్చిరి. రసమతసమాలోచనమునందువలెనే ప్రతీయమానార్థప్రకాశమున గూడ వీరు భిన్నభిన్నమతముల ననుసరించిరి. కావున భట్టనాయకుడు తనపాండిత్యప్రకర్ష నంతయు ధ్వనిమతప్రతికూలముగను, అభినవగుప్తపాదుడు స్వప్రతిభాప్రభావము నంతయు ధ్వనిమత

ప్రతిపాదనమునకును వినియోగించిరి. భట్టనాయకునితోపాటు మరి కొందరు ధ్వనిధ్వంసమునకు శక్తిసామర్థ్యములనంతయు వెచ్చపెట్టిరి. కాని అభినవగుప్తపాదాచార్యుల పాండిత్యప్రశస్తిని, ప్రతిభాప్రభావమును ప్రకటించు ధ్వన్యాలోకలోచనప్రకాశము ప్రతివాదిజ్ఞానచక్షువుల మిరుమిట్లు గొలిపి, వారికి దిగ్భ్రమజనింపజేసి ధ్వనిమతమున కనూనప్రఖ్యాతిప్రసిద్ధుల సంపాదించెను. ఈ అభినవగుప్తపాదుడు భరతముని సంద్రుని నాట్యశాస్త్రమునకు అభినవభారతీవ్యాఖ్యానమును రచించె ననియు, రససమాలోచనమున భట్టలొల్లట, శ్రీశంకుక, భట్టనాయకులవాదముల నెల్ల ఖండించి, నూతనమతము నీతడు నెలకొలిపె ననియు చదువరు లీవరలో నెరింగియేయున్నారు. ఈ నవీనమతమును ప్రతిపాదించుచు, ప్రాచీనుల ఉత్పత్తి, అనుమాన, భుక్తివాదముల నెల్ల నిరసించి, అభినవగుప్తుడు వ్యక్తివాదమును స్థాపించెను. ఇచట ధ్వనిమతానుకూలమైన వ్యంజనావ్యాపారమును రసాభివ్యక్తికి సంకల్పించుటలో, నీతడు రసమతధ్వనిమతములకు పరస్పరసమాగమ సమావేశముల సంభవింపజేసెను. కావ్యరసాస్వాదానందమును సంపూర్ణముగ ననుభవించిన సహృదయవతంస మగుటచే అభినవగుప్తపాదాచార్యుడు రసధ్వనిపక్షపాతమును బహిరంగముగ ప్రకటించెను. ఈతనిమతమున రసమే కావ్యజీవితసర్వస్వముగా వెలుగొందును. ఇట్టి రసచర్వణసౌఖ్యమే వ్యాపారమూలమున నుదయించున ని మనము ప్రశ్నించినచో, నది వ్యంజనావ్యాపారమహిమవలననే గలుగు నని తేటపడును. అందువలన కావ్యాత్మ ధ్వని యనియు, ధ్వనిజీవము రస మనియు మనము గ్రహింపవలయును. ఆనందవర్ధను డేరీతిగా రసమును ధ్వనివిభాగముగ స్వీకరించి నాట్యరసమును కావ్యరసముగ మార్పు నొందించెనో. ఆప్రకారముగనే అభినవగుప్తపాదుడు

వస్త్వలంకారరసధ్వనిత్రయమున రసధ్వనియే కావ్యాత్మగ సమ్మతించి వస్త్వలంకారధ్వను లంత ప్రధానములు గావని చాటి చెప్పెను.

ఇటుల శాస్త్రమర్యాద ననుసరించి ఆనందవర్ధనుడు ధ్వనియే కావ్యాత్మగా వచించి, పిదప నీధ్వని మూడువిధముల జెలంగు నని పలికెను. ఈ విభాగమున నాయా ప్రతీయమానములకు ప్రత్యేకత నంగీకరించి శాస్త్రసంప్రదాయము నతడు గౌరవించెను. ఇంక అభినవగుప్తపాదు డనినచో నీ కట్టుబాటుల నన్నింటిని దాటి తన కుశాగ్రబుద్ధిబలమున కావ్యాత్మతత్త్వవిచారమును విపులముగ నొనరించి, రసముచేతనే సర్వకావ్యములును సజీవములై చెలంగు ననియు, రసశూన్యమైన కావ్య మెన్నడును కొంచెమేనియు వెలుగొందజాల దనియు స్పష్టముగ శంఖము పూరించెను. ఇంక మిగిలిన వస్త్వలంకారధ్వనుల గురించి పలుకుచు, రసమే వాస్తవముగ కావ్యాత్మ యనియు, వస్త్వలంకారధ్వను లన్నచో నివిగూడ నెల్లవేళల రసమునకు నభ్యుదయము గూర్చు ననియు, వాచ్యమునకన్న మిన్న యనుభావమున ధ్వనియే కావ్యాత్మగా సామాన్యలక్షణము రచింపబడె ననియు అభినవగుప్తపాదాచార్యులు లోచనమున వచించి, భరతమునిచంద్రుని వచనములపై తనకు గల గౌరవాదరాతిశయముల వెలిపుచ్చెను. అభినవగుప్తపాదుని పలుకుల కెదురాడ నోడి, వాగ్దేవతావతారు డని ప్రఖ్యాతి గాంచిన మమ్మటాచార్యుడుగూడ చాల నేర్పుతో, మివుల మెలకువతో రసధ్వనుల గురించి కావ్యప్రకాశగ్రంథమున జర్చించెను. అభినవగుప్తుని వాక్యమువలన గాబోలు, విశ్వనాథకవిరాజు రసాత్మకమైన వాక్యమే కావ్య మని లక్షణము విధింపసాహసించెను. ఈ విషయమున ఆనందవర్ధనాచార్యుల హితోపదేశముల పెడచెవిం బెట్టి, ఆతడు

సంశయగ్రస్తముగ, సందేహాస్పదముగ దల్చించి, మితభాషణముల, మౌనముద్రల వాచ్యాతిరిక్తముగ, ప్రతీయమానరూపముగ వదలిన దానిని నిశ్చయముగ నిర్వచింప నెంచినందున పండితరాయల నిష్ఠుర నికారకణికానికరములకు కవిరాజు గురి గావలసివచ్చెను. ఏది యె ట్లున్నను, అర్వాచీనాలంకారికు లందరును అభినవగుప్తపాదాచార్యులతో పాటు వస్త్వలంకారధ్వనులు రసధ్వని కంగములై చెలంగు నని చెప్పుటకు సాహసింపకున్నను, త్రివిధములైన ధ్వనులలో రస ధ్వనియే సర్వోత్తమము, పరమోత్కృష్టము నని సమ్మతించి శిరసా వహించి రని మన మెరుంగవలయును.

ఇదియే ధ్వనిమతాభ్యుదయమునకు అభినవగుప్తపాదు డొనరించిన ప్రయత్నము. కావ్యాత్మతత్త్వ స్వరూపమును సంపూర్ణముగ ప్రదర్శించుటవలనను, విమర్శనవివేకమును విస్ఫుటముగ ప్రకటించుట వలనను ధ్వనిమతము తొలుదొల్త సహృదయులమానసము నాకర్షించెను. దీనికి దోడుగా ఆనందవర్ధనాచార్యుల ధ్వన్యాలోకగ్రంథము, అభినవగుప్తపాదుల లోచనవ్యాఖ్యానము లీధ్వనిమతమును శాశ్వతముగ నెలకొల్పి, విపశ్చిద్వతంసుల వివశుల గావించివైచెను. అభినవగుప్తపాదునితరువాత విలసిల్లిన అర్వాచీనాలంకారికులు ఆనందవర్ధనాచార్యుల ధ్వనిమతసంప్రదాయములనే పాటించి, తమగ్రంథములరచించిరి. వీరిలో నెల్ల పేరెన్నికగన్నవాడు మమ్మటాచార్యవర్యుడు. ఇతని కావ్యప్రకాశగ్రంథము ధ్వనిమతమును చిరస్థాయిగా నొనరించి, ప్రతికక్షమతముల నెల్ల నిర్మూలించెను. పాణిని, వరరుచి, పతంజలు లను మునిత్రయప్రయత్నముల వ్యాకరణశాస్త్ర మభివృద్ధి గాంచినట్లే ఆనందవర్ధన, అభినవగుప్తపాద, మమ్మటభట్టు లను ఆచార్యత్రయప్రయత్నముల అలంకారశాస్త్రము—అందును

ధ్వనిమతము—అభ్యుదయము గాంచెను. ఆధునికుల కందరకును వీరలు మువ్వురును పరమగురువులు, ఉపాధ్యాయ శిరోమణులు, ఆచార్యావతంసులు నై చెలంగి ధ్వనిమార్గమును, రసస్వరూపమును, కావ్యప్రకాశమును కనులకు కట్టినటుల ప్రదర్శించిరి. అందువలననే ఆనందవర్ధనుడు ఆక్షేపధ్వని కొసంగిన లక్ష్యమును, అలంకారసర్వస్వకారుని లక్ష్యమును జర్చించుచు, పండితరాయలు 'ధ్వనికారుని ఆలంకారికసరణివ్యవస్థాపకత్వమునే' ప్రమాణముగా గొని రాజానక రుయ్యకుని వచనముల విమర్శించి నిరసించెను. కావున నవీనాలంకారికులు ఆనందవర్ధనాచార్యులపథము ననుసరించి రని జగన్నాథుని పలుకులవలన మనకు దెలియవచ్చును. ఇంతమాత్రమున నీధ్వనిమతము సర్వజనసమ్మత మని మనము దలంపరాదు. దీనిని కొందరు బహిరంగముగ ఖండించి ధ్వనిధ్వంసగ్రంథముల రచించిరి. మరికొందరు ధ్వనిని సమ్మతించినను దానిని వేరువిధముగ సమన్వయ మొనరింప సమకట్టిరి. ఉద్భటునివ్యాఖ్యాత, ప్రతీహారేందుడును, వామనునివ్యాఖ్యాత తిప్పభూపాలుడును ప్రాచీనమతముల పునరుద్ధరింప బూనిరి. ప్రతీహారేందుని గురువరుడైన ముకులుడుగూడ 'లక్షణామార్గావగాహితత్వమైనను సహృదయులు ధ్వనియని నూతనముగ నుపవర్ణించి' రనియు, 'ఇది విద్వాంసుల కుశాగ్రబుద్ధిచే నిరూపణీయ' మనియు, 'అంతియేకాని వెంటవెంటనే బోధపడ'దనియు, 'అందుచే నతిప్రసంగము వల' దనియు నీరీతిగా నసమ్మతినివెలిపుచ్చెను. వీరికన్న మిన్నలైన పండితఖండాలములు గొందరు నూతనమతముల నెలకొల్ప పాటుపడి, వ్యంజనావృత్తి నంగీకరింప నక్కరలే దనియు, వ్యంజనావ్యాపార మనావశ్యక మనియు, ప్రతీయమానార్థ మనుపేర ప్రకాశించుదానిని వాచ్యార్థమూలముననే గ్రహింపవచ్చు ననియు, లేనిచో తార్కికానుమాన

మూలమునసే పడయవచ్చు ననియు ప్రమాణపూర్వకముగ ధ్వని నాశకగ్రంథముల రచించిరి. అందువలన - వీరు ఆనందవర్ధనాచార్యుల విభాగమునందలి అభావవాదులు గారు. ధ్వనిని సమ్మతించి దాని నన్యముగ నిరూపింప యత్నించుటచే, వీరిని భాక్తవాదులుగా మన మెంచవలయును. వీరిలో భట్టనాయకుడు అభినవగుప్తునకు పూర్వుడును, రాజానకకుంతలుడు సమకాలీనుడుగను నుందురు. ధ్వనిప్రపంచ మంతయు అనుమానాంతర్గత మని ఘోషించి, నవీనముగ అనుమానమతమును సృజించిన మహిమభట్టుడు, అభినవగుప్తపాదుని ముదుసలితనముననో, లేక వెనువెంటనో పుట్టియుండును. ఈ సందర్భమున ఆనందవర్ధనాచార్యుల ధ్వనిప్రసూనపరిమళములు సోకియు సోకని అగ్నిపురాణమున గలట్టియు, భోజదేవునిగ్రంథముల నున్నట్టియు అలంకారశాస్త్ర సంగ్రహమునుగూడ జదువరులు గమనింపవలయును. వానిసారమును మున్ముందు వివరింతుము. దీని నంతయు పరికించినచో, పూర్వాచార్యుల కుశాగ్రబుద్ధిబలమున నంకురించి, ఆనందవర్ధనాచార్యుల అప్రతిమానప్రతిభాప్రభావమున పల్లవించి, ఆచార్యాభినవగుప్తపాదుని నవనవోన్మేషశాలిధీనికాసమున పుష్పించి, మమ్మటాచార్యవర్యుని ప్రౌఢవాఙ్మహిమాతిశయమున ఫలించి, ధ్వనిమతము సహృదయరసనాంచలసీమల మృద్వీకామసృణరసఝరీ మాధురీభాగ్య భాజనమై చెలువ మలరుచున్నది.

---

# కావ్యాత్మ

## నవీన మతములు

---

### ౨. ధ్వనినాశకమతములు

(ప్రౌఢోక్తిమతము - భట్టనాయకుడు)

ధ్వనినాశకమతములనుగురించియు, ధ్వనిధ్వంసగ్రంథములనుగురించియు చదువరులు ధ్వనిమతసందర్భమున వినియున్నారు. మరియు రసమతసమాలోచనమున భుక్తివాద మనుపేరును, భట్టనాయకుని నామమును చదువరులకు చిరపరిచితము లైయున్నవి. రసమతసమాలోచనమునందువలెనే ధ్వనిమతసందర్భమునగూడ భట్టనాయకుని భావములును ఖండములుగనే మనకు దొరకుచున్నవి గాని సంపూర్ణముగ లభ్యములు గాకున్నవి. ఈ భట్టనాయకుని పేరును, ఈతని భావములను పెక్కుచోట్ల అభినవగుప్తపాదాచార్యుడు పేర్కొనియున్నాడు. నాట్యశాస్త్రవ్యాఖ్యాన మైన అభినవభారతియందును, ధ్వన్యాలోకవ్యాఖ్యాన మైన లోచనమునందును, అభినవగుప్తపాదుడు పలుమారు ఈతనినామము నుచ్చరించి, భావముల విమర్శించి పూర్వపక్ష మొనరించెను. వ్యక్తివివేకకారు డైన మహిమభట్టు గ్రంథప్రారంభముననే దర్పణమును జూడకయే తాను వ్రాయుచుంటి నని ప్రతిజ్ఞ నొనరించెను. దానివ్యాఖ్యానమున దర్పణ మనగా, హృదయదర్పణ మనుపేర బరగు ధ్వనిధ్వంసగ్రంథ మని

వచింపబడెను. ఈదర్పణముతోపాటు చంద్రికనుగూడ మహిమ భట్టు పేర్కొనెను. ఈచంద్రిక యొకానొక ధ్వనివిచారణగ్రంథ మని వ్యాఖ్యాత పలికెను. చంద్రికననుసరించి మనము దర్పణముకన్న నెక్కువగా నెరుంగుదుము. కాని చంద్రికాకారునిగురించి మన కంతగ తెలియదు. లోచనమునందు చంద్రిక ననేకసారులు పేర్కొని, చంద్రికాకారుని భావముల జర్చించి,తప్పుల నిరూపించి, 'నిజపూర్వజ సగోత్రునితో మన కీవివాద మేల' నని అభినవగుప్తపాదుడు వచించెను. కావున చంద్రికయనునది ధ్వన్యాలోకమునకు విమతవ్యాఖ్యాన మనియు, దానిని అభినవగుప్తపాదుని పూర్వవంశజు డొకడు రచించె ననియు మనకు దెలియవచ్చును. దీనివలె స్పష్టముగ దర్పణమునుగురించి పలుకుటకు దగిన ప్రమాణములు లేవు. రససందర్భమున నీతని అభినవగుప్తు డుదాహరించుటచే నిది నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యాన మని కొందరందురు. లోచనమున, ముఖ్యముగ రసధ్వని విషయమున నీతనిభావములు పరిశీలింపబడుటవలన నిది ధ్వనిధ్వంస గ్రంథములలో నొకటి గానోపు నని మరికొందరు తలంతురు. ఏల నన, భట్టనాయకుడు రచించె నని అభినవగుప్తపాదాదులు కొన్ని పద్యములను, కొన్ని గద్యములను తమతమవ్యాఖ్యానముల నుదాహరించిరి. కావున భట్టనాయకుని హృదయదర్పణము, మహిమభట్టుని వ్యక్తి వివేకమురీతిగ ధ్వనిమతము నున్మూలించుటకు కంకణము గట్టుకొనిన గద్యపద్యోభయమయధ్వనిధ్వంసగ్రంథము గావచ్చును. గ్రంథరచనావసరమున కావ్యలక్షణము, రసస్వరూపము, ధ్వనితత్త్వము మొదలైనవానిని జర్చించుచు, తా నొక నూతనమతమును, నవీనవాదమును భట్టనాయకుడు ప్రతిపాదించియుండును. అందువలననే అభినవగుప్తపాదు డీతని పేరును అభినవభారతి, లోచనవ్యాఖ్యానములలో

ను దాహరించియుండును. ఈ హృదయదర్పణమును చంద్రికచంద మున విమతవ్యాఖ్యాన మనుటకు గాని, అభినవభారతిరీతి నాట్య శాస్త్రవ్యాఖ్యాన మనుటకు గాని మనకు సంపూర్ణము లైన ప్రమాణ ములు లేవు. కావున రాజానకరుయ్యకాదుల మార్గము ననుసరించి వ్యక్తివివేకమువలెనే హృదయదర్పణ మొక ధ్వనిధ్వంసగ్రంథ మని మనము భావించినచో దోషము గానేరదు.

ఇంతవఱకు రసమతసమాలోచనమున చాలచోటుల భట్ట నాయకుని భావముల సమగ్రముగ జర్చించితిమి. రసోదయరసచర్వణా సందర్భముల భట్టనాయకుని మతమును నిరూపించి, రసచర్వణమే కావ్యసర్వస్వముగ నత డంగీకరించె ననియు, రసచర్వణావసరమున వ్యంజనావ్యాపారము నాతడు సమ్మతింపలే దనియు వచించి తిమి. అభివ్యక్తివాదమునకు ప్రతికూలముగ భట్టనాయకుడొనర్చిన విమర్శనముల నన్నిటిని అభినవగుప్తపాదుడు లోచనమున పరీక్షిం చెను. వానిని చదువరు లీవరలో రసమతసమాలోచనమున గాంచియే యున్నారు. శృంగారము శక్తిరూపమున అభివ్యక్త మైనచో నది విషయార్జనతారతమ్యప్రవృత్తి గలిగి వెలుంగు ననియు, అపుడు గూడ రసము పరగతమా, లేక స్వగతమా యనుదోషము జెలంగు ననియు, కావున రసము కావ్యముచే అభివ్యంగ్యము గానేరదనియు భట్ట నాయకుడు నుడివెను. మరియు వస్త్వలంకారధ్వనుల నుపాలంభనమొన రించినను రసధ్వనిని కావ్యాత్మగా భట్టనాయకు డంగీకరించినట్లు లోచనమున రచింపబడెను. ఇందువలననే కాబోలు భట్టనాయకుని గురించి అభినవగుప్తు డిట్లు పలికెను: "వస్తుధ్వనిని దూషించుచు, తనకు అనుగ్రాహక మైన రసధ్వనిని సమర్థించుటచే నీతడు సుష్ఠు తరముగ ధ్వనిధ్వంసకారుడుగా విలసిల్లు" నని అభినవగుప్తుడు రచిం

చెను. ఇంతియే కాక 'శబ్దప్రాధాన్యము నాశ్రయించి శాస్త్రమును, అర్థతత్త్వయుక్తమై ఆఖ్యానమును, శబ్దార్థము గుణీభూతము, లేక న్యగ్భావితమై కావ్యమును ప్రకాశించును' అను భావమును ప్రకటించు భట్టనాయకుని శ్లోకమును అభినవగుప్త, హేమచంద్ర, మాణిక్యచంద్ర, జయరథులు పేర్కొనిరి. మరియు నింకొకచోట అన్యశబ్దవైలక్షణ్యమై కావ్యాత్మగా వెలంగుశబ్దము త్ర్యంశతా ప్రసాదాతిశయమున దీపించు ననియు, ఈమూడంశములలో అభిధాయకత్వము వాచ్యవిషయమై, భావకత్వము రసాదివిషయమై, భోక్తృత్వము సహృదయవిషయమై వెలుంగు ననియు, ఈమూడు అంశములకును క్రమప్రకారము మూడువ్యాపారములు భాసించు ననియు భట్టనాయకునిమతసార మని అభినవగుప్తుడు రచించెను. ఈరీతిగా అభిధాభాగమే శుద్ధ మైనచో శాస్త్రన్యాయము లైన తంత్రాదులకును, శ్లేషాద్యలంకారములకును భేద మేమిగల దనియు, కించిత్కారమైన వృత్తిభేదవైచిత్ర్యమే యనినచో శ్రుతిదుష్టాదుల నేల వర్జింపవలయు ననియు భట్టనాయకుడు ప్రశ్నించి దీనికి సమాధానముగ రసభావనాఖ్యగల ద్వితీయవ్యాపారమును గల్పించెను. ఈ రసభావనావ్యాపారమును భావకత్వవ్యాపార మందురు. దీనివశమున అభిధయు విలక్షణముగ వెలుగొందును. కావ్యమునందలి విభావాదులకు సాధారణత్వము నాపాదించుటయే భావకత్వవ్యాపారమై చెలంగును. రసము భావితమైనప్పుడే దానికి భోగము సంభవించును. ఈ భోగమే సాంఖ్యసిద్ధాంతానుసారముగ పరబ్రహ్మాస్వాదసచివము, రజస్తమోరహితము, సత్త్వగుణసంకలితము, ద్రుతివిస్తరవికాసరూపము నైన చిత్స్వభావనిర్వృత్తిగా ప్రకాశించు నని భట్టనాయకుడు వచించెను.

## ధ్వనినాశకమతములు-ప్రౌఢోక్తిమతము

ఇటుల అభిధాభావకత్వముల నతిక్రమించిన భోగ మను తృతీయ వ్యాపారమును భట్టనాయకుడు పరిగ్రహించెను. దీనిమూలమున రసాస్వాదనమున కాతడు సమన్వయము సంభవింపజేసెను. వ్యంజకమూల మునను, వ్యంజనావ్యాపార మహిమవలనను అభివ్యక్త మగు నని ధ్వని మతానుసారులు నిశ్చయించిన కావ్యరసము భట్టనాయకుని మతమున స్వసంవేద్యముగ నిరూపిత మయ్యెను. అందువలన నీతడు ఆనందవర్ధనుడు వచించిన విభాగములలో ధ్వనితత్త్వము వాచామగోచర మని వర్ణించువారిలో నొక డని మన మెరుంగవలయును. భట్టనాయకుని మతమున ధ్వనిస్వరూపము గిరామగోచరముగా జెలంగినను, మానసగోచరముగా మెలంగకపోదు. ఆతడు దీనిని సహృదయహృదయ సంవేద్య మని వచించి, ధ్వన్యర్థము వ్యంజనాత్మకవ్యాపారమున వెలుంగుచు భేదముగ గానవచ్చినను, దానియందు అంశత్వము నంగీకరింపవలయునేకాని మనము దానికి రూపత నాపాదింపరాదని రచించెను. మరియు అభిధాభావనారస చర్వణాత్మక మైన త్ర్యంశమున రసచర్వణమే కావ్యజీవితభూత మనుట నిర్వివాద మనియు, కావ్యమందు సర్వలును రసయితలే కాని బోద్ధలును, నియోగభాక్కులును గాజాల రనియు, దానిచే ధ్వనిని భట్టనాయకుడు అంగమాత్రము, లేక అంశమాత్రముగనే సాధించె ననియు మనము తలంపవలయును. ఈభట్టనాయకుని మతసారము నీవిధముగ రాజానకరుయ్యకుడు వచించెను. ఇంక భట్టనాయకు డనినచో "ప్రౌఢోక్త్యభ్యుపగత మైన వ్యంగ్యవ్యాపారమునకు అంశత్వమును సమ్మతించుచు, న్యగ్భావిత మైన శబ్దార్థస్వరూపమునకు వ్యాపారప్రాధాన్యమును విధించెను, మరియు అభిధాభావకత్వలక్షణవ్యాపారద్వయోత్తీర్ణ మైన, రసచర్వణాత్మక మైన, భోగాపరపర్యాయ మైన వ్యాపారప్రాధాన్యమున విశ్రాంతి

స్థానము సంగీకరించె" నని భట్టనాయకునిగురించి అలంకారసర్వస్వకారుడు రచించెను. కావున ప్రౌఢోక్తిమూలకమై ప్రకాశించు వ్యంగ్యవ్యాపారమునకు కావ్యాంశత్వమునే కాని కావ్యజీవితసర్వస్వమును భట్టనాయకుడు సమ్మతింప లేదని రాజానకరుయ్యకుని తాత్పర్యముగా విలసిల్లును. ఇందువలన శబ్దార్థముల న్యగ్భావితము, లేక అప్రధానముగా నొనరింపజాలు కవికర్మ, లేక కవివ్యాపారమే జయరథుడు వచించినట్లు కావ్యమునకు ముఖ్యమై చెలంగు నని భావము. ఈరీతిగ వ్యాపారప్రాధాన్యమును భట్టనాయకు డంగీకరించుటంజేసియు, వైదగ్ధ్యభంగీభణితిప్రకారమై వెలుగొందు వక్రోక్తివైచిత్ర్యమునకు ప్రధానకారణముగ కవికర్మను రాజానకకుంతలుడు సమ్మతించుటంజేసియు, వీ రిరువురమతములకును సాదృశ్యసంబంధ మెంతయో కొంత సంభవించినను, వీనిరెంటికిని గల విశేషభేదము సహృదయులకు విలక్షణముగ గోచరింపకపోదు. భరతమునిచంద్రుని రసమతము ననుసరించి, భట్టనాయకుడు ధ్వనిధ్వంసమునకు గడంగనోపును. ఇంక భామహాచార్యుల అలంకారమతమును గమనించి రాజానకకుంతలుడు వక్రోక్తిజీవితమతమును ప్రతిపాదించనోపును. ఇంతకన్న భట్టనాయకుని ప్రౌఢోక్తిమతమును గురించి, మన కాతనిహృదయదర్పణము దొరకనంతవరకు, విశేషాంశములు దెలియుట కవకాశము లేదు. కావున భట్టనాయకుని ప్రౌఢోక్తిమతతత్త్వవిచారమును పూర్తి మొనరించి, మన మింక కుంతలాచార్యుల వక్రోక్తిజీవితస్వరూపసందర్శనమున ధన్యతం జెంగుదము.

---

# కావ్యాత్మ

## నవీనమతములు

---

### 3. వక్రోక్తిమతము

(వక్రోక్త్యలంకారలక్షణనిరూపణము)

భామహాచార్యకల్పిత సువర్ణమయ శబ్దార్థాలంకార సంపదకు వన్నె వెట్టు దండ్యాచార్యసంపాదిత మాధుర్యౌదార్యసౌకుమార్యాదిసుగుణగణమణిప్రభావైభవమునకు చేదోడువాదోడుగ వామనాచార్యనిర్మిత రీతిరచనా సంఘటనాసౌష్ఠవ సర్వస్వముల దుల దూగుచున్న సాహిత్య సౌహిత్యసీమంతినీసౌభాగ్యమును కుంతలాచార్యవర్యుండు స్వకీయవైదగ్ధ్యభంగీభణితివైచిత్ర్యవిశేషమున నిరవశేషంబుగ జేసి, సూక్తిపరిస్పందసుందరాభినవోజ్జ్వల విచ్ఛిత్తివిలాసములు దీపింప, కవితావనితావతంసమును కవీంద్రవక్త్రేందు లాస్యమందిర నర్తకీలలామ గావించి, వక్రోక్తిజీవితకారు డన ప్రసిద్ధి నొందెను.

ఇంక వక్రోక్తిజీవితకారు డన్నచో, దర్పణకారవ్యక్తివివేకకారు లైన భట్టనాయక మహిమభట్టులపగిది, ధ్వనిమతధ్వంసమునకు బద్ధకంకణుడు గాడు. ధ్వనిమతాచార్యులతో కలహమునకు కాలు ద్రవ్వక, వ్యంగ్యార్థప్రతీతిని పరిహసించక, భామహాచార్యాదులచే 'సైషా సర్వైవ వక్రోక్తి' యని ప్రస్తుతింపబడిన వక్రోక్తితత్త్వమును

రాజానకకుంతలుడు గ్రహించి, రసాలంకార గుణరీతిధ్వనిమతముల నన్నింటిని స్వప్రతిభావిశేషమున వక్రోక్తిజీవితాదర్శమున ప్రతిబింబింపజేయ సమకట్టెను. ఇటుల వక్రోక్తియే కావ్యకాంతాజీవిత మని శ్రవణపేయముగ మనోహరగాన మొనరించినకతమున గాబోలు, కుంతలాచార్యు డాలంకారికు లెల్లరిచే వక్రోక్తిజీవితకారు డను సార్థక నామము వ్యవహరింపబడెను.

రాజానకకుంతలాచార్యుని వక్రోక్తిస్వరూపమును సంపూర్ణముగ నవలోకింప నెంచినచో మన మొకమారు ప్రాచీనార్వాచీనాలంకారికులు వర్ణించిన వక్రోక్తికన్యకాకామనీయకమును దిలకింపవలయును. భామహ, దండి, వామనాచార్యులమతమున వక్రోక్తి కేవలశబ్దాలంకారముగ గణింపబడక, అపూర్వాతిశయార్థసంపన్నమై వెలుగొందుచున్నది. శ్లేషకాకుస్వరాదులపై నాధారపడి రుద్రటాచార్యుని వక్రోక్త్యలంకారము దీపించుచున్న దనియు, ఈతని లక్షణము ప్రాచీనులలక్షణమున కనుకూలింపలే దనియు మన మీవరలో దెలిసికొంటిమి. అనగా ఒకరు పలికిన ఒకవాక్యము గాని, ఒకమాట గాని దానికాకుస్వరముననో, లేక దానిశ్లేషకారణముననో వేరొకరిచే వేరొకవిధమున నర్థము జేసికొనబడును. ఈ బుద్ధిపూర్వక భిన్నార్థవిపరీతార్థప్రకల్పనకు ఫలితము సమయోచితవిదగ్ధతా సమాధాన మొసంగుటయే కాని వేరు గాదు. యుక్తియుక్తముగ ప్రత్యుత్తర మొసంగుటకొరకే ప్రకృతార్థ మిం దపహ్నవింపబడుచున్న దని విద్యాధరుడు వచించెను. ఈ అపహ్నవమునే రాజానకరుయ్యకుడు 'గూఢార్థప్రతీతి' యని వ్యవహరించెను. సుబంధుడు, బాణభట్టుడు, కవిరాజు—వీరుమువ్వురే వక్రోక్తిమార్గమున నిపుణులనియు, నాల్గవవాడు గానరా డనియు నొకప్రాచీనశ్లోకము జెప్పు

చున్నది. కాని సుబంధుడును, బాణుడును శ్లేష, లేక శ్లిష్ట మును నుతించినట్లు గానవచ్చును. కాని వక్రోక్తిని వర్ణించినట్లు గానరాదు. మమ్మటాదినవీను లెల్లరును శ్లేషకాకువులపై నాధార పడి వక్రోక్త్యలంకారము జెలంగునని సమ్మతించుటచే, దానికి ప్రాచీను లొసంగిన గౌరవము నానాటికి సన్నగిల్లెను. అంతనుండియు నది యొక సామాన్యాలంకారముగ మెలంగజొచ్చెను.

శబ్దచిత్రము నంతగా పాటింపమిచే, భామహుడు సామాన్యా లంకారముకన్న మిన్నగ వక్రోక్తిని దలంచెను. ఇది యొకగుణవిశేష మని భామహునిభావము. ఇతనిమతమున గుణాలంకారములకు విశేష భేదము గానరాదు. అతిశయోక్త్యలంకారసందర్భమున భామ హుడు వక్రోక్తిని ప్రసంగించి ప్రశంసించెను. వక్రోక్తిప్రాధాన్యము ననుసరించి కావ్యప్రాశస్త్యము జెలంగు నని మొదటి అధ్యాయము నందే భామహుడు వచించెను. తరువాత అతిశయోక్తికి లక్ష్యలక్ష ణముల నొసంగి, ప్రాయికముగ నదియే వక్రోక్తిగా మెలంగు నని యుగ్గడించినను, దీనిని ప్రత్యేకాలంకారముగ నేలనో కాని విధింప లేదు. పదంపడి వక్రతారహిత మనుకతమున స్వభావోక్తి, హేతు, సూక్ష్మ, లేశాలంకారముల భామహుడు నిరసించెను. అలంకారము లన్నియు భామహునిమతమున వక్రోక్తిగర్భితములుగ నుండవలయును. ఈ లక్షణమును పాటించినచో, వక్రోక్తికి ప్రత్యేకాలంకారత నంగీ కరింపరాదు; సమ్మతించినచో సర్వాలంకారసాంకర్యము సంభ వించును. వక్రోక్తిగర్భిత మనుహేతువున నత డే అలంకారమును సంసృష్టము, సంకీర్ణముగ దలంపలేదు. కావున నీతనిమతమున వక్రోక్తియే సర్వాలంకార సామాన్య లక్షణముగ భాసించు చున్నది. అందుచేతనే "సైషా సర్వైవ వక్రోక్తి" యనియు,

"వక్రోక్తి లేనిచో అలంకార మెట్లుండు" ననియు ప్రశ్నించి కవు లెల్లరును వక్రోక్తికై ప్రయత్న మొనరింపవలయు నని యుప దేశించెను. ఇంతియేకాక మహాకావ్య, నాటక, కథా, ఆఖ్యాయికాది, కావ్యభేదములం దన్నిటియందును వక్రోక్తి వెలుంగవలయు నని వేరొకచో నాతడు ప్రశంసించెను. అందువలన కావ్యాలంకార ములకు వక్రోక్తి సాధారణలక్షణమై మెలంగును. 'అన్ని విధముల నదియే సుమీ వక్రోక్తి' యని అతిశయోక్త్యలంకారమున భామహా చార్యుడు వచించుటచే రెండును పర్యాయపదము లని మనము తలంపవచ్చును. లోకాతిక్రాంతగోచరవచనమే అతిశయోక్తిగ భామ హుడు విధించెను. కావున నిదియే భామహుని వక్రోక్తిలక్షణము గానోపును. లోకోత్తీర్ణరూపమున నవస్థానమై వక్రత ప్రకాశించు నని అభినవగుప్తపాదుడు వచించెను. ఈవక్రత, వర్ణనావిశేషము నతిశయోక్తి భేదముగ పరిణమించి, ప్రాకృతజనవ్యావహారికవచనముల గానరాని శబ్దార్థవైచిత్ర్యవైదగ్ధ్యములచే సహృదయవతంసుల హృదయాంత రంబుల రంజింపజేయు నని భామహాచార్యుల ప్రధానాశయము.

దండ్యాచార్యు డన్ననో, భామహునివలె వక్రోక్తికి సామ్రా జ్యాధిపత్య మొసంగలేదు. దానిసర్వాధికారమున సగబాలు స్వభా వోక్తికి పంచి యిచ్చెను. అర్థాలంకారపరిచ్ఛేదమున మొదటనే దం డ్యాచార్యుడు జాతి, లేక స్వభావోక్తిని జర్చించుచు దానిని 'ఆద్యా లంకారము'గ బేర్కొనెను. తరువాత నాతడు మిగిలిన అలంకారముల లక్ష్యలక్షణముల రచించి, అనన్వయ, ససందేహ, ఉపమా, రూపక, ఉత్ప్రేక్ష, అవయవాలంకారములను తానేల ప్రత్యేకాలంకారములుగ సమ్మతింపలేదో దానికి కారణముల వచించెను. అంతట సంసృష్టి, లేక సంకీర్ణాలంకారమును వివరించెను. కడపట నలంకారపరిచ్ఛేదమును ము

గించుచు వక్రోక్తిని తా నీవిధమున వర్ణించెను: 'సర్వాలంకారములకును శ్లేషము పుష్టి గలుగజేయును. ప్రాయికముగ వక్రోక్తి సంపదల పెం పొందించును. వాఙ్మయ మంతయు స్వభావోక్తివక్రోక్తు లని ద్వివిధ ముగ భిన్నమై చెలువారుచున్న' దని పలికెను. దీనివలన భామహా చార్యులతో దండ్యాచార్యు లేకీభవించినను, అలంకారసామ్రాజ్యాధి పత్యమును సంపూర్ణముగ వక్రోక్తి కొసంగక దానిలో దాయభాగ మును స్వభావోక్తికి నిర్ణయించె నని మన మెరుంగవలయును. దండ్యా చార్యులమతమున వక్రోక్తిపదము స్వభావోక్తి గాక మిగిలిన సర్వా లంకారములకును సామాన్యవాచకముగ జెలంగును. ఈ శబ్దమున నతడు సర్వాలంకారసముదాయమును గ్రహించె ననవచ్చును. సంకీర్ణాలంకార ముల జర్చించి 'శ్లేషము సర్వాలంకారములకును పుష్టి గలుగజేయు' ననుటచే శ్లేషాలంకారము స్వతంత్రాలంకారముగను, దీనిచే శోభాతి శయము నందు సర్వాలంకారములును సంకీర్ణముగను తలంపబడును. స్వభావోక్తి కెంతమాత్రమును శ్లేషము శోభాదాయకము కాదు. భామహాచార్యుల వక్రోక్తిలక్షణమునకు పుటము బెట్టి, వన్నె దెచ్చి, తూనిక తగ్గించి, దండ్యాచార్యులు సముదాయార్థమున సర్వాలంకార ములనుసరించి వక్రోక్తిశబ్దమును ప్రయోగించె ననియే దీని సారాంశము. ఈ విషయమున ప్రాచీనవ్యాఖ్యానములు రెండును మన కనుకూలము గనే యున్నవి. 'వాఙ్మయద్వైవిధ్య మీశ్లోకముచే ప్రదర్శింప బడెను. స్వభావోక్తియే ఆద్యాలంకారము; ఉపమాదిసంకీర్ణపర్యం తము పేర్కొనబడిన అలంకారములు వక్రోక్తిశబ్దముచే చెప్పబడె, నని హృదయంగమవ్యాఖ్యానము సహృదయహృదయంగమముగ వ్యాఖ్యాన మొనరించెను. ఈపైవ్యాఖ్యానముతో నంగీకరించినను, అలంకారవర్గమును ననుసరించి తరుణవాచస్పతి భిన్నభావమును వెలిచూపి,

'స్వవ్యాఖ్యానవ్యతిరిక్తములైన సర్వాలంకారములును వక్రోక్తిగా పలుకబడె' ననెను. సామాన్యదృష్టికీవిచారణ మంతయును విభేదము లేనిభేదము. కావున దండ్యాచార్యుల వక్రోక్తిప్రయోజనము భామహాచార్యుల వక్రోక్తిప్రయోజనముతో సదృశ మని తలంపవచ్చును.

వామనాచార్యుడు భిన్నార్థమున వక్రోక్తిపదమును ప్రయోగించెను. ఇతడు వక్రోక్తిని ప్రత్యేకాలంకారముగ భావించెను. రుద్రటునివలె గాక వామను డీవక్రోక్త్యలంకారమును అర్థాలంకారముగ గ్రహించి 'సాదృశ్యలక్షణామూలకమై' వక్రోక్తి భాసించు నని లక్షణము విధించెను. కావున నీ అలంకారము లక్షణమైపై నాధారపడి, ప్రాచీనుల అలంకారముకన్న భిన్నమై కన్పట్టుచున్నది. ఆనందవర్ధనాచార్యుల మతమున నీ అలంకారము 'అవివక్షితవాచ్య వ్యంగ్యము'గను, మమ్మటాచార్యులమతమున 'లక్షణామూలగూఢ వ్యంగ్యప్రధానధ్వని' రూపముగను వెలుగొందుచున్నది. ఈ విచారణవలన మన కొకసంగతి విశద మగును. భామహదండ్యాచార్యులు వక్రోక్తిశబ్దమును సర్వాలంకారసామాన్యవచనముగను, రుద్రటవామనాచార్యు లీవక్రోక్తిని ప్రత్యేకముగ శబ్దాలంకారము, లేక అర్థాలంకారముగను భావించినట్లు మనకు దెలియవచ్చును. ఆధునికు లెల్లరిచే రుద్రటాచార్యుల లక్షణము శిరసావహింపబడుటచే దండివామనుల లక్షణము నామమాత్రావశేష మయ్యెను. ఇంక భామహాచార్యుల వక్రోక్తిభావాంకురబీజములు కుంతలాచార్యుల భావనా విశేషమున కావ్యకుటిలశిరోజాతిలకమునకు జీవితసర్వస్వమై ప్రకాశించెను. అనగా భామహాచార్యులచే అలంకారసామాన్యలక్షణముగ, లేశముగ సూచింపబడిన వక్రోక్తిని కుంతలాచార్యు డాదల ధరించి, వక్రోక్తియే కావ్యజీవిత మను నూతనమతమును ప్రతిపాదించెను.

# వక్రోక్తిమతము-వక్రోక్త్యలంకారలక్షణ నిరూపణము

పూర్వాచార్యులు రచించిన గ్రంథము లెన్నియో చెలువారు చుండగ దా నేల నూతనగ్రంథమును నిర్మింప దొరకొనెనో దానికి గలకారణమును కుంతలుడు తొలుదొల్తనే వచించెను. "లోకోత్తరచమత్కారకారివైచిత్ర్యసిద్ధి" కొరకు తా నొకానొక అపూర్వమైన అలంకారకావ్యమును విధించుచుంటి నని కుంతలాచార్యుడు మొదటనే ప్రతిజ్ఞ నొనరించెను. ఈప్రతిజ్ఞావాక్యమునందే కుంతలుని వక్రోక్తితత్త్వము సంగ్రహరూపముగ నిమిడియున్నది. ఈవాక్యమునకు 'అసామాన్యాహ్లాదవిధాయివిచిత్రభావసంపత్తియే' తాత్పర్యమని వృత్తిగ్రంథమున తానే వివరించెను కావ్యమునకు ముఖ్యమని తాను గణించిన వక్రోక్తి, విచిత్రాభిధాభేద మనియు, వక్రత్వము, లేక వక్రభావము వైచిత్ర్యము, లేక విచిత్రభావమునకు పర్యాయపదముగను కుంతలుడు వ్యవహరించెను. ఈవక్రత్వము, లేక వైచిత్ర్యము 'శాస్త్రాదిప్రసిద్ధశబ్దార్థోపనిబంధవ్యతిరేకి' మనియు, 'షట్ప్రకారవక్రతావిశిష్టమై' కవివ్యాపారము జెలంగు ననియు కుంతలాచార్యుడు విధించెను. ఈ అర్థమునే 'ప్రసిద్ధప్రస్థానవ్యతిరేకమే వైచిత్ర్య' మని సూత్రప్రాయముగ వచించి వక్రోక్తిజీవితకారు డన కుంతలుడు ప్రసిద్ధిగాంచెను. వక్రోక్తిజీవితకారుని మతమును వ్యక్తివివేకకారుడు క్రింది విధమున నిపుణముగ నిరూపించెను. "ఏవైచిత్ర్యము శాస్త్రాదిప్రసిద్ధశబ్దార్థోపనిబంధవ్యతిరేకమై వెలుంగునో, అదియే వక్రత్వలక్షణము. మఱియు ప్రసిద్ధమార్గమును పరిత్యజించి వైచిత్ర్యసిద్ధికొరకు భిన్నప్రకారముగ నెచట వచింపబడునో, అచట వక్రోక్తి చెలంగు" నని వ్యక్తివివేకమున మహిమభట్టు రచించెను.

## కావ్యాత్మ - నవీనమతములు

సాలంకృతమై కావ్యత దీపించు నని సూక్ష్మముగ సూచించి, కుంతలాచార్యుడు కావ్యలక్షణమును విధింప ప్రారంభించెను. ఈ సందర్భమునందు 'కవికౌశలకల్పితకమనీయతాతిశయసంపన్న మైన కేవలశబ్దమే' కావ్య మను లక్షణమును, రచనావైచిత్ర్యచమత్కార కారియైన వాచ్యమే కావ్య మను లక్షణమును పేర్కొని కుంతలు డీపక్ష ద్వయమును నిరసించెను. ఈపక్షద్వితయమును సమగ్రముగ విమర్శించి, 'వక్రకవివ్యాపారశాలియై, శబ్దార్థసహితబంధవ్యవస్థితమై' కావ్యము వెలంగునని సామాన్యలక్షణము విధించెను. మరియు రమణీయతా విశిష్ట మైన కేవలశబ్దము గాని, అర్థము గాని కావ్యము గా నేర దనియు, శబ్దార్థద్వయసమ్మిళితమై కావ్యము వెలయు ననియు కుంతలుడు నుడివెను. అటు లైనచో, శబ్దార్థసాహిత్య మెట్టిది ? అనినచో నది 'వక్రతావిచిత్ర గుణాలంకార సంపత్పరస్పరస్పర్ధాధిరోహమై' వెలుగొందుచుండవలయును. అందుచేత దండ్యాచార్యుల లక్షణమును సమ్మతింపక, కుంతలుడు వక్రోక్తివైచిత్ర్యయుక్త శబ్దార్థసహితమై కావ్యము ప్రకాశించు నని నియమించెను. ఈ సామాన్యలక్షణానంతరమున కుంతలాచార్యుడు "వివక్షితార్థైకవాచకము లైన శబ్దము లనేకము లున్నను, ఎచట స్వస్పందసుందరము, సహృదయాహ్లాద కారియై అర్థము వెలుగొందునో అదియే కావ్య" మని విశేషలక్షణ మును విరచించెను.

కవివివక్షితవిశేషాభిధానక్షమత్వమే వాచకలక్షణ మనియు, సహృదయాహ్లాదకారిస్వస్పందసుందరమై అర్థము వెలుంగుటయే వాచ్యలక్షణ మనియు కుంతలాచార్యుని ముఖ్యాశయము. శబ్దార్థము లకు వక్రోక్తిమూలముననే వైచిత్ర్యాంతరవిశిష్టత లభించుచున్నది.

## వక్రోక్తిమతము-వక్రోక్త్యలంకారలక్షణ నిరూపణము

ఇచట వైదగ్ధ్యభంగీభణితియే వక్రోక్తినామమున వ్యవహరింపబడు చున్నది దీనిని వక్రోక్తిజీవితకారు డీతెరంగున వివరించెను. అలంకార్య, అలంకరణీయము లైన శబ్దార్థములు రెండును వేరొకవిధమున వక్రోక్తిచే మరల నలంకరింపబడుచున్నవి. వక్రోక్తి యన ప్రసిద్ధాభిధానవ్యతిరేక మైన అభిధావైచిత్ర్యమే. అది వైదగ్ధ్యభంగీభణితిక్రృతము. అనగా విదగ్ధభావము, లేక కవికౌశలమును వైదగ్ధ్యమందురు. విచ్ఛిత్తినే భంగి యనియు, విచిత్రాభిధానమునే భణితియనియు వచింతురు. ఇచట వైదగ్ధ్యభంగీభణితియే వక్రోక్తి యనియు, భంగి, లేక విచ్ఛిత్తిపై నాధారపడి భణితి యున్న దనియు, వైదగ్ధ్యము, లేక కవికౌశలము వలన భంగి సంభవించు ననియు కారికలకు రచింపబడిన వృత్తి, లేక వివరణమువలన మనకు దెలియుచున్నది. ఈభణితియే వేరొకస్థలమున విచిత్రాభిధానము, లేక విన్యాసవైచిత్ర్యమని వచింపబడెను. మరియు విచ్ఛిత్తిపదము భంగీశబ్దమునకు సమానార్థక మై చారుత్వము, లేక శోభకు పర్యాయనామమై చెలువొందును. ఈ వక్రోక్తిమతమున కవికౌశలము, లేక కవివ్యాపారమునకు ప్రధానస్థాన మొసంగబడెను. కావున కుంతలాచార్యునిమతమున వక్రకవివ్యాపారము, లేక కవివ్యాపారవక్రత్వమే కావ్యనిర్మాణ మునకు బీజమై వెలుగొందును. ఈ కవివ్యాపారము, లేక కవికర్మకు క్రమ మెట్టిదో కుంతలుడు నిర్వచింపలేదు. కావున దానిస్వరూపము వర్ణనాతీత మని వక్రోక్తిజీవితకారుడు తలంచియుండవచ్చును. వర్ణనాతీత మని మౌనముద్ర వహింపక, కుంతలాచార్యుడు విచ్ఛిత్తి శోభాధాయకము లైన భేదములు బహుళము లైనను, ప్రాయికముగ కవివ్యాపారవక్రత్వప్రకారములు షడ్విధము లని వివరించెను. ఈ ఆరుతెరగుల భేదములను ముందు వివరింతుము. వక్రోక్తిమతమునుగురించి

రాజానకరుయ్యకుడు సంక్షేపముగ నిట్లు వచించెను: "వైదగ్ధ్యభంగీభణితిస్వభావమై, బహువిధముల వక్రోక్తియే ప్రాధాన్యమై, కావ్యజీవితముగ కుంతలాచార్యునిచే చెప్పబడెను. వ్యాపారప్రాధాన్యము గూడ కావ్యమున ప్రతిపాదింపబడెను. అభిధానప్రకారవిశేషములే అలంకారములు. ఈ భేదత్రయము ప్రతీయమాన మైనను, వ్యాపారరూప మైన భణితియే కవిసంరంభమున గోచరించును. ఉపచారవక్రతాదులచే సమస్తధ్వనిప్రపంచము స్వీకృత మయ్యెను. కావున కేవలముగ ఉక్తివైచిత్ర్యజీవితమై కావ్యము చెలంగును. కాని వ్యంగ్యార్థజీవితము గాదు." ఇదియే వక్రోక్తిజీవితమతసర్వస్వముగ అలంకారసర్వస్వము రచించెను.

---

(వక్రోక్తిజీవితస్వరూపవర్ణనము)

వెనుకటి యధ్యాయమున సంగ్రహముగ రచింపబడిన మతస్వరూపమును దిలకించినచో, స్వభావోక్తిసౌందర్యావలోకనమునకు జనుషాంధునివలె కుంతలాచార్యుడు గానవచ్చును. ప్రసిద్ధార్థవిరుద్ధ మైన వైచిత్ర్యాంతరవైశిష్ట్య మీ స్వభావోక్త్యలంకారమున గానరానికారణమున గాబోలు, కుంతలుడు దీనిని గణుతింప లేదు. వాచ్యవాచకలక్షణశాశ్వతసంబంధనిబంధనము లైన శాకటికవాక్యములు సాహిత్యము గా దనియు, సరస్వతీహృదయారవిందమకరందబిందుసంతోషసుందరములై, సత్కవివచనము లమృతాస్వాదమనోహరత్వమున సహృదయహృదయమాత్రగోచరతం బెంది సాహిత్యముగ ప్రకాశించు ననియు కుంతలాచార్యుడు పల్కెను. ఇందువలన అలౌకిక చమత్కారకారి యైన శబ్దార్థవిచిత్రవిన్యాసభంగియే సహృద

యాహ్లాదసంధాయినియు, అన్యూనాతిరిక్తత్వమనోహారిణియు నైన సాహిత్యసౌందర్యముగ నెలుగొందు నని భావము. కుంతలాచార్యుని సాహిత్యలక్షణమును సమగ్రముగ పరిశీలించినచో నీతడు భామహాచార్యపదోపజీవి యైనట్లు కన్పట్టును. భామహాచార్యుడు వచించిన వక్రోక్తివైచిత్ర్యాతిశయమే కుంతలాచార్యుని విచిత్రమార్గమై చెలువొందుచున్నది. రసధ్వనివక్రోక్తుల దీపించు వైచిత్ర్యము, లేక చమత్కారము, తద్వాదాహ్లాదము, లేక సహృదయ సంవేద్య మని సర్వాలంకారికులును సమ్మతించిరి. కావ్యాంగములు, శాస్త్రసంప్రదాయములు, కావ్యరచనాకౌశలము, నిర్మాణమర్మమైన పుణ్యము, రసాస్వాదానందానుభవము మొదలైన వన్నియు సహృదయులకు, లేక రసికులకు కరతలామలకముగా నుండును. ఇట్లు వక్రోక్తిసామాన్యలక్షణమును రచించి, సర్వాలంకారములకును వక్రోక్తియే శోభాధాయక మని కుంతలుడు వచించెను. ఈ సందర్భమున అలంకార్యము లైన శబ్దార్థములకును అలంకారములకును నాత డంతగా విభేదమును పాటింపలేదు. ఇతని మతమున వక్రకవివ్యాపారశాలియై, సాలంకృతశబ్దార్థమిళితమై కావ్యము చెలంగుచుండుటచే నీతడు అలంకారములకు ప్రత్యేకత నంతగ నంగీకరింపలేదు. వక్రభావము సహస్రధాభివ్యమై విలసిల్లుటచే అలంకారవర్గము వక్రభంగీభణితిసముదాయమై వైచిత్ర్యనిబంధనమై వెలయును. ఇట్లనుటచే దండ్యాచార్యులవోలెనే కుంతలుడుగూడ అలంకారసామాన్యలక్షణముగ వక్రోక్తిని స్వీకరించె నని మన మనవచ్చును. వక్రోక్తివైచిత్ర్య మనగా అలంకారవిచిత్రభావ మనియు, ఇదియే జీవితప్రాయ మనియు తానే వివరించెను. కుంతలునిమతమున అలంకారములు అభిధానప్రకారవిశేషము లనియు, వక్రోక్తియే

శబ్దార్థములకు జీవితభూతాలంకార మనియు, మిగిలిన వన్నియు ప్రకారాంతరము లనియు, సర్వాలంకారములును వక్రోక్తియం దంతర్భావితము లగుటచే నీతనివక్రోక్తి అలంకారసామాన్యవచన మనియు ఆధునికాలంకారికులు పలికిరి. దీనికి తార్కాణముగ కుంతలాచార్యుడు వాక్యవక్రతాప్రకారప్రభేదములుగ అలంకారముల నిరూపించెను. ఈరీతిగ కుంతలాచార్యుడు వక్రోక్తిజీవిత మను నూతన మతమును ప్రతిపాదించెను.

ఈ నవీనమతమున సర్వాలంకారబీజరూపము, కావ్యకాంతా జీవితభూతము నై ప్రకాశించు వక్రోక్తి కవివ్యాపారముపై నాధారపడి యున్న దని కుంతలుడు వచించెను ఈకవివ్యాపారము అనిర్వచనీయము. కాన నీకవివ్యాపారతత్త్వమును విమర్శింపక, దీనిఫలితమైన వక్రత్వమెట్టిపట్టుల గానవచ్చునో దానినిమాత్రమే కుంతలాచార్యుడు వివరించెను. విచ్ఛిత్తిశోభాశాలి యైన కవివ్యాపారవక్రత్వము, కవిప్రతిభానిర్వర్తితమై విశేషవిధముల వెలుంగుచున్నను సామాన్యముగ నది షట్ప్రకారముల సంభవించుచుండును.

౧. వర్ణవిన్యాసవక్రత్వము - ఈ అక్షరవిశిష్టవిన్యాసము ప్రసిద్ధప్రస్థానవ్యతిరేకమై, వైచిత్ర్యోపనిబద్ధమై, సన్నివేశవిశేషవిహితశబ్దశోభాతిశయసంపన్నమై, సహృదయ హృదయాహ్లాదప్రదమై చెలువొందును.

౨. ప్రాతిపదిక, లేక పదపూర్వార్ధవక్రత, ప్రత్యయ లేక పద పరార్ధవక్రత యని పదవక్రత ద్వివిధము. పర్యాయ, రూఢి, ఉపచార, విశేషణ, సంవృతి, వృత్తి (సమాస, తద్ధిత), భావ, లింగ, క్రియారూపముల ప్రాతిపదికవక్రత, లేక పదపూర్వార్ధవక్రత భాసించును. ఇంక కాల, కారక, సంఖ్యా, పురుష, ఉపగ్రహభేదముల

ప్రత్యయ, లేక పదపరార్థవక్రత దీపించును. ఈవక్రతలకు ద్వితీయోన్మేషమున లక్ష్యలక్షణముల నొసంగెను.

3. వాక్యవక్రత్వము - ఈవిభాగమున కావ్యాలంకారములను, రసవత్ప్రియఆదిరసాలంకారములను జర్చించెను. తృతీయోన్మేషమున దీన్ని వివరించెను.

4. ప్రకరణవక్రత్వము.

5. ప్రబంధవక్రత్వము.

ప్రకరణ ప్రబంధవక్రతా స్వరూపవిమర్శనమును తురీయ పంచమోన్మేషముల రచించియుండనోపును. ఇవియే ముఖ్యము లైన వక్రతాప్రకారము లనియు, మహాకవిప్రవాహమున సహస్రప్రకారములై వక్రతావిశేషములు సంభవించు ననియు, వానిని సహృదయులు స్వయముగ నూహింపగల రనియు కుంతలాచార్యుడు వచించెను. మరియు చతుర్థోన్మేషమునందు 'అసామాన్యసముల్లేఖి ప్రతిభావంతులైన మహాకవుల వచనసముచ్చయముల నూతనవక్రత్వరహస్యము లసంఖ్యాకములు గానవచ్చు' నని వక్రోక్తిజీవితకారుడు రచించెను.

ఈ విధముగ అలంకారము లన్నియు వక్రోక్తిప్రకారాంతరము లని చెప్పుటచే, రసభావాదుల ప్రాముఖ్యమును కుంతలుడు సమ్మతింప లే దనియే చెప్పవచ్చును. భామహునికైవడి కుంతలుడు గూడ రీతిని పరిగణింపకున్నను, కొంతవరకు దండివామనులమతముల ప్రాబల్యమునుమాత్ర మంగీకరించె ననవచ్చును. ఏల నన కుంతలుడు విచిత్రమార్గముల మూడింటిని పేర్కొనెను. ప్రతీయమానకావ్యార్థము, రసభావాహూతము, వక్రోక్తినై చిత్ర్యాతిశయములచే నిబద్ధమై, కమనీయమై, జీవితభూతమై చెలువ మలరు 'విచిత్రమార్గము'

నొకదానిని కుంతలాచార్యు డంగీకరించెను. ఇతనిమతమున నిదియే ఉత్తమమార్గమై వెలుగొందును. బంధబంధురతాంగతాసంపాదకము, వైదగ్ధ్యస్పందిసుందరము నైన మాధుర్యగుణమును, అసమస్తపదన్యాసప్రసిద్ధ మైన ఓజోగుణమును, పదసముదాయగమకసమర్పక మైన ప్రసాదగుణమును గలిగి 'విచిత్రమార్గము' విలసిల్లును. ఇట్లనుటవలన భామహ, దండి, వామనులవలెగాక కుంతలుడు పది గుణములలో మూడింటినిమాత్రమే గణించె నని తలంపవలయును కాని వీనికి దోడుగ 'లావణ్యము', 'ఆభిజాత్యము' లనువానిని రెంటిని చేర్చుకొని దీనివలన విచిత్రమార్గము మనోహరముగ నుండు నని వచించెను. ఈ విచిత్రమార్గమునకు అనతిదూరముగ "సుకుమారమార్గ మొకటి కల" దని సూచించెను. ఈవిచిత్రసుకుమారమార్గముల కంతరమై, అనగా వైచిత్ర్యసౌకుమార్యసంకీర్ణతం జెంది, సహజాహార్యశోభాతిశయశాలియై "మధ్యమ మార్గము" నుతి గాంచును. మాధుర్యాదిగుణగ్రామవృత్తిసమాశ్రితమై, అపూర్వబంధచ్ఛాయాతిరిక్తసంశోభితమై, మార్గద్వితయసంపదుపేతమై, నానారుచిమనోహరమై 'మధ్యమమార్గము' ప్రకాశించు నని వక్రోక్తిజీవితకారుడు వర్ణించెను. 'ఔచిత్యము', 'సౌభాగ్యము' లను మరిరెండుగుణములు విచిత్ర, మధ్యమ, సుకుమారమార్గములు మూడింటికిని రామణీయకమును సంపాదించును. స్వభావమహత్త్వపోషకము, ఉచితాఖ్యానజీవితము నై ఔచిత్యగుణమును, సర్వసంపత్పరిస్పందసంపాద్యము, అలౌకికచమత్కారకారి కావ్యైకజీవితము నై సౌభాగ్యగుణమును ప్రఖ్యాతి జెందు నని కుంతలాచార్యుడు నుడివెను. ఈ ఔచిత్యమును ధ్వనిమతావలంబకులు రసమునకు ముఖ్యాంగముగ నంగీకరించి 'ప్రసిద్ధౌచిత్యబంధమే రసమునకు పరమరహస్య' మని వచించిరి.

## వక్రోక్తిమతము-వక్రోక్తిజీవితస్వరూపనిర్ణయము

ఈమతమున రసవత్ప్రేయఆద్యలంకారములసందర్భమునను, ప్రకరణవక్రతావిచారణమునను రసమునుగురించి కుంతలాచార్యుడు చర్చించెను. రసప్రాధాన్యము నీతడంగీకరించినను, కుంతలు డిది యొక నూతనవక్రతావిశేషవిలసనముగ దలంచెను. 'కథామాత్రాశ్రితములు గాకున్నను, నిరంతరరసోద్గారగర్భసౌందర్యనిర్భరములై కవివచనములు జీవించుచున్న' వని చతుర్థోన్మేషమున వక్రోక్తిజీవితకారుడు పలికినపలుకులే రసమహత్త్వమును వేనోళ్ల గొనియాడుచున్నవి. దీనివలన రసాస్వాదానందానుభవసౌఖ్యమును వక్రోక్తిమతానుసారులు గురు తెరింగి రనియు, కాని దానిని మాత్రము వారు అలంకారవర్గమున సమన్వయింప లేకపోయి రనియు మనకు దెలియవచ్చును. ఈసందర్భమున మన మొకసంగతిని గమనింపవలయును. వైచిత్ర్యమునకు పర్యాయపద మైన చమత్కారము వక్రోక్తికి ప్రధానాంశముగ కుంతలుడు సమ్మతించెను. ఈచమత్కారమే రసమునకు ముఖ్యాంశముగ రసమతావలంబకు లంగీకరించిరి. ఈ చమత్కారము అనుభవసాక్షిక మైన లోకోత్తరాహ్లాదముగ జగన్నాథపండితుడు రసగంగాధరమున రచించెను. మరియు 'చమత్కారమే రససారముగ సర్వత్రానుభూయమాన' మనియు 'చమత్కారసారత్వమున అద్భుతరసమే దీపించు' ననియు ధర్మదత్తుని ప్రమాణశ్లోకమును విశ్వనాథకవిరాజు వచించెను. చిత్తవిస్తారరూపాత్మక విస్మయాపరపర్యాయమే చమత్కార మని విశ్వనాథుడు రచించెను. ఈవిధముగ రసాలంకారమతానుసారు లెల్లరును వేర్వేరు మార్గముల చమత్కారసార మైన లోకోత్తరానందానుభవసౌఖ్యమును బొంది సహృదయైకసంవేద్యత్వమే దీనికి ప్రబలప్రమాణముగ స్వీకరించిరి. రసవదలంకారగుప్త

ద్వారమున రసభావాదులు అలంకారమితసౌధాంతరమును ప్రవేశించి, వాచ్యోపస్కారకములుగ నుపచరింపఁజొచ్చెను. సహృదయ సంవేద్యమైన రసభావాదుల చమత్కారాతిశయము నించుకించుక చవి చూచినను, అలంకారసంప్రదాయశృంఖలాబద్ధుఁడై వక్రోక్తివైచిత్ర్యవివశుఁ డగుటచే గాబోలు, కుంతలుఁడు రసాదుల నలంకారాంతర్గతముగ జేసెను. ఆనందవర్ధనాదులు రసప్రాశస్త్యము నామూలముగ నెరింగినవా రగుటచే దానికి ధ్వనిమతమున ప్రధానస్థాన మొసంగి సహృదయానందవర్ధనులై వన్నె గాంచిరి.

రసమతమును దిలకించిన కటాక్షవీక్షణములనే ధ్వనిమతముపై గూడ వక్రోక్తిజీవితకారుఁడు ప్రసరింపజేసెను. ఈ సందర్భమున రాజానకరుయ్యకుని సంగ్రహవాక్యములు సంస్మరణీయములు. 'ధ్వని ప్రపంచసర్వస్వము నంతను వక్రోక్తిజీవితకారుఁడు ఉపచారవక్రతాదులచే స్వీకరించె' నని అలంకారసర్వస్వకారుఁడు వచించెను. ఇంక కుంతలుఁడు పేర్కొనిన ఉపచారవక్రత ద్వితీయవక్రతాప్రకార విశేష మైన పదపూర్వార్ధవక్రతావిషయమునను, సరసోల్లేఖమూలక మైన రూపకాద్యలంకార వర్గమునను బహుళముగ గానవచ్చును. ఈ ఉపచారము అనుమాన, అధ్యారోపములపై నాధారపడును. వీనికి ధర్మసామ్యము విశేషముగ నక్కరలేదు. ఈసామ్యము లేశమాత్ర మున్నను జాలును. మరియు అదూరవిప్రకృష్ట సాదృశ్య సామాన్యము సంభవించినను సరియే. అట్టిచోట్ల అభేదోపచారనిబంధనమై అధ్యారోపము సమకూరును. ఉపచారమాత్రమే భక్తియనియు, గుణవృత్తిలక్షణా సందర్భమున ఉపచరణ మతిశయవ్యవహారమును గలిగియుండు ననియు తరుచుగా జెప్పుదురు. అనగా ఉపచారము నవీనులచే గౌణము, లేక సారోపలక్షణగ వ్యవహరింపబడుచున్నది. అత్యం

తము విశకలిత మైన శబ్దములకు సాదృశ్యాతిశయమహిమచే భేదప్రతీతిని గప్పిపుచ్చుటయే ఉపచార మని విశ్వనాథు డుపదేశించెను. "ఈ బాలకుడు అగ్నిహోత్రుడు." ఇది సారోపలక్షణ, లేక ఉపచార వక్రతకు లక్ష్యము. ఇచట బాలకునకును అగ్నిహోత్రునకును భేదము గలదు; సాదృశ్యముగూడ గలదు. ఇందుగల పోలికనుమాత్రమే కైకొని కవి భేదమును గప్పివైచెను. కావున నిట్టి భేదప్రతీతిస్థగనము సామాన్యముగ రూపకాలంకారమునను, లక్షణామూలకము లైన వాక్యములలోను గానవచ్చును. స్వరూపములేనివస్తువులకు స్వరూపముగల ద్రవ్యముల కుపయోగించుశబ్దముల నుపయోగించినచో ఉపచారవక్రతగ వచించి, కుంతలాచార్యుడు 'నికారకణిక' అను వచనమును లక్ష్యముగ నొసంగెను. ఇచట 'కణిక' అను శబ్దమును సామాన్యముగ మూర్తద్రవ్యముల కుపయోగింతురు. నికారము అమూర్తవస్తువు. ఈలక్ష్యమున మూర్తద్రవ్యాభిధేయమును అమూర్త వస్తుపరముగ కవి ప్రయోగించెను. ఇందుగల విశేష మే మన, నికారము కణికవలె స్వల్పమని కవిభావము. 'ఆ మహాత్మునియశము హస్తాపచేయము' అను వాక్యమునగూడ ఉపచారవక్రత భాసించుచున్నది. కావున అచేతనవస్తువులకు చేతనధర్మ సామాన్యారోపమున గలుగు ఉపచారవక్రతాప్రకారములు సత్కవిప్రవాహమున సహస్రములు సంభవించుచుండును. 'అతచ్ఛబ్దమునకు తచ్ఛబ్దాభిధానమే ఉపచార' మను న్యాయవార్తికమునందలి లక్షణమునకు కుంతలుని ఉపచారవక్రత సరిపోవును. ఈ ఉపచారవక్రత ధ్వని సంప్రదాయమున లక్షణామూలవ్యంగ్యమై ప్రకాశించును.

ధ్వన్యాలోకమునందలి విభాగము ననుసరించి వక్రోక్తిజీవితకారునిమతమును పరిశీలించినచో మన కాతడు 'అన్యులు భాక్త

మందు' రనుప్రకారమున భాక్తవాదులలో నొక డని స్పష్ట మగును. కుంతలాచార్యుడు అభావవాదులలో జేరక, పూర్వమునుండియు ప్రఖ్యాతి గాంచిన ప్రతీయమానార్థమును భాక్తము, లేక గౌణము, లేక లాక్షణికముగ సమన్వయింప స్వశక్తి నంతయు వినియోగించెను. అందుకు కుంతలుడు కేవల భాక్తవాది గాక, అభినవగుప్తపాదుడు నిరూపించిన తాదాత్మ్యము, లేక తాద్రూప్యము, వ్యావర్తకధర్మ మైన లక్షణ, కదాచిద్వ్యావర్తకధర్మ మైన ఉపలక్షణ లను విభాగత్రయమున నితడు ద్వితీయాంతర్భావవాదిగ గన్పట్టును. కావున నీతడు 'ధ్వన్యర్థమును భక్త్యంతర్భాగముగ వచించె' నని రుయ్యక జయరథవిద్యాధరులు రచించిరి. చిరంతను లైన భామహ దండి వామనాదులుగూడ నీరీతినే ధ్వన్యర్థమును పర్యాయోక్తి, సమాసోక్త్యాద్యలంకారముల స్వీకరించుటంజే, వారుగూడ భాక్త వాదులలో జేరినవా రని మనము దలంపవచ్చును. వ్యక్తివివేక కారునివలెనే వక్రోక్తిజీవితకారుడుగూడ, ఆనందవర్ధన మమ్మటా చార్యుల మధ్యకాలమున ప్రబలి ధ్వనిమతధ్వంసమునకు శక్తి సామర్థ్యముల వ్యయపరచి ప్రాచీనమతసంప్రదాయముల మరల బ్రతిపాదించుటకు సకలప్రయత్నముల నొనరించి పాటుపడెను. కాని వీరిరువురిపరిశ్రమలును కాంతారాంతరమల్లికాకుసుమసంకాశ మై చెలంగెను. మమ్మటాచార్యుల ప్రయత్నమువోలె సత్కారభాజనము గాక, వక్రోక్తిజీవితకార వ్యక్తివివేకకారుల పరిశ్రమలు నవీనులకాల మున 'నికారకణికాపాత్రము', తిరస్కారవాక్యలక్ష్యము నై నశించెను. ధ్వనిమతప్రాశస్త్యమును వర్ణించుసమయముల వీరిని, వీరిగ్రంథ ములను సందర్భానుసారముగ నవీనులు పేర్కొనుచుండిరి. వక్రోక్తి జీవితకారుని మూలమతమును నిరసించినను, అలంకారముల విషయ

మునమాత్రము నూతనులు కుంతలాచార్యుని వైదగ్ధ్యభంగీభణితిని, విచ్ఛిత్తివిశేషమును జాల గొనియాడిరి. అలంకారములు సామాన్యముగ నలంకారములుగ వెలుంగుచున్నను వానివానికి వేరువేరుగ విశేషములు గానవచ్చును. అనగా అభిధాప్రకారవిశేషములుగ అలంకారములన్నియు జెలంగినను, ఆయా యలంకారములు కవివ్యాపారముపై నాధారపడి, కవిప్రతిభానిర్వర్తితములై, వైదగ్ధ్యవైచిత్ర్యము, విచ్ఛిత్తివిశేషము, భంగీభణితులతో తులదూగుచు, అపూర్వసౌందర్యమును వెలిపుచ్చుచు, అలౌకికానందమును జదువరుల కొదవించును. కావున కవిప్రవాహప్రసిద్ధిప్రతీతి ననుసరించి, ఉక్తివైచిత్ర్యభణితివైదగ్ధ్యమును జేయూత గొని, అలంకారములు ప్రత్యేకములై లోకోత్తరాతిశయకోటి నధిరోహించు నని కుంతలాచార్యుడు వచించెను. నవీను లంద రీలక్షణము నంగీకరించిరి. అలంకారసర్వస్వకారు డైన రాజానకరుయ్యకుడు ప్రాయికముగ కుంతలుని విశేషలక్షణము నాదరించియే తత్తదలంకారముల విమర్శించెను. యథాసంఖ్యాలంకారమును జర్చించుచు; జయరథుడు 'వక్రోక్తిజీవితకర్తయే స్వప్రపంచముగ వచించె' నని కుంతలాచార్యుని ప్రమాణముగ గ్రహించి యథాసంఖ్యమును నిరాదరించెను. కావున కావ్యజీవితవిషయమున గాకున్నను అలంకారశోభాతిశయసందర్భమున నైనను కుంతలాచార్యుని వైదగ్ధ్యవైచిత్ర్యమునకు శాత్రవమతసంప్రదాయానుసారు లైన రాజానకరుయ్యకాదులు సహితము శిరఃకంప మొనరించిరని చెప్పక తప్పదు. ఇటుల కుంతలుని వక్రోక్తితత్త్వమును ధ్వనిమతావలంబకులుగూడ అలంకారవిమర్శనావసరమున నౌదల దాల్చి రని భావము.

---

# కావ్యాత్మ - నవీనమతములు

( అలంకారతత్త్వవిమర్శనము )

వెనుకటివిషయములవలన ఆనందవర్ధనాదు లొనరించిన కావ్యాలంకారవిచారము సమగ్రము, సంపూర్ణము గాదని తేటపడును. వ్యంగ్యోపస్కారములుగను,రసధ్వనికి అంగములుగను అలంకారములను ఆనందవర్ధనాదులు చర్చించిరి. వ్యంగ్యప్రతీతికిని, రసస్ఫూర్తికిని గాక కొన్నిచోట్ల కేవలవాచ్యాతిశయప్రకటనకుమాత్రమే కవులు పాటుపడుటగూడ గలదు. ఇట్టి వాచ్యాలంకారపద్యములలో నెంతయో కొంత వ్యంగ్యప్రతీతి గలిగినచో వానిని గుణీభూత వ్యంగ్యకావ్యముగను, లవలేశమేనియు లేనిచో చిత్రకావ్యముగను ఆనందవర్ధనుడు గ్రహించెను. మరియు అలంకారములలో కొన్ని సహజముగ వ్యంగ్యగర్భితములుగ నుండు ననియు పలికెనేకాని అలంకారతత్త్వమును ఆనందవర్ధనుడామూలముగ విమర్శింపలేదు. ఇతడు వ్యంగ్యగర్భితము లైన పద్యములు మధ్యమకావ్యములుగను, కానిచో చిత్రకావ్యములుగను విధించి, మూడవ విభాగమైన చిత్రము కావ్యానుకారము గాని కావ్యము గా దనెను. 'వాగ్వికల్పము లనంతము' లనియు, 'అలంకారములే తత్ప్రకారము' లనియు స్థూలదృష్టిని వ్రాకుచ్చెను. ఈవచనము సర్వసమ్మతముగా లేదు. ఏల నన, వ్యంగ్యార్థశూన్యము లైనను కొన్నిపద్యములు వాచ్యాలంకార రామణీయకాతిశయమున సహృదయాహ్లాదమును గల్గింప నోపును. అందుచే 'నలంకారములు వాగ్వికల్పము' లను ఆనందవర్ధనుని పలుకులలోని లోపములను కుంతలునితరువాతివారు కొందరు సవరింపబూనిరి. రసోపకారకములు గానిచో అలంకారములు ఉక్తివైచిత్ర్యమాత్రములై మెలంగు నని మమ్మటు డాడినమాటలు కుంతలాచార్యుని పలుకుల స్మరింపజేయును. 'వైచిత్ర్యమే అలంకార' మని వేరొకచో

మమ్మటుడు నుడివెను. మరియు మమ్మటుని అతిశయోక్తిలక్షణము భామహకుంతలాచార్యుల లక్షణములకు ప్రతిబింబముగ గన్పట్టును. అతిశయోక్తియే ప్రాణత్వమున అవస్థిత మనియు, అది లేనిచో ప్రాయికముగ నలంకారము లేదనియు మమ్మటుడు రచించుటచే సర్వాలంకారసాధారణలక్షణముగ భామహకుంతలులచే భావింపబడిన వక్రోక్తివైచిత్ర్యలతాంకురము నవీనాచార్యుల హృదయాలవాలమున పుష్పించి సౌరభముల వెదచల్లుచున్న దనిపించును. మరియు రుద్రటుని హేత్వలంకారలక్షణమును నిరసించుచు మమ్మటుడు వైచిత్ర్యాభావమున నది ప్రత్యేకాలంకారము గా దని వచించెను. సాధ్యసాధనైక్యమే హేత్వలంకారముగ బరిగణింపబడునేని, సారోపలక్షణాలక్ష్య మైన 'ఆయువే ఘృతము' అనుచోటగూడ హేత్వలంకారము గావచ్చు నని మమ్మటుడు పలికెను. మమ్మటాచార్యుని తరువాత ధ్వనిమతసంప్రదాయానుసారముగ రాజానకరుయ్యకుడు సర్వాలంకారముల నలంకారసర్వస్వమున జర్చించెను. అలంకారమతముపై విశేషాభిమానమును, భామహాభట్టోద్భటులయెడ నత్యంత గౌరవమును గల్గియున్నను, కుంతలుని వక్రోక్తివైచిత్ర్యమునే అలంకారవిమర్శనబీజముగ రాజానకరుయ్యకు డంగీకరించి ధ్వనిమతానుకూలముగ నలంకారవర్గమును జర్చించి అలంకారసర్వస్వమును రచించెను. మమ్మటరుయ్యకులచే మాననీయ మగుటచే, వక్రోక్తిమాహాత్మ్యము వేరుగ వివరించుట వృథాయాసము.

కావ్యాలంకారసంచయమునకు కుంతలాచార్యుని వక్రోక్తివైచిత్ర్యము వన్నె దెచ్చె నని మున్నె చెప్పియుంటిమి. నవీనుల కిదియే ఆదర్శప్రాయమై అలంకారరామణీయక మంతయు దీనియందు ప్రతిఫలించెను. రాజానకరుయ్యకుని అలంకారసర్వస్వమే మనవాద

మునకు ప్రథమసాక్షిగ మనము స్వీకరింపవచ్చును. అతడు సందేహాలంకారమును జర్చించుచు, 'కవిప్రతిభోత్థాపిత మైన సందేహమే సందేహాలంకార' మని నిస్సందేహముగ బలికెను. తరువాత భ్రాంతిమదలంకారము ' భణితిప్రకార 'మనియు, ఇందలి భ్రాంతి 'సాదృశ్య-హేతుకం బైనను, అది విచ్ఛిత్తికొరకు కవిప్రతిభాకల్పితమై చెలంగు' ననియు రుయ్యకుడు వచించెను. ఈ సందర్భమున ' కవిప్రతిభోత్థాపిత మగుటవలననే అలంకారత్వ ' మని జయరథుడు వ్యాఖ్యానము చేసెను. దీనివలన కవిప్రతిభ గలచోటనే అలంకార మనియు, కవిప్రతిభ లేనిచోట అలంకారము గా దనియు స్పష్ట మగుచున్నది. 'నవనవోల్లేఖశాలిని యైన బుద్ధియే ప్రతిభ' యని మన మీవరలో దెలిసికొంటిమి. అనగా నిమిషనిమిషమునకు క్రొత్తక్రొత్తచింత లీను కోరికల కొనలెత్తజేయుజాలు తెలివి తేటలని మనము తలంపనగును. మరియు ఉల్లేఖాలంకారము శ్లేషమూలక మగుటచే దీనిని ప్రత్యేకాలంకారముగ లెక్కింప నక్కర లేదని కొందరు పలికినవచనములకు సమాధానముగ 'శ్లేష లేకున్నను ఉల్లేఖాలంకారమున విచ్ఛిత్తివిశేషము గల' దని వచించి, రుయ్యకుడు దీనిని ప్రత్యేకాలంకారముగ నంగీకరించెను. తరువాత నీప్రకారముగనే అప్రస్తుతప్రశంసావ్యాజస్తుత్యలంకారముల పరస్పరభేదమును విమర్శించెను. ' స్తుతినిందారూపాత్మక మైన విచ్ఛిత్తివిశేష ముండుటచే వీనికి భేదము గల' దనియు, గావున రెండును వేర్వేరుగ గణింపబడవలయు ననియు బలికెను. అర్థాశ్రయమైన విచ్ఛిత్తివిశేషము లేనిచో అనుమానాలంకారమునకును, తర్కానుమానమునకును వే రేమిభేదము గలదని రుయ్యకుడు అనుమానాలంకార సందర్భమున ప్రశ్నించెను. అనగా కవికౌశలకల్పితమైన వైచిత్ర్యము లేనిచో రెండును సమానము లే. ' రూపకమూలత్వ

మైన అలంకారాంతర గర్భీకారముచే విచ్ఛిత్త్యాశ్రయమై తర్కాను మానముకన్న విలక్షణమై" అనుమానాలంకారము కావ్యమున ప్రకాశించు నని రుయ్యకుడు వ్రాసెను. ఇంతియేకాక 'ప్రౌఢోక్తిమాత్ర నిష్పన్నార్థనిష్ఠత్వముచేతను, విచ్ఛిత్తివిశేషాశ్రయ మగుటచేతను అనుమానాలంకారము చారుత్వమును గల్గియుండు'నని రాజానకరుయ్యకుడు వచించి సహృదయులమానసముల గలుగు అనుమానాంకురముల మరల నన లెత్తకుండ గాల్చివైచెను. అందువలననే 'విచ్ఛిత్తిచే సాధనమువలన సాధ్యజ్ఞానమే అనుమాన' మని విశ్వనాథకవిరాజును; 'కవిప్రతిభోల్లిఖితత్వమైన చమత్కారిత్వముచే కావ్యాలంకార మైన అనుమానము వెలుగొందు' నని జగన్నాథపండితుడును రచించిరి.

ఈ నిదర్శనములవలన కవిప్రతిభావిశేషమున సంభవించు విచ్ఛిత్తివిశేషమే అలంకారబీజముగా నవీను లంగీకరించినట్లు తెలియుచున్నది. ఈవిచ్ఛిత్తివిశేషము కొన్నిచోట్ల విశేషణవిచ్ఛిత్తిరూపముగను, మరికొన్నిపట్టుల శృంఖలావిచ్ఛిత్తిరూపముగను గోచరించును. కావుననే పరికరాలంకారసందర్భమున జయరథు డీక్రిందివిమర్శనమునందు 'ఏవంవిధానేకవిశేషణోపన్యాసద్వారమున వైచిత్ర్యాతిశయము సంభవించుటయే అలంకారత్వ' మని నిష్కర్ష చేసెను. కావున అలంకారమునకు రెండు ముఖ్యాంశములు గల వని బోధపడుచున్నది. మొదటిది కవిప్రతిభ, లేక కవిప్రజ్ఞ, లేక కవికౌశల మనియు, రెండవది విచ్ఛిత్తి, వైచిత్ర్యము, చారుత్వము, చమత్కారము, సౌందర్యము, లేక హృదయత్వ మనియు పేర్కొనబడును. కవిప్రతిభాత్మకమును, విచ్ఛిత్తివిశేషాత్మకమును నైనప్పుడే అలంకార మనుపేర బరగు ననియు, వాక్యము దోషాభావమాత్రమై చెలంగుచున్నను కవిప్రతిభాత్మకవిచ్ఛిత్తివిశేషత్వము లేనిచో నది

అలంకారము గా దనియు జయరథుడు చాటి చెప్పెను. దీనివలన కవికౌశలము గానరానిచోట నలంకార ముండనేర దనియు, అలంకారమునకు కవిప్రతిభయే ప్రధానాంశ మనియు తేటపడును. మరియు భావికాలంకారమును విమర్శించుచు 'కవిసమర్పితము లైన ధర్మములచేతనే అలంకారత్వము చెలంగు' నని రుయ్యకుడు వచించెను. అనుమానాలంకారసందర్భమునం దీభావమునే జయరథుడు విపులముగ, విస్పష్టముగ వివరించెను. 'అందువలన కవికర్మయే వైలక్షణ్యనిమిత్తము. కవికర్మాభావమువలన నెచట విచ్ఛిత్తివిశేషము సంభవింపదో అచట నలంకార ముండనేరదు. ఏల నన, కవికర్మచేతనే అలంకారనిబంధనము చెప్పబడెను.' అని జయరథుడు వచించెను. ఈరీతిగ కవికర్మకును, విచ్ఛిత్తివిశేషమునకును ప్రధానస్థానము నొసంగినను, రాజానకరుయ్యకాదులు స్వభావోక్తిసందర్భమున భామహునివలె సంకుచితస్వభావులు గాక, కవిత్వమాత్రగమ్యమై, సూక్ష్మవస్తుస్వభావస్వరూపసత్యవర్ణనసంశోభితమై స్వభావోక్తి ప్రకాశించు ననుటచే వారు ప్రకృతివైచిత్ర్యసౌందర్యమును సవిమర్శదృష్టి దిలకించి రనియే మనము భావింపవలయును. కవిప్రతిభావిచ్ఛిత్తివిశేషముల నాధారముగ గైకొనుటచేతనే యథాసంఖ్యాలంకార మపక్రమదోషాభావ మనియు, కావ్యలింగాలంకారము నిర్హేతుత్వదోషాభావ మనియు జయరథ జగన్నాథులు వచించి వీనిని ప్రత్యేకాలంకారములుగ నంగీకరింపరైరి. 'కవిసమయప్రసిద్ధి ననుసరించి హృద్యమై, శోభాకరమై వెలుగొందునప్పుడే వాక్యములు అలంకారతను భజించు' నని చిత్రమీమాంసాకారుడు రచించెను. అతడిందుల కుదాహరణముల గొన్నిటి నొసంగెను; "గోసదృశము గవయము" అనిచో ఉపమానము గాదు. "వాహీకుడు గోవే" అనుచో

రూపకము గాదు. "స్థాణువా, లేక పురుషుడా?" ఇదిసందేహముగాదు. "ఇదిరజతమే" భ్రాంతిమదలంకారము గాదు. "ఇది సర్పము గాదు." అపహ్నుత్యలంకారము గాదు. "పీను డైన దేవదత్తుడు పగటివేళ భుజింపడు." ఇది పర్యాయోక్తిగాదు. "పర్వతము వహ్నిమంతము" ఇచ్చట అనుమానము లేదు. "అతడే దేవదత్తుడు" ఇది స్మరణాలంకారము గాదు. "కొమరునితోగూడ తండ్రి వచ్చెను" ఇది సహోక్తి గాదు. ఇట్టి సామాన్యజనవచనములు కవిసమయసంప్రదాయసిద్ధములు గాకుంటచే అలంకారములుగ లెక్కింపబడవు. జగన్నాథపండితుని ప్రౌఢవాక్యములుగూడ పై విషయమునే సంస్కరింపజేయును. రాజానకకుంతకరుయ్యకాదులచే విచ్ఛిత్తి, వైచిత్ర్యము, చారుత్వము, చమత్కారముగ గొనియాడబడినదానినే జగన్నాథుడు హృదయత్వము, సౌందర్యము నను పేరుల బేర్కొనెను. 'భణితివిశేషరూపత్వమే' అలంకార మనియు, 'అలంకార సామాన్యలక్షణప్రాప్తమై చమత్కారిత్వ ముండు' ననియు, 'అలంకారసామాన్యలక్షణగత మైన హృదయత్వమే సకలాలంకారసాధారణ' మనియు రసగంగాధరము వచించును. 'ఇంక విచ్ఛిత్తి యన నేమి?' అలంకారముల పరస్పరవిచ్ఛేదమై లక్షణ్యమునకు హేతుభూత మైన జన్యతాసంసర్గకావ్యనిష్ఠ మైన కవిప్రతిభయా, తజ్జన్యత్వప్రయుక్త మైన చమత్కారితయా? దేనిని విచ్ఛిత్తిగా బల్కుదు రని ప్రశ్నించి, 'జన్యతాసంసర్గకవిప్రతిభావిశేషము, తన్నిర్మితత్వప్రయుక్త మైన చమత్కృతివిశేషము నను రెండును గూడ విచ్ఛిత్తియే' యని జగన్నాథపండితుడు రచించెను. ఇటు లనుటచే వక్రోక్తిజీవితకారుని వైదగ్ధ్యభంగీభణితి ప్రసాదించిన 'వైచిత్ర్యమే' పండితరాయల ప్రౌఢవాక్యరచనానిర్మిత మైన 'సౌంద

ర్యము 'గ ప్రకాశించె నని మనము గురుతింపవలయును. అనుభవము, సంప్రదాయము నను రెంటివలననే విచ్ఛిత్తివిశేషమును, హృదయత్వ సౌందర్యములను మనము పరికింపగల మని జగన్నాథుడు నిర్ణయించెను. వే యేల ? జిలిబిలిపలుకుల, తళుకులొలుకునగల, సరసపు గొనముల, మురుపునెరపునపకల, చదువరులడెందముల గలంచు 'బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకా' లలామకు వక్రోక్తి వైచిత్ర్యవైదగ్ధ్యభంగీభణితిప్రకారవిచ్ఛిత్తివిశేషముల బోధించి కుంతలాచార్యవర్యు డామెను, వెలగలిగి నెరయమెరయు ముత్తెముల మూటల రత్నములరాసుల బోలు నెరజాణతనము, నన లెత్తుపలుకుములుకులవలపుల, 'పరువపునిండుజవ్వనపుబాగరినాగరికంపుబోడకుం' దగిన దంటమాటల నీటుబ్రేటుల తియ్యందనము బచరించు కావ్యకుటిలశిరోజాతిలకముగ దీర్చి, సహృదయశిరోమణుల మానసముల గరంచె నంటయే వక్రోక్తిమతమునం గల పరమరహస్యము. ఇట్టి విచ్ఛిత్తివిశేషము గానవచ్చుటం జేసియే, కావ్యకాంతాశరీర కాంచనామూల్యత నెరుంగుటకు కషాశ్మముగను, అలంకారరత్నానర్ఘ్యత నరయుటకు శాణోపలముగను కుంతలాచార్యుని వక్రోక్తి వైచిత్ర్యమును, పరమతానుసారు లైన సహృదయవతంసులు, కవిరాజులు, పండితేంద్రులుంగూడ స్వీకరించుట. ఇదియే దీనిప్రాశస్త్యమును వేనోళ్ల జాటుచున్నది.

---

# కావ్యాత్మ

## నవీనమతములు

---

### ౪. అనుమానమతము

(ధ్వన్యాదిమతఖండనము - అనుమానమతమండనము)

వ్యక్తివివేక మను గ్రంథనామమే మహిమభట్టారకుని సంకల్పమును జదువరుల కెరుకపరచును. ధ్వన్యాలోకకారుని వ్యక్తి, లేక వ్యంజనను విమర్శించి, ధ్వనిమతమును ధ్వంస మొనరించి, ధ్వని ప్రపంచము నంతను అనుమానాంతర్గతముగా నిరూపించి, నూతన మతమును స్థాపించుటయే వ్యక్తివివేకకారుని ప్రబలప్రయత్న మని ప్రారంభశ్లోకమే ఘోషించుచున్నది. అందువలన ఆనందవర్ధనాచార్యుల ధ్వనిలక్షణమును, వ్యక్తివాదమును సమగ్రముగ జర్చించి, ఖండించి, అనుమానాంతర్భావితముగ సమర్థించెను. ధ్వనిమతలక్ష్యముల నెల్ల తృతీయవిమర్శనముగ విపులముగ విమర్శించి, వాని నన్నిటిని అనుమానమతలక్ష్యములుగ మహిమభట్టు ప్రదర్శించి, తనపాండితీ మహిమను ప్రకటించెను. మొదటినుండి తుదివఱక నీవ్యక్తివివేకము ధ్వన్యాలోకమునకు ఖండనగ్రంథమే కాని వేరొండు గాదు. ఆనందవర్ధనాచార్యుల ధ్వనిలక్షణమును దోషదూషితముగ వచించి, మహిమభట్టు డాలక్షణవాక్యమును కావ్యానుమితిగ సమర్థించెను. 'అర్థము నకు చాని ఉపసర్జనీకృతాత్మత్వ మనుపాదేయ' మని నిరసించి, 'ఎచట

వాక్యానుమితులలో నొకటి అర్థాంతరమును ప్రకటింపజేయునో అదియే కావ్యానుమితి ' యని లక్షణమును మహిమభట్టు విధించెను.

ఇటుల లక్షణమును నిర్మించి, 'వాక్యము ఏకప్రకార' మనియు, 'వాచ్యము, అనుమేయమునని అర్థము ద్వివిధ'మనియు, శబ్దవ్యాపారవిషయము వాచ్యము, అదియే ముఖ్యమనియు, దానివలన గాని లేక అనుమితిమూలమున గాని లింగభూతాదులవలనే అర్థాంతరము అనుమీయమాన మైనచో అనుమేయ మనియు, ఇది మరల వస్తుమాత్రము, అలంకారము, రసాదులు నని త్రివిధ మనియు, ఈమూటిలో వస్త్వలంకారములు రెండును వాచ్యములుగను, కడపటిరసాదులు అనుమేయములుగను మహిమభట్టు రచించెను. దీనివలన, వస్తు, అలంకార, రసములకు విశేషార్థప్రకాశనమును మహిమభట్టు సమ్మతించె ననియు, ఆవిశేషార్థప్రకాశనము వ్యక్తిరూపమున గాక అనుమానస్వరూపమున జెలంగు ననియు మహిమభట్టారకుని మత మని తేటపడును. ఇచట వాచ్యప్రతీయమానములు లింగలింగిభావమున మెలంగుటవలన ధ్వనిలోక మంతయు అనుమానాంతర్భావముగ సమన్వితె మగుచున్న దని వ్యక్తివివేకకారుని వాదము. వాక్యార్థప్రపంచమంతయు సాధ్యసాధనభావగర్భ మనుటకన్న దీనికిని ధ్వనిమతమునకును విశేష భేదము గానరాదు. ధ్వనికి వ్యక్తియే ప్రాణభూత మను వివేచనమే కాని విమతిమతమునకును, స్వమతమునకును వేరు భేదము లేనట్లు వ్యక్తివివేకకారుడే సూచించెను.

వ్యంజకత్వము వాచకత్వముకన్న నత్యంతభిన్న మనియు, వ్యంజకత్వమార్గమునందు అర్థము అర్థాంతరమును ద్యోతింపజేయు ననియు, స్వరూపమును ప్రకాశింపజేయుచు దీపన్యాయమున దా

నన్య ప్రకాశమునకు ప్రతీతి గలిగించుననియు ధ్వన్యాలోకమున ఆనంద వర్ధనుడు రచించెను. వాచ్యార్థముతోటిపాటు సమకాలమున గాక పిదప స్ఫురించుటంజేసి, వ్యంగ్యరూపావచ్ఛిన్నములైన రసాద్యలంకార విషయత్రయమున నేకకాలావభాసము సంభవింపదు. వాచ్యములైన విభావము లజ్ఞానమునకును, వ్యంగ్యమైన రసానుభవమునకును విశేషాంతరము లేదు. ఇటుల విభావరసప్రతీతులకు స్వల్పకాలావధి గల్గుటచే ధ్వనిమతావలంబకులు దీనిని అసంలక్ష్యక్రమవ్యంగ్య మని వచించిరి. ఈరసధ్వనికి వా రిడినపేరే, దీనికి క్రమము గల దని చెప్పకయే చెప్పుచున్నది. కావున వాచ్యవ్యంగ్యములు సమకాలీనములు గా వనియు, ఒకదానివెంట నంటి రెండవది వెలుంగు ననియు మన మెఱుంగవలయును. ఇట్లగుటచే రసాదిప్రతీతి కార్యకారణభావమూలకము గావచ్చు ననియు, అందుచే వాచ్యవ్యంగ్యప్రతీతి నిమిత్తనిమిత్తిభావమున సంభవించు ననియు మహిమభట్టు ఖండించెను. ఈవిధముననే లక్ష్యార్థముగూడ అనుమానవిషయమై చెలంగును. "గౌర్వాహీకః" అను లక్ష్యమున రెంటికిని తాద్రూప్యవిధానమున కుపపత్తి గన్పడదు; ఒకానొకయంశమునమాత్రమే సాదృశ్యప్రతిపత్తి గల్గును. వాహీకాదులయందు గవాదిగతజాడ్యాదిధర్మప్రతిపాదనమే, -యీశబ్దనివేశనమునకు ప్రయోజనము. ఇది తత్త్వారోపాన్యథానుపపత్తిపరికల్పితమైన అనుమానవిషయమే కాని వేరొండు గా దని వ్యక్తివివేకకారుడు నిరూపించెను. వక్ష్యమాణక్రమమున లింగలింగిభావసమర్థనమువలన సర్వధ్వనిప్రకారములును, అనుమానాంతర్భావసమన్వితములై చెలంగును. ఈ అర్థము అనుమాపకమే కాని వ్యంజకము గాదు మరియు అనుమానము ధ్వనికన్న మహావిషయమని మహిమభట్టారకుని మహాశయము.

వాచ్యార్థమునకు ప్రతీతి గలిగించి, దానివ్యాపారము విరమించుటచేసి ముఖ్యార్థమునకన్న వేరొకదానికి శబ్దము వ్యంజకము గానేరదు. ఇటులనే లక్ష్యార్థముగూడ సత్యముగ అనుమానవిషయమే కాని వేరొండు గాదు. ఇట్టిచో నింకేవిధమున విశేషార్థమును శబ్దము వెలి పెట్టజాలును? కావున వాచ్యార్థమూలమున శబ్దము లన్నియు అనుమాపకములుగనే మెలంగు నని వ్యక్తివివేకకారుని సిద్ధాంతము.

ఇటుల విశేషార్థప్రతీతిని గలిగించు అనుమానముగూడ కేవల తార్కికానుమానమువలెనే వ్యాప్తిలింగలింగిజ్ఞానమూలముననే జనించును. ఇచట విశేషార్థము లింగియు, శబ్దార్థములు లింగమును నై చెలంగును. అనుపలబ్ధి, తాదాత్మ్యము, తదుత్పత్తిమూలకమై వ్యాప్తి గానవచ్చును. ఈ కార్యకారణభావము లింగి యైన ధ్వనికిని, లింగమైన శబ్దార్థములకును సమన్వయింపదు. అనుపలబ్ధి ఒకానొకదాని అభావమును నిశ్చయించునే కాని వేరొకదానిసిద్ధిని సమర్థింపజాలదు. ఘటానుపలబ్ధిచేత ఘటాభావమును మన మనుమానింపగలము. అటులనే శబ్దార్థానుపలబ్ధి ధ్వనిని నిర్ణయింపనేరదు. ఒకదాని అభావముపై నిచట లింగి యైన ధ్వని యాధారపడలేదు. అందుచే హేతువు దోషదూషిత మైనది. శబ్దార్థముల అభావమును శబ్దార్థానుపలబ్ధి నిరూపించును గాని ధ్వన్యభావమును నిర్ణయింపదు. మరియు వాచ్యార్థమును అప్రధాన మొనరించి, దానికన్న విలక్షణమై వ్యంగ్యార్థము ప్రకాశించుటంజేసి శబ్దార్థములకును ధ్వనికిని తాదాత్మ్యము సంభవింపదు. ధూమాగ్నులకువోలె సాహచర్యనియమము గానరాకపోవుటచే శబ్దార్థములకును ధ్వనికిని తదుత్పత్తి నంగీకరింపరాదు. ఇటుల వ్యాప్తిపక్షధర్మతాజ్ఞానము వ్యభిచారాదిదోషగ్రస్త మగుటచే వ్యక్తివివేకకారుని వాదము ప్రతిహతమై చెలంగును.

ఈ ఖండనమును విశ్వనాధకవిరాజు వేరొక ప్రకారము వివరించెను. పక్షసత్త్వ, సపక్షసత్త్వ, విపక్షవ్యావృత్తత్వవిశిష్టతచే లింగమువలన గలుగు లింగిజ్ఞానమే అనుమానము. సందిగ్ధసాధ్యము పక్షము (పర్వతము); నిశ్చితసాధ్యము సపక్షము (మహానసము); సాధ్యాభావము విపక్షము (జలాశయము). ఇందులకు తార్కాణముగ 'ఎచట ధూమము గలదో అచట వహ్ని గలదు; మహానసమున ధూమవహ్నులు గలవు; పర్వతముపై ధూమము గానవచ్చుచున్నది; కావున పర్వతమున వహ్ని గలదు' అను లక్ష్యమును పరీక్షింతము. ఇచట పర్వతమున వహ్ని గలదని మన మనుమానించుచున్నాము. ఇందు లింగియైన వహ్ని ననుమానించుటకు ధూమమే లింగము. ఈ లింగమైన ధూమము సపక్షమైన మహానసమున వ్యాప్తియు, విపక్షమైన జలాశయమున వ్యావృత్తత్వమును గల్గియున్నది. ఇటులనే లింగమైన వాచ్యార్థమువలన లింగియైన వ్యంగ్యార్థమును మన మనుమానించుచున్నాము. కావున అనుమానమునందు ధ్వని పర్యవసించుచున్నదను వ్యక్తివివేకకారుని వాదమును పూర్వపక్షము గావించి, విశ్వనాధుడు 'కవిప్రతిభామాత్రజన్యములైన కావ్యముల కీప్రామాణ్యవాదము వర్తింప' దని సిద్ధాంత మొనరించెను.

ధ్వనిమతమును ఖండించుసందర్భమున వ్యక్తివివేకకారుడు భాక్తవాదుల ప్రమాణములగూడ స్వమతప్రతిపాదనార్థముగ స్వీకరించెను. ఇచట ప్రసంగవశమున దీర్ఘవ్యాపారవాదులైన మీమాంసకుల నిరసించి, వక్రోక్తిజీవితకారుని మతమునుగూడ తిరస్కరించి మహిమ భట్టారకుడు అనుమానమతమును నెలకొల్పెను. వక్రోక్తిమతవిమర్శన మీతని రసాభిమానమును, ధ్వన్యనాదరమును వెల్లడిచేయును. వక్రోక్తిమతమునంగల ప్రసిద్ధోపనిబంధనవ్యతిరేకమును శబ్దార్థౌచిత్య

మాత్రపర్యవసానపరముగను, ప్రసిద్ధాభిధేయార్థవ్యతిరేకి యైన ప్రతీయమానాభివ్యక్తిపరముగను వ్యక్తివివేకకారుడు భావించెను. ఆద్యపక్షమున కిటుల సమాధాన మొసంగెను: 'విభావాద్యుపనిబంధనమే కవివ్యాపారము గాని వేరొండు గాదు; యథాశాస్త్రోపనిబధ్యమానము లైనచో, అవి రసాభివ్యక్తినిబంధనభావమును భజించును. అన్యథా గాసేరదు. కావ్యము రసాత్మక మైనచో దాని యందు అనౌచిత్యసంస్పర్శ మెట్లు సంభవించును ? కావున కావ్యస్వరూపనిరూపణసామర్థ్యసిద్ధికొరకు శబ్దార్థోపనిబంధనవైచిత్ర్యపృథగుపాదానము నిరర్థకము. ఇంక ద్వితీయపక్షమును పరిగ్రహించినచో ఇది భంగ్యంతరాభిహితముగ ధ్వనిలక్షణమే. కాన యుక్తియుక్తము గాదు'. ఇటుల విమర్శించి 'కావున ధ్వనివిధము ననే వక్రోక్తిగూఢ అనుమాన మేల గా' దని ప్రశ్నించెను. ఈకారణములవలన ధ్వనివక్రోక్తిమతము లన్నియు అనుమానాంతర్గతము లని వ్యక్తివివేకకారుని విశ్వాసము. ఇటుల కార్యకారణభావమూలక మై రసప్రతీతియు, వాచ్యప్రతీయమానముల గమ్యగమకసంస్పర్శమున కావ్యము కెలంగు ననియు, ఇచట అనుమేయత్వమే కాని వ్యంగ్యగంధము లేశమైనను లేదనియు, కావున ధ్వనిభేదము లన్నియు అనుమానాంతర్భావము లనియు వ్యక్తివివేకకారుడు ప్రథమవిమర్శనమున వివరించెను.

(అనౌచిత్యవిచారము - ధ్వనిలక్ష్య విమర్శనము)

ఇంక ద్వితీయవిమర్శనమున అనౌచిత్యవిచారమును సల్పుచు దోషనిరూపణ మొనరించెను. అర్థవిషయము, శబ్దవిషయము నను అనౌచిత్యము రెండువిధములు. అర్థవిషయమును అంతరంగ మందురు;

అయథాయథ్యముగ విభావానుభావ వ్యభిచారిభావముల వినియోగ మూలకమై అంతరంగా నౌచిత్యము రసభంగకారణమై చెలంగును. శబ్దవిషయమును బహిరంగ మందురు. ఇది విధేయావిమర్శము, ప్రక్రమ భేదము, క్రమభేదము, పౌనరుక్త్యము, వాచ్యావచనము నని ముఖ్య ముగ ఐదువిధములు. ఇందు మొదటిదోషమును విమర్శించుచు, సమా సము, వృత్తము, వృత్తులు, కాకువు, వాచికాభినయౌత్కృత్వములను రసాభివ్యక్తికి హేతువు లనియు, సమాససంస్పర్శ సంభవింపక పోవుటచే వైదర్భీరీతి ప్రశంసాపాత్ర మనియు మహిమభట్టు వచిం చెను. రెండవదోషమును వివరించుచు, ఏకరసప్రవృత్తియందు ప్రక్రమ భేదము ప్రతిపత్తృప్రతీతికి శూలమువోలె పరిస్ఖలనఖేదదాయకమై రసభంగమును గలిగించు ననియు, శబ్దార్థవ్యవహారమునందు విద్వాం సులు సర్వదా లౌకికక్రమము ననుసరింపవలయు ననియు హిత ముపదేశించెను. పిదప పౌనరుక్త్యమును నిరూపించుచు, అర్థభేద మున్నచో శబ్దసామ్యము దోషము గాదనియు, తాత్పర్యభేదము వలన నది భూషణమే కాని దూషణము గాదనియు రచించెను. ఈ సందర్భముననే అవకరభూయిష్ఠము, అక్షునైకపరాయణము నన సమాస విషయదోషము ద్వివిధ మనియు, కావుననే కవులకు సమాసము నికష ముగ వచింపబడె ననియు, ఈ అవకరోత్కరమును దిఙ్మాత్రము సూచించితి ననియు మహిమభట్టు పలికెను. స్వశబ్దవాచ్యతాదోషమే వాచ్యావచనాభిధ మనుటచే వాచ్యావచనదోషమునకును స్వశబ్దాభి ధానమునకును భేదము లేదు. 'అర్థమే సహృదయైకసంవేద్య మైన చమత్కారాతిరేకమును సంభవింపజేయును; కాని శబ్దము గాదు. కావున సౌందర్యాతిరేకనిష్పత్తికొరకై కవీంద్రుడు కావ్యక్రియా రంభము నొనరింపవలయునే కాని అలంకారనిష్పత్తికొరకు చేయ

రాదు. అలంకారత్వోపగమనము భంగిభణితిభేదవశాదనేకమై చెలంగును' అని మహిమభట్టు వచించెను. మరియు రసమును గురించి వ్యక్తివివేకకారుడు పలికిన వాక్యములగూడ మనము గమనింపవలయును. 'విభావాదులే రసాంగములు; అలంకారములు తద్వైచిత్ర్యోత్కర్ష వపుషములై, తదాశ్రయములై మెలంగును. కావున అప్రధానములైనవాని ఆధానోద్ధరణాదులను కవిచంద్రుడు చారుతాపేక్షాధీనమై స్వాయముగ కల్పింపవలెను. అందుచే నలంకారము లెన్ని యున్నను శక్తిమంతుడైన కవీశ్వరుడు కొన్నిటినిమాత్రమే ప్రయోగించును, సర్వాలంకారములలో ఉపమయే జీవితాయమాన మగుటచే. అది ప్రతీయమానవిశేషమునసే తద్విదుల కత్యానందమును గలిగించును.' ఇంక శ్లేషవిషయమున 'న్యాయసిద్ధమైన అర్థమునైనను మృదుమతుల సుఖప్రతిపత్తికొరకు వచనముచే ప్రతిపాదింపవలయు' ననియు, 'యుగపల్లాఘవమువలన నుభయార్థప్రయోగమునందు కవితిలకులు కామచారు' లనియు 'ఎచట ననిష్టప్రతీతి గల్గునో, అట్టి రచనను పరిత్యజింపవలయు' ననియు రచించెను. ఈ వాచ్యావచన సామర్థ్యమునసే అవాచ్యవచన దోషముగూడ సంగృహీత మని చదువరు లెరుంగవలయును. ఇటుల యథాయోగముగ దోషములు పంచవిధము లని నిరూపించి, స్వభావోక్త్యలంకారమును విమర్శించెను. 'స్వభావమాత్రోక్తియందు విశేష మించుకయు లేకుంటచే స్వభావోక్తి కలంకారత్వము నంగీకరింపవచ్చునా?' అని ప్రశ్నించి, దానికీ క్రిందిసమాధానము నొసంగెను. ఇది సామాన్యము, విశిష్టమునన రెండురూపముల గానవచ్చును. ఏది వికల్పైక గోచరమో అది సామాన్యము. ఇది సర్వశబ్దములవిషయమై పరికీర్తిత మగుటచే అభిధేయమై చెలంగును. దేనిరూపము ప్రత్యక్ష

గోచరమో అది విశిష్టము. ఇదియే ప్రతిభావంతు లైన సత్కవుల సూక్తుల గోచరించును. 'రసానుగుణశబ్దార్థచింతాస్తిమితచేతస్కుడైన కవిబ్రహ్మయొక్క క్షణస్వరూపస్పర్శోత్థ మైన ప్రజ్ఞయే ప్రతిభ' యనియు, 'త్రైకాల్యవర్తనములైన భావముల నీప్రతిభ సాక్షాత్కరింపజేయుటచే నిది భగవంతుని తృతీయచక్షువుగ వర్ణింపబడు' ననియు వ్యక్తివివేకకారుడు రచించెను. తత్ప్రోక్తికోశాఖ్యశాస్త్రము నందు ప్రతిభాతత్త్వమును తా నుపపాదించుటచే నిచట మరల వివరింపలే దని పలికి, ప్రతిభార్పితము లైన అర్థములు సాక్షాత్స్వరూపమువోలె భాసించుటవలన స్వభావోక్త్యర్థమును అలంకారముగ స్వీకరింపవచ్చు నని సిద్ధాంతము చేసెను.

తృతీయవిమర్శనమున ధ్వన్యాలోకమునందలి లక్ష్యముల నొకదానిపిదప వేరొకదానిని విమర్శించి, వాచ్యానుమేయార్థద్వయమునందు అనుమేయముననే ప్రతీతివిశ్రాంతి గాని వాచ్యమున గా దనియు, కావుననే సాధ్యసాధనభావగర్భ మూలమైలక్ష్యశ్లోకములు చెలంగు ననియు వచించెను. మరియు 'విభావాదులవలన రసాదులప్రతీతిగూడ అనుమానమునందే అంతర్భావమును బొందుట కర్హము. విభావానుభావ వ్యభిచారిప్రతీతియే రసాదిప్రతీతికి సాధనము. కారణకార్యసహకారిభూతములైన రత్యాదిభావములు అనుమాపకములై రసాదుల నిష్పాదించును. అవియే ప్రతీయమానములై ఆస్వాదపదవిని బొంది సజ్జనులచే రస మని పలుకబడును. ఇదియే అవశ్యంభావి యైన రసప్రతీతిక్రమము. కేవలముగ నాశుభావితము లగుటచే నది లక్షితము గాదు. దానిని అభివ్యక్తిగ భావించుట భ్రమయే' అని రససందర్భమున వ్యక్తివివేకకారుడు వివరించెను. ఇంతియే కాక, 'సాధువు, అసాధువు, అపశబ్దము నన శబ్దము త్రివిధము. అవిషయమునందు

ప్రయుజ్యమాన మైన శబ్దము అపశబ్దము. ప్రధానార్థవ్యపేక్షకొరకై శబ్దప్రయోగము కర్తవ్యము; శబ్దార్థోభయప్రధానమూలకమై శాస్త్రము త్రివిధము; సర్గబంధాదికావ్యము ఉభయప్రధానము; అది రసాత్మక మగుటవలన ఉభయౌచిత్యము ననుసరించి రసపరి పోషణమును గావింపవలయును; అనౌచిత్య నిబంధనమే అత్యం తము రసభంగకారణముగ కవులు వచింతురు. కావున అనౌచిత్య వ్యాధిని జొరనీయక రసనిధానము లైన కావ్యముల గాపాడవల యును.' అని వస్తుమాత్రాదుల గమ్యత్వమును ప్రతిపాదించి, వర్ణపద వాక్యసంఘటనాదుల గమకత్వమును ప్రతిపాదించెను. కడపట రసాదిధ్వనివిభేద మైన అలక్ష్యక్రమవ్యంగ్యమును, లక్ష్యక్రమవ్యం గ్యమునుగూడ గమ్యగమకభావాభ్యుపగంతవ్యము లని నిరూపించి, పదవాక్యకృత్తద్ధితసమాసోపసర్గనిపాతాదుల గమకతను ప్రతిపాదించి సర్వధ్వనిప్రపంచమును అనుమానాంతర్భావ మనుటయే శ్రేయ మని మహిమభట్టు సిద్ధాంత మొనరించెను.

ఈ సంగ్రహమును పరిశీలించినచో మనకు కొన్ని సంగతులు తెలియవచ్చును. ధ్వనిధ్వంసకారులలో మహిమభట్టారకు డత్యంత సమర్థు డనియు, ప్రాచీననైయాయికమతానుసారముగ వ్యక్తివివే కము రచింపబడె ననియు చదువరులు సులభముగ గ్రహింప గలరు. అనుమానమతస్థాపనముకొరకును, ధ్వనిపక్షనిరసనముకొరకును దర్పణచంద్రికలను చూడకయే స్వయముగ కీర్తి నార్జింపదలంచి, తానీఖండనగ్రంథమును రచించితి నని ప్రారంభముననే ప్రతిజ్ఞ జేసెను. ఈ ప్రతిజ్ఞావాక్యమువలనను, ఈ ప్రబలప్రయత్నముచేతను మహామహిమాన్వితుం డైన పండితశుండాల మీత డని ప్రకటిత మగుచున్నది. ఇతడు ప్రమాణశాస్త్రపారావారపారీణు డగుటచే

వాదప్రతివాదపంకమున కుత్తుకబంటిగా దిగబడి, పూర్వపక్ష సిద్ధాంతక్షారోదకముల తలమున్కలు వైచెనేకాని, వ్యంగ్యార్థామృతమును దనివిదీర గ్రోలి మైమరచి, సుఖించి, చదువరుల సుఖింపజేయుటకు శక్తుడు గాకయ్యెను. ఆనందవర్ధనము, సహృదోదయలాభహేతుకము లైన మహాగ్రంథగూఢాశయానవబోధ విజృంభణమే దీనికి గారణము. పూర్వాచార్యవర్యులు తనదెస జూపిన కృపారసాదులకు గృతజ్ఞత జూపగోరెనో యన, ఆచార్యాభినవగుప్తపాదుడు మొదలు మమ్మటాచార్యుడు వచ్చుదనుక కవితాసీమంతినీశిరోమణి 'చకితహరిణీనేత్రత్రిభాగము లైన తిర్యక్ప్రసారితేక్షణముల' క్షణక్షణము దిలకింపజొచ్చెనేకాని, 'దుగ్ధమహాబ్ధిఫేనపటలప్రఖ్యము లైన కటాక్షచ్ఛటల' పురోమార్గమున వీక్షింపలే దని సహృదయవతంసులు భావింపవలయును. ఈ మధ్యకాలమున అలంకారశాస్త్రము ప్రాచీనమతప్రాబల్యమును ప్రకటింపజొచ్చెనేకాని, నూతనమతాధిక్యమును బ్రకాశింపజేయలే దని విమర్శకు లెరుంగనగును. ఈ కారణముననే వక్రోక్తిజీవితమతమునకును, అనుమానమతమునకును ప్రసిద్ధిప్రఖ్యాతులు లభింపలేదు. ప్రతివాదిమతదౌర్బల్యమును నిరూపించి, వానిని నిరసించి ధ్వనిమతమును స్థాపించుటకొరకే నవీనాలంకారికులు లీ వక్రోక్తిజీవితవ్యక్తివివేకకారుల బేర్కొనజొచ్చిరి. కావున కుంతలాచార్యమహిమభట్టుల ప్రయత్నము లన్నియు గతజలసేతుబంధనము కైవడి నిష్ఫలము లయ్యెను. ఆనందవర్ధనభట్టనాయకకుంతలాచార్యుల మతముల ఖండించు సందర్భమున వ్యక్తివివేకకారుడు రచించిన వాక్యము లాతని మతవిషయముననే సార్థకము లయ్యె ననుటకన్న వేరుగ వచింప నవసరము గన్పట్టదు. ఆనందవర్ధనాచార్యుడు విధించిన ధ్వనిలక్షణశ్లోకమునందలి ద్వివచనప్రయోగమును భట్టనాయకుడు దూషించెను.

ఈ దూషణము గజనిమీలికమే. భట్టనాయకుని వికల్పాభి ధానము భ్రాంతిమూలమే కాని తత్త్వము గాదు; అవస్తునిర్బంధము వలనిఫల మేమి ? అని మహిమభట్టు నుడివెను. వ్యక్తివివేకకారుడు భట్టనాయకున కారోపించిన హస్తిమూర్ఖత్వమును విశ్వనాథుడు మహిమభట్టునకే సమన్వయించెను. తరువాత 'వక్రోక్తివైచిత్ర్యమే కావ్యజీవిత మని నిరూపించిన సహృదయమానివచనములు సమీచీన ములు గా' వని నిశ్చయించెను. మరియు 'వ్యంగ్యవ్యంజక భావము వలన ధ్వనివ్యపదేశము గల దనుట సర్వ సమంజసము. అవివక్షిత వాచ్యవివక్షితాన్యపరవాచ్యముల కెట్లు ధ్వనిప్రకారతోక్తి సయు క్తిక మగును ?' అని వచించెను. సమాసవిధమున బహుళగ్రహణ మనుసరించి చర్చించుచు, వ్యక్తివివేకకారుడు 'ప్రధానేతరభావ పరికల్పనప్రయాస మెందులకు ?' అని ప్రశ్నించి, 'అనభిధానమా లేక సమర్థగ్రహణమా ? కారణద్వయమే మా కిష్టము గాని బహుళ గ్రహణము గాదు' అని సంగ్రహశ్లోకముల రచించెను. పిదప 'అర్థవిషయము కవులదే కాని ఖండికోపాధ్యాయులది గా దని తదభిప్రాయానవగతు లుపేక్షింతురు. శుష్కశబ్దవ్యుత్పత్తిమాత్రోప జనితాభిమానదుర్విదగ్ధులు, వివిధాభిధానాధానోద్ధారులు అభిధేయ ప్రతీతివైచిత్ర్యవివేకకౌశలశాలీనులే కాని, వారు స్వప్నమునం దైన సాహిత్యసుధారసాస్వాదచమత్కారులు గారు. రసాభి వ్యక్తివిఘ్నభూత మైన అపరలక్షణము గల దని బహుతరా వకరప్రాయమును ప్రయోగింతురు. రసాస్వాదానుగుణప్రయోజనా వహితచేతసులైన కవులచేతనే దీనివిచార ముచితము; పరులవలన గాదు. ఇది మాచే మున్ముందు విస్తరముగ వివరింపబడును' అని వ్యక్తివివేకకారుడు వృత్తిగ్రంథమున వివరించెను. మరియు వివక్షితా ర్థైకవాచకత్వద్యోతకముగ వక్రోక్తిజీవితకారు డొసంగిన లక్ష్య

శ్లోకము విధేయావిమర్శదోషదూషిత మని విమర్శించుచు, వ్యక్తి వివేకకారు డీవిధమున విరచించెను : "న చాయ మర్థః కవే రభిప్రేతః; తథాహి, అసమాభియోగాభిముఖీభూతభగవత్సరస్వతీప్రసాదాసాదితాసామాన్యవైదుష్యాతిశయశాలిన మాత్మానం మన్యమానస్య కస్యచిత్కవే రితరమనీషిమాత్రసముచితేనాచరితేన లజ్జమానస్య మహతోపి తజ్జాతీయా నగణయతో నిజగుణగరిమోద్దానుదర్పకందూవినోదసుఖసమాశ్రయ మనురూప మపర మపశ్యతః సహృదయచూడామణిమానినో విమనసః సమానధర్మాణ మప్రకృత మేవాంబికాకేసరిణం పురస్కృత్య స్వాభిప్రాయావిష్కరణ మేతత్......" అంతట నత డీలక్ష్యశ్లోకమునకు పాఠాంతరమును గల్పించి, పూర్వోక్తదోషత్రయావకాశము ప్రతివిహిత మయ్యె నని వచించెను. తరువాత విమర్శనమును విరమించుచు, 'కావ్యకాంచనకషాశ్మమానియైన కుంతకుడు సర్వనిరవద్య మని నిజకావ్యలక్ష్మమున నుదాహరించినశ్లోకము నాచే నిటుల నిదర్శిత మయ్యె'నని, సర్వోత్కర్షశాలితాప్రకటనార్థమై స్వపరిశ్రమమును సంగ్రహశ్లోకమున పిండీకృతము గావించెను. ఈ విధముననే ప్రాచీనాలంకారికమతములు శుక్తిరజతప్రతీతివోలె భ్రాంతిమాత్రము లని ఖండించి, పూర్వకవిశ్లోకములు దోషభూయిష్ఠము లని విమర్శించి, వానికి పాఠాంతరముల గల్పించి, వ్యాఖ్యాతలు అలీకవిద్వన్మాను లగుట కావ్యాత్మతత్త్వవిదులు గా రని వారి నధిక్షేపించి, అనుమానాంతర్భావాభ్యుపగమమై ధ్వనిప్రకారము లన్నియు దనరారు నని వ్యక్తివివేకమున నతడు సిద్ధాంత మొనరించెను. మహిమభట్టారకుని మతమునం గల లోపముల నెల్ల వ్యక్తివివేకవ్యాఖ్యానమున రాజానకరుయ్యకుడు నిరూపించి, ధ్వనిమతసంస్థాపనమున కాతఁ డొనరించిన ప్రయత్నము లత్యంత ప్రశంసనీయములు.

# కావ్యాత్మ

## నవీనమతములు

---

### ౫. రసాలంకారమతసమ్మేళనము

(అగ్నిపురాణము - సరస్వతీకంఠాభరణము)

అగ్నిపురాణమునగల అలంకారభాగమును పరిశీలించినచో నది పురాతనచ్ఛాయ ననుసరించినను, ప్రాచీనమతములకన్న భిన్నముగ నున్న దని మనకు తెలియవచ్చును. అగ్నిపురాణవిభాగమున కామోదించి, దీని నాదరించినవారు నవీనులలోఁగూడ గలరు. భోజదేవుని సరస్వతీకంఠాభరణ మిందులకు దృష్టాంతము. సందిగ్ధప్రమాణమైన అగ్నిపురాణము సర్వశాస్త్రసారసంకీర్ణగ్రంథము. విభాగసూత్రవివేచనము గాని, విమర్శనజ్ఞానవిచక్షణము గాని వీసమేనియు లేక, కంఠస్థములు, శ్రుతపూర్వములు నైన లక్షణముల నన్నిటిని సంగ్రహించి సంకలన మొనరించినదే కాని ప్రత్యేకముగ నొకమతము నాధారముగ నైకొని రచించినది గా దని దీనిలోని అలంకారవిభాగమే చదువరుల కెరుకపరచును. ఈపురాణమున గానవచ్చు ప్రాచీనాచార్యశ్లోకజాలమే దీనికి నిదర్శనము.

అగ్నిపురాణసరస్వతీకంఠాభరణములలోని అలంకారపరిచ్ఛేదమును పర్యాలోచన మొనరించినచో, వీని ముఖ్యలక్షణములకు సారూప్యసాదృశ్యసంబంధములు గల వని తేటపడును. ప్రాచీనా

లంకారికులపగిది 'ధ్వనిని ఆక్షేపాలంకారమున శబ్దమాత్రముగ ప్రసంగించినను, ధ్వనిప్రశంసాభావమే అగ్నిపురాణమునందలి విశేషాంశమై కానవచ్చును. గ్రంథప్రారంభశ్లోకమున భోజుడు ధ్వనిపదమును ప్రయోగించెను. ధ్వని, వర్ణము, పదము, వాక్యమునన వాఙ్మయము చతుష్టయ మని రచించెను. ఇందలి ధ్వనిపదము వాక్యపదీయము నందు వచింపబడినట్లు వైయాకరణమతానుసారముగ స్ఫోటశబ్దమునకు పర్యాయవాచకమేకాని వేరొండు గాదు. ఆలంకారికు లంగీకరించి నట్టియు, వైయాకరణులు పరిగ్రహించినట్టియు అభిధాలక్షణలను గూడ సరస్వతీకంఠాభరణము సమ్మతించెను. భరత, భామహ, దండ్యాచార్యుల శ్లోకముల కొన్నిటి నూతగా గొని తానుగూడ మరికొన్నిటి రచించి, వీని నన్నింటిని గుదిగ్రుచ్చి పాఠకుల మేలు కొరకు లక్ష్యలక్షణసమన్వితముగ శాస్త్రసంపుట మొకదానిని వ్రాయుటచే భోజదేవుడు రసాలంకారమతసమ్మేళనమొనరించెనే కాని నూతనమతమును స్థాపనచేయలే దని మనము గురుతింపవలయును.

'వాగ్వైదగ్ధ్యప్రధానము కావ్య మైనను రసమేసుమా దాని జీవితము' అని అగ్నిపురాణము పేర్కొనుటవలనను, భరతమతాను సారముగ రసభావాదులనుగురించి విపులముగ వివరించుటచేతను, పురాణ కారునకు మునిమతమునం దాదరము గల దనుట కాధార మున్నది. 'రసమేసుమా కావ్యజీవిత' మను శ్లోకమును విశ్వనాథకవిరాజు ప్రమాణముగ నంగీకరించి, తాను రసమతోద్ధరణమునకై సాహిత్య దర్పణము రచించనోపును. ఇంతమాత్రముననే అగ్నిపురాణము ప్రత్యేకమతమును ప్రతిపాదించెనని కాని, పూర్వమత మొకదానిని బ్రోది చేసె నని కాని చెప్పుటకు సాహసింపలేము. ఇంక రసప్రతీతి విషయమున నీపురాణ మపూర్వపథము ననుగమించెను. దీనగల విశే

పాంశ మిదియే. 'ఆనందమువలన అహంకార ముదయించును అహంకారము అభిమానమును గలిగించును. అభిమానమే రతికి గారణము. ఈరతిమూలమున శృంగారహాస్యరసములకు ప్రతీతి గల్గును. మిగిలినరసములు వీనివలననే పుట్టును.' అని అగ్నిపురాణము వచించెను. భరతునివలెనే అగ్నిపురాణకారుడుగూడ రసచతుష్టయమును సమ్మతించెను. ఈనాలుగురసములవలన దక్కిన అయిదురసములును జనించును. ఇటుల రసాభిమానము జూపించి నను, అగ్నిపురాణమును కేవలముగ రసమతానుకూలగ్రంథముగ గ్రహింపరాదు. ఏల నన, ఈపురాణము రీతిగుణాలంకారములకుగూడ ప్రత్యేకత నంగీకరించెనే కాని వానిని రసమున కన్వయించి ప్రధానేతరములుగ భావింపలేదు. ఇచట మన మొకసంగతిని గమనింపవలయును. శాంతముగూడ సమ్మతించి నవరసము లని నిశ్చయించినను, అగ్నిపురాణము శృంగారమునకే ప్రధానస్థానము నొసంగి దానినే బహుళముగ ప్రశంసించెను. మునీంద్రునికిగల కగ్గలమగుదు మన్న భయకారణముననో, పురాణవచనములు ప్రబలప్రమాణము లన్నభక్తికతముననో రాజచూడామణి యైన భోజదేవుడు శృంగారమే సర్వాతిశాయిమనోహరరసముగ స్వీకరించి, సరస్వతీకంఠాభరణశృంగారప్రకాశికలలో దానిమాహాత్మ్యమును, ప్రాశస్త్యమును వర్ణించెను. ఈ కవిరాజకృత మైన గ్రంథద్వితయనామ మీతని రసాదరమును, అలంకారాభిమానమును విశద మొనరించును.

రీతిగుణములగురించి అగ్నిపురాణమునందు వివరింపబడినను, దీనిలోని వివరణము ప్రాచీను లైన దండివామనుల లక్షణానుకూలముగ లేదు. దండిమతమున రీతి రెండుతెరంగులు. వీని నతడు వైదర్భమార్గము, గౌడవర్త్మము నని పేర్కొనెను. ఈ రెంటికిని మధ్యస్థ

మైన పాంచాలీరీతిని వామనుడు జేర్చెను. కొన్ని గుణముల కలిమిలేముల ననుసరించి రీతివిభాగము తెలంగునని దండివామనులమతము. ఈవిభాగమునకు లాటీరీతి నొకదానిని రుద్రటాచార్యుడు గూర్చెను. సమాసరచనాభేదముపై నాధారపడి రీతి మెలంగునని రుద్రటునిముఖ్యాశయము. అగ్నిపురాణ మీరీతిచతుష్టయమును సమ్మతించెను. లఘుమధ్యాయత సమాసరచనావిభేదాశ్రయమాత్రమే కాక, మాధుర్యౌదార్యసౌకుమార్యాదిగుణగణసంయుతమును, ఉపచారప్రధానతాప్రధానమూలకముగను నది వెలుంగునని పురాణకారుని మతము. గుణములు వైదర్భమార్గమునకును, విపర్యయములు గౌడవర్త్మమునకును ప్రాణము లని దండ్యాచార్యుడును, గుణాత్మకమైనవిశిష్టపదరచనయే రీతియని వామనాచార్యుడును పలికి, కావ్యశోభాకరధర్మము లలంకారము లని దండియు, సౌందర్య మలంకార మనియు, గుణనిర్వృత్తిచే గల్గిన కావ్యశోభ కలంకారము లతిశయహేతువు లనియు వామనుడును వచించుటవలన వీ రిరువురును గుణాలంకారవిభేదము నంగీకరించి రని. మనము గుణరీతిమతముల విచారసమయముననే తెలుసుకొంటిమి. ఇంక అగ్నిపురాణ 'మన్ననో, గుణరీతులకుగల పరస్పరసంబంధమును బాటించక, 'యః కావ్యే మహతీం ఛాయా మనుగృహ్ణాత్యసౌ గుణః' అనియు, 'కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే' అనియు రచించుటవలన ప్రాచీనులతోగల గుణాలంకార విచక్షణము పురాణకారునియందు లే దని చదువరు లెరుంగవలయును. మరియు పురాణమునందలి అలంకారలక్షణము దండ్యాచార్యుని శ్లోకార్థమే గాని వేరొండు గాదు. ఈశ్లోకము నుదాహరించి 'కావ్యశోభాకరము లనుటచేత, శ్లేషోపమాదులవలెనే గుణ, రస, భావ, తదాభాస, ప్రసాదాదులుగూడ స్వీకరింపవలయు' నని భోజుడు రచిం

చెను. ఇది దండిశ్లోకమునకు భోజునివ్యాఖ్యానముకైవడి గాన వచ్చును. కావ్యాదర్శమునందలి నలువదియొక్క కారికలను, నూటఅరువదినాలుగు ఉదాహరణములను గైకొని భోజదేవుడు సరస్వతీకంఠాభరణమున నుపయోగించినకారణమున కావ్యాదర్శమునకు విస్తరగ్రంథముగ కంఠాభరణము వెలంసె నని కొందరందురు. దీనివలన అగ్నిపురాణ, సరస్వతీకంఠాభరణములు రెండును ప్రాచీనాలంకారికమతసంగ్రహమును, పూర్వాచార్యగ్రంథశ్లోకకదంబము నై భాసించుచున్న వని వేరుగ వచింప నక్కరలేదు. ఇచట గుణవిభాగమున మన కొక విశేషము గానవచ్చును. సామాన్యముగ నిది శబ్దగుణము, అర్థగుణము నని వామన మతానుసారముగ రూపింపబడును ఇంక అగ్నిపురాణ మీగుణనిరూపణమున సూక్ష్మసూక్ష్మతర భేదముల గమనింప జొచ్చెను. ఇందలిగుణములు వైశేషికములు, సామాన్యములు నని విభజింపబడెను. శబ్దసన్నివేశచారుత్వము, లేక సమాసరచనాసౌందర్యమునకు సంబంధించి వైశేషికగుణము లుండును. దాని ప్రత్యేకాంగములకు సంబంధించి సామాన్యగుణములు వెలువారును. ఈసామాన్యగుణములు శబ్దము, అర్థము, శబ్దార్థము నని మూడువిధములు. ఇటుల విభాగత్రయము నాదరించినగ్రంథములలో అగ్నిపురాణమే మొదటిది. ఇందలివిభాగము వెనుకటిదానికన్న విభిన్నముగ నున్నది. శ్లేషము, లాలిత్యము, గాంభీర్యము, సౌకుమార్యము, ఉదారత, సత్వయౌగికము లన శబ్దగుణములును, మాధుర్యము, సంవిధానము, కోమలత్వము, ఉదారత, ప్రౌఢి, సామయికము లన అర్థగుణములును, ప్రసాదము, సౌభాగ్యము, యథాసంఖ్యము, ప్రశస్తత, పాకము రాగము లన శబ్దార్థగుణములును విభజింపబడెను. ఈ గుణముల

లక్షణము స్పష్టముగ నిరూపితము గాలేదు. మరియు నితరులచే నలంకారములుగ నంగీకరింపబడిన సంవిధానము, యథాసంఖ్యము నీపురాణమున గుణములుగ వచింపబడెను.

ఈ విధముననే రసాలంకారమతముల ప్రభావమునకు అగ్ని పురాణము లోబడె నని నిదర్శనముల నెన్నిటినో చూపవచ్చును. శబ్దాలంకారవిభాగమునందు అగ్నిపురాణము కావ్యాదర్శము ననుసరించినట్లు గన్పట్టుచున్నను, అర్థాలంకారనిరూపణమున స్వల్ప భేదములు గానబడుచున్నవి. స్వరూపము, లేక స్వభావము, సాదృశ్యము, ఉత్ప్రేక్ష, అతిశయము, విభావన, విరోధము, హేతువు, సమము నన అర్థాలంకారము లెనిమిదివిధములు. ఉపమా, రూపక, సహోక్తి, అర్థాంతరన్యాసములు సాదృశ్యాలంకారవిభాగములుగ వచింపబడెను. మరియు ఉపమాభేదములు పదునెనిమిది గల వనుటవలన దండ్యాచార్యుల ఉపమావర్గమునందలి విభేదములు చాలవర కిందు జేర్పబడినవి. ఉభయగుణముల నాదరించినట్లే ఉభయాలంకారముల నంగీకరించుటలోగూడ అగ్నిపురాణమే ప్రథమగ్రంథము. ప్రశస్తి, కాంతి, ఔచిత్యము, సంక్షేపము, యావదర్థత, అభివ్యక్తు లన శబ్దార్థోభయాలంకారము లారు ప్రకారములు. ఈ అలంకారములలో గొన్నిటి నితరులు గుణములుగ గ్రహించిరి. కావున పురాణములోని గుణాలంకారవిభేదమును బరికించినచో నీవిభాగము పురాణమే కాని నవీనము గా దనియు, గుణరీతిమతముల విలక్షణవిచక్షణమును వీక్షించినచో నీవిభాగము విమర్శనవివేకశూన్యమే కాని సహృదయావర్జకము గాదనియు చదువరులకు దోచకమానదు. ఇటుల పరిశీలించినచో అగ్నిపురాణము సర్వాలంకారమతసారసంగ్రహము, పూర్వాచార్యవర్యపద్యరత్నభాండాగారమునై విలసిల్లుచున్న దని మనకు విశదము

గాకపోదు. 'ఇష్టార్థవ్యవచ్ఛిన్న పదావళియే' కావ్యశరీర మని దండ్యా చార్యుడు విధించినలక్షణమును సమగ్రముగ సంగ్రహించి, 'స్ఫుర దలంకారము, గుణసముపేతము, దోషవర్జితము' అను విశేషణత్రయ మును పురాణకారుడు జేర్చెను. ఈవిశేషణములవలన నీసమేనియు విశేషార్థము లభింపదు. గుణాలంకారముల లక్షణముగూడ నీరీతినే చెలంగుచున్నది. కావుననే దీని నొక ప్రాచీనమతసమ్మేళనగ్రంథముగ నైకొనవలసివచ్చెను. దీనికి దోడుగ అగ్నిపురాణమున గొన్ని నూత నాంశములుగూడ గానవగును. గుణాలంకారలక్షణక్రమములలో ప్రాచీనులకును, పురాణకర్తకును చాల భేదము గలదు. ఈ భేదభావ ముల కేమికారణ మని చదువరులకు సందియ ముదయించును. ఈ ప్రశ్నవిషయమున మన మొక సమాధానము నూహింపనగును. అగ్ని పురాణమునగల నూతనాంశములకు మాతృకగా నున్న ప్రాచీన మత మొకటి పురాణకారునికాలమున ప్రచారమున నుండనోపును. దాని ననుసరించి గుణాలంకారములకు దాను లక్షణమును, క్రమమును నిర్మించియుండవచ్చును. ఆమూలగ్రంథము కాలవశమున ఖిల మైయుండును.

అగ్నిపురాణమార్గము ననుసరించి భోజదేవుడు సరస్వతీకంఠా భరణమును రచించుటవలన దీనిలో గానవచ్చు రసమతపురస్కార ధ్వనిమతతిరస్కారములకు చదువరు లాశ్చర్యచకితులు గా నక్కర లేదు. మరియు కంఠాభరణమునందలి గుణాలంకారవిభాగవిశేష రంజకతామూల్యతలు పాఠకమహాశయులకు భ్రాంతి నాపాదింప జాలవు. మొదటినుండియు తుదిదనుక భరతుడు, దండి మొదలైన వారలను భోజదేవు డత్యంతగౌరవాదరముల సమ్మానించెను. కావ్యా దర్శమునందలి కారికలను, లక్ష్యములను భోజుడు విరివిగ నైకొనె

నని మన మీవరలో నెఱింగితిమి. భామహ, వామన, రుద్రట, ధనికాది చిరంతనాచార్యుల శ్లోకరత్నముల నెన్నిటినో సేకరించి రాజదేవుడు సరస్వతీకంఠాభరణమును రచించెను. ఇంతియేకాక ధ్వనిమతమును నిరాదరించినను రాజచూడామణి ధ్వన్యాలోకమునందలి కారికల నాదరించినకతమున అపూర్వప్రాశస్త్యమును, అత్యంతానర్ఘ్యతను కంఠాభరణమునకు సంపాదించెను. ఈగ్రంథము అగ్నిపురాణమున కను కరణమును, కావ్యాదర్శమునకు విస్తరమును నైయున్నది. కావున కంఠాభరణమునందుగూడ ప్రాచీనమతముల సంగ్రహమును, పూర్వాచార్యుల శ్లోకసంకలనమును గానసగును. అందుచే నిది శబ్దకోశాదుల వలెనే విద్యాధికులకును, విద్యార్థులకును ప్రయోజనకారియై చెలువారుచున్నది. ఈ పురాణకంఠాభరణములఛాయ ననుసరించి వాగ్భటద్వయము అలంకారసంగ్రహముల రచించిరి. ముఖ్యాంశముల గొన్నిటిని భోజదేవుడు అగ్నిపురాణమునుండి గ్రహించెను. "యే వ్యుత్పత్త్యాదినా శబ్ద మలంకర్తు మిహ క్షమాః, శబ్దాలంకార మాహుః తాన్ కావ్యమీమాంసకోవిదాః" అని శబ్దాలంకారలక్షణమును అగ్నిపురాణకారుడు విధించెను. ఈలక్షణమే స్వల్పశబ్దపరివర్తనముతో "శబ్దాలంకారసంజ్ఞాః తే జ్ఞేయా జాత్యాదయో బుధైః" అని కంఠాభరణమున గానవచ్చుచున్నది. ఇటువంటి పదసామ్యమును గల్గిన శ్లోకార్థములను, శ్లోకములను వలసినన్నిటిని జూపవచ్చును. అగ్ని 342-21, భో 2-3; అ 342-10 భో 2-4; అ 334-11 భో 4-3 మొదలైన చాలచోటుల సాదృశ్య మున్నది. ఈ శబ్దసామ్యమును, భావైక్యమును సమర్థించు టెట్లని సందియ ముదయింపవచ్చును. ఈ సందర్భమున కవికులకల్పకమును, సహృదయహృదయసత్కార భాజనము నై వెలింగి మహాకవిచంద్రుడైన రాజేంద్రునకు గళంక

కారణమై చెలంగు గ్రంథచౌర్యదోష మాపాదించుటకన్న, రసాలంకార సమ్మేళనాకలిత మైన ప్రాచీనాచార్యగ్రంథమాత్మక కీపురాణకంఠాభరణములు కవలపిల్ల లని మనము సమ్మతించుటయే సమంజసము. భోజదేవుడు నవీను డైనను, కాశ్మీరాలంకారికుల సంప్రదాయములకన్న భిన్నముగ నీతని కంఠాభరణము రచింపబడె నని విమర్శకులకు దోచకపోదు. ఇంతమాత్రమున కాశ్మీరకుల భావము లిందు లేవని తలంపరాదు. కొన్నిపట్టుల కాశ్మీరకుల సూక్తిరత్నములుగూడ కంఠాభరణమున గూర్పబడి సరస్వతీదేవికి సౌందర్యసంపాదకము, సహృదయచూడామణులకు నయనానందసంధాయకము నై మురువు గురియుచున్నది. కావుననే కంఠాభరణమును రసాలంకారమతసమ్మేళనగ్రంథముగ గ్రహించుటయే మేలు.

నిర్దోషము, గుణవంతము, అలంకృతము నై కావ్యము చెలంగు నను అగ్నిపురాణలక్షణమునకు రసాన్విత మను విశేషణమునుగూడ జేర్చి భోజుడు కావ్యలక్షణమును విధించెను. ఈలక్షణము సర్వలక్షణసంపన్నమై యున్నను విమర్శనవిరహిత మగుటచే విలక్షణముగా నున్న దనుటకు వీలు లేదు. తాను విధించినలక్షణానుసారముగ భోజుడు మొదటిపరిచ్ఛేదమున దోషములను, గుణములను నిరూపించి, తరువాత మూడుపరిచ్ఛేదములలో క్రమముగ శబ్దార్థోభయాలంకారనిర్ణయ మొనరించి, కడపటి పంచమపరిచ్ఛేదమున రసవిచారమును సల్పెను. 'ఎచట పరంపరచే విభావాదిపర్యవసానము గలుగదో, అది కావ్యము గాదు' అను కాశ్మీరికుల సంప్రదాయమును సమ్మతించినకారణమునగాబోలును, కావ్యము రసాన్విత మనియు, రసోక్తియే వాఙ్మయమున సర్వగ్రాహక

మనియు కవిరాజచూడామణి కంఠాభరణమున లక్షణమును రచించెను. కావున రసోక్తియే కావ్యమున ప్రధానాంశ మని భోజ దేవుని ముఖ్యాశయముగ మనము భావింపవలయును. ఇటుల రసప్రభా వమున కీతడు వశు డైనను, రసరమణీసౌందర్యసర్వస్వమును సమ గ్రముగ సంవర్ణించి, గుణాలంకారములు రసాంగములే కాని వేరొండు గా వని నిశ్చయించుటకు జాలిన విమర్శనవివేకమును వెలి పెట్టలేదు. ఉత్పత్తివాదుల రససమాలోచనమున కీతని రసవిచారము సాటివచ్చును. దండ్యాదులుగూడ నిటుల రసపర్యాలోచన మొన రించి రని అభినవగుప్తుడు వచించెను. సదలంకారవికల్పకల్పనలచే నిరంతరవిహితప్రణయమై మెలంగుచున్నను, గుణగణోపేతమై చెలంగి నచో కావ్యరూపము మదవతీమణిమాడ్కి మానసము నాకర్షించు నని భోజదేవుడు పొగడెను. దీనికి దోషముగా జనదయితము, నియతాలంకారభూషితము నైనను, గుణగణరహిత మైనచో జవ్వ నముసడలిన పడతివశువున కావ్యము విడువబడు నను భావమునుగూడ వెలిపుచ్చెను. ఈశ్లోకము వామనునివృత్తిగ్రంథములోని దగుటచే ప్రాచీనాచార్యుల వాక్యములపై భోజునకు గల గౌరవమును సూచించు శ్లోకముగనో, లేక ఒకానొకముఖ్యాంశమును నొక్కి వక్కాణించుటకై పేర్కొనిన ప్రమాణశ్లోకముగనో దీనిని చదు వరులు దలంపవలయును. లేనిచో నిది విమర్శనపద్ధతుల దూర మొనరించి, సర్వాలంకారగ్రంథకదంబముగ కంఠాభరణమును భోజుడు రచించె నని ధ్రువపరచుటకు ప్రబలనిదర్శన మని భావించు టకు పనికివచ్చును. ఇటుల గానిచో రసవిచారమునను, అలంకార విషయమునను భోజుడు నుడివినపలుకులను దీనితో సమన్వయించుటకు వీలు లేదు. ఈ రీతిని పరస్పరవిరుద్ధభావములతో గుమిగూడినకత

మనసే కంఠాభరణమును రసాలంకారసమ్మేళనమత గ్రంథముగః గ్రహించితిమి.

ఆనందవర్ధన, అభినవగుప్తపాదాదుల రసాభినివేశమును గమనించి కాబోలును, భోజదేవుడు రసాభిమానమును ప్రకటించినను, మన మీత నిని కేవలముగ రసమతానుయాయిగగాని, రసమతసమాలోచనానుసారిగగాని భావించుటకు ప్రబలాధారములు గానరావు. ప్రాచీనుల శృంగారాద్యష్టరసములకును, రుద్రటాచార్యుని ప్రేయమునకును దోడుగ శాంతమునుగూడ జేర్చి పదిరసముల నీత డంగీకరించెను. రసవిచారమునం దితడు పురాణకారుని ఛాయ ననుసరించి, శృంగారమునకే ప్రాధాన్యమును సమ్మతించెను. భోజుని శృంగారప్రకాశగ్రంథ మిందు లకు ప్రత్యక్షదృష్టాంత మని వేరుగ వచింప నక్కర లేకయే చదువరు లెరుంగగలరు. ఇంక గుణవిచక్షణమున భోజుడు పురాణకారుని నిరూపణమున కొక క్రొత్తసొంపు సంపాదించెను. శబ్దము ననుసరించి బాహ్యగుణములుగను, అర్థము నాదరించి ఆభ్యంతరగుణములుగను విభజింపబడెను. వీనికి దోడుగ వైశేషికగుణములుగూడ గలవు. స్థూల దృష్టికి దోషము లైనను, సూక్ష్మదృష్టి బరిశీలించినచో నేవి గుణములుగ బెంపొందునో, వానిని వైశేషికగుణము లని భోజుడు వివరించెను. ఈ గుణముల సంఖ్యావిభేదములు క్రమముగ నతిశయించెను. భోజునిమతమున శబ్దగుణములు ఇరువదినాలుగును, అర్థగుణములు ఇరువదినాలుగును గలవు. సంఖ్యతోపాటు పేరులుగూడ సమానముగనే యున్నవి. గుణములకు లక్షణమును విధించునపు డితడుగూడ పురాణకారునివలెనే విమర్శనవిభేదము నంతగా బాటింపలేదు. కావుననే కొన్ని గుణములలక్షణము లితరుల అలంకారలక్షణములతో దులదూగుచున్నవి. ఇచట నొకవిశేషము గానవచ్చును. వామనాచార్యునివలెనే

భోజుడు 'దీప్తరసత్వమే అర్థగుణకాంతి' యని పలుకుటచే నందు రస ప్రాచుర్యము సంభవించెను. మరియు 'ధ్వనిసంబద్ధమే గాంభీర్య'మని వచించుటచే నందు ధ్వనిప్రభావము గానవచ్చును. వీనివలన భోజుడు పరమతధ్వనిమతముల కపరిచితుడుగాడని మనకు దెలియుచున్నది. కావున భోజదేవుడు రసలోలు డైనట్లు ధ్వనిపరవశుడు గాలే దని మాత్రము మనము గ్రహింపవలెను. ఈ యంశమును శృంగారప్రకాశిక ప్రకటించుచున్నది. అగ్నిపురాణములోని రీతిచతుష్టయమునకు అవంతికా మాగధీద్వితయమును జేర్చి, భోజుడు రీతిషట్కమును విధించి నను వామనునికైవడి 'రీతిరేవ కావ్యాత్మ'గ నితడు శిరసావహించ లేదు. వైదర్భీపాంచాలీరీతులకు మధ్యస్థమై ఆవంతికారీతి చెలంగును. ఇక ఖండరీతిగ మాగధి పాటింపబడును. పైమార్పులతో పాటు, ఉపమాదోషములుగ సామాన్యముగ రూపింపబడు అధికత్వహీనత్వ ములుగూడ దోషప్రకరణముననే చర్చింపబడెను. అలంకారవిచార మునగూడ అగ్నిపురాణకారునిపగిదినే కంఠాభరణకర్త విభాగ త్రయము నంగీకరించెను. ఇటుల శబ్దార్థోభయాలంకారము లను విభాగత్రయమును సమ్మతించుట కీతడే ప్రథముడు. స్తనశల్యపరీక్ష సలుపుట మానితిమేని, సరస్వతీకంఠాభరణమునంగల అలంకారవిచా రము విపులముగ నున్న దని భావింపవచ్చును. అప్పుడప్పుడు భోజ దేవుడు అపూర్వాలంకారములగూడ నిర్మించి సరస్వతీదేవికి కాను కగ నర్పించెను. జైమినిప్రమాణముల నితడలంకారములుగ స్వీకరిం చుటయే దీనికి నిదర్శనము. ఇతనిమతమున నిరువదినాలుగుశబ్దాలం కారములు గలవు. దండిరుద్రటాచార్యపురాణకారుల మార్గముల విశాలముగ నొనరించి, శబ్దాలంకారములసంఖ్య నితడు పెంపొం దించెను. అర్థాలంకారములసంఖ్య నేలనో? కాని త్రుంచి దానినిగూడ

శబ్దాలంకారసంఖ్యతో వియ్య మందించెను. ఇటుల సంఖ్యాతౌల్య మునకు లోలుడై కాబోలు, కంఠాభరణకారుడు ఉభయాలంకారవర్గ మునకును శబ్దాలంకారసంఖ్యకును నెయ్యముం దియ్యముం గూర్చి పెట్టెను. ఈఉభయాలంకారప్రకరణమునం దపూర్వనిర్మాణమై పుణ్యము గానవచ్చును. ఉపమారూపకోత్ప్రేక్షాదీపకాతిశయోక్త్యాద్యర్థాలంకారము లిందు బొందుపరుపబడెను. మమ్మటాచార్యుడు కంఠాభరణాలంకారవిభాగత్రయము నొదల నిరించినను శబ్దార్థసమానప్రాధాన్యముం గల్గిన పునరుక్తవదాభాసాదిస్వల్పసంఖ్యనుమాత్రమే ఉభయ వర్గమున జేర్చెను.

ఇటుల వెదకి చూచినను విమర్శనవివేకము గానరాని క్రొత్త త్రోతల కలగలపుతో, చిక్కజీరుగా గుదిగ్రుచ్చబడిన సూక్తిముక్తా మణులతో వింతతళుకుల వెదజల్లజాలు కంఠాభరణమును నిర్మించి భోజదేవుడు సరస్వతీసతి కలంకారముగ సమర్పించి, స్వకీయరసాభిమానమును స్వీయాలంకారగౌరవమును బ్రకటించి మహాకవియు, రాజదేవుడును నై ప్రఖ్యాతి గాంచెను. ఈగ్రంథమునందు రసాలంకారమత సమ్మేళనమే కాని ప్రత్యేకమతస్థాపనము లేదు. కావున దీని నొక మూలగ్రంథముగ గాక కేవల సంగ్రహగ్రంథముగనే చదువరులు దలంపవలయును. అందుచే నిది ప్రాచీనలక్ష్యలక్షణకదంబముగ విశేషవిఖ్యాతి వహించెను. భోజదేవునియం దెంత గౌరవాదరము లున్నను, తమముఖ్యాశయముల సమర్థించు సమయమునమాత్రమే నవీనులు కంఠాభరణమును బ్రమాణముగ నుదాహరింతురేకాని, దీనిని నాత్మకగ సమ్మానించి తమతమగ్రంథముల రచింపరైరి. ఈ కారణమున నీ రసాలంకారమతసమ్మేళనము సర్వజనాంగీకారమును బొంద సమర్థము గాదయ్యెను.

---

# కావ్యాత్మ

## నవీనమతములు

---

### నవ్యమతము

(ధ్వనిమతస్థాపనము)

ఇంతదనుక రచింపబడిన అలంకారశాస్త్రాభ్యుదయమును మన మొకపరి పరిశీలించినచో, కాలక్రమమున గొన్నిమతములు పుట్టి పెంపొందుటయు, మరికొన్ని క్రొత్తమతముల రాపిడివలన ప్రాతమతములు తమంత దాము నిలువజాలక నవీనమతములకు దావొసఁగుటయు, లేదా నూతనమతములలో గలసిపోవుటయు, తుదకు ధ్వనిమతము సర్వంసహాధిపత్యము వహించుటయు చదువరులకు గోచరింపకమానదు. అలంకారశాస్త్రచరిత్రము కాలగర్భమున లీన మగుటచే, దీనితొలికాంతులు విమర్శకులకు దృగ్గోచరము గాలేదు. భరతుని తోడ నీశాస్త్రమునకు ఉషఃకాలము ప్రాప్తించి, భామహుడు మొదలు వామనునివనుక అరుణోదయముగ దీపించి, ఆనందవర్ధన, అభినవగుప్తపాదులపర్యంతము సూర్యోదయముగ బ్రకాశించెను. ఉషఃకాల మాదిగ మహోదయమధ్యకాలమున రసాలంకారగుణరీతిధ్వనిమతములు జనించి ప్రచార మొనరింపజొచ్చెను. ఇదియే సారవంతము, ప్రౌఢిమసంయుతము నైన వయఃకాలము. కావుననే కాలగర్భమునందుండి భామహ, ఉద్భట, రుద్రట, లొల్లట, శంకుక, భట్టనాయక,

దండి, వామన, ఆనందవర్ధన, అభినవగుప్తపాద, కుంతల, మహిమభట్ట, భోజదేవు లుదయించిరి. వీ రందరును యథోచితముగ శాస్త్రాభ్యుదయమునకు దోడ్పడిరి. ఇట్టిసందిగ్ధసమయమున మమ్మటాచార్యుడు జన్మించి నానాముఖముల ప్రవించుచున్న అలంకారశాస్త్రకల్లోలినీప్రవాహమును స్వప్రతిభావిశేషమున నేకముఖము గావించి, ధ్వనిమతసంస్థాపన మొనరించి, వాగ్దేవతావతారు డన ప్రఖ్యాతి వహించెను.

అలంకారశాస్త్రాభ్యుదయమునం గల వివిధమతముల విభేదమును విమర్శించినచో స్థూలదృష్టి కీచందమున గానవచ్చును. రసమతము నాట్యశాస్త్రమును ప్రధానముగ గైకొని రూపకలక్షణమును విధించెను. విభావానుభావవ్యభిచారిసంయోగమున రసము జెలంగుననుటచే రసవిచార మాభ్యంతరపరామర్శపూర్వకమై చెలువొందెను. ఈ నాట్యరసము కాలక్రమమున కావ్యరసముగ పరిణమించెను. అలంకారమత మాదినుండియు బాహ్యసౌందర్యప్రదర్శనార్థముగనే మెలంగెను. ఈ మతమున వాచ్యమునకే ప్రాధాన్యము గాని కావ్యాత్మతత్త్వాన్వేషణము గానరాదు. అందుచే నలంకారములసంఖ్య నానాటికి మితిమీరిపోయెను. పిదప గొంతకాలమునకు గుణమతప్రాబల్య మతిశయించుటచే నలంకారములయం దాదరము సన్నగిల్లెను. ఈ మతమునందు కావ్యసౌందర్యవిచారము, అలంకారమతములో నున్న దానికన్న విలక్షణముగ నున్నను, స్వరూపరామణీయకసంభావనమే కానవచ్చును. గుణమతమును వెన్నంటి వెలసిన రీతిమతమున గూడ, కావ్యబాహ్యాంగసంచయ మైన రీతియే కావ్యాత్మ యనురంగరజతభ్రాంతి ప్రబలెను. ఇటుల కేవలబాహ్యసౌందర్యమే కావ్యసర్వస్వ మని ప్రాచీనమతములు ప్రకటించినను వీనిలో తరతమ

భేదములు లేకపోలేదు. ఇట్టిసమయమున ఆనందవర్ధనాదు లుదయించిరి. ప్రాచీనమతములలోని బాహ్యాభ్యంతరవిచారమును పరిశీలించి, వానివాని సత్యాసత్యసౌందర్యతత్త్వమును సవిమర్శదృష్టి వీక్షించి నవ్యమతమును నెలకొల్పిరి. కావున ధ్వనిమతము రసధ్వనిని ముఖ్యాంశముగ నంగీకరించి, మిగిలినవానిని ధ్వన్యంగములుగ స్వీకరించెను. ఇందువలన అలంకారశాస్త్రమునందు రస, అలంకార, గుణ, రీతి, ధ్వనులకు ప్రత్యేకత లభించి, వేర్వేరుమతములు విలసిల్లె నని మనకు దెలియవచ్చును. ఇటుల ఆలంకారికులు వారివారికి దోచినట్లు పోవుటవలన నలంకారశాస్త్రకల్లోలినీప్రవాహము వివిధపథముల బ్రసరింపజొచ్చెను. నానాముఖములైన స్రవంతికనేకముఖ మొనరింపకున్నచో నది కాలక్రమమున నంతర్వాహిని యైపోవును. ఈవివిధనదముల నరికట్టినచో జీవనదియై, కావ్యకేదారము సారవంతము, సర్వసస్యాఢ్యము నై ఫలించు నన్న ముఖ్యాశయము నవ్యులకు జనించెను. అంతనుండియు బాహ్యాంగవర్గ మైన గుణాలంకారరీతులకు ప్రాముఖ్యము సన్నగిల్లి, ఉత్తమకావ్యసౌందర్యస్వరూప మైన ఆభ్యంతరవిచారము ఆలంకారికుల మానసముల నాకర్షింపజొచ్చెను. వ్యంగ్యవ్యాపారమే - అందును రసభావధ్వనులే - అత్యంతాహ్లాదానుసంధాయకములై, సహృదయరంజకములై వెలుంగు నని తేటపడెను. సర్వజనాదర్శప్రాయ మైన సౌందర్యస్వరూపము, కేవలబాహ్యవస్తుప్రదర్శనముపై నాధారపడదు. అది సత్యముగ సరసజనాంతరంగికముకురఫలకములలోననే పతిబింబించును. అత్యంతమాధుర్యసంజనితస్త్రీస్వాభావిక మైన ఆనందానుభవమునకును, పౌరుషసౌందర్యప్రధాన మైన ప్రతిభాగాంభీర్యమునకును సంయోగసౌఖ్యము నాలంకారికాచార్యులు

ప్రసాదించిరి. ఈ అన్యోన్యసాంగత్యలాభ మాదినుండియు గాన వచ్చును. మాధుర్యగాంభీర్యములు, లేక సౌకుమార్యస్వారస్యముల పరస్పరసమాగమమున నపూర్వానందానుభవము గల్గును. కేవల లక్షణనిర్మాణము కావ్యకాంతామణిని నిర్జీవిగ నొనరించునేకాని యామెకు మాధుర్యలావణ్యముల గూర్పజాలదు. ఈవిశేషాంశ మాలంకారికు లెరుంగనిది కాదు. సౌందర్యసర్వస్వస్వరూపమునకును, పరమానందానుభవరహస్యమునకును వీ రనూనాదరగౌరవముల జూపిరి. లక్షణవిధానమును మీరరాదని శాసించినను, కవిప్రతిభాప్రదర్శనమున కనేకావకాశముల గల్పించి, కవులు నిరంకుశులని నవ్యులు వచించిరి. మరియు కావ్యసౌందర్యమును, రామణీయకమును గురుతెరుంగుటకు సహృదయులును, రసికులునుమాత్రమే తగినవారని వారు రచించిరి. కావున మహాకవులవోలెనే సహృదయశిరోమణులుగూడ స్వల్పసంఖ్యాకులై చెలంగుదురని మన మెరుంగవలయును. అందుచే కవిత్వ సహృదయత్వలాభములు పూర్వజన్మవాసనాఫలితములై సహజమును, స్వాభావికమునుగా జెలంగునుగాని వేరొండుగాదు.

ఆభ్యంతరవిమర్శనపూర్వకమైన ఉత్తమకావ్య స్వరూప సందర్శనము ధ్వన్యాలోకమూలమున సహృదయులకు సంభవించెను. ప్రాచీనమతములన్నియు నీగ్రంథమున సమన్వయింపబడి ధ్వనిమతము స్థాపింపబడెను. దీనివెనువెంటనే ప్రత్యర్థిమతములు కొన్ని ప్రబలి క్రమముగ నశించెను. కొందరు ప్రాచీనమతానుసారులు కొన్నిగ్రంథముల రచించిరి కాని వానికిగూడ ప్రచార మంతగా లేకపోయెను. ఇటుల ఐదారుశతాబ్దములవరకు అలంకారశాస్త్రము కేవలవ్యాఖ్యానములు, సంగ్రహగ్రంథములతో నిండెను. ఎవరో యొకరిద్దరుతక్క తక్కినవా రందరును మమ్మటాచార్యకృత ధ్వనిమత సంస్థాపనము

నాపల గరించిరి. కాని కొంతమంది కవిశిక్షకును, రసవిచారమునకును పాటుపడిరి. వీరి శిక్షావిచారములు వీరి ప్రాచ్యాచారపరాయణత్వమును, ప్రాచీనమతప్రాబల్యమును చాటిచెప్పును. ప్రాచీనమతావలంబకులు ధ్వనిమతప్రామాణ్యమునకు విముఖులై, నవీనమతాభ్యుదయమునకు ప్రతిపక్షులై, పూర్వాచార్యసంప్రదాయముల శిరసావహించి చర్విత చర్వణముగ గ్రంథముల రచించిరి. వీరిగ్రంథసరణిని విమర్శింప బూనినచో జదువరులకు విసుగు జనించును. పంథలు, పదములు, భావములు, పరిభాష, సర్వము నొకేఛక్కి జెలంగుచున్నది. వీనిలో ముఖ్యముగ మనము గమనింపదగినవిషయ మొక్కటియే. అలంకారముల సంఖ్యాభేదములుమాత్ర మంతకంతకు నతిశయించుటచే అలంకారశాస్త్ర మన్వర్థాభిధాన మయ్యెను. ఆభ్యంతర మైన కావ్యాత్మతత్త్వవిమర్శనాకృష్టమానసు డగుటనో, లేక బాహ్యాంగ మైన కావ్యసౌష్ఠవవిచారవిఘాతచేతస్కు డగుటనో కాని ఆనందవర్ధను డలంకారముల నంతగ బాటింపలేదు. ఈ అలంకారముల కాధునికుల కాలమున ప్రాచుర్యము గల్గెను. కావుననే ప్రాచీనమతములకు వన్నె పెట్టి అలంకారసర్వస్వమును రచించుటకు రాజానకరుయ్యకున కవకాశము గలిగెను. అందుచేత రుయ్యకునికాలమునుండి అలంకారముల లక్షణస్వరూపములు విలక్షణముగ విధింపబడినవి. అచ్చటచ్చట గొన్నికొరంత లున్నచో వానిని పండితరాయలు పరిష్కరించెను.

ఈ అర్వాచీనమతము, లేక నవ్యమతమునందు విశేష మొకటి విలసిల్లుచున్నది. అర్వాచీనాలంకారికు లందరును ధ్వనిమతాభ్యుదయమునకు యత్నించినను, ప్రాచీనమతాధికారతిరస్కారము సల్పుటకు సమర్థులు గారైరి. పూర్వాచార్యశాసనధిక్కార మొనరించుటకు దగిన సాహసము నవ్యులకు లేకపోయెను. భయకారణ

మునవో, లేక భక్తికతమునవో నవ్యమతము చిరంతనమత సంప్రదాయముల గౌరవపురస్సరముగ నాదరించెను. కావున నవ్యుల నందర నొకఘట్టమున జేర్చుట కనువుపడదు. ఇందులకు నిదర్శనముగ ధ్వనిమతసంస్థాపకు డైన మమ్మటాచార్యుని కావ్యలక్షణమున వామనాదుల ఛాయాసంపర్కము గానవచ్చును. ధ్వనిమార్గావలంబి యైన రుయ్యకుని అలంకారలక్షణవిభాగములు ఉద్భటకుంతలుల పథము ననుగమించుచున్నవి. ఇంక విశ్వనాథు డన్ననో, రసమతసముద్ధరణమునకు బద్ధకంకణు డని వేరుగ వివరింప నక్కరలేదు. తుదకు పండితరాయల రసగంగాధరము రసమతసింహావలోకన మొనరించుచున్నను, ధ్వనిమత ప్రాశస్త్యమును ప్రకటించినను కావ్యలక్షణముమాత్రము దండ్యాచార్యలక్షణమున కనువాదస్వరూపమై శ్లాఘాపాత్ర మగుచున్నది. ఇచట మన కొకసంగతి స్పష్ట మగును. 'సదసత్సంశయగోచరముగను, అస్తినాస్తివిచికిత్సాహేతుభూతముగను' ఆనందవర్ధనాచార్యుడు రచించిన కావ్యవరవర్ణినీస్వరూపవర్ణనమును నవ్యులు 'ఇద మిత్థ'మని నిరూపింప నిశ్చయించిరి. కావ్యకన్యకాసౌందర్యసర్వస్వప్రదర్శనమునకు అర్వాచీనులు ప్రారంభించినంతనే లావణ్యరసము చిందుటయు, ప్రాచీన నవీనమతసంప్రదాయసాంకర్యము సంభవించుటయు గల్గెను. ఈ తిర్యగవలోకనసింహావలోకనములవలన ప్రాచీనమతములలోని ప్రాశస్త్యమును, ధ్వన్యాలోకమునందలి లోపములనుగూడ అర్వాచీనులు గుర్తించి రనియు, స్వప్రతిభావిశేషమున నవ్యమతసంస్థాపనమునకై ప్రయత్నించి రనియు మనకు దెలియవచ్చును. దీనివలన ధ్వనిమతాభ్యుదయకారకులు ప్రతిభావంతులుగా రను దోషారోపణమునకు నిదానము గాజాల రని చదువరు లెరుంగవలయును.

---

( ధ్వనిమతసంస్థాపనము - మమ్మటాచార్యుడు )

నవ్యమతాభ్యుదయమునకు బాటుపడినవారలలో ప్రథమ పూజ్యుడు, ఉత్తమోత్తమప్రతిభావంతుడు, మహామహిమాన్వితుడు నైనవాడు మమ్మటాచార్యు డని నిశ్చయించుట కాతని కావ్యప్రకాశ గ్రంథమే ప్రబలప్రమాణము. ఈ గ్రంథరచనమువలన మమ్మటాచార్యుడు ధ్వనిమతసంస్థాపన మొనరించి, కాశ్మీరక సంప్రదాయముల ప్రతిష్ఠించి నవ్యమతాభ్యుదయమునకు దోహద మాచరించెను. ప్రాచీనమతాచార్యప్రయత్నముల నెల్ల బరిశీలించి, ఛిన్నాభిన్నములై, చిక్కుజీరుగా బడిన సూత్రజాలముల నెల్ల సంగ్రహించి, మమ్మటాచార్యుడు స్వకీయకరకౌశలమును ప్రదర్శించి, కావ్యకన్యాలలామమునకు నవ్యదుకూలాంబరమును కాన్క గావించెను. కావున కావ్యప్రకాశము సరసజనులకనుల మిరుమిట్లుగొలిపి, వారి మానసముల పరవశ మొనరించెను. అలంకారగ్రంథములలో కావ్యప్రకాశము సమగ్రము, సంపూర్ణము, సర్వంకషము నై 'వెలుగొందుటచే, మమ్మటాచార్యుని మార్గ మనుసరించి నవీనులు తమతమగ్రంథముల రచించిరి. అందుచే అర్వాచీనాలంకారికగ్రంథముల కెల్ల కావ్యప్రకాశ మాదర్శప్రాయమై చెలువొందెను.

మమ్మటుని కావ్యలక్షణమును గమనించినచో నవ్యమతతత్త్వము చదువరులకు కరతలామలక మగును. ఇతడు ధ్వనిమతమున కంజలిబంధ మొనరించి, రసధ్వనిని శిరసావహించినను, కావ్యలక్షణనిర్మాణమునమాత్రము ప్రాచీనమతప్రధానాంశము లైన శబ్దార్థములను గుణదోషాలంకారములను బాటించెను. " దోషరహితము, గుణసహితము, కొన్నివేళల అలంకారరహిత మైనను, శబ్దార్థసముపేత మైనచో

నదియే కావ్యము" అని విధించెను. ఈలక్షణమునందు రసప్రసంగము ధ్వన్యభిధానమును వాచ్యరూపమున గానరాకున్నను, వీనికి ప్రతీతి గలదు. కావ్యలక్షణమును విధించినతరువాత, శబ్దార్థత్రైవిధ్యమును జర్చించుచు మమ్మటాచార్యుడు వ్యంజనావృత్తిని సాధించి, వ్యంగ్యార్థస్వరూపమును ప్రదర్శించి, కావ్యత్రయభేదమును వివరించెను. ఇటుల వ్యంగ్యార్థప్రతీతి ననుసరించి, ధ్వని, గుణీభూతవ్యంగ్య, చిత్రములను క్రమముగ ఉత్తమ, మధ్యమ, అవరకావ్యములగు లక్షణమును విధించి, లక్ష్యముల నొసంగి, పిదప అసంలక్ష్యక్రమవ్యంగ్యమును నిరూపించుచు, సందర్భోచితముగ రసస్వరూపమును వర్ణించెను. రసమతసమాలోచనావసరమున భట్టలొల్లట, శ్రీశంకుక, భట్టనాయకుల వివిధవాదముల సారమును బేర్కొని, వానిని విమర్శించి కడకు ఆచార్యాభినవగుప్తపాదుల వ్యక్తివాదమును మమ్మటుడాదరించెను. భరతమతానుసారముగ ఎనిమిదిరసములు నాట్యమున స్మరింపబడిన వని వచించినను, కావ్యౌచిత్యమును గణుతించి కాబోలును, శాంతముగూడ తొమ్మిదవరస మని ప్రకాశకారుడు నుడివెను.

మమ్మటాచార్యు డనంతరమున గుణదోషవిచారమునకు గడంగెను. ఈవిచారణము కావ్యసామాన్యమునకు వర్తింపక, విశేషముగ రసధర్మపరత్వముగనే విలసిల్లెను. కేవలరసాశ్రయములై గుణములు కావ్యకామనీయకమును పెంపొందించు ననుటచే, ఆనందవర్ధనుని పథము నవలంబించి గుణములకుగూడ నవ్యతను మమ్మటుడాపాదించెను. ఓజోమాధుర్యగుణములు శబ్దార్థమూలమున ప్రకాశింపవు. ఇంక శబ్దార్థములకు గల గుణవ్యవహారము గౌణమే కాని వేరొండు గాదు. మరియు నీవ్యవహారము రసోపకారకముగనే పరిణమించును. శౌర్యాదు లేరీతిగ నాత్మకు వర్తించునో, ఓజోగుణాదులుగూడ

నారీతిగ రసమునకే చెందును. వర్ణసమాసరచనాదులుగూడ రసవ్యంజకములుగనే భాసించును. కావున మాధుర్యాదిగుణములు సాక్షాద్రసధర్మము లనియే గ్రహింపవలయును. ఇటులనే అలంకారములుగూడ జెలంగును. కొన్ని శబ్దద్వారమునను, మరికొన్ని అర్థద్వారమునను రసోపకారకము లగును. కటకాదులవలె నలంకారములు శరీరమునకు శోభగూర్చును. అందువలన కావ్యశరీర మైన శబ్దార్థములమూలమున నలంకారములు కావ్యాత్మ యైన రసమునకు పరిస్ఫూర్తి గలిగించును. రసోపస్కారకములు గానిచో నవి వాగ్వైచిత్ర్యమాత్రములుగనే పరిగణింపబడును.

ఆనందవర్ధనునివలెనే మమ్మటుడుగూడ మూడుగుణములను మాత్రమే సమ్మతించెను. ఆయావర్ణముల సాహచర్య మాయాగుణముల దీపింపజేయు ననుటవలన ఉద్భటు డుదాహరించిన వృత్తిత్రయము, లేక స్థూలదృష్టిని వామనుని రీతిత్రయ మీతనిగుణత్రయముగ పరివర్తనము జెందెను. ఈ గుణనిరూపణమున మమ్మటాచార్యుడు వామనుని దశగుణపరిగణనము నత్యంతశ్రద్ధతో పరిశీలించి, ఓజఃప్రసాద మాధుర్యములలో మిగిలినగుణము లంతర్గతములుగాన వానిని పేర్కొన నక్కర లే దని నిశ్చయించెను. మనముగూడ వానిని కడు జాగరూకతతో విమర్శించినచో మమ్మటుని పలుకులలోని సత్యము నరయగల్గుదుము. వామనుని గుణములలో కొన్ని గుణత్రయమున లీన మగును; మరికొన్ని దోషాభావములుగను, తక్కినవి కేవలదోషములుగను గానవచ్చును. ఎట్లన—వామనుని శ్లేష, సమాధి, ఉదారతలు మమ్మటుని ఓజోగుణమున పర్యవసించును. అర్థవ్యక్తి నిజమునకు ప్రసాదగుణవిశేషమే. సమతాగుణము కొన్నిచోట్ల దోషముగ జెలంగును. ఇంక కాంతిసౌకుమార్యములు గ్రామ్యత్వశ్రుతికష్టత్వదోషాభావములుగ గన్పట్టును.

ఇతని విమర్శనము గుణములసంఖ్యను తగ్గించి, వాని శ్లోకమితి నేర్ప రచెను. లేనిచో భోజునివలెనే విభేదముల బెంచుటకు నవీనుల కవకాశము లభించును. మరియు అర్థగుణశబ్దగుణవిచక్షణము నిరర్థక మని మమ్మటుని ముఖ్యాశయము. విభావాదిసంయోగమూలక మైన రసాస్వాదానందము ననుభవించు సహృదయచిత్తవృత్తిని ప్రమాణముగ పరిగ్రహించినచో గుణత్రయము నంగీకరించుటయే సమంజసము. కావుననే ఓజోగుణము చిత్తవిస్తారమును గల్గించి, వీరబీభత్సరౌద్రరసోద్రేకమునకు దోడ్పడును. ప్రసాదగుణము సర్వరసవిహితస్థితిని గల్గి, ఎండినకట్టెల నిప్పు రగుల్కొనునటులను, తెల్లనిబట్టల నీరు పారు రీతిని చిత్తవ్యాప్తి, లేక మానసవికాసము నొదవించును. ఇంక మాధుర్యము సామాన్యముగ సంయోగశృంగారమున గన్పట్టుచున్నను, వియోగశృంగారకరుణశాంతముల క్రమక్రమముగ నతిశయించుచు, హృదయాహ్లాదకత్వము, లేక చిత్తద్రుతికి గారణ మగును. ఈ చిత్తవిస్తారవికాసాహ్లాదకత్వములే వరుసగా గుణత్రయమునకు ఫలప్రాయములై, కావ్యరసానుభవమునకు హేతుభూతము లగుచున్నవి. వివిధము లైన విభావాదుల కలయికవలన వేర్వేరు చిత్తవృత్తులు విలసిల్లును. కాని మన మావిభేదముల బాటింప నక్కర లేదు. ఈవిషయమునందు ధ్వన్యాలోకమార్గము ననుసరించి మమ్మటాచార్యుడు దానిని సమూలముగ జర్చించి విపులముగ వివరించినట్లు గానవచ్చును. ఆయాగుణములు చదువరుల హృదయముల నాయామార్పుల గలిగించు ననుసందేశమును మమ్మటుడు భట్టనాయకుని భుక్తివాదమునుండి స్వీకరించియుండు ననుటకుగూడ నవకాశము గలదు. అభిధాయకత్వము వాచ్యవిషయము, భావకత్వము రసవిషయము, భోక్తృత్వము సహృదయవిషయము నై చెలంగి ద్రుతివిస్తరవికాసాత్మకముగ

రసానుభవము వెలుంగునని లోచనమునందు భట్టనాయకుని వాదము సంగ్రహింపబడెను. రసమతసమాలోచన, ధ్వనిమత, ప్రౌఢోక్తి మతములలో నీవిషయ మింతకుమును పే రచింపబడుటచే నిట చర్విత చర్వణ మగు నని విరమించితిమి. అందువలన ఆనందవర్ధన, భట్ట నాయకుల మతసారము నేర్చి కూర్చి, విలక్షణముగ గుణవిచక్షణ మొనరించి, ఓజః ప్రసాదమాధుర్యములు సహృదయులకు చిత్తదీప్తత్వ, వ్యాప్తిత్వ, గళితత్వజనకము లని వచించెను. ఇతనిమతముతో విశ్వ నాథకవిరాజు సమ్మతించినను భేదము గానవచ్చును. మాధుర్యాదులు ద్రుత్యాదికారణము లని మమ్మటుడు వచింప, గుణములకు గల జనక తను విశ్వనాథుడు విమర్శించి, కార్యకారణభావవిభేదమును పాటించక, సహృదయచిత్తార్ద్రీప్రాయత్వాదుల నంగీకరించెను. వర్ణ సమాసరచనావిశేషములపై నాధారపడి గుణము లుండు ననుటవలన మమ్మటుడు అర్థగుణములయెడ ననాదరభావము జూపెను.

ట, ఠ, డ, ఢ లను వర్జించి, క కారము మొదలు మ కారముదనుక గల స్పర్శముల నుపయోగించినపుడును, ర, ణ కారముల హ్రస్వముగ వాడినపుడును, సమాసములు లేకున్నపుడు గాని, స్వల్పసమాసములతో గూడినపుడు గాని మాధుర్యగుణము ప్రకాశించును. వర్గప్రథమతృతీయాక్షరముల వెంట నంటి ద్వితీయ చతుర్థవర్ణముల సంఘటన మున్నపుడును, రేఫయుత మైన ద్విత్వాక్షరప్రయోగము గాని, తుల్యవర్ణసంబంధ మున్నపుడు గాని, ణ కారవర్జిత మైన ట వర్గాక్షరము లున్నపుడును, శ కార, ష కారములు గల్గునపుడును, దీర్ఘసమాస వికట సంఘటనములతో నిండినపుడును ఓజోగుణము భాసించును. ఇంక సాధారణము, సమగ్రము నైన సంఘటనము గల్గి ప్రసాదగు.

ముండును. ఇట్టుల మమ్మటుడు వచించిన వర్ణములకును, ఉపనాగరికా, పరుష, కోమలవృత్తుల విషయమున ఉద్భటుడు సూచించినవానికిని చాలవరకు సామ్యము గానవచ్చును. కావున అలంకారమతమునందలి ఉద్భటాచార్యుని వృత్తిత్రయమే రీతిమతమున వామనుని రీతిత్రిత యమై, నవ్యమతమున గుణత్రయముగా మమ్మటునిచే గొనియాడ బడెను. తరువాత పద, వాక్య, అర్థదోషములను, రసదోషములను గూడ కావ్యప్రకాశమున వివరించెను. ఇతని మార్గమును మిగిలినవా రంద రవలంబించిరి. ఇతనిమతమున అలంకారములు కావ్యప్రాశస్త్య మునకు ప్రధానములు గాకున్నను, శాస్త్రసంప్రదాయము నాదరించి మమ్మటుడు దశమోల్లాసమునం దర్థాలంకారవివేచన మొనరించెను. రీతిమతమును సమ్మతించి, సర్వగుణాతిశయసంపన్నమై కావ్యసౌంద ర్యము ప్రకాశించు నని తలంచినచో సమగ్రగుణరహితము లైన గౌడీయాపాంచాలులకు కావ్యత్వము లభింపదు. లేదా, ఒకానొక మేలిగుణము గల్గినకతమున, దానిని కావ్యముగ నంగీకరించినచో కావ్యాభాసములు, కావ్యానుకారములు నైన వాగ్వికల్పములగూడ ఉత్తమకావ్యములుగ గణింపవలసివచ్చును. కావున నవ్యమత మును ప్రమాణముగ గైకొనినచో, వామనుడు వచించినవడువున 'గుణములు కావ్యసౌందర్యమును సంపాదించు' ననియు, 'అలం కారము లాసౌందర్యమున కధికతరరామణీయకము నాపాదించు' ననియు భావించుట సవిమర్శకము గా దని తేటపడును. మరియు విమర్శనజ్ఞానశూన్యమై చెలంగును.

ఈ కావ్యప్రకాశసంగ్రహమువలన వివిధము లైన ప్రాచీన మతముల నేకముఖి మొనరించి, లక్ష్యలక్షణస్వరూపమును విలక్షణ ముగ వివరించి, విమర్శనపూర్వకముగ విధించి, మమ్మటాచార్యుడు

నవ్యమతాభ్యుదయమునకు దోడ్పడె నని చదువరులకు దోచకమానదు. ఇతడు నాటకలక్షణమునుమాత్రము నిర్ణయించలేదు. హేమచంద్ర విద్యానాథవిశ్వనాథు లాలోపమును పూర్తిగావించి తమగ్రంథముల రచించిరి. పూర్వాచార్యవర్యుల భిన్నభిన్నాభిప్రాయముల నెల్ల స్వీకరించి, వానిని ధ్వనిమతమునకు సమన్వయ మొనరించి, సయుక్తికముగ, సూత్రప్రాయముగ, సంగ్రహరూపముగ కారికావృత్తుల రచించి, నవ్యమతసంస్థాపన గావించినకారణమున మమ్మటాచార్యుడు వాగ్దేవతావతారు డని ప్రఖ్యాతి గాంచుటయు, కావ్యప్రకాశము ప్రసిద్ధివహించుటయు, దాని కనేకవ్యాఖ్యానములు వెల్వడుటయు సంభవించెను.

మమ్మటుని కావ్యలక్షణము నవీనాలంకారికుల ఖండనములకు పాత్ర మయ్యెను. మమ్మటుని కావ్యప్రకాశము విశ్వనాథుని సాహిత్యదర్పణమునకు ఉపజీవ్య మైనను, ప్రకాశకారుని కావ్యస్వరూపము చింత్య మని దర్పణకారుడు దూషించెను. 'అదోషము, సగుణము, క్వచిదనలంకృతము నైన శబ్దార్థమే కావ్యము' అను మమ్మటుని లక్షణమునంగల విశేషణములను కవిరాజు క్రమముగా నిటుల విమర్శించెను. అదోష మైన శబ్దార్థమే కావ్యమన్నచో, దోషదూషితము గాకుండ రచించుట దుర్లభ మగుటవలన కొన్నివేళల నుత్తమకావ్యములగూడ త్యజింపవలయును. మరియు, ఈషద్దోషదూషితము, లేక అంశదుష్ట మని తలంచి సమర్థించుటకు గూడ వీలు లేదు. ఇచట దోషము నిత్యమా, అనిత్యమా యను ప్రశ్నమున కవకాశము గలుగును. ప్రత్యేకాంశము లైన పదపదార్థములకుమాత్రమే దోషము సంబంధించు ననుట సమంజసము గాదు. రసాపకర్షకములే దోషము లనుసూత్రము ననుసరించి దోషము

పద్యమున కంతకును వర్తించును. కావున కావ్యత్వానంగీకారము ప్రవిరలవిషయమా, లేక నిర్విషయమా యను సందియ ముద యించును. ఇంక, గుణసహితశబ్దార్థమే కావ్యముగ విలసిల్లు నని భావించినచో, గుణములు రసైకధర్మము లని ప్రతిపాదింపబడు టచే, అభిమతశబ్దార్థమైన కావ్యస్వరూపమున రసము గలదా, లేదా యను సంశయము గల్గును. రసము లేనిచో గుణవత్త్వముగూడ లేక పోవును. ఒకవేళ రసము గల దని పలికినచో, రసవంత మను విశేషణము నేల విధింపరా దను ప్రశ్న వచ్చును. గుణవత్త్వాన్యథానుప పత్తిచే నది లభించు నని వాదించినచో, సగుణ మనుటకన్న సరస మని వచించుట యుక్తము. ఇంక గుణాభివ్యంజకమైన శబ్దార్థమే కావ్యమునందు ప్రయోజ్య మనుటయే ముఖ్యాభిప్రాయమని భావిం చుటకుగూడ ప్రమాణము లేదు. 'కావ్యమునకు శబ్దార్థములే శరీరము; రసాదులే ఆత్మ; గుణములు శౌర్యాదులు; దోషములు కాణత్వా దులు; రీతులు అవయవసంస్థాన విశేషములు; అలంకారములు కటకకుండలాదులు' అని చెప్పబడెను. కావున గుణాభివ్యం జకశబ్దార్థవత్త్వమునకు కావ్యమున ఉత్కర్షమాత్రాధాయకత్వమే కాని స్వరూపాధాయకత్వము లేదు. మరియు, క్వచిదనలంకృతశబ్దా ర్థము కావ్యమై చెలువారు నని తలంచినచో, సర్వత్ర సాలంకారమై క్వచిదస్ఫుటాలంకార మైయున్నప్పుడుగూడ శబ్దార్థము కావ్యముగ గణింపబడు నని తాత్పర్యము వచ్చును. ఇచట సాలంకార శబ్దార్థము ఉత్కర్షాధాయకత్వమే కాని వేరొండుగా దని సాహిత్య దర్పణమున విశ్వనాథుడు వివరించెను. ఇటుల గుణదోషాలంకారము లను కావ్యలక్షణమున విధింపరా దనువిషయమున కవిరాజు రచించిన ఖండనములతో పండితరాయలు సమ్మతించినను, జగన్నాథపండితుని

విమర్శనమే సప్రమాణము, సశాస్త్రీయము నై సహృదయరంజకముగ నున్నది. 'నానాభావ మగుటచే శబ్దార్థయుగళము కావ్యశబ్దవాచ్యము గాదు. కావ్యము స్పష్టముగ పఠింపబడుచున్నది. అర్థము కావ్యము వలన నవగమ్య మగుచున్నది. కావ్యము శ్రుత మయ్యెను. అర్థము జ్ఞాతము గాలేదు. ఇటువంటి విశ్వజనీన వ్యవహారమువలన శబ్దవిశేష మునకే కావ్యపదార్థత్వప్రతిపత్తి గల్గుచున్నది......ఇంక ఆస్వాదో ద్బోధకత్వమే కావ్యత్వప్రయోజకముగ పరిగ్రహించి, శబ్దమునం దును, అర్థమునందును నయ్యది అవిశిష్ట మని చెప్పినచో, రాగము నకుగూడ రసవ్యంజకత లభించును. ధ్వనికారాదిసకలాలంకారిక సమ్మతత్వమున ప్రకృతమునందు లక్షణీయత్వాపత్తి జనించును. బహూక్తు లేల? నాట్యాంగములం దన్నిటిలో ప్రాయికముగ రస వ్యంజకత్వ ముండుటవలన కావ్యత్వాపత్తి గల్గు' నని జగన్నాథుడు చర్చించి, 'చమత్కారిత్వమే కావ్యజీవిత 'మని సమర్థించి, 'రమణీ యార్థప్రతిపాదకశబ్దమే కావ్య'మని లక్షణమును నిర్మించెను.

ఈవిమర్శనములలో గల వాదములను, ప్రమాణములను పరి శీలించినచో వానిలో గొన్ని శుష్కతర్కములుగను, పాండిత్య ప్రకటనానుకూలములుగను గన్పట్టును. మమ్మటుని వ్యాఖ్యాతలలో గొంద ఱీయాక్షేపణములకు దగినసమాధానముల నొసంగిరి. కావున న్యాయసిద్ధము, యుక్తియుక్తముగ కావ్యస్వరూపమునకు లక్షణము విధించుట నిష్ఫల మని మన కీవివాదము బోధించును. ఇందలి సత్యమును గ్రహించియే పంకసంస్పర్శనప్రక్షాళనముల కంగీకరింపక ఆనంద వర్ధనాదులు కావ్యసామాన్యస్వరూపమును ప్రదర్శించి, కావ్యవిభే దముల విస్తరించి, కావ్యాత్మతత్త్వమును బోధించి మౌనముద్ర వహించిరేకాని మమ్మటాదులమాడ్కి విలక్షణోపేతము, విమర్శన

యుతము నైన లక్షణమును రచించుటకు యత్నింపరైరి. కావుననే 'కావ్యస్వరూపమును వ్యుత్పాదింపగోరిన మతిమంతునిచే కావ్య సామాన్యలక్షణముమాత్రమే వచింపబడెను' అను వ్యక్తివివేకకారుని నిందాలాపములకు ధ్వనికారుడు పాత్రుడయ్యెను. ఇంక సర్వాలంకారికసంప్రదాయసంగ్రహవాక్యమై, వాగ్దేవతావతారుడైన మమ్మటాచార్యుని కావ్యస్వరూపలక్షణము చెలంగు నంటయే దీనిప్రాశస్త్యమును ప్రకటించును. ప్రాచీనమతముల నొకపరి పరికించినచో, నీతని లక్షణమునందు చదువరుల స్థూలదృష్టికి లోపములవోలె గానవచ్చు బాహ్యాభిభేదముల కన్నిటికిని సమన్వయము సంభవించును. ఇతని లక్షణమున రసమునకు స్థానము లేదు. ఆనందవర్ధనునిచే కావ్యభేద మాత్రముగ గణింపబడిన చిత్రకావ్యమును మమ్మటుడు అవర కావ్యముగ నంగీకరించుటవలన విశ్వనాథుడు విమర్శించినవడువున రస మీతనిలక్షణమునందు ప్రధానాంశము గా దని తలంపవలసి వచ్చును. అయినను రసోపస్కారకత్వము నాధారముగ గైకొని, గుణదోషవిచారమును ప్రకాశకారు డొనరించినకతమున రసము ముఖ్యాంగము గా దనుటకుగూడ వీలు లేదు. ఇట్లు కాక కవిప్రపంచము, సహృదయజగము, ఆలంకారికలోకములలో రసమే కావ్యసర్వస్వముగ ప్రఖ్యాతిగాంచుటచే నది లక్షణమునం దుదాహృతము గాలే దని శంకించినచో; రసవస్త్వలంకారవ్యంగ్య విభాగమును, ధ్వనిప్రాధాన్యము ననుసరించి మమ్మటుడు గావించిన కావ్యత్రయవిభేదమును సమర్థించుటకు మార్గము గానరాదు. ఇందు వలన రసగంగాధరకారునికైవడి గుణదోషములను జేర్పక ప్రకాశకారుడు కావ్యలక్షణమును విధించినచో కొంచెము విలక్షణముగ నుండియుండును. కావున వామనుడు వచించినపగిది గుణదోషములు

శబ్దార్థములకు సంబంధించిన వని మనము దలంపవలయును. అందుచే పండితరాయలు ప్రకాశకారునితో నేకీభవింపక, శబ్దార్థరసరచనాగతములుగనే వీనిని గ్రహించెను. నవ్యమతానుసారి యైనను విద్యానాథుడు ఉద్భటునిమతము నాదరించి గుణములు సంఘటనాధర్మములని వచించెను. ఈవిభేదవిషయముల నాలోచించినచో నవ్యమతప్రతిపాదకు డని పేరెన్నికగన్న మమ్మటుడుగూడ ప్రాచీనమతప్రాబల్యమునకు దాసానుదాసుడై, చేతులు జోడించి జోహారు లొనరించె నని తలంపక తప్పదు. ఇటుల ప్రాచీనాచార్యపదానువర్తియుఁ ప్రాచీనమతసంప్రదాయపక్షపాతియుగా విలసిల్లినను, వాగ్దేవతాపరావతారుడు ధ్వనిమతప్రాశస్త్యమును బరిగణించి, కావ్యప్రకాశగ్రంథరచనామూలమున దానిని సంస్థాపించి, మిగిలినవానిని దీనితో సమన్వయ మొనరించె నని సహృదయు లెరుంగగలరు.

ఇటుల ఆనందవర్ధన, అభినవగుప్త, మమ్మటాచార్యవర్యులు పురోహిత, ప్రధాన, దండనాథులై తేజరిల్లి, వాదోపవాదవాహినీతతుల దశదిశలం బంచి, శాస్త్రప్రావీణ్యమును, నీతినైపుణ్యమును, ఖడ్గకౌశలమును నెరయ మెరయ, వ్యూహప్రతివ్యూహముల బన్ని విప్పి, విమతమతసైన్యతంషముల జించి చెండాడి, వానిని దిగంతరములకు బారద్రోలి, వస్త్వలంకారరసాదుల బరిచారికలుగా నియమించి, ఉత్తమకావ్యస్వారాజ్యసంపాదనము గావించి, సరస్వతీసతీలలామను ధ్వనిమతసువర్ణమయమయూరసింహాసనమునం దాసీనురాలుగ నొనరించి, మూర్ధాభిషేకముం జేసి, నూతనవైభవ, వికాస, విలాసముల నెలుగొందునటుల సలిపి రనినచో స్వభావోక్తియై విలసిల్లును.

---

## కావ్యాత్మ - నవీనమతములు

### (ధ్వనిమతప్రాచుర్యము—రుయ్యకుడు)

ధ్వనిమతాభ్యుదయమున కమితప్రయత్నము లొనరించిన వారిలో రాజానకరుయ్యకుడు ప్రథముడు. ఇతడు మమ్మటాచార్యుని తరువాత ప్రబలి కావ్యప్రకాశమునకు వ్యాఖ్యానము వ్రాసెను. కేవల వ్యాఖ్యానముతో దృప్తి జెందక స్వతంత్ర గ్రంథములగూడ రచించి, రుయ్యకుడు శక్తిసామర్థ్యములను, విజ్ఞానవివేకములను బ్రకటించెను. ఇందుల కాతని అలంకారసర్వస్వమే నిదర్శనము. రాజానకకుంతలాచార్యుడు వక్రోక్తిజీవితమున ప్రదర్శించిన వైదగ్ధ్యవైచిత్ర్యవిచ్ఛిత్తి విశేషముల బుటమువెట్టి 'పదార్వన్నియ జాళువాపసిడి రంగుమెరుంగుల వెలుంగు' అలంకారస్వరూపస్వభావములను కరువుగట్టి పోతపోసి రాజానకరుయ్యకాచార్యుడు సర్వస్వమున భద్రపరచి కావ్యవరవర్ణినికి గానుక నొసంగెను. అమితకౌశల్యము గానుపింప, అత్యంత నైపుణ్యము సెరయమెరయ అలంకారముల ప్రత్యేకతను, ప్రధానతను నిశ్చయించినకతమున నితనిమతము నాదల దాల్చి విశ్వనాథ విద్యాధర విద్యానాథాది నవీనులుగూడ దాని నంగీకరించిరి.

అలంకారసర్వస్వమునందలి విమర్శనవిధానమును గురించి గ్రంథకర్తయే వివరించెను. సూత్రములకు వృత్తిని రచించి లక్ష్యముల నొసంగి వానిని సమన్వయ మొనరించెను. ధ్వనిమతానుసారుల పక్షము ననుగమించుటచే రాజానకరుయ్యకుడు ధ్వనిమతప్రాశస్త్యమును ప్రమాణముగ నంగీకరించి, చిరంతనాలంకారికుల మతముల తత్త్వమును దిజ్మాత్రముగ నుపన్యసించి, ప్రాచీనమతములలో ధ్వనికి గల ప్రాచుర్యమును ప్రదర్శించెను. వాద్యోపస్కారకత్వమే అలంకారముల కాత్మభూత మగుటచే, పూర్వాచార్యుల మతమున

ప్రతీయమానార్థము అలంకారపక్షనిక్షిప్త మని రుయ్యకుడు రచించెను. ఇదియే భామహోద్భటదండివామనరుద్రటుల ముఖ్యాశయము. ఇంక, ఆనందవర్ధనునితరువాత వచ్చిన రాజానకకుంతలాచార్యుడు ఉపచారవక్రతాదులచే సమస్తధ్వనిప్రపంచమును స్వీకృత మయ్యె నని ప్రతిపాదించెను. భట్టనాయకుని మతమున ప్రతీయమానార్థము కవిప్రౌఢోక్తిసిద్ధమై కావ్యాంశత్వమును గాంచును. రసచర్వణాత్మకమైన భోగాపరపర్యాయవ్యాపారమే ప్రధానమైన విశ్రాంతిస్థానముగ నంగీకృత మయ్యెను. అభిధాభావకత్వలక్షణవ్యాపారద్వయోత్తీర్ణమై భోగము చెలంగు నని భట్టనాయకుని భావము. వ్యక్తివివేకకారు డన్నచో, వాచ్యవ్యంగ్యార్థములకు లింగలింగిసంబంధము గానవచ్చుటం జేసి ధ్వనిప్రపంచ మంతయు అనుమానాంతర్గత మని వాదించెను. ఈప్రతిపక్షమతములు సమంజసములు గాకుండుటవలన రాజానకరుయ్యకాచార్యుడు వానిని నిరసించి ధ్వనిమతమును శిరసావహించి 'వ్యంగ్యనిష్ఠమై వ్యంజనావ్యాపారము గల' దని సిద్ధాంతీకరించెను. మరియు ధ్వని, గుణీభూతవ్యంగ్య, చిత్రకావ్యభేదత్రయమును సమ్మతించి, మొదటిరెండుభేదములను అలంకారమంజరియందు ప్రదర్శించితినని వచించి, వ్యంగ్యార్థరహితము, వాగ్వికల్పవైచిత్ర్యయుతము నైన చిత్రకావ్యభేదమును రుయ్యకుడు అలంకారసర్వస్వమున నిరూపించెను. ఆనందవర్ధనాచార్యు డీచిత్రకావ్యభేదమును ధ్వన్యాలోకమున వివరింపనిలోపమును రుయ్యకుడు సర్వస్వమును రచించి సవరించెను.

వక్రోక్తివైచిత్ర్యమే కవివ్యాపారము గాని కేవలరసాదిప్రతీతిగా దని వచించి, వైచిత్ర్యము, లేక విచ్ఛిత్తివిశేషమే కావ్యాలంకారస్వరూప మనియు, కవిప్రతిభానిర్వర్తితమై వైచిత్ర్యము

వెలుంగు ననియు కుంతలాచార్యుడు కొనియాడెను. ఈపదములు నూత్న నములు గావు. కవిప్రతిభను సకలాలంకారికులును సమ్మతించిరి. వామనుని 'సౌందర్యమే' కుంతలుని 'వైచిత్ర్యము' 'లేకవిచ్ఛిత్తి' గా మారెను. ఆనందవర్ధనుడు 'ఉక్తివైచిత్ర్యము'ను చేరొ్కనెను. మమ్మటుడు గూడ వైచిత్ర్యమే అలంకార మని రచించెను. ఉపమావిచ్ఛిత్తిని గురించి అభినవగుప్తుడు పలుకుటయే కాక, కామనీయకము, లేకచారు త్వము దీనికి పర్యాయపద మని తెల్పెను. రాజానకరుయ్యకుడు నూతనమతము నొకదాని నుపవర్ణింపక, కుంతలాచార్యుని అలంకార విమర్శనవిధానమును స్వీకరించి, ప్రత్యేకాలంకారస్వరూపవిభేద మును వివరించెను. విశ్వనాథజగన్నాథాదులు రుయ్యకునిమార్గముననే తమతమగ్రంథముల నిర్మించిరి. యథాసంఖ్యమును ప్రత్యేకాలంకార ముగ నంగీకరింపనగునా, కూడదా యనువిమర్శనమున జయరథుడు 'వక్రోక్తిజీవితకారునిచే నిది సప్రపంచముగ వచింపబడుటచే మాచే వివరింపబడలే' దని వ్యాఖ్యాన మొనరించినకారణమున కుంతలుని మార్గమును రుయ్యకు డనుసరించె నని చదువరు లెరుంగవలయును. విచ్ఛిత్తిస్వరూపమును సర్వస్వకారుడు వేరుగ వివరింపకున్నను, వ్యక్తి వివేకవ్యాఖ్యానమునందు శబ్దార్థముల విచ్ఛిత్తియే అలంకార మనియు, విచ్ఛిత్తి కవిప్రతిభోల్లాసరూప మనియు, కవిప్రతిభోల్లాస మనంత మనియు, అనంతత్వమును భజించుటవలన పరిగణింప శక్యము గా దనియు రచించెను. 'వాచస్పతిసహస్రము సహస్రప్రయత్న మొన రించి బంధించినను, జగత్ప్రకృతిసరణి నయ్యది క్షయము పొంద' దనిన ఆనందవర్ధనునివచనములకు రుయ్యకునిపలుకులు ప్రతిధ్వనులు గానోపును. కావున కవిమతిచే నుపభుక్త మైనను, అనంత మైన కావ్య

స్థితి పరిక్షీణముగాక నవనవవ్యుత్పత్తివిశేషమున పరివర్ధనము గాంచి ప్రకాశించునని భావము.

ఇటుల కవిప్రతిభాఫలిత మైన విచ్ఛిత్తివిశేషమును అలంకార నిరూపణమునకు ప్రమాణసూత్రముగ పరిగ్రహించి రుయ్యకుడు అలంకారసర్వస్వమును రచించెను. అందువలన విచ్ఛిత్తివిశేషవిరహిత మైనచో తార్కికానుమానములును, ప్రాకృతికసందేహములును అలంకారములు గానేరవు. ఈవిషయమును రుయ్యకునికన్న జయరథుడు స్పష్టముగ వివరించెను. కవికర్మ, లేక కవిప్రతిభపై నాధారపడి విచ్ఛిత్తివిశేషము చెలంగినప్పుడే దాని నలంకారముగ నంగీకరింపవలెను. లేనిచో త్రోసిపుచ్చవలె నని విమర్శనకారుడు రచించెను. ఆధునికు లందరును దీనిని విశ్వసించిరి. అప్పయ్యదీక్షితుడు దీనిని చిత్రమీమాంసయందు వివరించెను. 'భణితివిశేషరూపత్వము లే అలంకారము' లని జగన్నాథు డనేకసారులు వచించెను. భణితివిశేషము, వైచిత్ర్యము, విచ్ఛిత్తులకు మారుగ విశ్వనాథజగన్నాథులు హృదయత్వము, చమత్కారిత్వము, సౌందర్యము నను పదములను చేర్కొనిరి. అలంకారముల పరస్పరవిచ్ఛేదవైలక్షణ్యములయొక్క హేతుభూతజన్యతాసంసర్గముచే కావ్యనిష్ఠమై కవిప్రతిభయు, తజ్జన్యత్వప్రయుక్తమై చమత్కారిత, లేక విచ్ఛిత్తియు జెలంగు నని సారాలంకారప్రకరణమునందును, వైచిత్ర్యాత్మక మైన విచ్ఛిత్తివిశేష మనగా జన్యతాసంసర్గముచే కవిప్రతిభావిశేషము, లేక తన్నిష్ఠత్వప్రయుక్త మైన చమత్కృతివిశేష మనియు జెప్పను నని కావ్యలింగప్రకరణమునందును పండితరాయలు రచించెను.

అలంకారసర్వస్వమునందలి ప్రత్యేకాలంకారముల స్వరూపస్వభావముల విలక్షణవిమర్శనమును పరిశీలించినచో దాని కాపేరు

సార్థక మనుచున్నది. రుయ్యకునిమతమున డెబ్బదియేను ప్రత్యేకా లంకారములు గలవు. దీనిని గాంచినచో స్థూలదృష్టి కీతడు అలంకార మతానువర్తిగా గన్పట్టును. ఉద్భటాచార్యు డన్నచో రుయ్యకుని కత్యంతాదరము. రుయ్యకుని జనకుడు ఉద్భటాలంకారమునకు వివేకము, లేక విచార మనుటీకను రచించినట్లు జయరథుని వలన తెలియవచ్చును. తాను 'చిరంతనమతానుయాయి' నని రుయ్యకుడే స్వయముగ వచించెను. దీనికి తార్కాణముగ నితనివ్యాఖ్యాతలు జయరథుడును, సముద్రబంధుడును 'రుయ్యకుడు భామహోద్భటమతావలంబకు' డని రచించిరి. భామహోద్భటప్రభృతు లైన చిరంతనాలంకారికుల ప్రాచీనభావములకును, ఆనందవర్ధనమమ్మటాదులగు నవీనాలంకారికుల నూతనసంప్రదాయములకును పరస్పరసమన్వయము గలిగించి, రాజానకరుయ్యకుడు అలంకారముల కపూర్వస్వరూపసౌందర్యమును సంపాదించెను. ఇందులకు నిదర్శనముగ శ్లేషాలంకారస్వరూపమును దిలకింతము. శ్లేషాలంకారమునందలి విభాగములకును, దీనికిని మరియొక అలంకారమునకును సంబంధము సంభవించినపుడు వానివానికిగల విభేదములకును గల ప్రాచుర్యమునుగురించిన వివాదము ఉద్భటాచార్యుని కాలమునందే మొదట నుద్భవించెను. ఇచట రుయ్యకుడు శబ్దశ్లేషము, అర్థశ్లేషము, ఉభయశ్లేషము నను భేదత్రయము నంగీకరించి, "ఏఅలంకారము దేని నాశ్రయించునో, అది యా అలంకార" మను సూత్రమును సమ్మతించెను. 'ఆశ్రయాశ్రయిభావమూలకమై చెలంగక, అన్వయవ్యతిరేకములపై నాధారపడి శబ్దార్థశ్లేషాలంకారములు వెలుంగుటచే అర్థశ్లేషముకై వడి శబ్దశ్లేషము పరివృత్తిసహాముగా' దను మమ్మటాచార్యునిమతమును రుయ్యకుడు నిరాదరించెను.

ఇంక అలంకారసర్వస్వకారునిమతమున సభంగశ్లేషమునకు జతుకాష్ఠన్యాయముచే శబ్దద్వయవృత్తిత్వమును, అభంగశ్లేషమునకు ఏకవృంతగత ఫలద్వయసామ్యమున అర్థద్వయవృత్తిత్వమును స్ఫుటముగ సంభవించును. ఉభయశ్లేషమున కీరెండు ప్రక్రియలును వర్తించును. శ్లేషాలంకారసందర్భమున మమ్మటుని మతమును విశ్వనాథుడును, రుయ్యకుని విభాగమును విద్యాధరుడును స్వీకరించిరి.

మరియు, అలంకారాంతరవిషయవినివేశ మీశ్లేషాలంకారమునకు సంభవించెడి సందర్భమున దేనిని సమ్మతింపవలయు ననుప్రశ్న యుదయించెను. ఇచట పక్షత్రయమున కవకాశము గలదు. అలంకారాంతరమునకు బాధకత్వము చేకూరునా, లేదా, సంకీర్ణత్వము నంగీకరింపవలెనా? కానిచో శ్లేషమునకే బాధ్యత్వము సమ్మతింపనగునా? ఈవిషయమున రుద్రటాచార్యుడు ప్రథమపక్షము నవలంబించెను. శ్లేషాలంకారము ప్రాప్తించినపుడు అలంకారాంతరమునకు బాధ చేకూరును. అట్టిచోట నలంకారాంతరప్రతిభమాత్రమే కానవచ్చును. కావున శ్లేషాలంకారమునే గ్రహింపవలయు నని రుద్రటుని ముఖ్యాశయము. రాజానకరుయ్యకు డీపక్షము నంగీకరింపక మమ్మటాచార్యుని మార్గము నవలంబించెను. ఉపమాప్రతిభోత్పత్తిహేతుకమై శ్లేష మున్నదా? అట్లు గానిచో శ్లేషప్రతిభోత్పత్తిహేతుకమై ఉపమ జెలగునా? అను ప్రసంగమున రుద్రటమతము నుదాహరించుచు ప్రకాశకారు డిటుల రచించెను: 'కమల మివ ముఖం' అనుచో సాధారణధర్మ ప్రయోగశూన్యములైనపట్టుల ఉపమావిషయమనుట యుక్తము గాదు. ఏల నన, అట్టిచో నిర్విషయత్వాపత్తి సంభవించుటచే పూర్ణోపను లేదు. మరియు ఉపమాద్యలంకార వివిక్తవిషయము శ్లేషమునకు కొన్నిచోట్ల గానవచ్చును. రెంటికిని

యోగము సంభవించినచో నచట సంకరము చెలంగును. విరోధాభాస మున విరోధము గానవచ్చురీతిని శ్లేషాభాసమున శ్లేషము గానరాదు. కావున నిటువంటివాక్యములలో శ్లేషప్రతిభోత్పత్తిహేతుకమై అలంకారాంతరము మెలంగును. దీనివలన మమ్మటునిమతమున అలంకారాంతరప్రతిభోత్పత్తిహేతుకమై శ్లేషాలంకారము ప్రకాశింపనేరదని చదువరు లెరుంగవలయును. ఈ సందర్భమున ప్రకాశకారునితో సర్వస్వకారు డేకీభవించెను. ఇటులనే మిగిలిన అలంకారముల ప్రత్యేకతను, స్వరూపమును, స్వభావమును గురించి రాజానకరుయ్యకుడు విపులముగ జర్చించెను. ప్రాచీనమతసంప్రదాయముల మూఢభక్తితో నాదల ధరింపక, వానిని విలక్షణముగ విమర్శించి రుయ్యకుడు అలంకారసర్వస్వము నన్వర్థాభిధానముగ నొనరించెను. ఇతనిగ్రంథమున మొదటి నుండియు తుదిదనుక చిరంతననవీనాచార్యుల భావములకు సమన్వయము సలక్షణముగ గన్పట్టును. వక్రోక్తిజీవితకారుని అలంకారస్వరూపలక్షణము నాదర్శముగ గైకొని, ఉద్భటరుద్రటవామనాదుల అలంకారస్వభావమును రుయ్యకుడు తన గ్రంథమునందు ప్రతిబింబింపజేసెను. ఇంతమాత్రమున నీత డలంకారమతానుసారు డని చెప్ప సాహసింపరాదు. తాను ధ్వనిమతావలంబకు డైనట్లు రుయ్యకుడే వచించెను. మరియు వ్యక్తివివేకవ్యాఖ్యానమునం దీతడు ధ్వనిమతాభ్యుదయము నప్పినప్రయత్న మత్యంతశ్లాఘాపాత్రము. రుయ్యకుడు ధ్వనిమతావలంబకు డని వ్యక్తివివేకవ్యాఖ్యానమే చాటి చెప్పును.

---

(రసమతసముద్ధరణము - విశ్వనాథుడు)

మమ్మటాచార్యుని కావ్యస్వరూపలక్షణమును ఖండించుటకు కంకణము గట్టుకొనిన కవిరాజు విమర్శనము, కాలక్రమమున కావ్య

ప్రదీపకారు డైన మహామహోపాధ్యాయ గోవిందచంద్రునిచేతను, రస గంగాధరకారు డైన జగన్నాథపండితేంద్రునిచేతను పునర్విమర్శన ములకు పాత్ర మయ్యెను. నవ్యమతాభ్యుదయమునకు దర్పణకారుడు ప్రయత్నించినను, ప్రకాశకారుని లక్షణమును ప్రత్యాఖ్యాన మొన రించి 'రసాత్మకవాక్యమే కావ్య' మని ప్రతిపాదించుటచే విశ్వ నాథుడు రసమతసముద్ధరణమునకు జేయూత నొసంగె నని చెప్పక తప్పదు. వాచ్యగత మొనరింపక వదలినను ఆనందవర్ధను డత్యంతా దరము జూపి మన్నించినట్టియు, కావ్యాత్మగ నంగీకరించి అభినవ గు ప్తపాదు డనూనాభిమానమును ప్రకటించినట్టియు రసధ్వనికి సుస్వా గత మొసంగి విశ్వనాథు డప్రతిమానప్రణయభావమున నతిథిసత్కార మాచరించెను. ఇటుల రసధ్వనిరామణీయకసందర్శనమున విహ్వలు డై, విధేయు డై విశ్వనాథుడు స్వప్రతిభాసర్వస్వము నర్పించి దాని సహజ స్వరూపసౌందర్యమును సాహిత్యదర్పణమున ప్రతిబింబితము గావించి సహృదయులచే కవిరా జను ఖ్యాతి గాంచెను. ఈరీతిని రసధ్వని పక్షపాతమును ప్రదర్శించినకతమున 'వస్త్వలంకారప్రధానము లైన కావ్యములందు విశ్వనాథునిలక్షణమున కవ్యాప్తిదోషము సంభ వించును. ఇంతమాత్రమున నివి కావ్యములు గా వనుట మహాకవి సంప్రదాయభంగప్రసంగమై చెలంగును. ఏల నన, కపిబాలాదివిలసిత ములను, జలప్రవాహవేగనిపతనోత్పతనభ్రమణములను కవులు వర్ణిం చిరి. ఇట్టివర్ణనముల కావ్యములుగ నైకొనవలసినచో పారం పర్యముగ రసస్పర్శము వీనిలోగూడ గల దని చెప్పవలయును. ఇట్లు వచించుట సర్వానుభవసిద్ధము, సహృదయరంజకము గాదని రస గంగాధరకారుడు రచించెను. మరియు రసధ్వనిని ముఖ్యాంశముగా గ్రహించుటవలన దోషదూషితము లైనను రసాదివైచిత్ర్యమును

గల్గినమాత్రముననే కావ్యము లని నుతి గాంచుటయు, వస్త్వలంకార ధ్వనివిశేషసముపేతము లైనను రసదూరము లైనచో కావ్యములు గా వని నింద బొందుటయు సంభవించును. ఈ విమర్శనములను సంభావించియే వస్తుధ్వనివిషయమును జర్చించుచు 'వస్తుమాత్ర వ్యంగ్యమునకు కావ్యవ్యవహారము జెల్లదు. అట్టిచోట రసాభాసము దీపించుటచే కావ్యవ్యవహారము సమ్మతింతు' మని విశ్వనాథుడు వివరించెను. దీనికి జగన్నాథపండితుడిట్లు సమాధాన మొసంగెను: 'యథానుసారముగ రసస్పర్శము గలదని పలికినచో 'ఆవు పోవును; లేడి లేచెను' అను వాక్యములలో గూడ రసస్పర్శమో, లేక రసాభాసమో కానవచ్చునని తలంపనగును. కావున పారంపర్యముగ రసస్పర్శము గల దని చెప్పరా' దని పండితరాయలు వచించెను. కావున సాహిత్యసారసలోచనాస్వైరవిహారమునకు సహృదయులు సమ్మతింపవలయునే కాని, శాస్త్రసంప్రదాయశృంఖలల బంధించినచో రసభంగకారణ మని నిరూపించుటకు విశ్వనాథుని లక్షణనిర్మాణ మింకొకనిదర్శన మని సరసమతులు భావింపవలయును.

ఇటుల రసప్రాధాన్యమును ప్రకటించుటకన్న విశ్వనాథుడు వేరేమియు విశేషముల తనగ్రంథమున జేర్పలేదు. రచనాక్రమమంతయు ప్రకాశకారునిఫక్కినే చెలంగుచున్నది. ఇతడు కావ్యప్రకాశమునకు దర్పణ మనువ్యాఖ్యానము రచించెను. దీనివలన కావ్యప్రకాశకారు డన్నచో కవిరాజున కత్యంతాదరగౌరవము లున్నటుల గానవచ్చును. వాక్యము రసాత్మకమ్ము కావ్య మ్మటంచు వచించిన పిదప వాక్యస్వరూపమును, అర్థత్రైవిధ్యమును వివరించి, వ్యంజనావృత్తిప్రతిపాదన మొనరించి, వ్యంజనాశక్తియే రసాదిప్రతీతి

కత్యంతావశ్యక మని సమర్థించెను. తరువాత ధ్వనిగుణీభూత వ్యంగ్యకావ్యద్వయభేదమునుమాత్రమే సమ్మతించి, అర్ధాంగీకార మున ఆనందవర్ధను డాదరించినట్టియు, మొదల దాల్చి మమ్మటా చార్యుడు సమ్మానించినట్టియు తృతీయభేద మైన చిత్రకావ్య మును నీరస మనుకారణమున జీరికింగొనక కవిరాజు నిరసిం చెను. ఆనందవర్ధనునిమార్గము ననుసరించి, వస్త్వలంకారధ్వనిభేద ములను శబ్దార్థశక్త్యుద్భవము లైన సంలక్ష్యక్రమవ్యంగ్యములుగ విశ్వ నాథుడు గణించెను. అప్రధానముగనో, లేక ప్రధానముగనో రసప్రతీతి గల్గుటయే కావ్యలక్షణ మగుటచే, ఇతరాంగము లై రసాదుల కెచట ప్రతీతి గల్గునో దానిని గుణీభూతవ్యంగ్యముగ గ్రహించుటచే కావ్యత్వ హాని సంభవింపదు. ఈరసపక్షపాతమువలననే మిగిలినవారు వదలిన రూపకభేదములగూడ సాహిత్యదర్పణమున జర్చించి, విభావానుభావ మూలకము లైన రసాదులను విశ్వనాథుడు విపులముగ వివరించెను. మరియు కావ్యలక్షణానుకూలముగనే దోషములు రసాపకర్షకము లనియు, గుణాలంకారరీతులు రసోత్కర్షహేతువు లనియు కవిరాజు లక్షణమును విధించెను. 'దేహద్వారమున, అనగా శబ్దార్థద్వారమున కావ్యాత్మభూతమైన రసమునకు గుణము లుత్కర్షను గూర్చి కావ్యసౌందర్యమునకు తోడ్పడును. ఇచట గుణముల రసధర్మత్వమును, గుణశబ్దమును గుణాభివ్యంజకశబ్దార్థముల కుపచరించును. అందువలననే గుణాభివ్యంజకము లైన శబ్దములు రసోత్కర్షావహము లని మొదటనే వచింపబడె' నని సాహిత్యదర్పణమున రచింపబడెను. ప్రత్యేకవర్ణ విన్యాసమువలన చిత్తద్రవీభావ, విస్తార, వ్యాప్తిమయము లై క్రమ ముగ మాధుర్యౌజఃప్రసాదగుణములు రసాస్వాదమును గలిగించును. ఈసందర్భమున ప్రాచీనుల దశగుణములను వేరొకని మమ్మటునివలెనే

విశ్వనాథుడు వానిని గాదని మాధుర్యగుణములనుమాత్రమే సమ్మ తించెను. మమ్మటునిమాడ్కి రీతివృత్తుల కభేదము నంగీకరింపక విశ్వ నాథుడు రీతులకు ప్రత్యేకత నాపాదించెను పదసంఘటనమే రీతి యనియు, రసాదుల కుపకారకములై రీతులు చెలంగు ననియు వచించెను. రీతులు కావ్యాంగసంస్థావిశేషమున దీపించి నాల్గుతెరం గుల మెలంగును. తియ్యదనము నెదజల్లుచు, లలితవర్ణమిళితమై, సమాస రహితము, లేదా స్వల్పసమాససహితమై వైదర్భియు, కరకుదనము నెరయ మెరయుచు, ఉద్భటాక్షరబంధాడంబరసముపేతమై, దీర్ఘ సమాససంశోభితమై గౌడియు, వైదర్భిగౌడీరీతుల వెలుంగు వర్ణ ములు గాక తక్కినవానితో గూడి సమస్తపంచషపదబంధసమన్వి తమై పాంచాలియు, వైదర్భిపాంచాల్యంతరమై లాటీరీతియు వర్తించు నని విశ్వనాథుడు లక్షణ మేర్పరచెను.

గుణత్రయముపై నాధారపడి రీతులు నవ్యమతమున జెలు వారును గాన మమ్మటాచార్యుని మార్గమే నిష్కంటకమై చెలంగు నని చదువరు లూహింపవలయును. మరియు రాజానకరుయ్యకుని తోపాటు 'రసవిషయవ్యాపారవతి యైన వర్ణరచనమే వృత్తి' యనియు, 'తదనుగతప్రకర్ష న్యసనమువలన వృత్త్యనుప్రాసము భాసించు' ననియు దర్పణకారుడు వచించెను. కడపట మమ్మట రుయ్యకులవలెనే శబ్దార్థముల కస్థిరధర్మములై శోభాతిశయమును గూర్చి రసాదుల కుపకారకములై అలంకారములు జెలంగునని కవిరాజు రచించెను. ఇచట 'అస్థిరము' లనుటచే గుణములకై వడి నలంకారము లావశ్యకములు గావని గ్రంథకర్తయే వివరిం చెను. ఇటుల కావ్యప్రకాశమున కనుకరణముగ తనగ్రంథమును రచించినను, అభినవగుప్తపాదుని రసధ్వని కనుస్యూనముగ పొండి

త్త్యమును ప్రకటించి కావ్యస్వరూపమును సాహిత్యదర్పణమున ప్రతిఫలింపజేసి విశ్వనాథకవిరాజు రసమతసముద్ధరణ మొనరించెను. ఆనందవర్ధన మమ్మటరుయ్యకుల గ్రంథములలోని వివిధవిషయము లిందు గానవచ్చును. ఈవిషయమున విశ్వనాథుడు వివేకదూరుడయ్యె నని తలంచుటకన్న నతని విపక్షమతగ్రంథసంగ్రహస్వీకారమే ధ్వనిమతప్రాశస్త్యమును ప్రకటించుచున్న దని భావించుటయే చాల మేలు. కావ్యప్రకాశమువలె దర్పణముగూడ కారికావృత్తులతో గూడియున్నను కావ్యప్రకాశమునకైవడి కఠినశైలిగాక, రసగంగాధరమునరణి తర్కకర్కశము గాక, మాధుర్యసౌకుమార్యములతో నది చెలువారుచు చదువరుల డెందముల గరంచుచున్నది. మరియు రూపకలక్షణముగూడ గూర్పబడుటచే నలంకారగ్రంథములలో నెల్ల సాహిత్యదర్పణము సరసమై, సమగ్రమై సహృదయుల సంస్తవమునకు పాత్ర మయ్యెను.

---

## (అలంకారమతానుకరణము—విద్యాధరవిద్యానాథులు)

మమ్మటరుయ్యకులతరువాత వచ్చిన నవీనులకు స్వతంత్రపథమున సంచరించుట కవకాశము లేకపోయెను. ధ్వనిమతము చిరస్థాయిగ నెలంగెను. విశ్వనాథుడు రససముద్ధరణమున కొనరించిన విశ్వప్రయత్నము విఫల మయ్యెను. కావ్యాత్మతత్త్వముతోపాటు అలంకారస్వరూపముగూడ రుయ్యకాదులచే నిర్వచింపబడెను. స్వతంత్రగ్రంథములు గాని, విమర్శనగ్రంథములు గాని క్రొత్తగ రచించుట కెంతమాత్రమును వీలు లేకుండెను. నూతనమార్గమును ద్రొక్కుటకు దగిన ప్రతిభావంతులుగూడ లేకుండిరి. భరతఖండమునం దంతటను ప్రతి

కూలమారుతములు వీచుటచే, పారతంత్ర్యవాతావరణముతో రాజకీయపరిస్థితులు పరిపూర్ణముగ నిండిపోయెను. ఈ రాజకీయపారతంత్ర్యవశమే భాషాజగమునం దుల్లేఖ గానవచ్చెను. ఇంతనుండి స్వతంత్రరచనలు సమసిపోయి, పండితలోకముగూడ బానిసతనంపుపథము నవలంబించి, గ్రంథానుకరణములను, వివిధవ్యాఖ్యానవివరణములను వెలయించుటవలననే కాలము గడవజొచ్చెను. కావ్యప్రకాశమునకు నేడు గానవచ్చుచున్న వ్యాఖ్యానము లీవిషయమును వెల్లడి చేయును. ఇటుల భాషాలోకమునం దావరించిన గాఢాంధకారమునం దొకటిరెండు నక్షత్రము లచ్చటచ్చట వెలుంగజొచ్చెను. నవ్యమతమును సుగమముగ చదువరులకు బోధించుటకై విద్యాధర, విశ్వనాథులును, అలంకార విభేదమును విలక్షణముగ నెరుకపరచుటకై జయదేవ, అప్పయ్యదీక్షితులును పాటుపడిరి.

మమ్మటుని కావ్యప్రకాశమునకు ప్రతిరూపముగ విద్యాధరుడు ఏకావళీగ్రంథమును నిర్మించెను. ధ్వనిప్రధానముగ కావ్యము వెలుంగు నని ప్రతిపాదించి, కావ్యాంగలక్షణప్రయోజనముల ప్రథమాధ్యాయమున విద్యాధరుడు వివరించెను. ఇచట ధ్వనిప్రతిపాదనమున ఏకావళీకారుడు తూచా తప్పక ఆలోకకారుని కారికల ననుసరించెను. ధ్వనికారుని కారికలను సూత్రకలుగా గ్రహించి విద్యాధరుడు కారికల రచించెను. ఈసందర్భమున ధ్వనిమతప్రతికూలుర వాదముల నుదాహరించి విద్యాధరుడు వానిని విమర్శించి ఖండించెను. ఈవిమర్శనఖండనములు చాలవరకు ఆనందవర్ధన, మమ్మటాచార్యుల భాషణములకు ప్రతిధ్వనులు. రెండవ అధ్యాయమున అభిధాలక్షణావ్యంజనావిభేదమును, మూడవ అధ్యాయమున ధ్వనికావ్యవిభాగమును ప్రదర్శించెను. వాచ్యార్థము నతిశయించి వ్యంగ్యార్థము వెలుంగు నని వచించుచు, రస

మతసమాలోచనమునగల వివిధవాదముల బేర్కొని, అసంలక్ష్యక్రమ వ్యంగ్యమునందు రసధ్వనిప్రాశస్త్యమును విద్యాధరుడు గొనియాడెను. గుణీభూతవ్యంగ్యకావ్యభేదమును నాల్గవ యధ్యాయమున గూర్చెను. గుణాలంకారరీతుల తారతమ్యమును అయిదవ యధ్యాయమున వివరించుచు, ప్రాచీనుల భావముల నించుక విమర్శించుచు, మమ్మటాచార్యునిమతమును సమర్థించెను. ఆవల దోషముల వచించి, కడపటి రెండు అధ్యాయములలో శబ్దాలంకార, అర్థాలంకారముల గురించి రచించెను. ఇచట నలంకారవిచారమున విద్యాధరుడు ప్రాయికముగ రాజానకరుయ్యకుని మార్గ మవలంబించెను. అలంకార విభాగమునందు విశ్వనాథ, విద్యాధర, విద్యానాథులు చాలవర కేకీభవించిరి. ఈగ్రంథసంగ్రహమును గమనించినచో మమ్మటుని కావ్యప్రకాశమునకును, విద్యాధరుని ఏకావళికిని రచనాశక్తిలో వీసమేనియు భేదము లే దని చదువరులకు తెలియవచ్చును.

విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణమునకును, విద్యాధరుని ఏకావళికిని రచనావిధానమున విశేషభేదము గన్పట్టును. విద్యాధరుడు మమ్మటభట్టారకుని ప్రకాశమునకు ప్రతిరూపముగ నేకావళిని రచింప, విద్యానాథుడు విశ్వనాథుని దర్పణమునకు ప్రతిబింబముగ యశోభూషణమును నిర్మించెను. కావున కావ్యప్రకాశ సాహిత్యదర్పణములకు గానవచ్చు రచనాక్రమభేదము ఏకావళీయశోభూషణములకుగూడ గానవచ్చును. దర్పణమునందలి పదిపరిచ్ఛేదములలో గలవిషయ మంతయు భూషణమునందలి తొమ్మిదిప్రకరణములలో ప్రదర్శిత మయ్యెను. గ్రంథరచనమున విద్యాధరవిద్యానాథులకు విశేషభేదము గన్పట్టుచున్నను, విషయనిరూపణమున విద్యాధరునివిధముననే విద్యానాథుడుగూడ చాలవరకు మమ్మటా

చార్యుని మార్గముననే చనెను. ఇంతమాత్రమున కేవలమమ్మట మతోపజీవియు, తదీయపథానువర్తియు నైన విద్యానాథుడు జరించ ననరాదు. కావ్యాత్మవిచారమున మమ్మటాచార్యునితో నేకీభవించి నను, గుణవిచక్షణమున భోజదేవుని సమ్మానించి అలంకారవిభాగ మున రాజానకరుయ్యకునితో నెయ్య మొనరించి, విద్యానాథుడు విమర్శనవిజ్ఞానమును, స్వాతంత్ర్యాభిలాషను ప్రకటించెను. అలంకారగ్రంథముల రచించి ప్రాచీనాచార్యులు ప్రసిద్ధి గాంచి నను, గ్రంథగ్రంథకారుల కీర్తిప్రతిష్ఠలకు మూలవిషయ మైన నేతృగుణనిరూపణము, చిరంతనుల ప్రబంధముల మందునకైన గానరా దనులోపమును జూపించి, విద్యానాథుడు ప్రతాపరుద్ర యశోభూషణనిర్మాణమున దనకళాకౌశలమును బ్రదర్శించెను. పుణ్య శ్లోకుడైన మహాపురుషునివర్ణనము ప్రబంధమునకును, మహాకవికిని ప్రఖ్యాతికారణ మని ప్రశంసించి, దీనికి లక్ష్యముగ సాంగనాటకము నుదాహరింతు నని ప్రతిన జేసి విద్యానాథుడు ప్రతాపరుద్రరాజ్యాభి షేకమహోత్సవమును నాటకరూపముగ గ్రంథమున బొందుపరచి దానిపేరు వన్నెమీర జేసెను. కావుననే ప్రథమమున నాయక ప్రకరణమును రచించెను. అందు నాయకగుణములను, స్వరూపవర్ణన మును, ఉదాత్తాదినాయకవిభేదమును వివరించెను. పిదప కావ్య స్వరూపమును నిరూపించి, కైశిక్యాదివృత్తులను, రీతిశయ్యాపాక విశేషములను, కావ్యవిశేషవిభేదమును రెండవప్రకరణమునందు తెలియ జేసెను. విద్యానాథుని కావ్యలక్షణము చాలవరకు మమ్మటుని కావ్య లక్షణము బోలియున్నది. 'దోషవర్జితము, గుణాలంకారసహితము నైన శబ్దార్థమే కావ్య' మనియు, 'గద్యపద్యోభయమయమై కావ్యము వెలంగు' ననియు విద్యానాథుడు వచించుటచే నిచట రచనా

విశేషము ననుసరించి కావ్యము మూడురీతుల విభజింపబడెను. ఇటుల కావ్యసామాన్యలక్షణమును విధించి విశేషాంగవర్ణనము నొనరించెను. శబ్దార్థము మూర్తిగ వెలంగి, వ్యంగ్యవైభవమే జీవితముగ వెలింగి, హారాదులలీల నుపమాద్యలంకారములును, శౌర్యాదులవోలె శ్లేషాదిగుణములును మెలంగు నని విద్యానాథుడు వాక్రుచ్చెను. మరియు రీతులు స్వభావముపగిది నాత్మోత్కర్షావహములనియు, వృత్తులు వర్తనముకైవడి కృత్రిమశోభాధాయకములనియు, శయ్య శయ్యచాయ పదానుగుణ్యవిశ్రాంతి నొసంగు ననియు, పాకము పాకముపగిది రసాస్వాదప్రభేదమును జేకూర్చు ననియు రచించి విద్యానాథుడు కావ్యసామగ్రీసంపద లోకసామగ్రీసంపదతో వియ్యమందు నని వివరించెను. తరువాత శబ్దార్థజాతత్రైవిధ్యమును, రచనాశ్రితములైన కైశిక్యాదిచతుర్విధవృత్తుల వృత్తాంతమును, రీతిశయ్యాపాకస్వరూపవిభేదమును నిరూపించి కడపట నైదువేల మూడువందల నాలుగు ధ్వనివిశేషములను, అష్టవిధ గుణీభూతవ్యంగ్యమును, మహాకావ్యోపకావ్యాదిప్రబంధనిరూపణమును కావ్యప్రకరణమున గ్రంథకారుడు ప్రదర్శించెను. ఇటుల ధ్వనివ్యంజకత్వములగురించి విపులముగ వివరించినను, 'రచనయందు గూడ రసవ్యంజకత్వము ప్రసిద్ధ'మనియు, 'ధ్వనిమత్త్వమే గాంభీర్య'మనియు విద్యానాథుడు నుడువుటవలన రసవ్యంజకత్వధ్వనిమత్త్వములకు మతాంతరయోజనము గాననగును. కావ్యప్రకరణానంతరమున నాటకప్రకరణమును రచించెను. దీనియందు నాట్యస్వరూపమును, దశవిధరూపకభేదమును, వస్తునేతృరసాదిరూపకసామగ్రీవిశేషమును, ముఖప్రతిముఖాదిపంచసంధిసంధ్యంగనిరూపణమును ధనంజయదశరూపకోక్తరీత్యనుసారముగ వివరించి, కాకతీయరాజ్యలక్ష్మీప్రాప్తి

నామకసాంగనాటకము నుదాహరించి విద్యానాథుడు ప్రాచీనాలంకారికగ్రంథగౌరవలోపమును దీర్చెను. పిదప రసప్రకరణమునందు రసస్వరూపమును, రత్యాదిస్థాయిభావములను, సాత్త్వికవ్యభిచారిభావములను, శృంగారచేష్టామన్మథావస్థాదులను వివరించెను. తరువాత పదవాక్యార్థదోషముల నొకప్రకరణమునను, గుణనిరూపణమును వేరొకప్రకరణమునను విధించెను. కడపటి మూడుప్రకరణములలో శబ్దార్థమిశ్రాలంకారముల లక్ష్యలక్షణముల నిర్మించెను. మమ్మటాచార్యుని కావ్యప్రకాశము నాదర్శముగ జేకొని ధ్వనివిభాగము నొనరించినరీతినే, రూపకనిరూపణమున ధనంజయుని, గుణవిచక్షణమున భోజదేవుని, అలంకారవిచారమున రాజానకరుయ్యకుని గ్రంథములను మాతృకలుగ గ్రహించి విద్యానాథుడు ప్రతాపరుద్రీయమును రచింపనొప్పును.

ఈసందర్భముననే నవీనాలంకారికులచే నుతింపబడుచున్న శయ్యాపాకముల చరిత్రము నెరుంగుట మేలు. ఈశయ్యాపద మతి ప్రాచీనము. ఇది బాణుని కాదంబరీకాలమునుండియు వచ్చుచున్నది. శయ్యకు పర్యాయపదముగ ముద్రాశబ్దమును అగ్నిపురాణకారుడు వచించెను. విద్యాధరవిద్యానాథు లీశబ్దమునకు విశేషార్థమును కల్పించిరి. పదముల పరానోన్యమైత్రియే శయ్యగా విద్యానాథుడు వాక్రుచ్చెను. అనగా పదపరివృత్యసహిష్ణుత్వమువలన బంధమునకుగల పదానుగుణ్యరూపమే శయ్యగా వివరించెను. ఇచట పదముల కొండొంటికిగల నెయ్యంపుటియ్యందనమే శయ్యగా పలుకునపుడొకపద్యమున నున్నశబ్దము నొకదానిని దొలగించి వేరొకదానిని కూర్చుట కాపద్యము సమ్మతింప దని భావము. మహాకవులమాటలు ముత్యములమాటలు. ఆమాట కదియే సాటిగాని వేరొకటి దీటునకు రా

దని తాత్పర్యము. ఇంక పాక మనుపదము వామనాచార్యుని నాటి నుండియు వాడుకలో నున్నది. ఈత డీశబ్దమును వైదర్భీరీతిసందర్భమున నుపయోగించెను. సహృదయహృదయరంజక మైన పాకమును గలిగి, వాచకశ్రీనిస్పందితము గావించి, వితథమైన వస్తువునకుగూడ తథాత్వమును వైదర్భీరీతి ప్రసాదించు నని వామనుడు నుడివెను. చాల నేర్పుతో పదముల నేర్చి కూర్చి రచించినచో, నొకమాటను మార్చి వేరొకమాటను గూర్చుటకు శబ్దపాకము సమ్మతింప దని వేరొకచోట నతడు వచించెను. వామనునితరువాత వచ్చినవారు పాకమును ప్రశంసింపజొచ్చిరి. శబ్దార్థానుగుణ్యముగల పదపరస్పర మైత్రియే శబ్దపాక మనియు, అర్థగాంభీర్యమే అర్థపాక మనియు, కడపటిది కావ్యరసానుకూలముగ పలుతెరంగులరుచుల జెలంగు ననియు నవీనులమతము. సౌశబ్ద్యము, లేక తిఙంతసుబంతముల వ్యుత్పత్తియే మంగళునిమతమున పాక మని రాజశేఖరుడు వివరించెను. విద్యాధరుడు అర్థపాకమునుమాత్ర మంగీకరించెను. దీనితోపాటు పదవ్యుత్పత్తిని (మంగళుని మతమును), పదపరివృత్తివైముఖ్యమును (వామనునిమతమును) గూడ నతడు పేర్కొనెను. ఈ రెండవ దానిని విద్యానాథుడు శయ్యగా సమ్మతించి, అర్థగంభీరిమమే పాక మని విధించెను. విద్యానాథుని లక్షణమును పరిశీలించినచో, పరులచే శబ్దపాకముగ గ్రహింపబడినదాని నీతడు శయ్యగాను, అర్థపాకమునుమాత్రమే పాకముగను సమ్మతించె నని తెలియవచ్చును. ఇంక విద్యానాథుడు పాక మని ప్రశంసించిన అర్థగాంభీర్యమును భోజదేవుడు ప్రౌఢిగ స్వీకరించి శబ్దగుణముగ నంగీకరించెను. మరియు కావ్యమీమాంసయందు రాజశేఖరుడు పొందుపరచిన ప్రశ్నోత్తరరూపమైన సంభాషణములోని

సంగ్రహముపలన పాకమునుగురించి చదువరులు విశేషముగ నెరుంగ గలరు.

'పాక మన నేమి?' అని ఆచార్యు లడిగిరి. 'పరిణామమే పాకము' అని మంగళుడు పలికెను. 'పరిణామ మన నేమి?' అని మరల ఆచార్యు లడిగిరి. 'సుబంతతిజంతముల వ్యుత్పత్తియే పరిణామము' అని మంగళుడు పలికెను. కావున సౌశబ్ద్యము, లేక పదాన్యోన్య న్యాసమే పాకము. 'పదాధానోద్ధరణమే అవేక్షః' మని వామనుడు వచించెను. "డెంద మువ్విళ్ల లూగుచున్నంతదనుక మాటలను మార్చుటయు, కూర్చుటయు గలుగును. ఇంక మాటలపొందిక వాటముగ గుదిరినచో, ఆహా! కవితభాగ్యము పండి, చవు లూరుచుండును" అని వామనాచార్యుడు పేర్కొనుటచే, 'ఒకమాటకు వేరొకమాటను గూర్చుటకు వలనుపడకపోవుటయే పాక' మని వామనీయుల మతము. కావుననే 'పరివృత్తిసహిష్ణుత్వమును పదములు పరిత్యజించుటయే శబ్దపాక' మని శబ్దన్యాసనిష్ణాతులచే ప్రశంసింపబడె నని వామను డొకశ్లోకము నుదాహరించెను. ఈ పరివృత్తిపై ముఖ్యము పాకము గా దని అవంతిసుందరి ముఖ్యాశయము. మహాకవుల పదవైచిత్ర్యము పరిపక్వదశ నందుటవలన, రసపరిపోషణసమర్థ మైన శబ్దార్థ సాంగత్యమే పాక మని చెప్పవచ్చును. కావుననే, 'గుణాలంకారరీతులకు సముచితముగ శబ్దార్థసంఘటన మొనరించుటయే వాక్యపాక' మని వచింపబడెను. మరియు 'కవియు, పదములును, రసమును లభించినను, దేనిమూలమున పదము లమృతమును వర్షించునో, అదిమాత్రము లభ్యము గాకుండు' నని చెప్పబడెను. ఈ కారణముననే పాకమున కాధారభూత మైన శబ్దము చాలవరకు అభిధా

ప్రపంచమున నిమిడియున్నను, సహృదయసమ్మతిం గాంచినవిధముస నుపయోగింపబడుచున్న దని యాయావరీయులు పల్కిరి.

ఈపూర్వోక్తప్రసంగమువలన శబ్దమూలమున పాకము జెలంగు నని రాజశేఖరునిమత మని మనము గ్రహించుట కవకాశము గలుగుచున్నది. దీనివలన సౌశబ్ద్యమే, లేక శబ్దవ్యుత్పత్తియే పాక మని సమ్మతించినచో నది అభిధాలోకమున లీనమై మెలంగును. కాని దాని ప్రవృత్తిమాత్రము సహృదయరంజకార్థముపై నాధారపడియుండును. రసపదమువోలెనే పాకశబ్దముగూడ వ్యుత్పత్త్యర్థము గలిగి చవిగొనుట, లేక రుచిచూచుటగా వ్యవహరింపబడుచున్నది. ఇచట పాకపదప్రయోగము ఫలము పక్వమైనపుడు దానిని జవిగాంచుటవలన గలుగురుచికి బోలికను గలిగియున్నది. ఆయాపండ్లాయారుచుల నిచ్చుటవలన నాలంకారికు లీసామ్యమును సమర్థించి పలుతెరంగులపాకముల బేర్కొనిరి. ప్రాచీనశ్లోకముల ప్రమాణముగ గైకొని వామనాచార్యుడు చూతపాకమును, వృంతాకపాకమును ఉదాహరించెను. వీనిలో మొదటిది గుణస్ఫుటత్వసాకల్యమై చెలువారును; రెండవది సుప్తిఙ్సంస్కారమాత్రమై, క్లిష్టవస్తుగుణసహితమై, జుగుప్సాకరమై చెలంగు ననెను. ఇంక విద్యానాధుడు ద్రాక్షాపాకనారికేళపాకములను, భోజదేవుడు మృద్వీకానారికేళపాకములను సమ్మతించెను. బహిరంతఃస్ఫురద్రసవంతమై ద్రాక్షాపాకమును, అంతర్గూఢరసోదయమై నారికేళపాకమును జెలంగు నని విద్యానాధుడు వచించి, మధుక్షీరాదిపాకాంతరముల స్వయముగ బుద్ధిమంతు లూహింప నగు నని రచించెను. ఇచట వ్యాఖ్యాత కుమారస్వామి ద్రాక్షాపాక, నారికేళపాకములలో నర్థము ద్రుతవిలంబితప్రతీతుల పరాకోటి నారూఢించు నని చెప్పుచు-

వీని కంతరాళవర్తినులై మధ్యమప్రతీతి జెలువారు కదళీరసాలాదిపాక ముల మన మూహించుకొనవలయు నని వ్రాసెచ్చెను. వీనికి తోడుగ కొందరు సహకార వార్తాక నీలకపిత్థపాకముల జేర్కొనిరి. వీరి నందర మించి రాజశేఖరుడు పిచుమంద, బదర, మృద్వీకా, వార్తాక, తింత్రిణీ, సహకార, క్రముక, త్రపుస, నారికేరము లను నవవిధపాక ముల నుదాహరించెను. ఇదియే శయ్యాపాకముల సంగ్రహమై చెలంగును.

గుణనిరూపణమున విద్యానాథుడు భోజదేవునిమార్గ మను సరించె నని చెప్పియుంటిమి. కంఠాభరణ యశోభూషణములలోని గుణముల సంఖ్యాస్వరూపములు చాలవరకు సామ్యముం గలిగి యున్నవి. "సుశ్లిష్టపదతయే శ్లేష" యని భోజుడు వచింప "సంశ్లిష్టపదతయే శ్లేష" గా దలంపబడు నని విద్యానాథుడు రచించెను. పాఠసమయమునందు పదములకు సంభవించు ఏకపదవదవభాసమానత్వమును శ్లిష్టత్వ మందు రని వృత్తి వ్రాయ బడెను. "ప్రసిద్ధార్థపదత్వమును ప్రసాద" మందు రని వీ రిరువు రును వివరించిరి. "అవైషమ్యభణనమే సమతాగుణ" మనియు, "వాక్యమునందలి పృథక్పదత్వమే మాధుర్య"మనియు వీరు విధించిరి. "అనిష్ఠురాక్షరప్రాయము సుకుమార" మని భోజుడు వచింప "సుకుమారాక్షరప్రాయము సౌకుమార్య" మని విద్యానాథుడు రచించెను. "సంపూర్ణవాక్యత్వ మర్థవ్యక్తి" యనియు, "కావ్యము నందలి బంధౌజ్వల్యము కాంతి" యనియు, "వికటాక్షరబంధత్వ మౌదార్య" మనియు, "శ్లాఘ్యవిశేషణయోగ ముదాత్త" మనియు, "సమాసభూయస్త్వ మోజ" మనియు, "గాఢబంధత్వ మూర్జిత్వ" మనియు, "చాటూక్తులప్రియతరాఖ్యానము ప్రేయ" మనియు,

"సుబంతతిజంతముల వ్యుత్పత్తి సౌశబ్ద్య" మనియు, "అన్య ధర్మముల నన్యత్రాధిరోపణము సమాధి" యనియు, "శబ్ద గర్భితవివక్షితార్థరూపత్వము సౌక్ష్మ్య" మనియు, "ధ్వని మత్త్వము గాంభీర్య"మనియు వీ రిరువురును లక్షణమును విధించిరి. ఇంక "ఉక్తార్థసమర్థనప్రపంచోక్తియే విస్తర" మని విద్యానాథుడు వచింప "వ్యాసోక్తియే విస్తర" మని భోజుడు రచించె. "సంక్షిప్తార్థాభిధానము సంక్షేప" మనియు, "యావదర్థపదత్వము సంమితత్వ" మనియు, "విదగ్ధభణితియే ఉక్తి" యనియు, "భావవశేవాక్య వృత్తియే భావిక" మనియు, "ఉపక్రమనిర్వాహము రీతి" యనియు, "స్వరారోహావరోహసురమ్యత్వమే గతి" యనియు, "ఉక్తిపరిపాకమే ప్రౌఢి" యనియు గుణస్వరూపము వర్ణింపబడెను.

ఇచట గుణముల సంఖ్యాలక్షణములలో వీ రిరువురకును భేదము గానరాకున్నను వానిక్రమమునమాత్రము కొంత వ్యత్యాసము గానవచ్చును. ఇంక నీగుణములలో ఉదాత్త మనగా అనుచితార్థ దోషాభావ మని కుమారస్వామియు, ప్రేయము భామహదండ్యా చార్యులమతమున నలంకారమే కాని గుణము కా దనియు, వ్యాఖ్యాత మతమున నిది పరుషాభావ మనియు, ఔర్జిత్యము విసంధిదోష విపర్యయ మనియు చదువరు లెరుంగనగును. ఈదోషమును భరత భామహులు పేర్కొనిరి. విసంహితము, లేక విరూప మైన సంధి యనియు, కుమారస్వామి దీనికే విగతసంహిత మనగా వర్ణముల పరస్పరసన్నికర్ష మనియు, కర్ణకఠోర మనియు వివరణము వ్రాసెను. విశ్లేషము, లేక సంధిరానిచోటులలో, సంధి కష్టముగా నున్నచోటులలో నీవిసంధిదోషము చేసూరును. వీనికి దోడుగా మమ్మటుడు అశ్లీలత స్ఫురించుచోటులలోగూడ నీవిసంధిదోషము

గలుగు నని సూత్రప్రకారమును వివరించెను. ఇంక సమాధిగుణము కుంతలునిమతమున ఉపచారవక్రతగను, మరికొందరిమతమున రూపకముగను భాసించును. మరియు ప్రౌఢిగుణము పైన రచింపబడిన పాకవిశేషముగను, రీతిగుణము వామనుని సమతాగుణమునకు సాదృశ్యమును గలిగి విలసిల్లుచున్నది. అగ్నిపురాణకారు డన్నియో చాలవర [illegible]ముల నంగీకరించినను వానిని వేరువేరుగ విభాగ మొనరించి వానికి వేర్వేరులక్షణముల విధించెను.

(అలంకారమతానుకరణము - హేమచంద్రాదులు)

విద్యాధరవిద్యానాథులవెనుక హేమచంద్రవాగ్భటులు కావ్యానుశాసనవాగ్భటాలంకారము లను గ్రంథముల రచించిరి. వీరు మువ్వురును జైనులు. వీరిగ్రంథములలో స్వతంత్రరచన సుంతయు గానరాకున్నను, వీనిని కావ్యాలంకారసంగ్రహములుగ మన మంగీకరింపవచ్చును. ఇందు హేమచంద్రుని కావ్యానుశాసనము సూత్రములతోను, వృత్తితోను గూడియున్నది. దీనికి గ్రంథకర్తయే స్వయముగ వ్యాఖ్యానమును రచించెను. దీనిలోని సూత్రభాగమునకు కావ్యానుశాసన మనియు, వృత్తికి అలంకారచూడామణి యనియు, వ్యాఖ్యానమునకు వివేక మనియు హేమచంద్రుడు సంజ్ఞల నేర్పరచెను. ఈకావ్యానుశాసనమునందలి యెనిమిదియధ్యాయములలో నవీనమార్గము గాని, నూతనపక్కి గాని వెదకినను గానరాదు. ఇది యొక ప్రాచీనగ్రంథసారము. పూర్వాచార్యుల లక్షణముల నేర్చి మార్చి కూర్చి హేమచంద్రుడు దీనిని రచించుటచే ధ్వన్యాలోక, లోచన, అభినవభారతి, కావ్యప్రకాశాదిగ్రంథముల కీకావ్యానుశాసనము సంగ్రహ మనవచ్చును. ఇందు భరతాదుల నాయకాదిలక్షణమునుగూడ జేర్చి, మమ్మటుని మతానుసారముగ ధ్వని, రస,

ుణ, దోషాలంకారముల నన్నిటిని హేమచంద్రుడు గుది గ్రుచ్చెను. మరియు మమ్మటుని కావ్యలక్షణములోని 'అనలంకృతీ పునః క్వాపి' యనుదానికి మారుగ 'సాలంకారౌ చ' యను విశేషణమును జేర్చుటచే లక్షణము దోషదూషిత మయ్యెను. దానిని వారించుటకై 'చకారో నిరలంకారయోరపి శబ్దార్థయోః క్వచిత్ కావ్యత్వఖ్యాపనార్థః' అని వృత్తిని రచింపవలసివచ్చెను.

ఇంక వాగ్భటు లిరువురు గలరు. వీరు మమ్మటుని గ్రంథము ననుసరించినను ధ్వనిమతమును సమ్మతింపక ధ్వనిపూర్వమతములను మాత్రమే ప్రమాణముగ స్వీకరించిరి. వీరు చాలవరకు దండ్యాచార్యునిపథమున జనిరి. మరియు కనిష్ఠవాగ్భటుడు రుద్రటుని అలంకారములగూడ నాదరించెను. ఐనను వీరిగ్రంథములలో గాన వచ్చు నవ్యమతచిహ్నముల ప్రాబల్యముకతమున వీరిని గుణాలంకార రీతిమతానుసారు లని స్పష్టముగ జెప్పుటకు సాహసింప లేదు. వీరి గ్రంథములలో కొంతకొంత భేదముగూడ గాననగును. జ్యేష్ఠుడు శ్లోకరూపముగను, కనిష్ఠుడు సూత్రవృత్తులతోను తమతమగ్రంథముల రచించిరి. ఇందు కనిష్ఠుని కావ్యానుశాసనము, హేమచంద్రుని కావ్యానుశాసనమును బోలియున్నది. వీ రిరువుర కావ్య లక్షణమును గమనించినచో వీరికిగల తారతమ్యము తెలియ వచ్చును. జ్యేష్ఠుడు వాగ్భటాలంకారమున "సాధుశబ్దార్థ సందర్భం గుణాలంకారభూషితమ్, స్ఫుటరీతిరసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే" అని రచింప, కనిష్ఠుడు కావ్యానుశాసనమునందు హేమచంద్రునిలక్షణమున కనువాదముగ "శబ్దార్థౌ నిర్దోషౌ సగుణౌ ప్రాయః సాలంకారౌ కావ్యమ్" అని విధించెను. ఈలక్షణమును గాంచినచో 'గుణాలంకారరీతిరససంపన్న మైన శబ్దార్థమే కావ్య'

మని తేటపడును. వీరిలో భరతుడు దశగుణముల నంగీకరింప, తరుణుడు గుణత్రయమాత్రమే సమ్మతించెను. మరియు 'దండివామనవాగ్భటాదులు పది కావ్యగుణముల నంగీకరింప, మేము మాధుర్యౌజఃప్రసాదగుణముల మూటినిమాత్రమే సమ్మతింతు' మని నిష్కర్షముగ వచించెను. ఇంక రససందర్భమున తరుణవాగ్భటుడు 'దోషముక్తము, గుణయుక్తము, అలంకారభూషితము, శబ్దార్థరూపము కావ్యశరీరముగ వచింపబడెను. మరియు తత్త్వప్రాణిశరీరమువోలె నిరాత్మకము ప్రతిభాసింపమిచే, రసమే కావ్యమునకు ప్రాణభూత' మని రచించుట వలన రసమే కావ్యాత్మగ నీత డంగీకరించినట్లు గానవచ్చును. ఇటుల రసమునకు ప్రాధాన్యము నొసంగినను, హేమచంద్రాదులరీతిని నవరసములను, విభావాదులను వివరించుటయే కాని రసమతతత్త్వవిచార విమర్శనములకు వీరు గడంగరైరి. రసమతమునకు సుముఖులైన వాగ్భటద్వయము ధ్వనిమతమున కేమికారణముననో విముఖతం బొడజూపిరి. వీరిలో కనిష్ఠుడు భామహోద్భటులభాతిని ధ్వనిని పర్యాయోక్త్యలంకారము నం దంతర్గతము గావించి, 'ఇటువంటిభేదముల ధ్వనితోక్తి గలుగుచున్నది; మరియు గ్రంథగౌరవభయమున మాచే నుదాహృతము గాలేదు. ధ్వనిప్రపంచ మానందవర్ధన మగుటవలన నవగంతవ్య' మని సంగ్రహముగ వచించెను. ఈజైనగ్రంథకారుల సంగ్రహములు కేవల విద్యార్థి జనోపయోగముగ రచింపబడెనే కాని ప్రత్యేకప్రయోజనమునకు గాదు. కావున వీనిని పూర్వాచార్యశ్లోక రత్నమందసములుగను, ప్రాచీనాలంకారికసంప్రదాయ సంగ్రహములుగను మనము దలంపవలయును. ఇందువలన వీనిలోని అలంకారవర్గము అగ్నిపురాణ సరస్వతీకంఠాభరణములలోని అలంకారప్రకరణమునకు ప్రతిబింబముగ వెలంగుచున్నది.

## నవ్యమతము-అలంకారమతానుకరణము.

ఇంక చదువరులలాభమునకై హేమచంద్రుడు కావ్యానుశాసనమునందును వాగ్భటుడు అలంకారసంగ్రహమునను చర్చించినవిషయముల సంక్షేపముగ నిట బొందుపరచెద. కావ్యానుశాసనమునం దెనిమిది అధ్యాయములు గలవు:

౧. మంగళాచరణ, ప్రస్తావన, ప్రయోజనముల రచించి, కావ్యకారణ మైన ప్రతిభాభేదములను సంస్కారవ్యుత్పత్త్యభ్యాసశిక్షలను పేర్కొని, కావ్యస్వరూపమును, గుణదోషాలంకారలక్షణములను, శబ్దార్థస్వరూపమును, ముఖ్యగౌణలక్ష్యవ్యంగ్యార్థలక్షణములను, వ్యంగ్యార్థభేదములను ప్రథమాధ్యాయమున వివరించెను.

౨. రసలక్షణమును, నవరసభేదములను, స్థాయివ్యభిచారిసాత్త్వికభావములను ద్వితీయాధ్యాయమునను,

3. కావ్యదోషరసదోషములను, పదవాక్యదోషములను, అర్థదోషములను తృతీయాధ్యాయమునందును,

౪. గుణత్రయలక్షణమును, వానివ్యంజకములను, గుణాన్యథాత్వమును తురీయాధ్యాయమునను రచించెను.

౫. అనుప్రాస యమకచిత్రకావ్యశ్లేషవక్రోక్తిపునరుక్తవదాభాసశబ్దాలంకారములలక్షణమును పంచమాధ్యాయమునందును,

౬. ఉపమా, ఉత్ప్రేక్షా, రూపక, నిదర్శనా, దీపక, అన్యోక్తి, పర్యాయోక్తి, అతిశయోక్తి, ఆక్షేప, విరోధ, సహోక్తి, సమాసోక్తి, జాతి, వ్యాజస్తుతి, శ్లేష, వ్యతిరేక, అర్థాంతరన్యాస, ససందేహ, అపహ్నుతి, పరావృత్తి, అనుమాన, స్మృతి, భ్రాంతి, విషమ, సమ, సముచ్చయ, పరిసంఖ్యా, కారణమాలా, సంకరములను ఇరువదితొమ్మిది అర్థాలంకారములను ఆరవయధ్యాయమునను,

౭. నాయకనాయికా లక్షణభేదములను, స్త్రీస్వాభావికా లంకారములను సప్తమాధ్యాయమునందును,

౮. ప్రబంధాత్మకకావ్యభేదములను ప్రేక్ష్యపాఠ్యగేయశ్రవ్య విభాగముల నుదాహరించి అష్టమాధ్యాయముతో గ్రంథసమాప్తిని గావించెను.

తరువాత, వాగ్భటాలంకారమునందు ఐదుపరిచ్ఛేదములు గలవు. ప్రథమపరిచ్ఛేదమున కావ్యలక్షణమును ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములను కవికారణసంప్రదాయములను, ద్వితీయపరిచ్ఛేదమునసంస్కృత ప్రాకృత, అపభ్రంశ, భూతభాషా చతస్రమును, చంధోనిబద్ధకావ్యమును, పద్యగద్యమిశ్రభేదములను, పదవాక్యాద్యష్టవిధదోషములను, తృతీయపరిచ్ఛేదమున ఔదార్యాదిదశవిధగుణములను, చతుర్థపరిచ్ఛేదమున చిత్ర,వక్రోక్తి,అనుప్రాస,యమకాలంకారములను,జాతి,ఉపమా, రూపక, ప్రతివస్తూపమా, భ్రాంతి, ఆక్షేప, సంశయ, దృష్టాంత, వ్యతిరేక, అపహ్నుతి, తుల్యయోగితా, ఉత్ప్రేక్షా, అర్థాంతరన్యాస, సమాసోక్తి, విభావనా, దీపక, అతిశయోక్తి, హేతు, పర్యాయోక్తి, సమాహిత, పరావృత్తి, యథాసంఖ్య, విషమ, సహోక్తి, విరోధ, అవసర, సార, శ్లేష, సముచ్చయ, అప్రస్తుతప్రశంసా, ఏకావళి, అనుమాన, పరిసంఖ్యా, ప్రశ్నోత్తర, సంకరము లను ముప్పదియైదు అర్థాలంకారములను, గౌడీయావైదర్భీరీతిద్వితయమును, పంచమపరిచ్ఛేదమున శృంగారాదినవరసములను, నాయకనాయికాదులను వాగ్భటుడు వివరించెను.

ఇంక ద్వితీయవాగ్భటుడు కావ్యానుశాసనమును ఐదు అధ్యాయములుగ విభజించెను. మొదటిదానిలో కావ్యప్రయోజనము,

హేతువు, ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసములననుసరించియు, పద్య గద్యమిశ్రభేదములును, భాషావిభాగమును, మహాకావ్యము, ఆఖ్యాయికా, కథా, చంపూ, రూపకవిభేదములను, రెండవదానియందు నిరర్థకాదిషోడశశబ్దదోషములును, కష్టాదిచతుర్దశార్థదోషములను, వామనాదిదశగుణవిమర్శనమును, మాధుర్యాదిగుణత్రయనిరూపణమును, వైదర్భిగౌడీయాపాంచాలీరీతిత్రయసమాదరణమును, మూడవదానియందు అరువదిమూడు అర్థాలంకారములను, నాల్గవదానియందు ఆరు శబ్దాలంకారములను, ఐదవదానిలో నవరసములను, నాయకనాయికాదులను, రసదోషములను వివరించెను.

ఈముగ్వురిలో హేమచంద్రుడు ఇరువదితొమ్మిది అర్థాలంకారములనుమాత్రమే సమ్మతింప వాగ్భటులలో ప్రథముడు ముప్పదియైదలంకారములను, కనిష్ఠుడు అరువదిమూటిని చేర్కొనెను. హేమచంద్రుడు సంసృష్టిని సంకరమునం దంతిర్గతము గావించి, అనన్వయ, ఉపమేయోపమలను ఉపమావిభేదములుగను, అప్రస్తుత ప్రశంసను అన్యోక్తియందును జేర్చెను. రసభావాలంకారములైన రసవదాద్యలంకారములను గుణీభూతవ్యంగ్యప్రకారములుగ భావించెను. మరియు పరికర, యథాసంఖ్య, భావిక, ఉదాత్త, ఆశీః, ప్రత్యనీకములను కారణాంతరములచే ప్రత్యేకాలంకారములుగ నంగీకరింపడయ్యెను. ఇతనిఅలంకారలక్షణము లచ్చటచ్చట సామాన్యములుగ గన్పట్టుటచే నవి పరులమతమున నితరాలంకారములకుగూడ నన్వయించును. హేమచంద్రుని దీపకలక్షణము తుల్యయోగితాలంకారమునకును, పరావృత్తిలక్షణము పర్యాయపరివృత్తులకును, నిదర్శనాలంకారలక్షణము తదితరుల ప్రతివస్తూపమా, దృష్టాంత, నిదర్శనములకును సరివచ్చుచున్నది. హేమచంద్రవాగ్భటులగ్రంథముల బరిశీలించినచో

నొకదానిలోకన్న నింకొకదానియం దర్థాలంకారముల సంఖ్య మరల వృద్ధి జెందుట కారంభించినట్లు కానవచ్చును. అలంకారసంఖ్యాభివృద్ధిక్షయములు ధ్వన్యనంతరగ్రంథకారులైన మమ్మట, రుయ్యక, భోజదేవ, విద్యాధరాదు లందరిలోను గన్పట్టి జయదేవ, అప్పయ్యదీక్షితులనాటికి శతాధిక మయ్యెను. అర్థాలంకారముల పెంపుసొంపుల దిలకించి, వానిసమగ్రచరిత్రము నెరుంగదలంచువారు నాచే రచింపబడిన "అలంకారచంద్రిక" నవలోకింప బ్రార్థితులు.

విశ్వనాథునివెనుక వచ్చిన విద్యానాథవాగ్భటాదులు వారి వారిశక్తికొలంది స్థూలముగ, సూక్ష్మముగ సంగ్రహముల రచించిరి. వీరివలెనే కేశవమిశ్ర, అచ్యుతరాయ, జయదేవ, అప్పయదీక్షిత, విశ్వేశ్వరులుగూడ సంగ్రహగ్రంథముల గూర్చిరి. ఈ కాలముననే వ్యాఖ్యానములు, టిప్పణులు, టీకలు, సంగ్రహములకు సంగ్రహములును బయల్వెడలెను. కేశవమిశ్రుని అలంకార శేఖరమున గాని, అచ్యుతరాయని సాహిత్యసారమున గాని నూతనపంథలు, నవీనపథములు గానరావు. కేశవమిశ్రుని అలంకార శేఖరము చాలవరకు మమ్మటుని కావ్యప్రకాశము మొదలైన ప్రాచీనగ్రంథములపై నాధారపడినట్లు కన్పట్టుచున్నను, తా నీగ్రంథమును అలంకారవిద్యాసూత్రకారుడైన శౌద్ధోదనభగవానుని కారికల ననుసరించి రచించినట్లు కవియే వ్రాకుచ్చెను. అలంకార శేఖరమునందలి ప్రథమరత్నమున, 'రసాదిమంత మైన వాక్యమే కావ్య' మని ప్రతిపాదించి, 'ఆదిపదమువలన నలంకారపరిగ్రహ' మని వివరించి అష్టమరత్నమున 'రస ఆత్మేత్యుక్తమ్' అనుకారికను వచించి 'ఎటుల ఆత్మ లేనిచో శరీర మప్రయోజకమో, అటుల రసము లేకున్నచో కావ్యము జెలంగు' నని నిరూపించి, 'అంగాంగిభావాపన్న సకల

విభావాదిసాక్షాత్కారత్వమే రసత్వ' మని లక్షణమును కేశవమిశ్రుడు విధించెను. అందుచే నీతడు రసాదరము గలవా డని తలంపవలసి యున్నను, గ్రంథనామ మీతని అలంకారాభిమానమును బ్రకటించు టంజేసి మే మీతని నలంకారమతానుసారులలో నొకనిగ బరిగణించి తిమి. మరియు నితనిగ్రంథనామ మలంకారమతావేశమును వెదచల్లు చున్నను, చతుర్థరత్నమున శబ్దాలంకార మష్టవిధమనియు, అర్థాలంకారము చతుర్దశవిధ మనియు వచించుటవలన నిత డలంకారసంఖ్యాభివృద్ధి నిచ్ఛగింపనివారిలో బ్రథమగౌరవపాత్రు డని చెప్పనొప్పును. భరతునితరువాత నీవిషయమున నత్యంతపూజనీయు డీతడే. అలంకారమతానుసారులలో నీతని జేర్పకుండుట కిది ప్రబలప్రమాణ మైనను, అలంకారశేఖర మను స్వనామకరణనిదర్శనమూలమునను, కావ్యస్వరూప నిర్ణయమున 'ఆది' పదము నలంకారపర మని సమర్థించినకతమునను, ప్రత్యేకమతిసంస్థాపనము గాని, ప్రాచీనమతసముద్ధరణము గాని దీనిలో గానరానికారణమునను, కేవలసంగ్రహముగ దీనిని గ్రంథకర్త రచించిన హేతువునను కేశవమిశ్రుని అలంకారపథానువర్తులలో జేర్ప సాహసించితిమి. ఇతనిగ్రంథములోని విషయసంగ్రహము మావిమర్శనమును సమర్థించును.

౧. ప్రథమరత్నములోని మొదటిమరీచియందు కావ్యస్వరూప నిరూపణమును, కావ్యప్రకాశకారాదిమతకావ్యలక్షణ విమర్శనమును, కావ్యకారణసందర్భమున మమ్మటభట్టశ్రీపాదుల మతప్రతిపాదనమును, దండిమతమున వాఙ్మయసలక్షణోపన్యాసమును, రెండవ మరీచియందు రీత్యుక్తిముద్రావృత్తుల జీవితత్వమును, దోషత్యాజ్యత్వ, గుణశ్లాఘ్యత్వ, అలంకారశోభార్థత్వ, రసాత్మత్వవర్ణనమును సల్పెను. ఇచట గౌడీ, వైదర్భీ, మాగధీరీతిత్రయమును, లోకచ్ఛేకా

ర్భకోన్మత్తభేదము లైన ఉక్తిచతుష్టయమును, పదవాక్యవిభక్తి వచన రూపములైన ముద్రాచతుష్టయమును వివరించెను. మూడవమరీచియందు శక్తిలక్షణావ్యంజనాపదవృత్తిత్రైవిధ్యమును, ఉత్తమమధ్యమాధమాత్మకము లైన త్రివిధకావ్యలక్షణమును రచించెను.

౨. ద్వితీయరత్నమునందలి మొదటిమరీచిలో దండి వచన ప్రమాణము నుపన్యసించి, దోషసామాన్యలక్షణకథనమును, అష్టవిధ పదదోషప్రదర్శనమును, రెండవమరీచిలో వాక్యదోషద్వాదశవిధత్వ నిరూపణమును, గోవర్ధనమతమున దోషాంతరత్వప్రకటనమును, మూడవమరీచిలో అష్టవిధము లైన అర్థదోషములను చెప్పి 'ధీమంతుల కుద్వేగకారికాని కావ్యమును రచింపవలె' నను సంప్రదాయమును నెలకొల్పెను.

3. తృతీయరత్నమునగల మొదటిమరీచియందు 'అలంకారములచే నలంకృత మైనను, కావ్యమునకు గుణము లత్యంతావశ్యకము' లని సమర్థించి, శ్రీపాదమతమున 'శబ్దార్థము కావ్యశరీర' మనియు, 'గుణదోషాలంకారములు శౌర్యకాణత్వకుండలాది సాదృశ్యము' లనియు వివరించి, శబ్దార్థనిష్ఠత్వమున సామాన్యగుణద్వైవిధ్యమును ప్రదర్శించి, సంక్షేపము, ఉదాత్తము, ప్రసాదము, ఉక్తి, సమాధు లను శబ్దగుణపంచకమును వచించి, రెండవమరీచిలో భావకత్వ, సుశబ్దత్వ, పర్యాయోక్తి, సుధర్మితలను అర్థగుణచతుష్టయము నుదాహరించి, మూడవమరీచియందు స్వమతపరమతముల వైశేషికగుణలక్షణమును నిర్దేశించి, 'రసోత్పత్తిప్రతిబంధకములైనచో దోషము' లనియు, 'రసప్రతిబంధకములు గానిచో దోషములు గా' వనుట సముచిత మను శ్రీపాదమతమును విస్తరించి, అదోషత్వములుగా గణింపబడిన వైశేషికగుణములకు లక్ష్యముల నొసంగెను.

४. చతుర్థరత్నములోని మొదటిమరీచియందు 'చమత్కార విశేషకారిత్వము, పరంపరవలన రసోపకారిత్వము'లే అలంకార సామాన్యలక్షణ మని నిరూపించి, చిత్ర, వక్రోక్తి, అనుప్రాస, గూఢ, శ్లేష, ప్రహేలికా, ప్రశ్నోత్తర, యమకములు శబ్దాలంకారము లని విభజించి గోవర్ధనమతమున యమకము చిత్రాత్మక మని పేర్కొని, రెండవమరీచియందు చతుర్దశవిధములైన అర్థాలంకారములను, ఉపమాదశధాత్వకథనమును, శ్రీపాద రాజశేఖరమత ప్రదర్శనమును, 'అలంకారశిరోరత్నము, కావ్యసంపత్సర్వస్వము' నగుటవలన 'ఉపమ కవివంశమునకు మాతృదేవత' యని ప్రతి పాదించి, మూడవమరీచియందు దండివచనానుసారమున విరుద్ధ, సమస్త, వ్యస్త, రూపకరూపక, శ్లిష్టము లను పంచవిధరూపక నిర్దేశమును, నాల్గవమరీచియందు 'సర్వాలంకారసర్వస్వము, కవి కీర్తివర్ధనము, చేతోహరము' నని ప్రఖ్యాతి గాంచిన ఉత్ప్రేక్షా లంకారమును, సమాసోక్తి, అపహ్నుతి, సమాహిత, స్వభావ, విరోధ, సార, దీపక, సహోక్తి, అన్యదేశత్వ, విశేషోక్తి, విభావ న లను చతుర్దశవిధము లైన అర్థాలంకారములను విభాగ మొన రించెను.

౫. పంచమరత్నమున మొదటిమరీచియందు ఉపమాప్రా శస్త్యము నుపవర్ణించి, మోహిదవయవాదిరూపక మైన ద్వాత్రింశద్వ ర్ణన మొనరించి, శ్రీపాదానుసారికవికల్పలతాకారుని వర్ణనాధిక్య మును, గోవర్ధనుని శరీరావయవవర్ణనీయగుణములను దిజ్మాత్రము ప్రదర్శించి రెండవమరీచిలో పురుషవర్ణనమును, మూడవమరీచియందు దండిమతావలంబనమున సాదృశ్యప్రాపక ప్రకారముల పేర్కొని, 'చరాచరవిలక్షణమై కవిఘటన వెలుంగుటచే నది జగమును జేయుట

కును, చేయకుండుటకును, వేరుగా జేయుటకును శక్తిగల' దని ప్రతిజ్ఞ సల్పెను.

౬. షష్ఠరత్నమున మొదటిమరీచియందు కవిసంప్రదాయ నియమములను, రెండవమరీచిలో వర్ణనీయవస్తుకథనమును, మూడు నాలుగుమరీచులలో నియమాంతరపరిగణనమును నొనరించెను.

౭. సప్తమరత్నమున మొదటిమరీచిలో కవిప్రకర్ష బీజకథనమును, రెండవమరీచియందు దుష్కరసమస్యాపూరణమును, ప్రశ్నోత్తరోదాహరణమును, శ్రీపాద రాజశేఖరాదులమతమును వివరించెను.

౮. అష్టమరత్నమున మొదటిమరీచిలో 'రసమే కావ్యాత్మ' యని ప్రతిపాదించి, 'కారణకార్యసహకారులచే నభివ్యక్తమైన స్థాయిభావమే రస' మని విధించి, శృంగారాదిభేదమున రసనవధాత్వమును, సంభోగవిప్రలంభశృంగార ద్వైవిధ్యమును, నాయకనాయికాదివిభేదములను, నవరసలక్షణోదాహరణమును, రత్యాదుల ముఖ్యత్వనిరూపణమును, రెండవమరీచియందు రసదోషపరిగణనమును, దివ్యాదివ్యక్తి త్రైవిధ్యమును, ధీరోదాత్తాదిచతుర్విధత్వమును వివరించి, 'అనౌచితియే రసదోషములలో నెల్ల మహాదోష' మనియు, 'అనౌచిత్యమును దూర మొనరించినచో రసభంగకారణము వేరొకటి లే' దనియు, 'అనౌచిత్యమూలముననే పరిగణితములైన రసదోషములు సంభవించుచున్న' వనియు, 'రసహాని గలుగనిచో నాదోషములు దోషాభావత్వమును భజించు' ననియు వచించి, మూడవమరీచియందు 'ఛందోరీత్యుక్తులాదులైన యథోచితోద్దామత్వహృద్యత్వ మధ్యమత్వాభిధానమును' వాక్యప్రబంధౌచిత్యోదాహరణప్రదర్శనమును గావించి, మూలసూత్రకారనామగ్రహణపూర్వకముగ గ్రంథోపసంహార మొనరించి సమాప్తి జేసెను.

అత్యంతనవీనగ్రంథ మైన సాహిత్యసారముగూడ నీరీతినే రచింపబడెను. అచ్యుతరాయనిగ్రంథనామమే దానిలోని విషయసంగ్రహమును జెప్పనక్కరలేకయే చెప్పుచున్నది. ఇది సత్యముగ సాహిత్యసారమే. ఆయాప్రాచీననవీనమతోద్యానవనములలోని గ్రంథనికుంజపుంజములలో పుష్పించిన రసధ్వన్యలంకారాదిమకరందబిందుసందోహము నత్యంతకౌశలమున సంగ్రహించుటంజేసి మన మీగ్రంథకర్తల నెల్లర భ్రమరసదృశులుగ నెంచవచ్చును. ఇంక నవీనగ్రంథములలో జయదేవుని చంద్రాలోకమును, అప్పయ్యదీక్షితుని కువలయానంద చిత్రమీమాంసలును గణనీయములు. జయదేవుని పరాక్రమప్రసాదముల నర్థాలంకారములసంఖ్య విజయము గాంచి మహోన్నతదశ నందెను. ఇతనిమతమున అర్థాలంకారములు నూరు విధములుగ బెంపొందెను. చంద్రాలోకము 'అడవి గాచిన వెన్నెలగా విలసిల్లుట' కంగీకరింపక, అర్థాలంకారమయూఖమును మాత్రకగా గొని దీక్షితుడు దానికి కువలయానందమును ఘటించి, భేదప్రభేదవిభేదములను విపులముగ వివరించి, విద్యార్థిజననయనకువలయానందమును గలిగింప దీక్షితుడై పూజనీయు డయ్యెను. కావున కువలయానందము చంద్రాలోకపుచ్ఛభూత మని సహృదయులు స్వయముగనే గ్రహింపగలరు. ఇటుల కువలయానందమును రచించినంతమాత్రమున స్వకీయపాండిత్యప్రకర్ష ప్రకటనాభిలాష విరమింపమి గాబోలు, దీక్షితుడు చిత్రమీమాంస నాబడు విచిత్రగ్రంథమును విరచించెను. ఇందు ప్రత్యేకాలంకారములకు ప్రత్యేకప్రకరణములు నియమించి, ప్రాచీనాచార్యమతముల నెల్ల క్రోడీకరించి క్రమప్రకారము వానిని విమర్శించి, కడపట స్వమతప్రతిపాదనము గావించెను. చంద్రాలోక, కువలయానంద, చిత్రమీమాంసా

గ్రంథములు వరుసమెయి బాలురకును, పండితులకును, సహృదయు లకు నర్థాలంకారతత్త్వమును, చరిత్రమును సమగ్రముగ విశదపరచును. మనదౌర్భాగ్యవశమున 'చిత్రమీమాంస' సంపూర్ణముగ లభ్యముగాక, ప్రస్తుతమున ద్వాదశాలంకారములుమాత్రమే దొరకెను. ఇందలి ఉపమా, రూపక, ఉత్ప్రేక్షాలంకారము లవశ్యపఠనీయములు. దీక్షితుని చిత్రమీమాంస నవలోకించినవెనుక పండితరాయని ఖండన మునుగూడ విలోకించినగాని సహృదయుల కానంద మతిశయించదు. ఈరెంటిని సమముగ జవిగాంచినపుడే, వారివారల ప్రతిభాప్రభావ ములను, విమర్శనవిజ్ఞానములను మనము సంపూర్ణముగ నెరుంగ గలము. నవ్యమతానుసారులలో నవనవోన్మేషశాలి యైన బుద్ధివికాస ముల విలసిల్లి, పండితరాయ లను సార్థకాభిధానముం గాంచి, మహా కవిప్రఖ్యాతినందినవాడు జగన్నాథు డొక్కడే. శత్రువులచే, మిత్రు లచేగూడ శిరసావహింపబడిన రసగంగాధరమునందలి విమర్శనమును వీక్షించినచో నితడు పాండిత్యకవిత్వములందు జగన్నాథు డనియే తేటపడును. ఇతనితో నలంకారశాస్త్రము చరమదశ నధిష్ఠించె నని చెప్పవచ్చును. జగన్నాథునివృత్తాంతముతో కావ్యాత్మతత్త్వమును ముగింప నెంచుటచే మే మిచట చంద్రాలోకమునందలి విషయ సంగ్రహమును వివరింతుము.

జయదేవుడు చంద్రాలోకమును మయూఖములుగ నిర్మిం చెను. కావ్యహేతు, లక్షణ, రూఢి, యౌగికముల కథనమును ప్రథమ మయూఖమునను, దోషవర్ణనమును ద్వితీయమునను, దశవిధవిశేష లక్షణనిరూపణమును తృతీయమునను, దశగుణనిర్వచనమును చతుర్థ మునను, శబ్దార్థాలంకారపరిసంఖ్యానమును పంచమమయూఖము నను బేర్కొనెను.

ఇచట మూడవమయూఖమున జయదేవుడు వివరించిన లక్షణ ములనవీను లెవరును రచింపరైరి. ఒక్కవిశ్వనాథుడుమాత్రమే సాహిత్యదర్పణమున రూపకసందర్భమున భరతునివలెనే ముప్పది యారులక్షణములను వివరించి ముప్పదిమూడు నాట్యాలంకారముల బేర్కొనెను. అక్షరసంహతి, శోభా, అభిమాన, హేతు, ప్రతి షేధ, నిరుక్త, మిథ్యాధ్యవసాయ, సిద్ధి, యుక్తి, ఫలము లను పది విశేషలక్షణములను విధించెను. భరతుని లక్షణములకును విశ్వనాథుని లక్షణములకును భేదము గలదు. భరతునిసంఖ్యను ప్రమాణముగ విశ్వ నాథు డంగీకరించినను భరతుని నాట్యలక్షణములు కొన్ని విశ్వనా థుని నాట్యాలంకారములుగ మార్పునొందెను.

ఇంక విశ్వనాథుడు భూషణము, అక్షరసంఘాతము, శోభ, ఉదాహరణము, హేతువు, సంశయము, దృష్టాంతము, తుల్యతర్కము, పదోచ్చయము, నిదర్శనము, అభిప్రాయము, ప్రాప్తి, విచారము, దిష్టము, ఉపదిష్టము, గుణాతిపాతము, గుణాతిశయము, విశేషణము, నిరుక్తి, సిద్ధి, భ్రంశము, విపర్య యము, దాక్షిణ్యము, అనునయము, మాల, అర్థాపత్తి, గర్హణము, పృచ్ఛ, ప్రసిద్ధి, సారూప్యము, సంక్షేపము, గుణకీర్తనము, లేశము, మనోరథము, అనుక్తసిద్ధి, ప్రియోక్తు లను ముప్పదియారు లక్షణలను; ఆశీ, ఆక్రందము, కపటము, అక్షమ, గర్వము, ఉద్యమము, ఆశ్రయము, ఉత్ప్రాసము, స్పృహ, క్షోభము, పశ్చాత్తాపము, ఉపపత్తి, ఆశంస, అధ్యవసాయము, విసర్పము, ఉల్లేఖము, ఉత్తేజనము, పరీవాదము, నీతి, అర్థవిశేషణము, ప్రోత్సాహనము, సాహాయ్యము, అభిమానము, అనువర్తనము, ఉత్కీర్తనము, యాచ్ఞ, పరిహారము, నివేదనము, ప్రవ

ర్తనము, ఆఖ్యానము, యుక్తి, ప్రహర్షము, ఉపదేశనము లను ముప్పదిమూడు నాట్యాలంకారములను వివరించెను.

విశ్వనాథుని లక్షణములను పరికించినచో కొన్ని కొందరిచే గుణములుగను, మరికొన్ని మరికొందరిచే నలంకారములుగను నంగీకరింపబడె ననియు, నాట్యాలంకారములు చాలవరకు రసభావములకు సంబంధించిన వనియు చదువరు లెరుంగగలరు. ఈవిషయమును మొట్టమొదటనే గుర్తెరుంగుటచే దండ్యాచార్యు డీలక్షణముల నలంకారములలో జేర్చెను. విశ్వనాథు డన్నచో వీనిని గుణాలంకార భావాదులలో గణించినను, వీనిని నాట్యసందర్భముననే ప్రత్యేకముగ జర్చించెను. వీనికి నవ్యమతమున కావ్యప్రయోజనము గానరాని కతమున వీనివిషయమై నవ్యులు మౌనముద్ర దాల్చిరి.

ఈసమయముననే విశ్వేశ్వరుడు అలంకారకౌస్తుభమును రచించెను. ఇం దలంకారములు విపులముగ జర్చింపబడె నను సంగతి గ్రంథనామమే ప్రకటించును. విశ్వేశ్వరుడు డెబ్బదియూరు ప్రత్యేకాలంకారములను సమ్మతించెను. ఈ అలంకారమతానుకరణకాలమున రచింపబడిన గ్రంథములు చాలవరకు ఒకసంప్రదాయమునకే కట్టువడి, ఒకజాతికే చెందినకారణమున వీనిని ప్రాచీనగ్రంథసంగ్రహములు, సంక్షేపములు, సారములుగనే తలంపవలయును. ఒకదానిని చదివినవెనుక వేరొకదానిని జదువుటకు విసువుపుట్టకమానదు. కావున వీరిగ్రంథసంగ్రహములకొరకు కాలమును వెచ్చింపనక్కరలేదు. నవ్యమతప్రతిపాదకులైన కాశ్మీరాలంకారికులకాలము గడచుటతో స్వతంత్రగ్రంథనిర్మాణచాతుర్యము సమసిపోయెను. తరువాతవ్యాఖ్యాతలును, టీకాకారులును ప్రబలిరి. వారివెనుక గ్రంథసారసంగ్రహకర్తలు పెంపొందిరి. కడపట నలంకారశాస్త్రము క్రమక్రమముగ నంతరించెను.

# నవ్యమతము-రసధ్వనిమతసింహావలోకనము

( రసధ్వనిమతసింహావలోకనము - జగన్నాథపండితుడు )

నవ్యమతాభ్యుదయప్రపంచమునకు మమ్మటభట్ట, విశ్వనాథ, జగన్నాథులు త్రిమూర్తు లని మనము దలంపవచ్చును. తక్కిన గ్రంథకర్తలు దేవతాసములుగ జెలంగ వీరిని బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగ నెంచనగును. శంకరునిచే ప్రపంచసంహార మైనటులనే రసగంగాధరకారునితో స్వతంత్రరచన సమాప్తి నొందుటచే అలంకారశాస్త్రోపసంహారము సంభవించెను. ప్రాచీనార్వాచీనాలంకారికుల గ్రంథముల నెల్ల పరిశీలించి, సమగ్రముగ జర్చించి సర్వంకషవిమర్శనవిజ్ఞానమును వెలయించి పండితరాయ లనుప్రఖ్యాతిని జగన్నాథుడు సంపాదించెను. ఇతని రసగంగాధరము మనకు సంపూర్ణముగ దొరకనికారణమున దానిప్రాశస్త్యమును పరిపూర్ణముగ వర్ణించుట కవకాశము లేదు. రసనిరూపణాత్మక మను ప్రథమాననమును, కావ్యాత్మరూప మైన వ్యంగ్యమును, అలంకారములను జర్చించిన ద్వితీయానన మసంపూర్తిగను మనభాగ్యవశమున లభించెను. దీనివలన పూర్ణగ్రంథము పంచాననసము పేతమనియు సాంతముగ దొరకినచో నీ రసగంగాధరముతో పోల్చినచో కావ్యప్రకాశసాహిత్యదర్పణములు నిస్సారములు, నిష్ఫలములు నగుననియు దలంపవలసివచ్చును. ఇతని గ్రంథనామమువలనను, దొరకినంతవరకు గ్రంథసంగ్రహమువలనను జగన్నాథుడు రసధ్వనుల యందు సమానాదరము గలవా డని తేటపడును. ఇతడు సూత్రప్రాయముగ కారికల రచించి, వ్యాఖ్యానతుల్యముగ వృత్తివిమర్శనముల విరచించి స్వకపోలకల్పితలక్ష్యముల నొసంగి గ్రంథనిర్మాణ మొనరించెను. "మననజలధిమధ్యమునందుండి లలితరసగంగాధరమణిని భూలోకమునకు దెచ్చితి" ననియు, "నూతనముగ నుదాహరణానురూప మైన కావ్యమును నిర్మింతునే కాని, కొంచెమేనియు

నితరులనుండి గైకొన" నని యు జగన్నాథుడు గ్రంథారంభమునందే ప్రతిజ్ఞ గావించెను. ఈ ప్రతిజ్ఞయే జగన్నాథుని కావ్యకౌశలమును, పాండిత్యపాటవమును, స్వతంత్రరచనాచాతుర్యమును జాటిచెప్పును. అలంకారప్రకరణములలోని చాలభాగము చిత్రమీమాంసాఖండన మునకును, అలంకారముల భేదవిభేదములను విపులముగ విమర్శించుట కును వినియోగపడెనే కాని వేరుగ వినూత్నవిశేషాంశములను వెద చల్లుటకు తోడ్పడలేదు. జగన్నాథపండితుని రచనామార్గము సమాస భూయిష్ఠము, తర్కకర్కశము నైనకతమున విద్యార్థిబృందమును భయవిహ్వలుల గావించుచున్నను సయుక్తికము, సవిమర్శము నై విలసిల్లుచున్నది. అలంకారసర్వస్వకారు డైన రాజానకరుయ్య కుడు, విమర్శనకారు డైన జయరథుడు, కువలయానందచిత్ర మీమాంసాకారు డైన అప్పయ్యదీక్షితుడు - వీరు మువ్వురే పండిత రాయల విశేషవిమర్శనములకును, నిష్ఠురనిందాభాషణములకును బాత్రు లైరి. ప్రాచీనులమతముల జక్కగ నెరింగినవా డగుటచే నవ్యమున నూతనసంప్రదాయములవలన సంఘర్షణము సంభవింపనిసరణి వానిని విమర్శనవీక్షణముల దిలకించి సమన్వయించుటకై పండితరాయలు ప్రయత్నించె నని సహృదయులు భావింపవలయును. అందువలననే మమ్మటరుయ్యకాదులమతముగూడ జగన్నాథుని అర్ధాంగీకారమునే కాంచెను. కావున నీతని యాచార్యకమున రసధ్వనిరమణీశిరోమణి సింహావలోకనశ్రీలతో చెలువ మలరెను.

'రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్య' మని జగన్నాథ పండితుడు విధించుటవలన నీలక్షణము దండ్యాచార్యుని 'ఇష్టార్థ వ్యవచ్ఛిన్నపదావళియే కావ్య' మనుదానికి ప్రతిరూప మనవచ్చును. ఇటుల కేవలలక్షణనిర్మాణముతో తృప్తి నొందక పండితరాయ

లీవిధమున వివరించెను. 'లోకోత్తరాహ్లాదజనకజ్ఞానగోచరతయే రమణీయతగా తెలంగును. ఆహ్లాదగతచమత్కారత్వాపరపర్యాయానుభవసాక్షికమైన జాతివిశేషమే లోకోత్తరత్వమై వెలుంగును. 'నీకు కుమారుడు గలిగెను; నీకు ధన మిచ్చెదను' అనువాక్యములలోని అర్థమువలన గల్గినసంతోషము లోకోత్తరమైనదిగాదు. అందుచే నీవాక్యముల కావ్యప్రసక్తి గానరాదు. కావున "చమత్కారజనకభావనావిషయార్థప్రతిపాదకశబ్దత్వమే కావ్యత్వము."

ఈ వివరణమువలన కావ్యరమణీయత, లేక కావ్యసౌందర్యమే సహృదయులకు లోకోత్తరాహ్లాదము, లేక అలౌకికానందమును గలిగించు నని తేటపడుచున్నది. ఈ ఆనందము ప్రాకృతికముకన్న విశిష్టము, విలక్షణమునై వెలుగొందును. ఇది చమత్కారత్వ మను మారుపేరున విలసిల్లునట్టి లోకోత్తరత్వరూపజాతివిశేషమును గల్గించును. ఇది మానసమున నట్టివానిని మరలమరల మనన మొనరించుటవలననే కాని వేరొకమార్గమున జేకూరదు. కావున అలౌకికానందము ననుభవింపగోరువార లందమైన వస్తువుల ననవరతము డెందముల భావించుచుండవలయు నని తాత్పర్యము. చతుర్వర్గసంపాదన మొనరించినగాని జన్మసాఫల్యము గలుగనికైవడి, కావ్యకాంతాలలామమునకు ధర్మార్థకామమోక్షసదృశము లైన శబ్దార్థరసధ్వనివర్గచతుష్టయలాభమును బెంపొందించు విశిష్టలక్షణమును పండితరాయలు ప్రసాదించెను. ప్రాచీననవీనసంప్రదాయముల నాదరించుటచే నీతని కావ్యలక్షణముగూడ ఉత్తమోత్తమకావ్యముకరణి సరసము, సవ్యంగ్యము నై చెలంగు రమణీయార్థప్రతిపాదకశబ్దసముపేతమై చదువరుల డెందములకు చమత్కారజనకము, లోకోత్తరాహ్లాదప్రదమునై వెలుంగుచున్నది. ఇటుల కావ్యలక్షణమును విధించినవెనుక జగన్నాథుడు

కావ్యవిభాగమునకు గడంగెను. ఇతనికావ్యలక్షణమువలెనే కావ్య విభాగముగూడ విశేషవిమర్శనావిజ్ఞానమును వెసచల్లుచున్నది. ఇతని మతమున ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము నని కావ్యము నాలుగువిధములు.

౧. ఏచట శబ్దార్థములు గుణీభావితాత్మకములై చమత్కృతి నిదానమైన అర్థమును సూచించునో, అచట ఆద్యము. ఈలక్షణముచే అతిగూఢస్ఫుటవ్యంగ్యములు తిరస్కృతము లైనవి. అపరాంగాదులు గూడ వారింపబడినవి. ఇటులనే సందిగ్ధప్రాధాన్యాదులు సహిత మసుందరము లని తలంపవలయును. కావున మమ్మటాదుల ఉత్తమ మైన ధ్వనికావ్యము జగన్నాథుని ఉత్తమోత్తమ మైనది.

౨. ఎచ్చట వ్యంగ్య మప్రధాన మైనను, అది చమత్కార కారణమో, అచట ద్వితీయము. వాచ్యాపేక్షవలన ప్రధానభూత మై వ్యంగ్యాంతర మీ లక్షణముచే గృహీత మగుచున్నది. అపరాం గాదు లీ విభాగమునకు లక్ష్యములు. ఇచట కావ్యప్రకాశగతగుణీ భూతవ్యంగ్యలక్షణమునకు టీకాకారు డిచ్చిన చిత్రాన్యత్వము నివా రిత మగుటచే లీనవ్యంగ్యాదులు పరిహరింపబడినవి. కావున ద్వితీయ మైన ఉత్తమకావ్యమునగూడ ధ్వనిత్వమే కానవచ్చును.

3. ఎచట వ్యంగ్యచమత్కారాసమానాధికరణమున వాచ్య చమత్కారమో, అచట తృతీయము. ఈ లక్షణమునందు వాచ్య చమత్కారము స్ఫుటమై, వ్యంగ్యచమత్కారము గూఢమై చెలంగు టచే నిది మధ్యమకావ్యముగ గణింపబడినది. అనగా నీవిభాగమున వాచ్యరామణీయకము వ్యంగ్యచమత్కారము నతిశయించు నని భావము. ప్రాచీనుల మధ్యమకావ్యమును జగన్నాథుడు ద్వితీయ

తృతీయభాగములుగ విభజించుటచే, గుణీభూతవ్యంగ్యమును రెండు తెరగుల గావించి, వ్యంగ్యరామణీయకము గలదానిని ఉత్తమకావ్యముగను, వాచ్యకామనీయకము గలదానిని మధ్యమకావ్యముగను వేరు పరచెను. ఆనందవర్ధనాదు లీతారతమ్యమును గుర్తించినను, గణింపని వారివలె మిన్నకుండిరి. ఇచట వాచ్యము ప్రధాన మగుటచే గుణీభూతము పెండ్లికుమారుడైన నేవకునివెంట కాలినడకను బోవు రాజురీతి నుండు నని పలికిరి. ఈసమాధానము సరిపడకపోవుటచే పండితరాయ లీగుణీభూతము దౌర్భాగ్యవశమున దాస్య మనుభవించుచున్న రాజకళత్రముకైవడి నొకానొక కమనీయతను బొందుచున్న దని వచించి మధ్యమకావ్యమునకు పూర్వాచార్యు లొనర్చిన లోపమును సవరించెను. అందుచే నీవిశిష్టవిభాగ మీతని విలక్షణ విమర్శనవివేకమును వెలయించుచున్నది. ఇదియే మమ్మటాదులకును, పండితరాయలకును గల తారతమ్యపరిజ్ఞానము.

౪. ఎచట అర్థచమత్కృత్యుపస్కృత మై శబ్దచమత్కృతి ప్రధానమో, అచట చతుర్థము. ఇది మమ్మటాదులమతమునను, జగన్నాథునిమతమునను గూడ అధమకావ్యము. ఇందు అర్థచమత్కృతి, శబ్దచమత్కృతిద్వయము జేర్పబడినది. శబ్దార్థచమత్కృతుల పరస్పరాతిశయమును పండితరాయలు పరిగణింప లేదు. మరియు నీసందర్భముననే, అర్థచమత్కృతి సామాన్యశూన్యమైన శబ్దచమత్కృతిని ప్రకటించు పద్మబంధాదులను అధమాధమముగ గణించుట సముచితమని జగన్నాథుడు సమ్మతించినను లక్షణవిరుద్ధ మనుకారణమున నీ పంచమవిభాగమును త్రోసిపుచ్చెను.

పైవిధమున కావ్యవిభాగ మొనరించినపిదప ధ్వనికావ్య ముత్తమోత్తమాద్యసంఖ్యాభేదముల విలసిల్లు ననియు, దానిలోని సామాన్య

భేదముల నిరూపింతు ననియు జగన్నాథుడు వచించెను. అభిధాలక్షణా మూలమున ధ్వనికావ్యము ద్వివిధము: రసవస్త్వలంకారధ్వనిభేదముల నాద్యము త్రివిధము. అలక్ష్యక్రమోపలక్షణమువలన రస, భావ, తదాభాస, భావశాంతి, భావోదయ, భావసంధి, భావశబలత్వములు రసధ్వనిచే గృహీతములు. ఇంక ద్వితీయము అర్థాంతరసంక్రమిత వాచ్యము, అత్యంతతిరస్కృతవాచ్యము నన ద్వివిధము. ఇటుల నీపంచాత్మకమే ధ్వనిప్రపంచమున పరమరమణీయము, రసధ్వనియే దాని కాత్మస్వరూపమని రచించి రసవిచారమును బ్రారంభించెను.

రసమునుగురించియు, రసవిచారమునుగూర్చియు విపులముగ నాయామతములలోను, రసమతసమాలోచనమునను వివరించినకార ణమునను, పునరుక్తిదోషభయమునను మరల నిచట రచింపలేదు. రసధ్వనిసందర్భముననే భావశాంత్యాదిభావధ్వనుల గూడ విమ ర్శించి, రసానుకూలములుగనే గుణములను పండితరాయలు నిరూ పించెను. వామనమతమైన శబ్దార్థగుణవింశతిని పేర్కొనినను జగ న్నాథుడు గుణత్రయమునుమాత్రమే సమ్మతించినట్లు కానవచ్చును. 'ద్రుతి, దీప్తి, వికాసము లను పేరుల జెలంగు మూడుచిత్తవృత్తుల క్రమముగ గలిగించుటకే గుణములు ప్రయోజ్యములు. కావున నాయా గుణవిశిష్టరసచర్వణజన్యము లని భావ' మని పండితరాయలు వచించుటవలన మాధుర్య, ఓజః, ప్రసాదముల నీతడు చిత్తవృత్తుల నాధారముగ గైకొని విభాగించె నని తేటపడును. ఇటుల గుణములు రసమాత్రధర్మవ్యవసితము లని సమ్మతించినను, ఆకారశూరు డనుదానివలెనే మధురరచన, ఓజోబంధములను చోటుల గుణవ్యవహారము ఔపచారిక మను మమ్మటవాక్యమును జగన్నాథు డాదరింపలేదు. ఇటుల ఆత్మరూపరసగుణత్వము మాధు

ర్యాగుల కనుపపన్న మనియు తదుపాధిరత్యాదిగుణత్వమును, గుణములయందు గుణాంతరత్వముగూడ ననుచితమనియు నిరూపించెను. ఇంక 'శృంగారము మధుర' మనుచోట వ్యవహార మెట్టుల సిద్ధించు ననువిషయమున ద్రుత్యాదిప్రయోజకత్వమున గాని, ప్రయోజకతా సంబంధముచే ద్రుత్యాదికమున గాని, మాధుర్యాదికము చెల్లగు ననియు, ప్రయోజకత్వము శబ్దార్థరసరచనాగతముగ గ్రహింప నగు ననియు, శబ్దార్థములకు నీకారణముచే మాధుర్యాదులకుగూడ ఉపచారము గల్పింప నవసరము లే దనియు పండితరాయలు రచించెను.

ద్వితీయాననమున సంలక్ష్యక్రమధ్వన్యాదిభేదముల నిరూపించి అరువదితొమ్మిది అర్థాలంకారముల వివరించెను. ఉత్తరాలంకార విమర్శన మసంపూర్తిగ లభించెను. కావ్యాత్మరూపవ్యంగ్యమునకు రమణీయతాప్రయోజకమే అలంకారలక్షణముగ విధించి, రమణీయతాచమత్కారము, లేక లోకోత్తరత్వమే అలంకారమునకు ముఖ్యాంశముగ నంగీకరించి, అలంకారసర్వస్వకారుని మతము నాదరించెను. ఇచట ప్రతిభయే కావ్యబీజమై అలంకారతత్త్వమును నిర్ణయించును. కవిప్రతిభామూలకమైన విచ్ఛిత్తివిశేషమే లోకోత్తర చమత్కారకారియై విలసిల్లును. సంప్రదాయానుభవములపై విచ్ఛిత్తి విశేష మాధారపడియుండు నని జగన్నాథుడు నిశ్చయించెను. ఇతని అలంకారప్రకరణముల విలకించినచో రాజానకరుయ్యక కుంతలాచార్యుల గ్రంథసారమును సంగ్రహించి దానికి స్వీయవిమర్శన వివేకమును సంయోగించె నని చదువరులకు దోచకమానదు. ఇతని రసగంగాధరమునం దలంకారవివేచనమే సహృదయవతంసులకు లోకోత్తరాహ్లాదజనకమై వెలుంగుచున్నది.

---

## కావ్యాత్మోపసంహారము

భరతముని మొదలు పండితరాయలతుదిదనుక గడచునకాలమున కావ్యకన్యాసౌందర్యసంస్థానవర్ణనమున సంభవించిన దశావిశేషముల నిచట సంగ్రహముగ వివరించి కావ్యాత్మతత్త్వమును ముగించెదము. ఈ రెండువేలవత్సరములలో నెన్నియో మార్పులు గలిగెను. రసము కొందర పరవశుల గావించెను; అలంకారముల యాడంబరము మరికొందర నాకర్షించెను; శరీరసౌందర్యము వేరొకకొందర సంతసింపజేసెను; గుణగణము కొందరిచే గణుతి గాంచెను; రీతిమార్గములు మరికొందరిచే వినుతింపబడెను; ధ్వన్యనురణనములు వేరొక కొందరి వివశుల గావించివైచెను; వక్రోక్తివైచిత్ర్యములు కొందరి కానందముం గూర్చెను. ఇటుల క్రమక్రమముగ రసికుల సరసములగు చూపులు బాహ్యవస్తువులపై మొదట ప్రసరించి, పిదప శారీరకసంపద వాసించి, వెనుక మానసికమాహాత్మ్యము నాదరించి, తుదకు నాధ్యాత్మికానందము నభిలషించి ధన్యము లయ్యెను. కావున కావ్యసౌందర్యము కేవలబాహ్యము, అస్థిరము నైనదానిపై గాక అంతరంగికము, ఆనందదాయకము నైన ఆత్మతత్త్వముపై నాధారపడు నని చదువరు లెరుంగవలయును.

అందువలన 'డెందమున కనువైన రసము లోలుకుభావమే కావ్య' మని భరతుడును, 'సువర్ణమయాలంకారవిశేషభూషితమైన వాక్యమే కావ్య' మని భామహుడును, 'శబ్దార్థములజంటయే కావ్య' మని రుద్రటుడును, 'ఇచ్చవచ్చినతలపుల మొలకలెత్తజేయజాలు నీటుగులుకు మాటలకూరుపే కావ్య' మని దండియు, 'మంచిగొనముల నెలవగు మేలిమిపదములపొందికయే కావ్య' మని

వామనుడును, 'ఇంపుసొంపుల ముంపుచు క్రొత్తవింతకోరికల నన లెత్తగా సలుపు పలుకునుడికారముం గల వలపుతలపే కావ్య' మని ఆనందవర్ధనుడును, 'నెరజాణతనపుమురిపెముల గురియు ముద్దు సుద్దులమాటయే కావ్య' మని కుంతలుడును, 'సరస మైనవాక్యమే కావ్య' మని విశ్వనాథుడును, 'అందముం జిందు భావముం బొందు పరచుటచే నెరయమెరయుపదమే కావ్య' మని జగన్నాథుడును వచించిరి.

ఇటుల పూర్వులును, నవీనులును నారివారిశక్తికొలంది కావ్య కాంతామణీరామణీయకమును వర్ణించిరి. వీనిలో నెల్ల ధ్వన్యా చార్యుడైన ఆనందవర్ధనునివర్ణనము విలక్షణోపేతమును, పండిత రాయ లైన జగన్నాథునిలక్షణము విమర్శనాయుతము నై వెలుగొందు చున్నది. పండితరాయలవచనప్రకారమున రసవస్త్వలంకారధ్వని త్రయమును, అర్థాంతరసంక్రమితవాచ్యాత్యంతతిరస్కృతవాచ్య వ్యంగ్యద్వయమును కలసి కావ్యవరవర్ణినీలలామమునకు పంచప్రాణ ములై చెలంగు ననియు, నీప్రాణపంచకమునందు రసధ్వనియే కావ్యాత్మరూపమున వెలుంగు ననియు జదువరు లెరుంగవలయును. కావున సర్వాంగసౌందర్యము నభిలషించినచో శరీరసౌష్ఠవము, మానసవిస్తారము, ఆత్మవికాసము నను త్రివర్గసంపాదనమునకు బాటుపడిననేకాని కావ్యకాంతారత్నమునకు దివ్యత్వము ప్రాప్తించి సహృదయశిరోమణుల కామె పరబ్రహ్మాస్వాదసచివసౌఖ్యమును బ్రసాదింపజాల దని కవికులతిలకులు గణింపవలయును.

---

# గ్రంథమున స్మరింపబడిన గ్రంథకర్తల పేరులసూచిక

---

అచ్యుతరాయలు - సాహిత్యసారము

కేశవమిశ్రుడు

కోహలుడు

గుణాఢ్యుడు - బృహత్కథ

చంద్రికాకారుడు

పాణిని

ప్రభాకరుడు

భట్టి

భట్టముకులుడు

భట్టలొల్లటుడు

భట్టతౌతుడు

భట్టనాయకుడు

భట్టబాణుడు - హర్షచరిత్ర - కాదంబరి

భాట్టుడు

భాష్యకారుడు

మంగళుడు

# కావ్యాత్మ - నవీనమతములు

గ్రంథములు వరుసమైయి బాలురకును, పండితులకును, సహృదయులకు నర్థాలంకారతత్త్వమును, చరిత్రమును సమగ్రముగ విశదపరచును. మనదౌర్భాగ్యవశమున 'చిత్రమీమాంస' సంపూర్ణముగ లభ్యముగాక, ప్రస్తుతమున ద్వాదశాలంకారములుమాత్రమే దొరకెను. ఇందలి ఉపమా, రూపక, ఉత్ప్రేక్షాలంకారము లవశ్యపఠనీయములు. దీక్షితుని చిత్రమీమాంస నవలోకించినవెనుక పండితరాయని ఖండనమునుగూడ విలోకించినగాని సహృదయుల కానంద మతిశయించదు. ఈరెంటిని సమముగ జవిగాంచినపుడే, వారివారల ప్రతిభాప్రభావములను, విమర్శనవిజ్ఞానములను మనము సంపూర్ణముగ నెరుంగగలము. నవ్యమతానుసారులలో నవనవోన్మేషశాలి యైన బుద్ధివికాసముల విలసిల్లి, పండితరాయ లను సార్థకాభిధానముం గాంచి, మహాకవిప్రఖ్యాతినందినవాడు జగన్నాథు డొక్కడే. శత్రువులచే, మిత్రులచేగూడ శిరసావహింపబడిన రసగంగాధరమునందలి విమర్శనమును వీక్షించినచో నితడు పాండిత్యకవిత్వములందు జగన్నాథు డనియే తేటపడును. ఇతనితో నలంకారశాస్త్రము చరమదశ నధిష్ఠించె నని చెప్పవచ్చును. జగన్నాథునివృత్తాంతముతో కావ్యాత్మతత్త్వమును ముగింప నెంచుటచే మే మిచట చంద్రాలోకమునందలి విషయసంగ్రహమును వివరింతుము.

జయదేవుడు చంద్రాలోకమును మయూఖములుగ నిర్మించెను. కావ్యహేతు, లక్షణ, రూఢి, యౌగికముల కథనమును ప్రథమమయూఖమునను, దోషవర్ణనమును ద్వితీయమునను, దశవిధవిశేషలక్షణనిరూపణమును తృతీయమునను, దశగుణనిర్వచనమును చతుర్థమునను, శబ్దార్థాలంకారపరిసంఖ్యానమును పంచమమయూఖమునను చేర్కొనెను.